# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 8 హైదరాబాద్ 121 ఆగస్ట్ 2011 పేజీలు : 68 రు. 15

▲ ఫోకస్ : ఆగస్ట్ 15 స్వాతంత్ర్యం
ఎంత నిజం? ఎంత అబద్ధం?

▲ సుప్రీంకోర్టు చరిత్రాత్మక తీర్పులు

▲ రైతాంగం ఎదుర్కొంటున్న సమస్యలు

▲ నెల్లూరు థర్మల్ పవర్ ప్లాంట్ల విధ్వంసం

▲ ప్రమాదం అంచున కుంటాల జలపాతం

▲ వ్యవసాయ సంబంధాలపై ఆర్.ఎస్. రావు

▲ గ్రీస్, స్పెయిన్ ప్రజా ఆందోళనలు

# మరొకసారి గ్రంథాలయోద్యమాన్ని చేపడదాం !

## పుస్తక సంస్కృతిని పెంపొందిద్దాం
## చదివే అలవాటును విస్తరిద్దాం

వంద సంవత్సరాల కిందనే, అక్షరాస్యత చాల తక్కువ ఉన్న రోజుల్లోనే, ప్రజల్లో చైతన్యవ్యాప్తికోసం గ్రంథాలయోద్యమాన్ని చేపట్టిన ఘనమైన చరిత్రగల జాతి మనది. ఇటు తెలంగాణలోనూ అటు కోస్తాంధ్ర, రాయలసీమల్లోనూ అయ్యంకి వెంకట రమణయ్య, కొమర్రాజు లక్ష్మణరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, సురవరం ప్రతాపరెడ్డి, వావిలాల గోపాలకృష్ణ వంటి ఎందరెందరో గ్రంథాలయ ఉద్యమకారులు వందలాది గ్రంథాలయాలు ఏర్పాటు చేసి వాటిని ప్రజా సమీకరణ కేంద్రాలుగా, ప్రజా చైతన్య కేంద్రాలుగా, సమావేశ స్థలాలుగా, జాతీయోద్యమ వేదికలుగా తీర్చిదిద్దారు. ఎందరో మహానుభావులు వ్యక్తిగతంగా తమ సొంత ఆస్తులను అమ్ముకుని ప్రచురణ సంస్థలు పెట్టి పుస్తక సంస్కృతిని పెంపొందించారు. వట్టికోట ఆళ్వారుస్వామి వంటి ప్రచురణకర్తలు పుస్తకాల కట్టలు నెత్తిన పెట్టుకుని గ్రామగ్రామాలు తిరుగుతూ పుస్తకాలను ప్రచారం చేశారు. చదివే అలవాటును పెంపొందించారు. అలా పుస్తకాల ద్వారా పెల్లుబికిన జ్ఞానదీపపు వెలుగులు ఈ జాతికి ఎనలేని చైతన్యాన్ని అందించాయి. మట్టిలోని మాణిక్యాలను వెలికితీశాయి. వేలాది మంది మేధావులను, ప్రజాహిత కార్యకర్తలను తయారుచేశాయి. కాని ఇటీవలి దశాబ్దాలలో ఈ పుస్తక చైతన్యమంతా క్రమక్రమంగా క్షీణిస్తోంది. ప్రభుత్వ గ్రంథాలయాలు నిధుల కొరతతో దిగజారిపోతున్నాయి. ప్రజలనుంచి గ్రంథాలయాల కోసం ప్రత్యేకంగా వసూలుచేసిన పన్నుల నిధులను కూడ ప్రభుత్వాలు గ్రంథాలయాలకు ఇవ్వడం లేదు. పుస్తక ప్రచురణ వ్యాపారంగా మారి సామాజిక సేవాంశం సన్నగిల్లుతోంది. ప్రచురణకర్తలు లాభార్జనా దృష్టితో ప్రజలకు అవసరం లేని పుస్తకాలను గ్రంథాలయాలకు అంటగడుతున్నారు. మన విద్యావ్యవస్థ చదివే అలవాటును పోషించడం లేదు, పుస్తక పఠనం అవసరమని సామాజిక నాయకులూ అనుకుంటున్నట్టు లేదు. ఈ స్థితి ఇలాగే కొనసాగితే భావితరాల చైతన్య స్ఫూర్తి కొడిగట్టిపోవడం ఖాయం. ఇప్పటికే ఇది గుర్తించిన కొందరు ఆలోచనాపరులు, దాతలు తమ గ్రామాలలో సొంతంగా గ్రంథాలయాలు ఏర్పాటు చేస్తున్నారు. ఇప్పటికి స్వల్ప స్థాయిలో జరుగుతున్న ఈ కృషిని ఇంకా విస్తరించి, సుస్థిరం చేయవలసి ఉంది. ఆయా గ్రామాల నుంచి ఎదిగి స్థితిపరులైనవారి నుంచి, దాతల నుంచి, ప్రచురణ సంస్థల నుంచి, రచయితల నుంచి పుస్తకాలు, విరాళాలు సేకరించి ప్రతి గ్రామంలోనూ ఒక గ్రంథాలయం నెలకొల్పవలసి ఉంది. ప్రభుత్వ గ్రంథాలయాలు సక్రమంగా నడిచేలా చూడవలసి ఉంది. ఈ కృషిని ఇప్పటికే ప్రారంభించిన వారితో సమన్వయ పరచుకుంటూ మరింత మందిని ఈ కృషిలోకి ఆహ్వానించి ఒక కొత్త గ్రంథాలయోద్యమం ప్రారంభిద్దాం రండి. మనకు అక్షరాలు నేర్పిన మన ఊరికి మనవంతుగా కొన్ని అక్షరాలు వెనక్కి ఇద్దాం రండి.

సలహాలకు, ఆలోచనల సహకారానికి:

## వీక్షణం

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com



121

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

ఆగస్ట్ 2011
సంపుటి : 9
సంచిక : 8



## లోపలి పేజీల్లో...

### ఫోకస్ : ఆగస్ట్ 15 స్వాతంత్ర్యం ఎంత నిజం? ఎంత అబద్ధం?





ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
అజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజెన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

వీక్షణం అకౌంట్ నెంబర్ - 013911011002175
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

## పరిశోధక విద్యార్థులకూ, రచయితలకూ, అధ్యాపకులకూ శుభవార్త

గత నెల నుంచి వీక్షణంకు ఇంటర్నేషనల్ స్టాండర్డ్ సీరియల్ నంబర్ (ఐ.ఎస్.ఎస్.ఎన్.) వచ్చింది. ISSN 2231-6892 అనే ఈ నంబర్‌ను పరిశోధక విద్యార్థులూ, రచయితలూ, అధ్యాపకులూ వీక్షణంలో అచ్చయిన తమ రచనలతో ఉదహరించడం వారి విద్యాపరమైన అవకాశాలను ఇనుమడిస్తుంది. ఈ నంబర్ ప్రపంచవ్యాప్తంగా ప్రతిష్ఠాత్మకమైన పరిశోధక పత్రికలకు ఇచ్చేదిగా ఎక్కడైనా గుర్తింపు పొందుతుంది. ప్రత్యేకించి 2009లో చట్టంగా రూపొందిన యు.జి.సి. రెగ్యులేషన్స్ ఆన్ మినిమమ్ క్వాలిఫికేషన్స్ ఫర్ అపాయింట్మెంట్ ఆఫ్ టీచర్స్ అండ్ అదర్ అకడమిక్ స్టాఫ్ ఇన్ యూనివర్సిటీస్ అండ్ కాలేజస్ అండ్ మెజర్స్ ఫర్ ద మెయింటెనెన్స్ ఆఫ్ స్టాండర్డ్స్ ఇన్ హయ్యర్ ఎడ్యుకేషన్ ప్రకారం ఐ.ఎస్.ఎస్.ఎన్. ఉన్న పత్రికలలో వ్యాసం అచ్చయితే అభ్యర్థికి ఉన్నత విద్యలో కానీ, పదవులలో కానీ, పదోన్నతులలో కానీ వేరు వేరు స్థాయిలలో పది మార్కుల నుంచి ఇరవై ఐదు మార్కుల వరకు వస్తాయి. ఈ సౌకర్యాన్ని పరిశోధకులూ, అధ్యపకులూ విరివిగా ఉపయోగించుకోవలసిందిగా కోరుతున్నాం. – సం.

ఒకే సంచికలో – మాధవస్వామి, నటరాజ రామకృష్ణ, ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు, ఆర్.ఎస్.రావు, కె. జయశంకర్‌ల గురించి (ఇప్పటికే వివిధ తెలుగు, ఇంగ్లిష్ పత్రికల్లో చదివాను) చదవడం బాధగా ఉంది. అయితే 'వీక్షణం'లోని వ్యాసాలన్నీ కొత్తవి కావడం వల్ల ఆయా రచయితల కోణాల్లోంచి చదవగలిగాను. ఆర్.ఎస్. రావుగారి ఉపన్యాసాలు నేను అనేకసార్లు విని ఉన్నాను. 1998 ప్రాంతాల్లో – విశాఖ జిల్లా చోడవరంలో – ఒక సభలో ఆయన ప్రధాన వక్త కాగా – నేను అధ్యక్షుణ్ని. 'అభివృద్ధి వెలుగు నీడలు' చాలా తీవ్రంగా ప్రభావితం చేసింది. అలాగే 1973 నవంబర్ 24న విశాఖపట్నం, కలెక్టర్ ఆఫీస్ సమీపంలో జరిగిన సభలో ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు గారితో పాటూ, నన్ను నేనూ వేదిక మీద ఉన్నాను. శ్రీశ్రీ అప్పటికే సృజనలో అచ్చయిన 'తుది సమరం – తొలి విజయం', 'ఊగరా ఊగరా' అనే కవితను లయబద్ధంగా చదివితే – జనాలు ఉద్రూతలూగి చప్పట్లు చరచడం, కారా మాస్టారు 'నక్సలైట్ ఖైదీల కేసుల కోసం ఆర్థిక సహకారానికి జోలె పట్టుకు వెళ్లగా మూడు వందలు నగదు, ఒక ఉంగరం, ఒక రిస్ట్ వాచీ రావడం ఆ సభకు ఇంకా – కొల్లా వెంకయ్య, చెరబండరాజు, జ్వాలాముఖి, నర్సీపట్నం న్యాయవాది అచంట లక్ష్మణరావు గారు రావడం – ఇప్పుడే జరిగిందన్నంత స్పష్టంగా గుర్తుంది. 'ఉత్తరాంధ్రలో ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా' వ్యాసంలో పి. కృష్ణారావు రాసిన అంశాలన్నీ దాదాపు నేను ప్రత్యక్షంగా చూడగలిగాను. 'వీక్షణం' నడిచినన్నాళ్లూ నేనూ చందాకట్టి తెప్పించి, ఇతరుల చేత చదివించి మిలిటెంట్ పోరాటాలకు అక్షర సహకారం అందించలగనని వాగ్దానం చేస్తున్నాను.

– డా. మానేపల్లి

*(అవగాహన) యలమంచిలి, విశాఖపట్నం*

వీక్షణం జూలై 2011 సంచికలో పుట్టపర్తి సత్యసాయి గురించి వాస్తవాలు ఉన్నది ఉన్నట్లుగా రాసిన రచయితలకు, ప్రచురించిన వీక్షణం సంపాదకవర్గానికి ధన్యవాదాలు. సోంపేట లాంటి ప్రజా ఉద్యమాలను ఏ పత్రిక కూడా ప్రాచుర్యంలోకి తీసుకురాలేదు, ఒక్క వీక్షణం మాసపత్రిక తప్ప. అంతేకాకుండా ఈ మధ్యన ప్రజా ఆరోగ్యంపై, పేద ప్రజలపై ఔషధ ప్రయోగాలు జరుగుతున్నాయి. దీనిపై లోతైన మూలాలకు సంబంధించిన వాస్తవాలను, విషయాలను ప్రచురిస్తారని ఆశాభావం వ్యక్తం చేస్తున్నాం. వీక్షణం ప్రతీ విద్యార్థి, ప్రతీ సంస్థ, కార్యాలయం చేరే విధంగా ప్రతీ ప్రజాస్వామికవాది పాటు పడగలరని విజ్ఞప్తి చేస్తున్నాను. అంతే కాకుండా తెలంగాణ ఉద్యమంపై ప్రజల ఆకాంక్షలను ప్రతిబింబించే విధంగా అన్ని వర్గాల నుంచి సమాచారాన్ని సేకరించి వీక్షణంలో వ్యాసంగా ప్రచురించగలరని మనవి.

– ముత్తన్నగారి రాజేందర్ రెడ్డి

*కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్*

శ్రీలంకలో స్వతంత్ర ఈలం కోసం రెండు దశాబ్దాలుగా ఎల్.టి.టి.ఇ. జరిపిన పోరాటం, తదుపరి జరిగిన పరిణామాలు గురించి తక్కువ సమాచారమైనా ముఖ్య అంశాలు పొందుపరిచినందుకు అభినందనలు.

*తుంపాల శ్రీరామమూర్తి*

గాజువాక, విశాఖపట్నం

వీక్షణం జూలై సంచికలో ఆర్.ఎస్. రావును స్మరిస్తూ రాసిన వ్యాసాలను చదివాక చాలా గొప్ప మేధావిని కోల్పోయామనిపించింది. నాకు అర్థమైన దాన్ని బట్టి చూస్తే ఆయన మేధాశక్తిని అంచనా వేయడం, ఆయనను పట్టుకోవడం నా లాంటి వారికి కష్టమనిపించింది. ఆయన గురించి మిత్రుల ద్వారా విన్నది, ఎంత సంక్లిష్టమైన విషయాన్నయినా అరటి పండు ఒలిచి నట్టు చెప్పేవాడని, సమాజ మార్పు గురించి నిత్యం ఆలోచిస్తూ ఆలోచింప చేసేవాడని. సామాన్యులకు ఏం జరుగుతోంది అని దగ్గర నుంచి చూసేవాడని విన్నాను. ఆ గొప్ప మనిషిని బతుకుండగా కలుసుకోలేక పోయనన్న బాధ నన్ను వెంటాడుతోంది. ఆర్. ఎస్. రావు గురించి వీక్షణంలో రాసి నాలాంటి వారికి తెలుసుకునే అవకాశం కల్పించిన వీక్షణం బృందానికి కృతజ్ఞతలు.

*గార సత్యం*

హైదరాబాద్

వీక్షణం జూలై 2011 సంచికలోని సంపాదకీయంతో పాటు తెలంగాణ ఉద్యమం గురించి 'మానుకోట నుండి మిలియన్ మార్చ్ దాకా' పోరాట చరిత్ర బాగుంది. ప్రతి నెల వీక్షణం పత్రికలో వివిధ సమకాలీన అంశాల గురించి కాకుండా ప్రత్యేకించి రాష్ట్ర సమస్యల గురించి వస్తున్న వ్యాసాలు చాలా ఉపయోగకరంగా ఉన్నాయి. ప్రస్తుతం జరుగుతున్న తెలంగాణ ఉద్యమం గల్లీ నుండి ఢిల్లీ వరకు తెలంగాణ భావ వ్యాప్తితో పాటు, వివిధ రూపాలలో తెలంగాణ వాదులు ఉద్యమాలు చేస్తున్నప్పటికీ ఈ ప్రాంతీత రాజకీయ నాయకత్వం మాత్రం సంఘటిత ఉద్యమానికి సిద్ధం కాకపోవడం వల్ల రాష్ట్ర సాధనకు అవరోధంగా మారుతోంది.

– బోరెడ్డి మధుసూదన్ రెడ్డి

సిద్ధిపేట్, మెదక్

ఒక్కొక్కరుగా మానవీయ మేధావులంతా కనుమరుగవుతున్న క్రమంలో ఇప్పుడు ఆర్.ఎస్.రావు మృతి చెందడం తీరని లోటు. ప్రత్యేకంగా 'వీక్షణం' పత్రికకు వెన్నుదన్ను అయిన సి.డి.ఆర్.సి. సంస్థకు కోలుకోలేని దెబ్బ. మానవ వనరులను సుశిక్షితులుగా చేయడంలో ఇప్పటికే ఎంతో శ్రమిస్తున్న 'వీక్షణం' మరింత కృషి చేయాల్సిన సందర్భమిది. పత్రికగా 'వీక్షణం' చరిత్రలో మరో మెట్టు అనదగ్గ ఐ.ఎస్.ఎస్.ఎన్. నెంబర్ సాధించినందుకు అభినందనలు. వ్యాసాల సారంలో మరింత నాణ్యతా ప్రమాణాలను పాటించేలా నిరంతరం గుర్తు చేసే ఒక బాధ్యతను ఈ నెంబర్ అందించింది. ఇక 'వీక్షణం' ఇటింటి పత్రిక కావాలని ఆశిస్తున్నాను.

– దుప్పల రవికుమార్

టెక్కలి, శ్రీకాకుళం

*www.chaduvu.wordpress.com*

వీక్షణం జూలై 2011 సంచికలో 'విశాలాంధ్రలో ప్రజారాజ్యంలో ఏముంది?' అనే ఈ పరిచయ వ్యాసం నేటి పరిస్థితులను అర్థం చేసుకోదగినదిగా ఉంది. 'సోషలిజం భ్రమా! అవినీతి వాస్తవమా!' అనే వ్యాసంలో అభివృద్ధి అంటే ఏమిటో, పాలకవర్గాలకు బాకాలూదే మేధావులు చెప్పే అభివృద్ధికి, ప్రజాస్వామిక మేధాలువు చెప్పే అభివృద్ధికి తేడా ఏమిటో విశదీకరించారు. 'ఉత్తరాంధ్ర ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా'లో ప్రజల అభివృద్ధి అంటే ఏమిటో, అది ఏ విధంగా ఉండాలో సోదాహరణంగా వివరించారు. ఆర్.ఎస్.రావు గారి గురించి రాసిన ముగ్గురు రచయితలు కూడా వారి వారి అవగాహన నుండి బాగా పరిచయం చేశారు. ఆర్.ఎస్.రావు గురించి బాగా తెలుసుకోదగ్గవిగా ఉన్నాయి.

– డా. కె. సుబ్బనాచారి

దుత్తలూరు, నెల్లూర్

# అనైతిక రాజకీయాలకు అద్దం రాజీనామాల ఘట్టం

జూలై మూడో వారంలో తెలంగాణ ప్రాంతానికి చెందిన శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు, ఇతర ప్రజాప్రతినిధులు తమ పదవులకు రాజీనామా చేయడంతో మొదలైన రాజకీయ కల్లోలం అనేక మలుపులు తిరిగి, ఆ రాజీనామాలను స్పీకర్ తిరస్కరించడంతో కీలకదశకు చేరుకున్నది. మన రాజకీయ సంస్కృతి అట్టడుగు స్థాయి నుంచి అత్యున్నత స్థాయి దాకా ఎంత కలుషితంగా, అనైతికంగా, అప్రజాస్వామికంగా, చివరికి వారే రాసుకున్న చట్టాలను వారు పాటించకుండా సాగుతున్నదో ఈ ఉదంతంలోని ప్రతి సన్నివేశమూ వేనోళ్ల ప్రకటిస్తోంది. మొట్టమొదట రాజీనామాలకు దారితీసిన పరిస్థితిని చూస్తే, ఆ కారణం మీద ప్రజాప్రతినిధులు రాజీనామా చేయవలసిన అవసరమేమీ లేదు. తాము తమ ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్నామని, తమ ప్రజల ఆకాంక్షల సాధన కోసం తమ ప్రాతినిధ్యాన్ని త్యాగం చేస్తున్నామని ఒక నాయకుడు అనవలసి రావడమే హాస్యాస్పదం. ఈ దేశంలో పార్లమెంటరీ వ్యవస్థ నిజమైన ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంగా ఎదగలేదనడానికి అది సూచన. వారు ఎన్నికలలో గెలిచినవారే తప్ప, ప్రజలకు ప్రతినిధులు కాదని వ్యవస్థ అనుకుంటున్నదన్నమాట. "కాదు, మేము ప్రజాప్రతినిధులమే, కావాలంటే మరొకసారి ఎన్నికలు జరిపి చూడండి" అనే స్థితి ఉన్నదన్నా, "మేము ప్రతినిధులమైన ప్రజల ఆకాంక్షలను గౌరవించడానికి వ్యవస్థ సిద్ధంగా లేదు గనుక మా ప్రాతినిధ్యాన్ని వదులుకుంటున్నాం" అనే స్థితి ఉన్నదన్నా ఇది పార్లమెంటరీ ప్రాతినిధ్య ప్రజాస్వామ్య వ్యవస్థ కాజాలదు. ఆ మౌలికాంశం అలా ఉంచి, ప్రస్తుత రాజీనామాలకు మరొక కోణం ఉంది. "తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమవుతున్నది" అని కేంద్ర హోంమంత్రి 2009 డిసెంబర్ 9న చేసిన ప్రకటన అమలు జరగకపోవడానికి ఆ మర్నాడు జరిగిన కోస్తాంధ్ర, రాయలసీమ శాసనసభ్యుల రాజీనామాలే కారణమనే అభిప్రాయం తెలంగాణ ప్రజలలో ఏర్పడింది. అందువల్లనే తెలంగాణ శాసనసభ్యుల మీద రాజీనామాల కోసం ఒత్తిడి పెరిగింది. ఈ రాజీనామాల వల్ల తమ రాజకీయ ప్రయోజనాలు నెరవేరుతాయని, ఉపఎన్నికలు వస్తే తమకు రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలు ఉంటాయని కూడ కొందరు రాజకీయ నాయకులు భావించి ఉండవచ్చు. ఊరు కాలిపోయేటప్పుడు పేలాలు వేయించుకునే వారు ఎప్పుడూ ఉంటారు. కాని ఇక్కడ తెలంగాణ సమాజం రాజీనామాల గురించి ఎందుకు పట్టుబట్టిందో అర్థం చేసుకోవలసి ఉంది. ఒకరకంగా 2009 డిసెంబర్ 23 నుంచీ ఆ కోరిక వ్యక్తమవుతూనే ఉంది. మధ్యలో తెలంగాణ రాష్ట్ర సమితి శాసనసభ్యులందరూ, భారతీయ జనతా పార్టీ, తెలుగు దేశం శాసనసభ్యులు చెరి ఒకరు రాజీనామా చేయడం, ఉపఎన్నికలు రావడం, ఆ శాసనసభ్యులే మళ్లీ గెలుపొందడం తెలిసిందే. ఆ తర్వాత శ్రీకృష్ణ కమిటీ నివేదిక వల్ల గాని, ఒకవైపు అణచివేత చర్యలనూ, మరొకవైపు సాచివేత ధోరణినీ ప్రదర్శించిన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వైఖరి వల్ల గాని, ఆజాద్, ప్రణబ్ ముఖర్జీల వక్రీకరణల వల్ల గాని, డిసెంబర్ 9 ప్రకటనను అమలు చేయడానికి రాజకీయ సంక్షోభం సృష్టించాలనీ, అందుకు రాజీనామాలే మార్గమనీ అభిప్రాయం ప్రబలింది. ఎన్నో గడువుల తర్వాత, చర్చోపచర్చల తర్వాత జూలై మొదటి వారంలో రాజీనామాలు మొదలయ్యాయి. ఇలా తెలంగాణ సమాజం మొత్తంగా రాజీనామాల మీద పట్టుబడుతుండగా, ఇంకా రాజీనామాలు చేయని ప్రజా ప్రతినిధులు ఉన్నారంటే "ప్రాతినిధ్యం" ఎంత అపహాస్యానికి గురవుతున్నదో అర్థమవుతుంది: ప్రస్తుతం నెలకొని ఉన్న శకలీకృత సామాజిక వాతావరణంలో ఎంత తప్పుడు వాదననైనా ఏదో ఒక కారణంతో సమర్థించే చిన్న బృందమైనా ఉండే అవకాశం ఉంది. అలా రాజీనామా చేయకపోవడాన్ని సమర్థించే, సమర్థించుకునే అవకాశం ఉండవచ్చు. కాని తెలంగాణ ఆకాంక్షలను వ్యతిరేకించడానికి అది కారణం కాజాలదు. రాజీనామా చేయనివారు అలా ఉంటే, రాజీనామాలు చేసినవారి పరిస్థితి కూడ ఆమోదయోగ్యంగా ఏమీ లేదు. పేరుకు రాజీనామా పత్రాలను స్పీకర్ కార్యాలయానికి సమర్పించిన శాసనసభ్యులు ఇవాల్టికీ శాసనసభ్యులుగా తమకు అందే అధికారాలను, సౌకర్యాలను ఒక్కదాన్ని కూడ వదులుకోలేదు. శాసనసభ్యులు కావడం వల్ల వచ్చిన భద్రతా సిబ్బందిని, కార్యాలయాలను, వాహనాలను, వసతులను యథాతథంగా ఉంచుకుని రాజీనామా చేశామనడం రూపంలోనే తప్ప సారంలో కాదన్నమాట. ఇక తెలంగాణకు చెందిన మంత్రులయితే ఒకవైపు రాజీనామా పత్రాలు ఇచ్చి కూడ తమ మంత్రిత్వశాఖలను నిర్వహిస్తూనే ఉన్నారు. అంటే ప్రభుత్వం ఏ తెలంగాణ వ్యతిరేక విధానాలను అమలు చేస్తున్నదని ఆరోపిస్తున్నారో, ఆ విధానాలను అమలు చేసే స్థానంలోనే ఉన్నారు. ఇంతకంటే అనైతికత మరొకటి ఉండదు. ఇది ఇలా ఉండగా మూడు వారాలు తాత్సారం చేసి, దేశం వదిలిపోతూ చివరినిమిషంలో ఈ రాజీనామాలను తిరస్కరించాలని స్పీకర్ నిర్ణయించారు. ఈ రాజీనామాలు "భావోద్వేగంతో" చేసినవని తన పరిశీలనలో తేలిందని కనుక రాజ్యాంగ అధికరణం 190 (3) (బి) ప్రకారం సంక్రమించిన అధికారంతో వాటిని తిరస్కరించామని స్పీకర్ కార్యాలయ ప్రకటన తెల్పింది. నిజానికి ఒకే ఒక్క వాక్యపు రాజీనామా లేఖ అక్షరాలు మాత్రమే చూసి, ఆ రాజీనామాలు చేసిన వ్యక్తులలో ఏ ఒక్కరితోనూ మాట్లాడకుండానే అవి భావోద్వేగపూరితమైనవని స్పీకర్ ఏ అతీంద్రియ శక్తితో గుర్తించారో తెలియదు. పైగా ఆరునెలల కింద ఇదే వాతావరణంలో ఆమోదయోగ్యమని అనిపించిన శాసనసభ్యుల రాజీనామాలే ఇప్పుడు ఆమోదయోగ్యం కాకుండా ఎలా పోయాయో తెలియదు. కారణం సరైనదైనా కాకపోయినా రాజీనామా చేయడం శాసనసభ్యుడి హక్కు అనీ, ఆ రాజీనామా స్వచ్ఛందమా కాదా అని మాత్రమే స్పీకర్ నిర్ధారించుకోవాలనీ గతంలో న్యాయస్థానాల తీర్పులున్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే రాజీనామాలను తిరస్కరిస్తూ స్పీకర్ తీసుకున్న నిర్ణయం రాజ్యాంగవ్యతిరేకం. గతంలో ఇదే స్పీకర్ కార్యాలయం వ్యవహరించిన సంప్రదాయాలకు వ్యతిరేకం. బహుశా జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ దాచిపెట్టిన ఎనిమిదో అధ్యాయంలో చెప్పిన రాజకీయ మేనేజిమెంట్ లో ఇది భాగం కావచ్చు. తిరస్కరిస్తే కొందరయినా జారిపోతారని, మళ్లీ రాజీనామా పట్టుపట్టరనీ స్పీకర్ ఆలోచనో, స్పీకర్ ను ఆ నిర్ణయానికి పురికొల్పినవారి ఆలోచనో కావచ్చు. ఇది రాసే సమయానికి ఆ సూచనలు కూడ కనబడుతున్నాయి. అంటే ఇటుకొసన ఒక ఆశయం కోసం రాజీనామాలు చేశామంటున్నవారి నుంచి, అటుకొసన ఒక చట్టప్రకారం రాజీనామాలు తిరస్కరించానంటున్నవారి వరకు మొత్తంగా ఈ పార్లమెంటరీ రాజకీయ సంస్కృతి ఎంత కుటిలంగా ఉన్నదో ఈ ఘట్టం రుజువు చేస్తున్నది. వీ

## రాజా అప్రూవర్ ప్రకటన - 'అందరం దొంగలమే'!

నేరవిచారణలో అప్రూవర్ పాత్ర చాల ముఖ్యమైనది. ఒక నేరం జరిగేటప్పుడు అందులో పాల్గొని, విచారణ క్రమంలో అవతలి పక్షానికి మారిపోయి, తనతో పాటు ఆ నేరంలో ఇంకెవరెవరు పాల్గొన్నారో వివరించే వ్యక్తిని అప్రూవర్ అంటారు. భారత ఆర్థిక వ్యవస్థలో అతి పెద్ద కుంభకోణాలలో ఒకటిగా ప్రఖ్యాతి పొందుతున్న ఒక లక్షా డెబ్బైఆరువేల కోట్ల రూపాయల 2జి స్పెక్ట్రమ్ అమ్మకాల వ్యవహారంలో ప్రధాన నిందితులలో ఒకరయిన మాజీ టెలికాం మంత్రి ఎ రాజా ఇంకా అప్రూవర్ కాలేదు గాని జూలై 25న ఆయన న్యాయస్థానం ముందు చేసిన ప్రకటన అప్రూవర్ ప్రకటనగానే ఉంది. ఈ కుంభకోణానికి సంబంధించిన వివాదాస్పదమైన స్వాన్ - యునిటెక్ ఒప్పందాల విషయం ఆర్థిక మంత్రి పి. చిదంబరంకూ, ప్రధాన మంత్రి మన్మోహన్ సింగ్ కూ తెలుసునని, తాను ఆ ఒప్పంద పత్రాలను ఆ ఇద్దరికీ పంపానని రాజా అన్నారు. "టెలికాం శాఖలో నా కంటె ముందు మంత్రులుగా ఉన్నవారు అవలంబించిన విధానాలనే నేను కొనసాగించాను. ఒకవేళ నేను నేరస్తుడినయితే, నాకంటె ముందు టెలికాం మంత్రులుగా పనిచేసిన వారూ నేరస్తులే. వారికి కూడ జైలు శిక్ష పడవలసిందే" అని రాజా అన్నారు. రాజా చేసిన ఆ ప్రకటనతో తమకు సంబంధం లేదని డిఎంకె దూరం జరిగింది. నిందితుడిగా ఉన్న రాజా మాటలకు విశ్వసనీయత లేదని ప్రస్తుత అధికార పక్షం కాంగ్రెస్ - యుపిఎ కొట్టివేసింది. తమ మీది ఆరోపణలు అబద్ధమనీ, కాంగ్రెస్ మీది ఆరోపణలు మాత్రం నిజమనీ గత అధికార పక్షం భారతీయ జనతాపార్టీ - ఎన్ డి ఎ చర్చను పక్కదారి పట్టించడానికి ప్రయత్నించింది. కాని రాజా చెప్పినది అక్షరాలా వాస్తవమని గత రెండు దశాబ్దాల భారత రాజకీయార్థిక చరిత్ర చూసిన వారెవరికయినా తెలుస్తుంది. ఎన్నికలలో మెజారిటీ స్థానాలు రాకపోయినా పి వి నరసింహారావు ప్రధానమంత్రిగా, మన్మోహన్ సింగ్ ఆర్థిక మంత్రిగా, పి. చిదంబరం వాణిజ్యమంత్రిగా 1991 జూన్ చివరివారంలో అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం ఆ జూలై మొదటి వారంలో ప్రారంభించిన నూతన ఆర్థిక విధానాలలో భాగమే, పర్యవసానమే 2జి స్పెక్ట్రమ్ వంటి వందలాది కుంభకోణాలు. ఆ ప్రపంచీకరణ విధానాలు దేశ వనరులను మరింతగా, ఏ ఆంక్షలూ, షరతులూ లేకుండా బహుళజాతిసంస్థలకు, దేశదేశాల సంపన్నులకు దోచిపెట్టాయి. దేశ మార్కెట్లలోకి బహుళజాతి సంస్థలనూ, అంతర్జాతీయ మాఫియాలనూ, వ్యాపారులనూ ఆహ్వానించాయి. ఈ విధానాలను అమలు చేసినందుకు, ఆ అమలులో ప్రత్యేకంగా కొన్ని కంపెనీలకు అనుకూలంగా నిబంధనలు సవరించినందుకు అన్ని ప్రభుత్వాలకూ పార్లమెంటరీ రాజకీయ పక్షాలకూ అధికారగణాలకూ ముడుపులు ముట్టాయి. గత ఇరవై సంవత్సరాలలో అధికారంలో భాగం పంచుకున్న ప్రతి ఒక్కరి చేతులకూ ఈ నెత్తురు అంటింది. ప్రత్యేకించి టెలికాం రంగంలోకేవస్తే అది అవినీతిపరులకు అక్షయపాత్ర వంటి శాఖ. సుఖ్‌రాం కుంభకోణంతో 1996నాటికే బయటపడిన ఈ అవినీతికి ఆజ్యం పోసినవి టెలికాం సాంకేతిక పరిజ్ఞానంలో వచ్చిన మొబైల్ ఫోన్లు, 2జి, 3జి ఆవిష్కరణలు. గాలిని, వాయు తరంగాలను అమ్ముకోవచ్చునని, ఆ అమ్మకంలో ముడుపులు పొందవచ్చునని తెలిసిన తర్వాత పార్టీలు, ప్రభుత్వాలు ఏవైనా - అరుణ్ శౌరి, ప్రమోద్ మహాజన్, దయానిధి మారన్, ఎ రాజా - మంత్రులందరికీ ఈ తిలా పాపంలో తలా పిడికెడు భాగం ఉంది. ప్రశ్నించవలసినది ఈ నలుగురైదుగురు మంత్రులనో, ఆ కాలపు ఆర్థిక మంత్రులనో, ప్రధాన మంత్రులనో మాత్రమే కాదు. అసలీ విధానాలను. ఈ అభివృద్ధి నమూనాను. ఈ సామ్రాజ్యవాద దళారీతనాన్ని. వీ

## యూరప్ అశాంతి దేనికి సంకేతం?

కొన్ని వారాలుగా యూరప్ లోని అనేక దేశాలు అట్టుడికి పోతున్నాయి. ఒకచోట సంక్షేమ పథకాల కేటాయింపులను ప్రభుత్వం తగ్గించినందుకు నిరసనగా కావచ్చు, మరొకచోట పెరిగిపోతున్న నిరుద్యోగానికి వ్యతిరేకంగా కావచ్చు. ఇంకొకచోట పెరుగుతున్న ధరలకు వ్యతిరేకంగా కావచ్చు. కారణమేదైనా, చిన్నదైనా, పెద్దదైనా, అది స్థానిక ప్రభుత్వ చర్యకు వ్యతిరేకంగానైనా, ఐఎంఎఫ్, యూరపియన్ యూనియన్ వంటి అంతర్జాతీయ సంస్థల చర్యలకు వ్యతిరేకంగానైనా వేలాదిగా ప్రజలు వీధుల్లోకి వచ్చారు. విద్యార్థులు, నిరుద్యోగులు, కార్మికులు, స్త్రీలు, మధ్యతరగతి అన్ని వర్గాల ప్రజలు ప్రభుత్వ వ్యతిరేక ప్రదర్శనల్లో భాగమయ్యారు. స్పెయిన్ లో నిరుద్యోగానికీ ఆర్థిక సంక్షోభానికీ వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు జరిగాయి. గ్రీస్‌లో ఐఎంఎఫ్, యూరపియన్ యూనియన్ ల ప్రోద్బలంతో స్థానిక సోషల్ డెమొక్రటిక్ ప్రభుత్వం ప్రభుత్వోద్యోగుల జీతాలలో కోత విధించింది. పరిశ్రమలు మూసేసింది. పెన్షన్ నిధులను కత్తిరించింది. పన్నులు పెంచింది. ప్రైవేటీకరణ ముమ్మరం చేసింది. విద్యా, వైద్య, ఆరోగ్య, సంక్షేమ రంగాల కేటాయింపులు తగ్గించింది. ఈ చర్యలను నిరసిస్తూ దేశమంతా ఒక్కతాటి మీద లేచినిలిచింది. ఈ ప్రజాందోళనలు స్పెయిన్, గ్రీస్‌లలో పెద్ద ఎత్తున సాగగా బ్రిటన్, జర్మనీ, పోర్చుగల్, ఇటలీలతో సహా అనేక దేశాలలో చిన్నవో పెద్దవో నిరసన ప్రదర్శనలు సాగాయి. చాల చోట్ల ఆందోళనకారులు క్రియాశీల పోరాటరూపాలను ఎంచుకోవడం, నిర్బంధ చర్యలను, పోలీసు దాడులను ఎదిరించడం, చాల వరకు ఈ ఆందోళనలకు నాయకత్వం వహించినది రాజకీయ పక్షాలు కాకపోవడం గమనార్హం. సంపన్న దేశాలుగా, ఎంతో కొంత సంక్షేమ రాజ్య భావనను అమలు చేస్తున్నదేశాలుగా పేరుపడిన ఈ దేశాలలోనే ఇప్పుడు ప్రజా అసంతృప్తి ఇంత ఉద్రిక్తంగా బయటపడుతున్నది. 1960ల కోపోద్రిక్త వెల్లువ తర్వాత ఈ దేశాలలో విప్లవ స్ఫూర్తి సన్నగిల్లిందనీ, ప్రజలు మందకొడితనంలోకి దిగజారారనీ, విప్లవశక్తులు భ్రమలలో మునిగి, అమ్ముడుపోయాయనీ, సంస్కరణవాదంలోకి జారిపోయాయనీ, విప్లవాలకు కాలం చెల్లిందనీ మేధావులు ప్రవచిస్తున్నప్పుడు, నిద్రాణంగా ఉన్న ప్రజా అసంతృప్తి అగ్నిపర్వతంలా ఉన్నదని ఈ ఆందోళనలు రుజువు చేస్తున్నాయి. సరిగ్గా ఈ ప్రజ్వలనాల సమయంలోనే, అభివృద్ధి నిరోధక భావజాల ప్రచారం ద్వారా, ప్రజాచైతన్యాన్ని జోకొట్టే చర్యల ద్వారా ప్రజలను పక్కదారి పట్టించడానికి పాలకవర్గాలు ప్రయత్నిస్తున్నాయి. నార్వేలో ఒక మతోన్మాది 90 మంది పిల్లలను కాల్చిచంపడం ఒక ఒంటరి చర్య కాదు. ప్రజల అసంతృప్తిని పక్కదారి పట్టించడానికి రెండు యుద్ధాల మధ్యకాలంలో హిట్లర్, ముస్సోలినీలు రెచ్చగొట్టిన జాతీయోన్మాద, హింసా రాజకీయాలకు కొనసాగింపే ఇది. ఒక్క మాటలో చెప్పాలంటే యూరప్ ఇవాళ ఒకపక్క ప్రజాచైతన్య, ఆచరణ ప్రదర్శనలతో ఆశనూ రేకెత్తిస్తున్నది. దుర్మార్గ హింసాకాండలతో నిరాశకూ వీలు కల్పిస్తున్నది. కొనసాగుతున్న ప్రజా అసంతృప్తి ప్రదర్శనలకు సరైన, శాస్త్రీయమైన పోరాట మార్గం చూపగలిగితే, ఆ ఆందోళనలను సంస్కరణవాదుల చేతులలోకీ, ప్రభుత్వేతర సంస్థల చేతులలోకీ పోనివ్వకుండా నిజమైన ప్రజాశక్తులు నాయకత్వం వహిస్తే ఈ శతాబ్దంలో యూరప్ మానవజాతి చరిత్రకు ఒక కొత్త ప్రజామార్గం చూపగలదని ఇటలీలోని ఒక చిన్న మావోయిస్టు పార్టీ - పార్టీ ఆఫ్ ది కమిటీస్ టు సపోర్ట్ రెసిస్టెన్స్ - ఫర్ కమ్యూనిజం (సిఎ ఆర్ సి) విశ్లేషిస్తున్నది. అది కేవలం ఆశాజనకమైన ఊహ కాగూడదు. వాస్తవరూపం ధరించాలి. వీ










- **సేద్యం** – ఇక్బాల్ కవిత్వం 1978-2011 – పాలమూరు అధ్యయన వేదిక ప్రచురణ – 190 పేజీలు, 1/8 డెమీ, రు : 100, ప్రతులకు: ఇక్బాల్, ఇక్బాల్ మంజిల్, 6-29, జి.వి. ఎన్‌క్లేవ్, గద్వాల్. సెల్ : 9440775732; ఎం. రాఘవాచారి, ఫ్లాట్ నెం. 41, శాంతి చంద్రిక, ఇం.నెం. 3-148, బాలాజీ నగర్, మహబూబ్‌నగర్, సెల్ : 9490909792; దిశ, సహచర, నవోదయ, విశాలాంధ్ర, ప్రజాశక్తి పుస్తక కేంద్రాలలో
- **మహోజ్జ్వల తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట** – నవలా సాహిత్యం – పరిచయాలు – పరిశీలన – జనసాహితి ప్రచురణ – 172 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు: మైత్రి బుక్‌హౌస్, జలీల్ వీధి, కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ – 520 002; దిశ, సహచర, నవోదయ, విశాలాంధ్ర, ప్రజాశక్తి, తెలుగు బుక్ హౌస్
- **సిర్గాపూర్ నుండి వాల్‌స్ట్రీట్ దాకా** – ఓ ఆర్థిక విశ్లేషణ – సిర్గాపూర్ విద్యాసాగర్ రెడ్డి – అనువాదం : నిజాం వెంకటేశం – సిద్ధాంత్ పబ్లిషర్స్ ప్రచురణ – 139 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు: సిద్ధాంత్ పబ్లిషర్స్, ఇ.నెం. 5-11-90, మస్తాన్‌దుబ్బా, ప్రియదర్శినీ నగర్, నిర్మల్, ఆదిలాబాద్ – 504 106
- **మానవీయ శ్రీశ్రీ** – లోచన్ – శ్రీశ్రీ సాహిత్య నిధి, 31 పేజీలు, 1/8 డెమీ, రు.20, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ – 520 004; ఫోన్ : 0866-6617375, ఫ్యాక్స్ : 0866-6697375, సెల్ : 9848504649, 9246277375; ఇ-మెయిల్ : srisri_sahityanidhi@yahoo.com
- **కుల వ్యతిరేక పోరాట యోధులు జోతిరావు పులే, సావిత్రిబాయి పులే** – రమణమూర్తి – విజయవిహారం సమర్పణ –జనహర్ష ప్రచురణ, 25 పేజీలు, 1/10 డెమీ, రు.10, ప్రతులకు : జనహర్ష పబ్లిషర్స్ ప్రై. లి. 3-8-347, మన్సూరాబాద్, చంద్రపురి కాలనీ, ఎల్.బి.నగర్, హైదరాబాద్ – 500 074. ఫోన్ : 24026053, సెల్ : 9848019076, ప్రజాశక్తి, దిశ బుక్ సెంటర్, నవోదయ బుక్ హౌస్, నవయుగ బుక్‌హౌస్, ప్రముఖ పుస్తక కేంద్రాల్లో
- **'సెజ్‌లు రైతుల మెడకు ఉరితాళ్లు'** – ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (ఎపిసిఎల్‌సి) ప్రచురణ – 41 పేజీలు, 1/4 క్రౌన్, రు. 10, ప్రతులకు : ప్రొ. ఎస్. శేషయ్య, ఫ్లాట్ నెం. 49, విద్యుత్‌నగర్, అనంతపురం
- **వర్డిక్ట్ ఆన్ అయోధ్య** – క్రాంతికార్ –74 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : క్రాంతికార్, బుద్ధ భవన్, 11-1-88, లెనిన్ నగర్, ఖమ్మం – 507 001; సెల్ : 9177280712, 9396735271; డా. వై. భానుప్రసాద్, భరత్ నర్సింగ్ హోమ్, యు.బి. రోడ్, భద్రాచలం, ఖమ్మం – 507 111; సెల్ : 9848421406
- **కథలు** – నాయుని కృష్ణమూర్తి – వియన్నార్ బుక్ వరల్డ్ – 202 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : వి.ఎన్.ఆర్. బుక్ వరల్డ్, చౌడేపల్లె, చిత్తూరు – 517 257
- **ప్రేమ ప్రతిపాదన** – కవిత్వం – ఆకెళ్ల రవిప్రకాష్ – పొయెట్రీ ఫోరం – 111 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు : ఫ్లాట్ నెం. 37 & 38, శ్రీకృష్ణ స్ట్రీట్, శాంతినగర్ ఎక్స్‌టెన్షన్, లాస్‌పేట్, పాండిచ్చేరి – 605 008; పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; ఇమెయిల్ : palapittabooks@gmail.com
- **సూది నానీలు** – యెన్నం సత్యం – భగీరథ ప్రచురణలు –124 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, బాంక్ స్ట్రీట్, విజ్ఞాన్ భవన్, హైదరాబాద్ – 500 001; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు








## పెరిగిన బస్ చార్జీలు

ఆర్.టి.సి. పెంచిన బస్‌టికెట్ చార్జీలు జూలై 16 నుంచి అమలులోకి వస్తాయని ఆర్‌టిసి అధికారులు ప్రకటించారు. పెంచిన రేట్ల ప్రకారం కిలోమీటరుకు ఆర్డినరీ బస్సుకు 4 పైసలు, ఎక్స్‌ప్రెస్‌కి 8 పైసలు, డీలక్స్‌కి 10 పైసలు, సూపర్‌లగ్జరీకి 12 పైసలు, గరుడాకి 15 పైసలు. ఈ పెంపుతో ఆర్.టి.సి.కి ఏడాదికి రు. 538 కోట్ల ఆదాయం వస్తుందని అధికారులు చెప్పారు.

## తాత్కాలిక బ్రేక్

సోంపేట థర్మల్ పవర్ ప్రాజెక్ట్‌కు సంబంధించి ప్రభుత్వం జారీచేసిన జి.ఒ. 1107 అమలును నిలిపివేస్తూ జూన్ 23న హైకోర్టు మధ్యంతర ఉత్తర్వులు జారీచేసింది. ప్రాజెక్ట్ నిర్మాణానికి వ్యతిరేకంగా మూడేళ్లుగా ఉద్యమిస్తున్న పర్యావరణ పరిరక్షణ సమితి, మత్స్యకారుల ఐక్య వేదిక ప్రతినిధులు ఈ పరిణామంపై హర్షం వ్యక్తం చేశారు. శ్రీకాకుళం జిల్లా సోంపేట మండలం బీల ప్రాంతంలో రు. 12 వేల కోట్ల పెట్టుబడితో 2640 మెగావాట్ల సామర్థ్యంతో థర్మల్ పవర్ ప్రాజెక్ట్ నిర్మించాలని నాగార్జున కన్‌స్ట్రక్షన్ కంపెనీ మూడేళ్ల నుంచీ సన్నాహాలు చేస్తున్న విషయం తెలిసిందే.

## మద్యంతో ప్రజల 'అభివృద్ధి'

ఇటీవల మద్యం దుకాణాలకు నిర్వహించిన టెండర్ల ద్వారా ఏడు వేల కోట్ల రూపాయల ఆదాయం చేసుకున్న ప్రభుత్వం అబ్కారీ శాఖకు లక్ష్యాలు నిర్దేశించింది. అబ్కారీ శాఖ నుంచి రాబట్టాల్సిన ఏడువేల కోట్ల రూపాయల ఆదాయ లక్ష్యాన్ని చేరుకోవాలంటే కనీసం రు. 20 వేల కోట్ల మేరకు మద్యం విక్రయాల ద్వారా రాబట్టుకోవాల్సి ఉంటుంది. రాష్ట్ర జనాభా దాదాపుగా 8.5 కోట్లు ఉంటే ఇందులో మద్యం సేవించే వారి సంఖ్య కోటిన్నర దాకా ఉంటుంది. వీరందరి నుంచీ వివిధ రూపాలలో ఆదాయం దండుకునేందుకు తలసరి రు. 13,350 మద్యం తాగించాల్సిందే.

## బలగాలు ఉపసంహరించాలి

దండకారణ్యం నుంచి సైన్యం, పారా మిలిటరీ బలగాలను తక్షణమే ఉపసంహరించి, గ్రీన్‌హంట్ నిలిపివేయాలని 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' వ్యతిరేక కమిటీ డిమాండ్ చేసింది. ప్రభుత్వ సైనిక చర్యకు వ్యతిరేకంగా త్వరలో హైదరాబాద్, ఢిల్లీలలో ధర్నాలు నిర్వహించాలని నిర్ణయించింది. జూన్ 25న హైదరాబాద్‌లోని ప్రోగ్రెసివ్ మీడియా సెంటర్‌లో సమావేశమైన కమిటీ ఈ తీర్మానాలను చేసినట్లు కన్వీనర్ క్రాంతి చైతన్య ఒక ప్రకటనలో పేర్కొన్నారు. ఎ.పి.సి.ఎల్.సి, కుల నిర్మూలన పోరాట సమితి, ప్రజా కళా మండలి, విరసం, చైతన్య మహిళా సంఘం, దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం, ఎ.పి.టి.ఎఫ్., ఆర్.పి.ఐ., ప్రగతిశీల కార్మిక సమాఖ్య, సి.ఎల్.ఎం.సి. సంస్థల ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

## జాంబ పురాణమే ప్రాచీనం

వేదాలు, ఉపనిషత్తులకన్నా జాంబ పురాణమే భారతీయ సంస్కృతికి మూలాధారమైన సాహిత్యమని విప్లవ రచయిత జి. కళ్యాణరావు అన్నారు. జానపద సంస్థ సేకరించి ప్రచురించిన మౌఖిక మహాగాథ 'దక్కలి జాంబ పురాణం' పుస్తకాన్ని హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జూలై 3న ఆవిష్కరించారు. ఈ సభకు పుస్తక సంపాదకవర్గ సభ్యులు జయధీర్ తిరుమలరావు అధ్యక్షత వహించారు. దక్కలి కళాకార్నుడు కన్నెగంటి (దక్కలి) గోపాల్ పల్లకిలో ఉంచిన పుస్తకాన్ని ఆవిష్కరించి మంత్రి డొక్కా మాణిక్యవరప్రసాద్‌కు అందించారు. ఈ సభలో వక్తలుగా గద్దర్, కొలకలూరి ఇనాక్, పొత్తూరి వెంకటేశ్వరరావు, జూలూరు గౌరీశంకర్, డా. విజయభారతి తదితరులు పాల్గొన్నారు.

## తెలంగాణ కోసం రాజీనామాలు

జూలై 3, 4 తేదీలలో తెలంగాణ రాష్ట్ర ప్రకటన వెంటనే చేయాలని డిమాండ్ చేస్తూ తెలంగాణ ప్రాంత ఎం.ఎల్.ఎ.లు, ఎం.ఎల్.సి.లు, ఎం.పి.లు రాజీనామాలు చేశారు. కాంగ్రెస్‌కు చెందిన ఎం.ఎల్.ఎ.లు - 42 (మొత్తం ఉన్నది 53), ఎం.ఎల్.సి.లు - 12 (19), ఎం.పి.లు - 10 (17); తెలుగుదేశం పార్టీకి చెందిన ఎం.ఎల్.ఎ.లు - 37 (37), ఎం.ఎల్.సి.లు-3 (3), ఎం.పి.లు-2 (2); వీరితోపాటు పి.ఆర్.పి. ఎం.ఎల్.ఎ.లు-2 (2), బి.జె.పి. ఎం.ఎల్.ఎ.లు-2 (2), సి.పి.ఐ. ఎం.ఎల్.ఎ.లు - 4 (4), టి.ఆర్.ఎస్. ఎం.ఎల్.ఎ.లు - 11 (11), ఎం.పి.లు - 2 (2) రాజీనామాలు చేశారు. ఈ పరిణామ క్రమంలో తెలంగాణ జె.ఎ.సి. జూలై 5, 6 తేదీలలో 48 గంటల తెలంగాణ బంద్‌తో సహా పలు నిరసన కార్యక్రమాలకు పిలుపునిచ్చింది.

## చుండూరు దళితులకు మళ్లీ అన్యాయం

1991 నాటి చుండూరు ఊచకోత కేసులో 116 మంది నిందితులపై కింది కోర్టు తీర్పు మీద హైకోర్టులో అప్పీలుకు ప్రభుత్వం ఉత్తర్వులు ఇవ్వగా, కేవలం ఇద్దరిపైన మాత్రమే కేసు దాఖలు చేసి చేతులు దులిపేసుకున్నారు. ప్రభుత్వం ఇటీవల నియమించిన ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్ బి. చంద్రశేఖర్ పరిశీలనలో ఈ వ్యవహారం బట్ట బయలైంది. దీనిపై లా సెక్రటరీకి నివేదించనున్నట్లు తనకు గల అధికారాలతో మిగిలిన 114 మంది పైనా అప్పీలు చేయనున్నట్లు జూలై 9న తెలిపారు. మరోవైపు ఈ మోసంపై ఉద్యమించేందుకు దళిత, ప్రజాస్వామిక వాదులు సమాయత్తం అవుతున్నారు.

## వర్షాభావం

జూన్ నెలాఖరుకల్లా 105.2 మిల్లీమీటర్ల వాన కురువాల్సి ఉండగా, జూన్ 29 నాటికి 37 శాతం తక్కువగా అంటే, 65.8 మిల్లీమీటర్ల వర్షం మాత్రమే కురిసింది. ఆ పాటికి 17.3 లక్షల హెక్టార్ల భూమిలో సాగు కావాల్సి ఉండగా 12.22 లక్షల హెక్టార్లలోనే విత్తనాలు పడ్డాయి. ఈసారి ఇరవై జిల్లాల్లో సగటు కన్నా తక్కువ వర్షపాతం నమోదైంది. ఉత్తర తెలంగాణలో 51 శాతం, దక్షిణ తెలంగాణలో 48 శాతం, రాయలసీమలో 37 శాతం, ఉత్తరాంధ్రలో 24 శాతం తక్కువ వర్షపాతం నమోదైంది.

## లడ్డా కేసు కొట్టివేత

2005లో ప్రకాశం జిల్లా అప్పటి ఎస్.పి. మహేష్ చంద్ర లడ్డాపై హత్యాప్రయత్నం కేసును కొట్టివేస్తూ జిల్లా అదనపు సీనియర్ సివిల్ జడ్జ్ బి. శివనాగిరెడ్డి జూలై 13న తీర్పును ఇచ్చారు. నేరం రుజువు కాకపోవడంతో గంటి ప్రసాదం, విరసం నేతలు పి. వరవరరావు, జి. కళ్యాణరావు, సాగర్ అలియాస్ పాండురంగా రెడ్డిలను నిర్దోషులుగా ప్రకటిస్తూ తీర్పునిచ్చారు. ఈ కేసులో ఉన్నవారిలో శాఖమూరి అప్పారావు, ఎర్ర సత్యంలు పోలీసు కాల్పుల్లో చనిపోయారు. అక్కిరాజు హరగోపాల్ అలియాస్ ఆర్.కె. అజ్ఞాతంలో ఉన్నారు. అసలు బాధితుడైన లడ్డా ఒక్కసారి కూడా కోర్టుకు రాలేదు. కేసు దర్యాప్తు చేసిన పోలీసులు సైతం కోర్టుకు హాజరు కాకపోవడం విశేషం.

## కౌలు రైతులకు రుణ అర్హత గుర్తింపు కార్డులు

కౌలు రైతులకు రుణ అర్హత గుర్తింపు కార్డుల పంపిణీ పథకాన్ని జూలై 10న ముఖ్యమంత్రి ఎన్. కిరణ్‌కుమార్ రెడ్డి రాజమండ్రిలో ప్రారంభించారు. దీని ద్వారా 26 లక్షల మంది కౌలు రైతులకు ప్రయోజనం చేకూరుతుందని చెప్పారు. ఖరీఫ్, రబీ సీజన్‌లలో రాష్ట్రంలో ఒక కోటి మంది రైతులకు రు. 44 వేల కోట్ల రుణాలివ్వాలని లక్ష్యంగా నిర్దేశించుకున్నట్లు చెప్పారు. వీ

*విద్యను మరింతగా వ్యాపారం చేయడానికీ, విదేశీ సంస్థలకు తలుపులు బార్లా తెరవడానికీ ఉద్దేశించిన విద్యా బిల్లులకు వ్యతిరేకంగా ఉద్యమించాలంటున్నారు* **డా. కె. లక్ష్మీనారాయణ**

# విశ్వవిద్యాలయాల విధ్వంసానికే బిల్లులు

రాబోతున్న వర్షాకాల పార్లమెంటు సమావేశాలలో ఉన్నత విద్యకు సంబంధించి తొమ్మిది బిల్లులను ప్రవేశపెట్టడానికి కేంద్ర ప్రభుత్వం సమాయాత్తమౌతోంది. విదేశీ విద్యాసంస్థల బిల్లు, విద్యా ట్రిబ్యునల్ బిల్లు, నేషనల్ అక్రిడిటేషన్ బిల్లు, విద్యా సంస్థలలో అక్రమాల నిరోధక బిల్లు, ఉన్నత విద్యా పరిశోధన జాతీయ సంస్థల బిల్లు, ఇనోవేటివ్ యూనివర్సిటీల బిల్లులు ఇందులో ఉన్నాయి. ప్రభుత్వ రంగంలో ఉన్న మెజారిటీ విశ్వవిద్యాలయాలను పూర్తిగా నిర్లక్ష్యం చేసి, మూసివేసి ఓ అరడజను విశ్వవిద్యాలయాలకు మాత్రం కొన్ని నిధులిచ్చి ప్రోత్సహించే అవకాశాలున్నాయి. ఇదే సమయంలో ప్రైవేటు, విదేశీ విశ్వవిద్యాలయాలను కుప్పలు తెప్పలుగా ఆహ్వానించి స్వయం ప్రతిపత్తి పేరు మీద ఉనికిలో ఉన్న చట్టాలను ఉల్లంఘించడానికి, వీటికి అనుకూలమైన చట్టాలను చేయటానికి కేంద్ర ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. ఇందులో భాగమే రాబోయే వర్షాకాల పార్లమెంటులో ప్రవేశపెడుతున్న తొమ్మిది బిల్లులు.

## ప్రభుత్వ విశ్వ విద్యాలయాల నిర్లక్ష్యం

మన దేశంలో దాదాపు 500 విశ్వవిద్యాలయాలు ఉన్నాయి. ఇందులో ప్రభుత్వ విశ్వవిద్యాలయాలే ఎక్కువ. అయితే 1990ల నుండి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న మార్కెటు ప్రేరిత సంస్కరణలు ప్రభుత్వ విశ్వవిద్యాలయాలను పూర్తిగా నిర్లక్ష్యం చేశాయి. చేస్తున్నాయి. మన రాష్ట్రాన్నే తీసుకుంటే ఒకపుడు జాతీయ స్థాయిలో అత్యంత ప్రతిష్ట కలిగిన ఉస్మానియా, ఆంధ్ర యూనివర్సిటీలు కూడా నిర్లక్ష్యానికి గురి అయ్యాయి. రాష్ట్ర ప్రభుత్వం అధ్యాపక పోస్టులు భర్తీ చేయడం లేదు. ాష్ట్ర వ్యాప్తంగా 1919 పోస్టులు ఖాళీగా ఉంటే ఒక్క ఉస్మానియా యూనివర్సిటీలోనే 580 అధ్యాపక పోస్టులు ఖాళీగా ఉన్నాయి.

ఇంకా శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీలో 220, ఆంధ్ర యూనివర్సిటీలో 153, కాకతీయ యూనివర్సిటీలో 119, ఆచార్య నాగార్జున యూనివర్సిటీలో 69, జవహర్‌లాల్ నెహ్రూ టెక్నాలజికల్ యూనివర్సిటీలో 251 పోస్టులు ఖాళీగా ఉన్నాయి. ప్రభుత్వాలు నిధులు తగ్గిస్తూపోవడం వలన లైబ్రరీలు, లాబరెటరీలను అప్‌గ్రేడ్ చేయలేకపోతున్నాయి. ఫలితంగా ప్రమాణాలు పడిపోతున్నాయి. ఇక కొత్తగా ఏర్పాటైన పాలమూరు యూనివర్సిటీ, రాయలసీమ యూనివర్సిటీ, కృష్ణా యూనివర్సిటీల లాంటి వాటి పరిస్థితి మరింత అధ్వాన్నంగా ఉంది. వందలాది రెగ్యులర్ అధ్యాపక పోస్టులు నింపకుండా అకడమిక్ కన్సల్‌టెంట్స్ అని, టీచింగ్ అసిస్టెంట్సు అనే ముద్దు పేర్లు పెట్టి వారిని కాంట్రాక్టు పద్ధతిలో నియమించి వెట్టిచాకిరి చేయిస్తున్నారు. వీరికిచ్చే జీతం 15-18 వేల రూపాయలు మాత్రమే. కొత్తగా వచ్చిన అన్ని యూనివర్సిటీలలోని అధ్యాపకులలో సుమారు నూటికి 80 మంది ఈ అకాడమిక్ కన్సల్‌టెంట్‌లే. దీనికి తోడు రాష్ట్రంలో 18 విశ్వవిద్యాలయాలకు వి.సి.లు లేక ఇన్‌చార్జీల పాలన నడుస్తున్నది.

ఈ విధంగా వందలాది రెగ్యులర్ అధ్యాపక పోస్టులు నింపకుండా, ఉద్యోగ భద్రతలేని, సహేతుక జీతాలు లేని అకడమిక్ కన్సల్‌టెంట్స్ ద్వారా విద్యా ప్రమాణాలు ఎలా పెరుగుతాయి? లైబ్రరీలు, లాబరెటరీలను నిరంతరంగా అభివృద్ధి చేయకపోతే గుణాత్మక విద్య ఎలా వస్తుంది?

ఇంకా ప్రమాదకరమైన అంశమేమిటంటే విశ్వవిద్యాలయాలలో ఉండవలసిన కోర్సులు ఈ యూనివర్సిటీలలో లేవు. విశ్వాన్ని అంటే ప్రకృతిని, సమాజాన్ని సమగ్రంగా, లోతుగా తెలుసుకోవడమే విశ్వవిద్యాలయాల లక్ష్యం. దీనికోసం మౌలిక ప్రకృతి, సామాజిక శాస్త్రాలు, మానవీయ, భాషా శాస్త్రాలు బోధించాలి. అయితే మార్కెటు ప్రేరిత సంకుచిత దృష్టితో సామాజిక, భాషా శాస్త్రాలను, మానవీయ శాస్త్రాలను చివరికి మౌలిక ప్రకృతి శాస్త్రాలను చిన్న చూపు చూడడమూ, లేదా బోధించకపోవడమో జరుగుతున్నది. పాలమూరు యూనివర్సిటీలో రాజకీయ శాస్త్రం తప్ప సామాజిక శాస్త్రాలు లేవు. ఇంగ్లిషు తప్ప మానవీయ, భాషా శాస్త్రాలు లేవు. రాయలసీమ యూనివర్సిటీలో అర్థశాస్త్రం తప్ప సామాజిక శాస్త్రాలు లేవు. ఇంగ్లిషు, తెలుగు తప్ప మానవీయ, భాషా శాస్త్రాలు లేవు. సెల్ఫ్ ఫైనాన్స్‌డ్ కోర్సులనీ ఎం.బి.ఎ., ఎం.సి.ఎ., కంప్యూటర్, ఫార్మసీలాంటి కోర్సులు ప్రవేశపెట్టి ఒక్కొక్క విద్యార్థి నుండి 26 నుండి 30 వేల రూపాయల వరకు వసూలు చేస్తున్నారు.

వందలాది అధ్యాపక పోస్టులను రెగ్యులర్ ప్రాతిపదికన నింపకపోవడం వలననూ, లైబ్రరీలు, లాబరెటరీలు నిరంతరంగా అభివృద్ధి చేయకపోవడం వలననూ, మిగతా ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ స్థాపించక పోవడం వలననూ ప్రభుత్వ విశ్వవిద్యాలయాలలో ప్రమాణాలు ఆశించిన స్థాయిలో లేకపోవడం సహజమే. ఇలా ప్రభుత్వ విధానాల వలన పడిపోతున్న ప్రమాణాలు చూపించి ఉన్నత విద్యలో అత్యున్నత ప్రమాణాలు ఉండాలనే పేరు మీద ఈ ప్రభుత్వ యూనివర్సిటీలను

మూసివేయడానికీ, లేదా వీటి ఆస్తులను, భూములను స్వదేశీ, విదేశీ కార్పోరేటు యూనివర్సిటీలకు ధారాదత్తం చేయడానికి ఆమోద ముద్ర వేయించుకొంటున్నారు.

## ఇన్నోవేషన్ యూనివర్సిటీల బిల్లు

విదేశీ విద్యాసంస్థల బిల్లు, అక్రిడిటేషన్ బిల్లు మొదలైన వాటి గురించి కొంత చర్చ జరిగింది. కాని ఇన్నోవేషన్ యూనివర్సిటీల బిల్లు రాబోతున్నదనే వార్తలు చదువుతున్నాం కాని దాని బిల్లు ప్రతి (డ్రాఫ్ట్ కాపీ) కూడా అందుబాటులో లేదు. అయితే ఇన్నోవేషన్ యూనివర్సిటీల లక్ష్యం ప్రపంచ ప్రమాణాలు గల విద్యనందించడమనే కాన్సెప్ట్ నోట్‌లో కొన్ని విషయాలను పొందు పరిచారు. ఈ నోట్ ప్రకారం రాబోయే 14 ఇన్నోవేషన్ యూనివర్సిటీలు ఏర్పరచడానికి ప్రభుత్వమే కీలక పాత్ర పోషిస్తుందని చెబుతూ ప్రభుత్వ - ప్రైవేటు భాగస్వామ్యం ద్వారా స్థాపించ వచ్చని పేర్కొన్నారు. అంటే ఇప్పటికే ఉన్నత విద్యనందిస్తున్న గీతం యూనివర్సిటీ, ఇక్ఫాయ్, విజ్ఞాన్, పాయ్‌ఫౌండేషన్‌లాంటి కార్పోరేటు సంస్థలు ఇంకా కొన్ని యూనివర్సిటీలు స్థాపించవచ్చు. అంతేగాక ప్రపంచ స్థాయి ప్రమాణాలు కలిగిన యూనివర్సిటీలు ప్రపంచంలో ఎక్కడున్నా మన దేశంలో ఇన్నోవేషన్ యూనివర్సిటీలు పెట్టవచ్చు. అందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అన్ని విధాలా సహకరిస్తాయి. అంటే ప్రభుత్వ రంగంలో వచ్చే యూనివర్సిటీల కన్నా ప్రభుత్వ - ప్రైవేటు భాగస్వామ్యంలో వచ్చే స్వదేశీ, విదేశీ, కార్పోరేటు యూనివర్సిటిలే ఎక్కువ. 'ఇన్నోవేషన్' పేరు మీద వచ్చే ఈ వర్సిటీలు రాజ్యాంగ స్ఫూర్తికి, సామాజిక న్యాయానికి వ్యతిరేకంగా పనిచేస్తాయి. ఈ కాన్‌సెప్ట్ నోట్‌లో విద్యార్థుల అడ్మిషన్ల గురించి రాస్తూ రిజర్వేషన్లు ఇచ్చే బదులు వెయిటేజి విధానాన్ని ప్రవేశపెట్టాలి. ఈ వెయిటేజి విద్యార్థుల తల్లిదండ్రుల స్థాయి, సామాజిక, ఆర్థిక నేపథ్యంని బట్టి నిర్ణయిస్తారు" అంటే ఎస్.సి./ఎసి.టి./బిసి విద్యార్థులకుండే రిజర్వేషన్లు ఉండవు. తరతరాలుగా విద్యకు దూరం చేయబడ్డ ఈ పీడిత కులాలకు ఇంకా విద్య దూరమౌతుంది. అయితే ఇక్కడ విదేశీ విద్యార్థులకు ఆహ్వానం పలకడమే కాక నూటికి 50 మంది దాక ఉండవచ్చని సూచించారు. ఇక అధ్యాపకుల నియామకం గురించి రాస్తూ, అసోసియేట్ ప్రొఫెసర్లు, అసిస్టెంట్ ప్రొఫెసర్లందరికి ఉద్యోగ భద్రత అవసరం లేదని బహిరంగంగానే చెప్పారు. దీనిని బట్టి చూస్తే ఒకవైపు సామాజిక న్యాయానికి, రాజ్యాంగానికి వ్యతిరేకంగా అడ్మిషన్లు జరుగుతాయి. ఇంకొకవైపు ఉద్యోగ భద్రత లేకుండా సరియైన జీతాలు ఇవ్వకుండా మెజారిటీ అధ్యాపకులను నియమిస్తారు.

ఇవన్నీ చూస్తే ఇన్నోవేటివ్ యూనివర్సిటీల బిల్లు, విదేశీ విశ్వవిద్యాలయాలకు అడ్డంకులు లేకుండా చేసి, సహాయ, సహకారాలు అందించడమే దీని 'ఇన్నొవేషన్'.

## విశ్వవిద్యాలయాల లక్ష్యాల వక్రీకరణ

ప్రజల పక్షాన నిలబడి ప్రజాస్వామికంగా, శాస్త్రీయంగా ఎలా ఆలోచించాలో చెప్పగలిగే సకల శాస్త్రాలు కలిగిన జ్ఞానకేంద్రమే విశ్వవిద్యాలయం. దేశంలో జరుగుతున్న వస్తు సేవల ఉత్పత్తి రంగాలకు కావలసిన శాస్త్ర సాంకేతిక నిపుణులను కూడా ఇవి తయారు చేయాలి. కాని మార్కెటులో గిరాకి లేదన్న పేరుతో యూనివర్సిటీలలో సామాజిక శాస్త్రాలకు, మానవీయ శాస్త్రాలకు ప్రాధాన్యత ఇవ్వడం లేదు. కొత్తగా వచ్చిన యూనివర్సిటీలలో ఆ శాస్త్రాలనే బోధించడం లేదు. దీనివలన విశ్వవిద్యాలయ లక్ష్యాలే వక్రీకరించబడుతున్నాయి. ఒకపుడు తాత్విక, సిద్ధాంత రాజకీయ చర్చలలో, ప్రజా ప్రయోజనాల వ్యక్తీకరణతో, మహోన్నత ఆదర్శాల ఆచరణతో విలసిల్లిన విశ్వవిద్యాలయాలు ఇప్పుడు స్వప్రయోజనం, వ్యక్తిగత ప్రయోజనం హద్దు మీరి పచ్చి స్వార్థాన్ని పెంచే కేంద్రాలుగా మారుతూ ఉన్నాయి. ఉపాధిని పొంది డబ్బు సంపాదనే విద్యా లక్ష్యంగా చూపి వృత్తి, నైపుణ్యాలను కుదించడం వలన ఇప్పుడున్న ప్రస్తుత వ్యవస్థలో స్వదేశీ కార్పోరేటు కంపెనీలకు, బహుళజాతి కంపెనీలకు మేధో శ్రామికులను తయారు చేయడమే విశ్వవిద్యాలయాల విధి అన్నట్లు విష ప్రచారం సాగుతోంది. తత్ఫలితంగా ఒకపుడు తమ శ్రమనంతా పరుల కొరకు ధారబోసే మూగజీవుల కోసం త్యాగమూర్తులను తయారు చేసిన వైద్యవృత్తి, విద్యా వ్యాపారుల కబంధ హస్తాలలో పడి ఆ మూగ జీవుల ప్రాణాలను బలిదీసుకుంటుంది. ఒకప్పుడు అత్యంత గౌరవంగా చూడబడ్డ ఉపాధ్యాయ, అధ్యాపక వృత్తులు విద్యా వ్యాపారీకరణ వలన దిగజార్చబడి పసిడి గల్ల వాని బానిసలుగా తయారౌతున్నాయి. ఫలితంగా విశ్వవిద్యాలయాల లక్ష్యాలే వక్రీకరించ బడుతున్నాయి.

## గ్యాట్స్ ఒప్పందం కోసమే పార్లమెంటులో బిల్లులు

ప్రపంచ వాణిజ్య సంస్థలో భాగమైన సేవల రంగంలో సాధారణ ఒప్పందం (జి.ఎ.టి.ఎస్.)లో భారత ప్రభుత్వం తన ఉన్నత విద్యారంగాన్ని చేర్చేందుకు 2008లోనే అందుకు సంబంధించిన 'ప్రారంభ సంసిద్ధతలను' అందజేసింది. అయితే 'దోహ విడత' చర్చలలో ప్రతిష్టంభన ఏర్పడడం వలన కొంత ఆటంకం ఎదురైంది. ప్రతిష్టంభన ఎందుకంటే దోహ విడత చర్చలు పూర్తి కావాలంటే ఏదో ఒక రంగంలో సభ్య దేశాలకు మధ్య వాణిజ్య ఒప్పందం కుదిరితే చాలదు. సకల రంగాలలో అంటే వ్యవసాయం, పరిశ్రమలు, విద్య, వైద్యం మొదలైన అన్ని రంగాలకు సంబంధించి అన్ని సభ్య దేశాల మధ్య ఒప్పందాలు కుదిరినపుడే దోహ ఒప్పందం పూర్తి అవుతుంది. అందుకే దేనిని సింగిల్ అండర్‌టేకింగ్ అంటున్నారు. ఈ దోహ విడత చర్చలలో ఏర్పడిన ప్రతిష్టంభనను తొలగించి వచ్చే డిసెంబరు లోగానే ఈ చర్చలను పూర్తి చేయడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నట్టు కేంద్ర మంత్రి ఆనంద శర్మ తెలిపారు. జి.ఎ.టి.ఎస్.లో తమ విద్యారంగాన్ని చేర్చదలుచుకొన్న దేశాలు ఈ వాణిజ్య ఒప్పందానికి అనుకూలంగా విద్యారంగానికి సంబంధించి అవసరమైన చట్టాలు చేయాలని డబ్ల్యూ.టి.ఓ. - జి.ఎ.టి.ఎస్. ఒప్పందం నిర్దేశిస్తుంది. అందుకే ఉన్నత విద్యకు సంబంధించిన బిల్లులను డిసెంబరుకు ముందే పార్లమెంటులో ఆమోదింపచేయాలని మన్మోహన్ సింగ్ ప్రభుత్వం కంకణం కట్టుకుంది.

ఒక రకంగా మానవీయ విలువలపై, మహోన్నత లక్ష్యాలపై, విద్యపై దాడి జరుగుచున్నది. వచ్చే వర్షాకాల పార్లమెంటు సమావేశాలలో ప్రవేశపెడుతున్న బిల్లులు, రాజ్యాంగానికి వ్యతిరేకంగా ఉన్నత విద్యను నాన్-మెరిట్ గూడ్‌గా అంగట్లో సరుకుగా చిత్రీకరించాయి. ఈ

*వనరులను విధ్వంసం చేసి, స్థానిక ప్రజల జీవితాలలో చీకట్లు నింపనున్న థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులను సంఘటితంగా అడ్డుకోవాలని అంటున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# నెల్లూరు గుండెలపై కుంపట్లు

నెల్లూరు జిల్లా సముద్రతీరంలోని ముత్తుకూరు మండలంలో, దానికి ఆనుకుని ఉన్న చిల్లకూరు, వెంకటాచలం మండలాలలో ముప్పై కిలోమీటర్ల పరిధిలో ఇరవై ఆరు థర్మల్ విద్యుదుత్పత్తి కేంద్రాలను ఏర్పాటు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ విద్యుత్ కేంద్రాలలో ప్రైవేటు రంగంలో 25, ప్రభుత్వ రంగంలో ఒకటి రాబోతున్నాయి. వీటిలో కొన్ని ఆగిపోయాయని, మందకొడిగా సాగుతున్నాయని వార్తలు వస్తున్నప్పటికీ ప్రభుత్వం అనుకున్నట్టుగా నిర్మాణం సాగితే, కొద్ది సంవత్సరాలలో ఈ విద్యుత్ కేంద్రాల వల్ల రోజుకు రెండు లక్షల టన్నుల బూడిద, 15 లక్షల టన్నుల కార్బన్ డై ఆక్సైడ్, 22,000 టన్నుల గంధకం, వేరువేరు పరిమాణాలలో పాదరసం, ఆర్సెనిక్, కాడ్మియం వంటి అణుధార్మిక, విషపదార్థాలెన్నో వెలువడతాయి. ఎనిమిది గ్రామాలలో నెలకొల్పుతున్న ఈ కేంద్రాల వల్ల చుట్టూ నెల్లూరు జిల్లా సముద్రతీర ప్రాంతమంతా బూడిదకుప్పగా మారిపోతుంది. అక్కడి నీరు, గాలి విషపూరితమై వ్యవసాయానికీ, పళ్లతోటలకూ, చేపల చెరువులకూ, సముద్రం మీద చేపలవేటకూ అవకాశాలు మృగ్యమైపోతాయి. ఏటేటా దూరతీరాల నుంచి వచ్చే పక్షుల విహార కేంద్రాలు వట్టిపోతాయి. అక్కడి ప్రజలందరూ అక్కడే ఉంటే చనిపోవడమో, తీవ్రంగా అనారోగ్యం బారినపడడమో జరుగుతుంది. లేదా ఉన్నఊరూ, ఉపాధీ వదిలిపెట్టి పొట్టచేత పట్టుకుని వలస వెళ్లవలసి వస్తుంది.

ఈ విద్యుత్ కేంద్రాలవల్ల ఎన్ని మెగావాట్ల విద్యుదుత్పాదన సామర్థ్యాన్ని ఏర్పరచబోతున్నామో, జరగనున్న విద్యుదుత్పత్తి వల్ల ఎన్ని కొత్త పరిశ్రమలు రాబోతున్నాయో, ఎన్ని వేల కోట్ల పెట్టుబడి రాబోతోందో, ఎన్ని ఉద్యోగాల కల్పించబోతున్నామో పాలకులు చాల భారీ అంకెలు ప్రకటిస్తున్నారు. ఎన్నెన్నో ఆకుకు అందని పోకకు పొందని 'అభివృద్ధి' స్వప్నాలను అమ్ముతున్నారు. కాని ఆ కలలన్నీ తీరప్రాంత మత్స్యకారులకు, వ్యవసాయదారులకు, పేద, మధ్యతరగతి ప్రజలకు పీడకలలే కానున్నాయి. అభివృద్ధి పేరుతో సాగుతున్న ఈ మహాయజ్ఞంలో నెల్లూరు ప్రజలు సమిధలు కాబోతున్నారు. ఈ ప్రయత్నమంతా ప్రజలను తమ భూములనుంచీ, ఉపాధినుంచీ, జీవితాలనుంచీ నిర్వాసితులను చేయబోతున్నది. ఇప్పటికే ప్రభుత్వం 30,000 ఎకరాల సారవంతమైన, వరి పండించే భూములను, చేపల చెరువులను ఆక్రమించి పెట్టుబడిదారులకు అప్పగించింది.

ఇదంతా ఆ ప్రాంత అభివృద్ధికి కాక, ఒక మహా విధ్వంసానికే దారితీయబోతున్నది. పిడికెడు మంది పెట్టుబడిదార్లకు, బహుళజాతి సంస్థలకు, దేశ దేశాల సంపన్నులకు ఇబ్బడిముబ్బడిగా లాభాలు సంపాదించుకునే అవకాశాలు ఇవ్వడం తప్ప ఈ విద్యుదుత్పత్తి కేంద్రాల వల్ల జరగబోయే అభివృద్ధీ లేదు, ప్రజల మేలూ లేదు. అసలు సంత పెద్ద మొత్తంలో తయారయ్యే విద్యుత్తు ప్రజలకు అవసరమే లేదు. ఆ

---

వ్యాపారానికి అటు రాజ్యాంగం గానీ, ఇటు కోర్టులు గానీ అడ్డు రాకుండా చట్టాలు చేయాలని కార్పోరేటు సంస్థలు ఒత్తిడి తెస్తున్నాయి. దశాబ్దాల చరిత్ర కలిగిన సంస్థలైన యు.జి.సి., ఎం.సి.ఐ., ఎ.ఐ.సి.టి.ఈ. లాంటి సంస్థలు ఎంత భ్రష్టుపట్టినా విద్యా వ్యాపారం అనే దృక్పథంతో పుట్టినవి కావు. కనుక విద్యా వ్యాపారీకరణకు, కార్పొరేటీకరణకు ఏదో ఒక ఆటంకాన్ని కలిగించవచ్చు. అందుకే వాటన్నిటిని రద్దు చేసి 'ఉన్నత విద్య, పరిశోధన జాతీయ సంస్థ (ఎన్.సి.హెచ్.ఈ.ఆర్.) ను స్థాపించడానికి ఒక బిల్లు. ఇంకొక బిల్లు పేరు ఎడ్యుకేషనల్ ట్రిబ్యునల్స్ బిల్లు. విద్యారంగంలో వ్యాపార లావాదేవీలను, అందులో రాబోయే వివాదాలను కోర్టుల పరిధి నుండి తప్పించడమే ఈ బిల్లు ఉద్దేశ్యం. ఎందుకంటే ఎంత దిగజారినా ఇప్పుడున్న మన న్యాయ వ్యవస్థ స్వేచ్ఛా, సమానత్వం కోసం చేసిన ప్రజా పోరాటాల నేపథ్యంలో వచ్చిందే. అందుకే ఈ కోర్టుల నుండి తప్పించడానికే ఈ బిల్లు. ఈ వరుస క్రమంలో తీసుకొస్తున్నదే జాతీయ అక్రిడిటేషన్ అథారిటీ బిల్లు. అయితే ఇప్పటికే విద్యాసంస్థల ప్రమాణాలు నిర్ణయించడానికి ఎన్.ఎ.ఎ.సి. ఉంది. విద్య మొత్తం వ్యాపారమైనపుడు ఈ సంస్థ పనికి రాకపోవచ్చు. వ్యాపార విలువలపై ఆధారపడిన ప్రైవేటు అక్రిడిటేషన్ ఏజన్సీలు కావాలి. అందుకే ఈ బిల్లు ప్రైవేటు అక్రిడిటేషన్ ఏజన్సీల ఏర్పాటుకు అనుమతించింది. ఇక విదేశీ విద్యా సంస్థల బిల్లు పనంతా విదేశీ పెట్టుబడిదార్లు మన దేశంలో యూనివర్సిటీలు స్థాపించడానికి ఉన్న అడ్డంకులను తొలగించి, సౌకర్యాలను సమకూర్చడమే.

రాజ్యాంగానికి, రాజ్యాంగ స్ఫూర్తికి, సమానత్వానికి, సామాజిక న్యాయానికి వ్యతిరేకంగా రాబోతున్న ఈ బిల్లులను విద్యార్థులు, మేధావులు, ఉపాధ్యాయులు, అధ్యాపకులు పెద్ద ఎత్తున ప్రతిఘటించ వలసి ఉంది.

*(రచయిత సెక్రటరీ, ఆంధ్రప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ)* వీ

విద్యుత్తుతో వచ్చే పరిశ్రమల్లో స్థానికులకు అవసరమైన వస్తువులు ఉత్పత్తి కాబోవడం లేదు. ఆ విద్యుత్ కేంద్రాలలోనూ, పరిశ్రమలలోనూ వస్తాయని చెపుతున్న ఉద్యోగాలలో నూటికి ఒక్కటి కూడ స్థానికులకు రాదు. అక్కడికి రాబోతున్న వేల కోట్ల రూపాయల పెట్టుబడి వల్ల స్థానిక ప్రజల జీవితాలలో ఇసుమంత మెరుగుదల కూడ జరగదు సరిగదా, వారి జీవితాలూ జీవనోపాధులూ రద్దయిపోతాయి.

అసలింత హడావుడిగా 30,000 మెగా వాట్ల విద్యుదుత్పత్తి కోసం కేంద్రాలు నిర్మించవలసిన అవసరం ఉందా అని మొట్టమొదట ప్రశ్నించవలసి ఉంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మొత్తానికీ గడిచిన 55 ఏళ్లలో సాధించిన విద్యుదుత్పత్తి సామర్థ్యం 14,769 మెగావాట్లు (2010 సెప్టెంబర్ నాటికి). ఇందులో సగమే థర్మల్ విద్యుత్తు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే ప్రస్తుత వినియోగానికి అవసరమైన సామర్థ్యం కన్న ఇది వెయ్యి మెగావాట్లు మాత్రమే తక్కువ. ప్రభుత్వ లెక్కల ప్రకారమే రానున్న 15 సంవత్సరాలలో పెరిగే వినియోగాన్ని బట్టి మరొక 15,000 మెగావాట్ల సామర్థ్యం అవసరమవుతుందని అంచనా వేస్తున్నారు. మరి ఒక్క నెల్లూరు జిల్లాలోనే 30,000 మెగావాట్ల అదనపు సామర్థ్యాన్ని కల్పించడం ఎందుకు? ఇంతకూ ఈ కేంద్రాలలో ఉత్పత్తి అయ్యే విద్యుత్తు రాష్ట్రానికి ఇవ్వకపోయినా ఫరవాలేదని, ఆ కంపెనీలు తమ ఇష్టం వచ్చిన ధరకు, ఇష్టం వచ్చినవారికి అమ్ముకోవచ్చునని కూడ ప్రభుత్వం హామీ ఇస్తోంది. ఇక ఈ విద్యుత్ కేంద్రాలన్నీ ఉత్పత్తిలోకి దిగితే, నిజంగానే విద్యుత్తు ఉత్పత్తి అయితే అది అమ్ముకోవడానికి కృష్ణపట్నం ఓడరేవు వల్ల రాగల పరిశ్రమలు, మద్రాసు నగరంలోని పరిశ్రమలు మాత్రమే మిగులుతాయి. ఆ పరిశ్రమలకు కూడ అంత విద్యుత్తు అవసరం ఉంటుందా, ఉన్నా మద్రాసు పరిశ్రమలు నెల్లూరు కేంద్రాల నుంచి కొనుక్కుంటాయా అన్నీ అనుమానాలే. అంటే అన్ని వైపులనుంచీ ఆలోచించి చూస్తే, విద్యుత్ కేంద్రాల పేరుమీద భూములు ఆక్రమిస్తున్న, ఇతర మినహాయింపులు, రాయితీలు సంపాదిస్తున్న కంపెనీలకు విద్యుదుత్పత్తి కాక ఇతర ప్రయోజనాలు, ఉద్దేశాలు ఏవో ఉన్నాయన్న మాట. ఈ భూమి అంతా సముద్రతీరంలో విలాస, విహారకేంద్రాలు ఏర్పరచడానికో, రియల్ ఎస్టేట్‌గా మార్చడానికో, రాయలసీమ-కర్నాటక సరిహద్దులలోని ఖనిజ నిలువలను విదేశాలకు ఎగుమతి చేసే కేంద్రాలు నిర్మించడానికో ఉపయోగపడుతుందన్నమాట.

ఈ మౌలిక ప్రశ్నలను కూడ అలా ఉంచి, మన ప్రభుత్వాధికార వర్గాల అవకతవకలు, అవినీతి, అక్రమాలు కూడ ఈ నెల్లూరు విధ్వంసకాండ తీవ్రతను మరింత పెంచుతున్నాయి. ఈ విద్యుదుత్పత్తి కేంద్రాల కోసం ఎంత భూమి అవసరమో, ఎంత సేకరించారో, ఎంత పారిశ్రామికవేత్తలకు ఇచ్చారో, ఏ ధరన లెక్కకట్టి ఇచ్చారో, రైతుల దగ్గరినుంచి ఏ ధరన సేకరించారో, ఏ ఒక్కటీ పారదర్శకంగా లేవు. ప్రభుత్వం చెపుతున్నవన్నీ తప్పుల తడకలు, పచ్చి అబద్ధాలు. ఒక్క ఉదాహరణ చెప్పాలంటే జిల్లా కలెక్టర్ 5.9.2010న రాసిన లేఖలో కోస్టల్ ఆంధ్రా పవర్ కార్పొరేషన్ కు 2,687 ఎకరాలు ఇచ్చామని అన్నారు. కాని మూడు నెలల తర్వాత ఎపిఐఐసి ఏర్పాటు చేసిన సమావేశ ఎజెండాలో అదే కంపెనీకి 21 ఎకరాలు మాత్రమే ఇచ్చామని రాశారు. ఎక్కడి 2,687? ఎక్కడి 21? మూడు నెలల్లోనే 2,665 ఎకరాలు ఎట్లా ఎక్కడ కరిగిపోయాయి? అలాగే సింహపురి ఎనర్జీ అనే కంపెనీ పెట్టుబడి కలెక్టర్ లేఖలో రు. 2600 కోట్లు ఉన్నదల్లా మూడునెలల తర్వాత సమావేశం నాటికి రు. 6000 కోట్లు అయింది. అలాగే కైనెటా పవర్ ప్రాజెక్ట్ అనే కంపెనీ వ్యయం మొదట రు. 7868 కోట్లు ఉన్నదల్లా సమావేశం నాటికి రు. 10,000 కోట్లు అయింది. అసలు నిర్మాణమూ, ఉత్పత్తీ మొదలుపెట్టకుండానే ఈ పెట్టుబడి వ్యయం అంకెలను ఇలా విపరీతంగా పెంచడానికి కారణం ఎవరు? ఎవరి ముడుపుల కోసం ఈ అంకెలు పెరిగాయి? మరొక ఆసక్తికరమైన విషయమేమంటే వీటిలో కోస్టల్ ఆంధ్రా పవర్ కార్పొరేషన్ అంబానీలకు చెందిన రిలయన్స్ ది. సింహపురి ఎనర్జీ తెలుగుదేశం పార్లమెంటు సభ్యుడు నామా నాగేశ్వర రావుది. కైనెటా పవర్ కార్పొరేషన్ కాంగ్రెస్ పార్లమెంటు సభ్యుడు వల్లభనేని బాలశౌరిది.

ఇంత పెద్ద ఎత్తున విద్యుదుత్పత్తి కేంద్రాలు నెల్లూరు జిల్లాకే ఎందుకు వస్తున్నాయో కూడ ఆలోచించవలసి ఉంది. అటుకొసన శ్రీకాకుళం జిల్లాలో సముద్రతీర ప్రాంతంలో ఇలాగే లెక్కలేనన్ని విద్యుత్ కేంద్రాలు వస్తున్నాయి. ఇవన్నీ రాష్ట్ర విద్యుత్ అవసరాలు తీర్చడానికి కాదనేది స్పష్టమే. విరివిగా సముద్రజలాలు, తీరప్రాంతం, లోతట్టున ఖనిజ వనరులు, అభివృద్ధి చెందిన ఓడరేవులు ఉన్న ప్రదేశంలో భవిష్యత్తు విద్యుత్ అవసరాల కోసం గాని, రియల్ ఎస్టేట్ కోసం గాని ఈ ప్రాజెక్టులు వస్తున్నాయి. నెల్లూరు జిల్లాలో ముఖ్యంగా కృష్ణపట్నం ఓడరేవు, తమిళనాడుకూ, చెన్నై నగరానికీ చేరువలో ఉండడం, రాయలసీమ – కర్నాటక సరిహద్దులలోని ఖనిజ నిలువలకు అతి తక్కువ దూరంలో ఉన్న సముద్రతీరం కావడం, గ్రాండ్ ట్రంక్ రైలు, రోడ్డు మార్గాలు చేరువలో ఉండడం వంటి అనేక కారణాలున్నాయి. ఈ జిల్లాకే చెందిన రాజకీయ నాయకులకు ఇటువంటి వ్యాపారాలలో ఆసక్తి ఉండడం మరొక అదనపు కారణం.

కాని నెల్లూరు సహజ, ప్రాకృతిక కారణాలవల్ల ఇటువంటి విధ్వంసకరమైన అభివృద్ధి నమూనాను ఎంతమాత్రం అమలు చేయడానికి వీలులేదు. ఈ జిల్లా 163 కి.మీ. సముద్రతీరంతో, దాదాపు 140 తీర గ్రామాలతో, వేలాది మంది మత్స్యకారుల ఆశ్రయంగా ఉంది. పెన్నార్, స్వర్ణముఖి నదీ ప్రవాహాలవల్ల, చిన్నతరహా నీటి పారుదల సౌకర్యాల వల్ల ఈ జిల్లా అనేక పంటలకు, ముఖ్యంగా వరికి ప్రసిద్ధిగాంచింది. గత మూడు దశాబ్దాలుగా సముద్ర తీర గ్రామాలలో, కొంత లోతట్టు గ్రామాలలో చేపల చెరువులు కూడ పెరిగాయి. పులికాట్ సరస్సు, నేలపట్టు పక్షుల విహారకేంద్రం వంటి ప్రకృతి సహజమైన స్థలాలు ఉన్నాయి. మొత్తానికి ఈ జిల్లా పర్యావరణ రీత్యా చాల సున్నితమైన ప్రాంతాలలో ఒకటి. ఈ సున్నితమైన పర్యావరణ వ్యవస్థలో ఏమాత్రం చిన్న కాలుష్యమైనా తీవ్ర ప్రమాదాలకు దారితీస్తుంది. అటువంటి చోట ఇంత భారీ కాలుష్యానికి, విధ్వంసానికి పూనుకోవడం దుర్మార్గం.

నిజానికి ఈ వ్యవహారంలో ప్రభుత్వం, పాలకులు తామే రాసుకున్న అనేక చట్టాలను, నిబంధనలను కూడ ఉల్లంఘిస్తున్నారు. రాజ్యాంగంలో ప్రజలకు హామీ ఇచ్చిన అనేక రక్షణలకు, ప్రాథమిక హక్కులకు, ఆదేశిక సూత్రాలకు తూట్లు పొడుస్తున్నారు. జల కాలుష్యానికి వ్యతిరేకంగా 1974లో, వాయు కాలుష్యానికి వ్యతిరేకంగా 1981లో,

| సం. | విద్యుత్ కంపెనీ పేరు | స్థాపిత శక్తి (మెవా) | గ్రామం | ప్రధాన పెట్టుబడిదారు / సహకరిస్తున్న రాజకీయవేత్త |
|---|---|---|---|---|
| 1. | మహావీర్ ఎనర్జీ ప్రై. లి. | 500 | అంకులపాటూరు | సమాచారం దొరకలేదు |
| 2. | వి ఎస్ ఎఫ్ ప్రాజెక్ట్స్ లి. | 485 | అంకులపాటూరు | సమాచారం దొరకలేదు |
| 3. | డా. ఆర్ కె పి పవర్ లి. | 420 | అంకులపాటూరు | సమాచారం దొరకలేదు |
| 4. | ఎస్ బి క్యు స్టీల్స్ లి. | 300 | అంకులపాటూరు | సమాచారం దొరకలేదు |
| 5. | బాలాజీ పవర్ అండ్ సోలార్ ఎనర్జీ | 100 | అంకులపాటూరు | మాగుంట శ్రీనివాస రెడ్డి |
| 6. | గూడూర్ థర్మల్ పాంట్ | 300 | అంకులపాటూరు | లగడపాటి రాజగోపాల్ |
| 7. | ప్రాగ్దిశ పవర్ ప్రై. లి. | 2640 | మోమిడి | లగడపాటి రాజగోపాల్ |
| 8. | శివస్వాతి కన్ స్ట్రక్షన్స్ ప్రై. లి. | 1200 | మోమిడి | ప్రత్తిపాటి పుల్లారావు |
| 9. | లాంకో పవర్ | 1000 | మోమిడి | లగడపాటి రాజగోపాల్ |
| 10. | ఎన్ ఎస్ ఎల్ ఆంధ్రా పవర్ ప్రై. లి. | 1320 | మోమిడి, ఏరూరు | మండవ ప్రభాకర రావు |
| 11. | ఆశ్రిత్ ఎనర్జీ ప్రై లి. | 200 | ఏరూరు | |
| 12. | కృష్ణపట్నం పవర్ కార్పొరేషన్ | 1980 | తమ్మినపట్నం, మోమిడి | నవయుగ గ్రూప్, నేదురుమల్లి జనార్ధనరెడ్డి |
| 13. | కైనెటా పవర్ ప్రాజెక్ట్స్ లి. | 1980 | తమ్మినపట్నం, మోమిడి | వల్లభనేని బాలశౌరి |
| 14. | మీనాక్షి ఎనర్జీ ప్రై. లి. | 2320 | తమ్మినపట్నం, మోమిడి | కాట్రగడ్డ శ్రీనివాసరావు |
| 15. | సింహపురి ఎనర్జీ ప్రై. లి. | 1920 | తమ్మినపట్నం | నామా నాగేశ్వరరావు |
| 16. | వి ఎన్ ఆర్ పవర్ టెక్ ప్రై.లి. | 330 | తమ్మినపట్నం, మోమిడి | వాకాటి నారాయణ రెడ్డి |
| 17. | నెక్కంటి పవర్ ప్రై. లి. | 60 | చిల్లకూరు మం. | సమాచారం దొరకలేదు |
| 18. | ఎన్ కార్ పవర్ జెన్ | 350 | చిల్లకూరు మం. | సమాచారం దొరకలేదు |
| 19. | ఎక్సెలాన్ ఇన్ ఫ్రాస్ట్రక్చర్ | 350 | చిల్లకూరు మం. | సమాచారం దొరకలేదు |
| 20. | థర్మల్ పవర్ టెక్ కార్పొరేషన్ | 1980 | నేలటూరు/పైనాపురం | గాయత్రి ప్రాజెక్ట్స్ (సుబ్బరామిరెడ్డి) |
| 21. | దామోదరం సంజీవయ్య పవర్ ప్లాంట్ | 1600 | నేలటూరు | ఏ పి జెన్ కో |
| 22. | లెదర్ పార్క్ పవర్ | 500 | కృష్ణపట్నం | సమాచారం దొరకలేదు |
| 23. | కోస్టల్ ఆంధ్రా పవర్ కార్పొరేషన్ | 3960 | కృష్ణపట్నం | రిలయన్స్ గ్రూప్ (అంబానీ) |
| 24. | నెల్ కాస్ట్ ఎనర్జీ | 1320 | పైనా పురం | నాగార్జున కన్ స్ట్రక్షన్స్ కంపెనీ (రాజు), సుబ్బరామిరెడ్డి |
| 25. | శౌర్య ఎనర్జీ | 100 | తిరుమలమ్మ పాలెం | సమాచారం దొరకలేదు |
| 26. | పూజిత ఇంజనీరింగ్ కంపెనీ | 100 | తిరుమలమ్మ పాలెం | విపిజె గ్రూప్, సికిందరాబాద్ |

సముద్ర తీరప్రాంతాల రక్షణకోసం 1991లో తామే తీసుకు వచ్చిన చట్టాలను తుంగలో తొక్కుతున్నారు. నూతన ఆర్థిక విధానాల, ప్రపంచీకరణ విధానాల వెల్లువలో దేశవ్యాప్తంగా ఇదే జరుగుతున్నది. కాని ఇక్కడ బహుళజాతిసంస్థల, బడా వ్యాపారస్తుల ప్రయోజనాలతో పాటు అదనంగా వ్యాపారవేత్తలయిన స్థానిక రాజకీయ నాయకుల పాత్ర కూడ ఉంది.

ఒక్కసారి ఈ విద్యుత్ కేంద్రాల జాబితాను పరిశీలిస్తే, ఆ కంపనీలలో ఎక్కువ భాగం బడా పెట్టుబడిదారులకు, వ్యాపారవేత్తలయిన రాజకీయ నాయకులకు సంబంధించినవేనని అర్థమవుతుంది. కాంగ్రెస్ పార్టీకి చెందిన పార్లమెంటు సభ్యులు టి సుబ్బరామిరెడ్డి, లగడపాటి రాజగోపాల్, వల్లభనేని బాలశౌరి, నేదురుమల్లి జనార్దనరెడ్డి, కాంగ్రెస్ శాసనమండలి సభ్యుడు వాకాటి నారాయణరెడ్డి, తెలుగుదేశం పార్లమెంటు సభ్యుడు నామా నాగేశ్వరరావు, మాజీ పార్లమెంటు సభ్యుడు మాగుంట శ్రీనివాసరెడ్డి వంటి రాజకీయ నాయకులు మాత్రమే కాక, అటు కాంగ్రెస్‌కో, ఇటు తెలుగుదేశంకో, లేదా రెండు పార్టీలకు ఉమ్మడిగానో మద్దతు, ముడుపులు ఇచ్చే వ్యాపారవేత్తలు ఈ కేంద్రాల మదుపుదార్లుగా ఉన్నారు.

ఇన్నిరకాల తప్పుడు ప్రయోజనాలతో, అనవసరంగా, దుర్మార్గంగా, విధ్వంసకరంగా, ప్రజాజీవితానికి వినాశకరంగా నెల్లూరును మహమ్మారిలా ముంచెత్తుతున్న ఈ థర్మల్ ప్రాజెక్టుల వ్యవహారాన్ని తీవ్రంగా ప్రతిఘటించడం ప్రతి ఒక్క ప్రజాస్వామికవాదికి, ప్రజాపక్ష ఆలోచనాపరులకు తప్పనిసరి బాధ్యత.

(పెన్నార్ డెల్టా ఆయకట్టుదార్ల సంఘం అధ్యక్షులు బెజవాడ గోవిందరెడ్డి ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో దాఖలు చేసిన ప్రజాప్రయోజన వ్యాజ్యం ఈ వ్యాసానికి ప్రధాన ఆధారం).

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

*విదేశాలకు తరలివెళ్లిన అక్రమ నిధుల గురించి, సాల్వాజుడుం చట్ట వ్యతిరేక కార్యకలాపాల గురించి ఇటీవలి తీర్పులను వివరిస్తున్నారు* **రాజవరం పార్థసారథి**

# సుప్రీంకోర్టు చరిత్రాత్మక తీర్పులు

భారతదేశపు అత్యున్నత న్యాయస్థానం సుప్రీంకోర్టు జూలై మొదటివారంలో రెండు చరిత్రాత్మకమైన తీర్పులు ప్రకటించింది. తమ ముందు సంవత్సరాలుగా విచారణ జరుగుతున్న రెండు కేసులలో జూలై 4న, 5న తీర్పులు వెలువరించిన న్యాయమూర్తులు జస్టిస్ బి సుదర్శన్ రెడ్డి, జస్టిస్ సురిందర్ సింగ్ నిజ్జర్ దేశ రాజకీయార్థిక వ్యవస్థ గురించీ, పాలన గురించీ, ప్రపంచీకరణ విధానాల గురించీ, ప్రజా ఉద్యమాల గురించీ చాల ఆలోచనాత్మకమైన వ్యాఖ్యలు చేశారు. విదేశాలకు అక్రమంగా తరలిపోతున్న భారతీయ సంపదను వెనక్కి తేవాలనే కేసులోనూ, చత్తీస్‌గఢ్‌లో సాల్వాజుడుం పేరుతో రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన ప్రైవేటు సైన్యం అకృత్యాలను అరికట్టాలనే కేసులోనూ ఈ తీర్పులు వెలువడ్డాయి. ప్రజల గురించి, దేశం గురించి, న్యాయం గురించి ఈ తీర్పులు మళ్లీ ఒకసారి మౌలికమైన చర్చను ముందుకు తెచ్చాయి. ఈ దేశంలో అధికార వ్యవస్థలలో, పాలక సంస్థలలో కూడ ఎక్కడో ఒకచోట న్యాయాన్యాయాలు ఆలోచించగల వాళ్లు ఇంకా ఉన్నారని రుజువు చేశాయి.

వీటిలో మొదటి కేసును "సిటిజెన్ ఇండియా" అనే స్వచ్ఛంద సంస్థ తరఫున రాం జత్మలానీ, గోపాల్ శర్మ, జలబాల వైద్య, కె.పి.ఎస్. గిల్, ప్రొ. బి.బి. దత్తా, సుభాష్ కాశ్యప్ వంటి సామాజిక కార్యకర్తలు, మాజీ ప్రభుత్వాధికారులు 2009 ఏప్రిల్‌లో సుప్రీంకోర్టులో దాఖలు చేశారు. భారతదేశపు నాయకులు, అధికారులు స్విట్జర్లాండ్‌లోనూ, ఇతర ప్రాంతాలలోనూ దాచుకున్న అక్రమ సంపద గురించి విరివిగా వార్తలు వస్తున్నాయని, ఆ అక్రమ ధనాన్ని వెనక్కి తెప్పించడానికి ప్రభుత్వం ఎటువంటి చర్యలూ తీసుకోవడం లేదని, ప్రభుత్వం చర్యలు తీసుకునేలా ఆదేశించాలని ఈ ప్రజాప్రయోజన వ్యాజ్యం దాఖలయింది. అప్పుడు ఎన్నికలు జరుగుతున్నాయి గనుక ప్రభుత్వాన్ని అప్రతిష్టపాలు చేసే దురుద్దేశంతోనే ఈ వ్యాజ్యం దాఖలయిందని, ఆ వ్యాజ్యాన్ని అంగీకరించగూడదని ప్రభుత్వం వాదించింది. ఆ తర్వాత కేసు అనేక మలుపులు తిరిగి, మధ్యలో హసన్ అలీఖాన్, కాశీనాథ్ తపురియా, చంద్రికా తపురియా వంటివారికి విదేశీ ఖాతాలలో వేల కోట్ల రూపాయల అక్రమ నిధులు ఉన్నాయని నిర్దిష్ట సమాచారం కూడ వచ్చింది. ఆ సమాచారం మీద కూడ ప్రభుత్వం ఏ చర్యలూ తీసుకోక పోవడమూ, దానిమీద సుప్రీంకోర్టు ప్రభుత్వాన్ని మందలించడమూ కూడ జరిగాయి. ధర్మాసనం ఇచ్చిన ఎన్నో మధ్యంతర ఉత్తర్వులను కూడ ప్రభుత్వం ఖాతరు చేయలేదు.

ఈ అక్రమ నిధుల వ్యవహారం చాల విస్తృతమైనది గనుక, ప్రభుత్వం నిర్లక్ష్యంగా, అలసత్వంతో వ్యవహరిస్తున్నది గనుక, ఈ వ్యవహారాన్ని పరిశోధించడానికి ఒక ప్రత్యేక పరిశోధనా బృందాన్ని నియమించాలని, దానిలో న్యాయమూర్తులను, ప్రజాజీవితంలో మచ్చలేని వారిని చేర్చాలని ఈ వాదనల క్రమంలో దరఖాస్తుదారులు వాదించారు. ప్రభుత్వానికి చిత్తశుద్ధి ఉన్నదని, పరిశోధన సక్రమంగానే సాగుతున్నదని, అక్రమ నిధులను వెనక్కి తీసుకువస్తామని, కనుక దరఖాస్తుదారుల విన్నపాన్ని అంగీకరించవద్దని ప్రభుత్వం వాదించింది.

చిట్టచివరికి 2011 జూలై 4న ఇచ్చిన తీర్పులో అక్రమధనం వ్యవహారాన్ని పరిశోధించడానికి ఒక ఉన్నతస్థాయి ప్రత్యేక పరిశోధక బృందాన్ని నియమించాలని న్యాయస్థానం ఆదేశించింది. పదకొండు మంది ఉన్నతాధికారులతో ఏర్పడే ఈ బృందం మాజీన్యాయమూర్తులు జస్టిస్ బి పి జీవన్ రెడ్డి, జస్టిస్ ఎం బి షా ల నేతృత్వంలో పనిచేయాలని ఆదేశించింది. ఈ బృందానికి అన్ని అధికారాలూ కల్పించాలని, బృందం సుప్రీంకోర్టుకు జవాబుదారీగా పనిచేయాలని, అన్ని ప్రభుత్వ శాఖలూ ఈ బృందానికి సహకరించాలని ఆదేశించింది. అలాగే, దరఖాస్తు దారులకు అవసరమైన సమాచారం ఇవ్వకుండా అడ్డుకున్న ప్రభుత్వాన్ని అభిశంసిస్తూ, ఈ విషయంలో రహస్యమేమీ లేదని, ఆ సమాచారమంతా దరఖాస్తుదారులకు అందజేయాలని ఆదేశించింది. ఈ తీర్పులోని అన్ని ఆదేశాలను పాటించారో లేదో ఆగస్ట్ మూడో వారంలో న్యాయస్థానానికి నివేదించాలని ఆదేశించారు.

ఈ ఆదేశాలకన్న ముఖ్యంగా, ఎనభై పేరాగ్రాఫుల తీర్పులో, మొదటి ఇరవై ఒక్క పేరాగ్రాఫులలో న్యాయమూర్తులు ఈ మొత్తం వ్యవహారంపై తమ సైద్ధాంతిక వైఖరిని ప్రకటించారు. మొత్తానికి మొత్తంగా ప్రజానుకూల దృక్పథంతో రాసిన ఈ భాగాన్ని ప్రతిఒక్కరూ తప్పనిసరిగా చదవాలి. "స్వార్థమే మేలు" అనే తప్పుడు సంస్కృతి మన సమాజంలో పెరిగిపోతున్నదని, గత రెండు మూడు దశాబ్దాలుగా, నయా ఉదారవాద సంస్కరణలలో భాగంగా ప్రభుత్వం ఈ సంస్కృతిని పెంచి పోషిస్తున్నదని న్యాయమూర్తులు అన్నారు. అందులో భాగంగానే అంతకంతకూ ఎక్కువగా అక్రమ సంపాదన, పన్నుల ఎగవేత, అక్రమ ధనాన్ని విదేశాలకు తరలించడం, దాన్నే ఇతర మార్గాలలో సక్రమ ధనంగా దేశంలోకి తిరిగి తీసుకురావడం జరుగుతున్నదని, ఇందులో రాజకీయ నాయకుల, అధికారవర్గాల పాత్ర ఉన్నదని తీర్పు అభిప్రాయ పడింది. ఇవాళ అత్యవసరమైన రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక అవగాహనలను ఈ తీర్పులో పొందుపరిచారు.

ఈ తీర్పు వెలువడినవెంటనే రాజకీయ నాయకులు, ప్రభుత్వాధికారులు, ప్రపంచీకరణ శక్తులు తీర్పుకు వ్యతిరేకంగా మాట్లాడడం మొదలుపెట్టారు. న్యాయస్థానం తన పరిధి దాటి వ్యాఖ్యానించిందని విమర్శించారు. ప్రభుత్వం చేయవలసిన పనిని

న్యాయస్థానం తన పరిధిలోకి తీసుకుందని అన్నారు. చివరికి ఈ తీర్పు చెల్లదని, దీని మీద పునర్విచారణ జరపాలని ప్రభుత్వం సుప్రీంకోర్టుకు జూలై 15న అప్పీలు చేసుకుంది. ఆ అప్పీలు మీద విచారణ జరగవలసి ఉంది. కాని అక్రమధనం మీద స్వతంత్ర, చట్టబద్ధ పరిశోధన జరగడం తమకు ఇష్టం లేదని ప్రభుత్వం స్పష్టంగా చెపుతున్నదని రుజువయింది. "రాజకీయ వ్యవస్థను నడపడంలో ఉన్న వాస్తవికమైన, ఆచరణాత్మకమైన ఇబ్బందులను" న్యాయవ్యవస్థ అర్థం చేసుకోవాలని న్యాయశాఖ మంత్రి సల్మాన్ ఖుర్షీద్ ఇచ్చిన సలహా చూస్తే, అక్రమ ఆస్తులను విదేశాలకు తరలించినవారిని కాపాడడమే ఈ రాజకీయ వ్యవస్థ చేసే "వాస్తవికమైన, ఆచరణాత్మకమైన" పని అని రుజువయింది.

ఇక రెండవ కేసు 2007లో సామాజిక శాస్త్రవేత్త ప్రొ నందినీ సుందర్, చరిత్రకారుడు రామచంద్ర గుహ, భారత ప్రభుత్వ మాజీ కార్యదర్శి ఇ ఎ ఎస్ శర్మ దాఖలు చేసినది. చత్తీస్‌గఢ్‌లోని దంతెవాడ జిల్లాలో మావోయిస్టు ఉద్యమాన్ని అణచడానికనే పేరుతో ప్రభుత్వం ఏర్పాటు చేసిన సాల్వాజుడుం అనే ప్రైవేటు సైన్యం వల్ల, స్పెషల్ పోలీస్ ఆఫీసర్ల (ఎస్పీవోల) వల్ల పెద్దఎత్తున మానవహక్కుల ఉల్లంఘన జరుగుతున్నదని, దానితో ఆదివాసి ప్రజల మధ్య అంతర్యుద్ధానికి ప్రభుత్వమే ఆజ్యం పోస్తున్నదని, ఈ రాజ్యాంగేతర ప్రత్యేక పోలీసు అధికారుల నియామకాన్ని ఆపివేయాలని దరఖాస్తుదారులు కోరారు. విచారణ జరిగిన ఐదు సంవత్సరాలలో మరికొంతమంది దరఖాస్తు దారులు చేరారు, మరెన్నో ఘటనలు జరిగాయి. మధ్యలో దరఖాస్తు దారుల ఆరోపణలపై పరిశీలన జరిపి నివేదిక సమర్పించవలసిందిగా సుప్రీంకోర్టు జాతీయ మానవహక్కుల సంఘాన్ని ఆదేశించింది. ఆ నివేదిక 2008 ఆగస్టులో రాగా, ఆ సిఫారసులను పాటించవలసిందిగా సుప్రీంకోర్టు చత్తీస్‌గఢ్ ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఈ ప్రాంతంలో పాఠశాలలను, విద్యార్థుల వసతి గృహాలను పోలీసులు ఆక్రమించుకుని, చదువు సాగకుండా చేస్తున్నారని వచ్చిన ఆరోపణలను, ఆదివాసులను హత్య చేసిన ఎస్పీవోలపై కేసులు నమోదు చేయడం లేదనే ఆరోపణలను కూడ సుప్రీంకోర్టు పరిగణనలోకి తీసుకుంది. ఈ కేసు కూడ ఎన్నో మలుపులు తిరిగి చివరికి 2011 మార్చ్‌లో మోర్పల్లి, తాడిమెట్ల, తిమ్మాపురం గ్రామాల మీద కోయ కమాండోలు జరిపిన దాడి దాకా వచ్చింది. ఆ దాడి నిజానిజాలు పరిశీలించడానికి, బాధితులకు సహాయం అందించడానికి సామాజిక కార్యకర్త స్వామి అగ్నివేష్ వెళ్లగా, రక్షణ కల్పిస్తానని స్వయంగా ముఖ్యమంత్రి హామీ ఉండగానే, ఆయన మీద ఎస్.పి.ఒ.లు దాడి చేసిన ఘటనను కూడ సుప్రీం కోర్టు పరిగణనలోకి తీసుకుంది.

చిట్టచివరికి 2011 జూలై 5న వెలువరించిన తీర్పులో న్యాయమూర్తులు ప్రధానంగా ఎస్.పి.ఒ.ల నియామకం గురించి, స్వామి అగ్నివేష్ ను అడ్డుకున్న ఘటన గురించి తమ ఆదేశాలు ప్రకటించారు. ఎస్.పి.ఒ. అనే ప్రత్యేక అధికారులను ప్రత్యేకంగా అవసరమైన సందర్భాలలో నియోగించడానికి చట్టం అనుమతిస్తుంది గాని చత్తీస్‌గఢ్‌లో ప్రస్తుతం ఏర్పాటయిన ఎస్.పి.ఒ.లకు ఆ చట్ట నిబంధనలేవీ లేవని సుప్రీంకోర్టు ఆధారాలతో సహా చెప్పింది. భారత రాజ్యాంగం, భారత శిక్షా స్మృతి, భారత నేర విచారణా స్మృతి, సాక్ష్యాధారాల చట్టం వంటి నిబంధనలు చదివే సామర్థ్యం లేని, అనుమానితుల ప్రాథమిక హక్కుల గురించి పరిజ్ఞానం లేని, ఐదోతరగతి కూడ చదవని ఆదివాసులను కేవలం వారికి మావోయిస్టుల మీద ఉన్న కసి, ప్రతీకారవాంఛ ఆధారంగా నియమించారని, వారి జీతభత్యాలు, క్రమశిక్షణా చర్యలు, పదవీ విరమణ కాలం, విరమణానంతర ప్రతిఫలాలు ఏమీ నిర్ధారించకుండా, కేవలం నెలకు రు. 3000 ఇచ్చి, వారి చేతికి తుపాకి ఇచ్చి వారేమి చేసినా అడగబోమని ప్రభుత్వం చెప్పిందని కోర్టు ప్రకటించింది. ఈ మితిమీరిన అధికారం వల్లనే ఎస్.పి.ఒ.లు అనేక అత్యాచారాలకు పాల్పడ్డారని, అందుకు ప్రభుత్వం బాధ్యత వహించాలని కోర్టు అభిప్రాయపడింది. ఇలా ప్రజలలో ఒక వర్గాన్ని మరొక వర్గం మీద ఉసి గొల్పడం అప్రజాస్వామికం, రాజ్యాంగ వ్యతిరేకం, చట్ట వ్యతిరేకం, అమానుషం అని కోర్టు అభిప్రాయపడింది.

అందువల్ల చత్తీస్‌గఢ్ రాష్ట్రప్రభుత్వం వెంటనే ఎస్.పి.ఒ. వ్యవస్థను రద్దు చేయాలని, ఈ ఎస్.పి.ఒ. వ్యవస్థకు కేంద్రప్రభుత్వ నిధులను వెంటనే ఆపు చేయాలని, ఎస్.పి.ఒ.లకు ఇచ్చిన ఆయుధాలను వెనక్కి తీసుకోవాలని, ఉద్యోగాల నుంచి తొలగించబడిన ఎస్పీవోల రక్షణ బాధ్యత ప్రభుత్వమే తీసుకోవాలని, సాల్వా జుడుం, కోయ కమాండోల పేరు మీద చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకుని మానవహక్కుల ఉల్లంఘనకు పాల్పడే అన్ని బృందాలను రద్దుచేయాలని ఆదేశించింది. అలాగే స్వామి అగ్నివేష్ మీద జరిగిన దాడిని తీవ్రంగా పరిగణించిన న్యాయమూర్తులు ఆ దాడి సంఘటనపైనా, అసలు ఆ మూడు గ్రామాలపై జరిగిన దాడి పైనా విచారణ జరపాలని సిబిఐని ఆదేశించారు.

సిబిఐ ఈ విచారణ నివేదికలను ఆరువారాల లోగా సమర్పించాలని, అలాగే చత్తీస్‌గఢ్ రాష్ట్ర ప్రభుత్వం, కేంద్రప్రభుత్వం కూడ మిగిలిన ఆదేశాల మీద తగిన చర్యలు తీసుకుని, ఆరు వారాలలోగా తమకు ఆ చర్యల గురించి చెప్పాలని న్యాయస్థానం ఆదేశించింది.

ఈ తీర్పులో కూడ ఈ ఆదేశాలు ఒక ఎత్తయితే, ఈ 81 పేరాగ్రాఫుల తీర్పులో మొదటి 22 పేరాగ్రాఫులలో న్యాయమూర్తులు తమ సైద్ధాంతిక అవగాహనను వివరించడం మరొక ఎత్తు. వలసవాద దుర్మార్గం వల్ల, వనరుల దోపిడీ వల్ల కాంగోలో జరిగిన విధ్వంసం గురించిన నవలను ఉటంకిస్తూ ప్రారంభమైన ఈ భాగం సామ్రాజ్యవాద ప్రపంచీకరణ గురించి, వనరుల దోపిడీ గురించి, దేశదేశాల సంపన్నులకు ప్రభుత్వం దళారీగా వ్యవహరించడం గురించి ప్రస్తావించింది. అందువల్ల ప్రజలు అనివార్యంగా ఉద్యమాలవైపు చూడవలసి వస్తున్న పరిస్థితి గురించి రాసింది. మావోయిస్టులకు కూడ చట్టాన్ని తమ చేతిలోకి తీసుకునే హక్కు లేదని, వారిది హింసాకాండ అని పాలకవర్గ వైఖరినే ఒక పేరాగ్రాఫులో రాసినప్పటికీ, మొత్తంగా ప్రజల పోరాడే హక్కు పట్ల ఈ తీర్పు అనుకూలంగా స్పందించింది.

ఈ తీర్పు మీద ఒకవైపు ప్రపంచీకరణ శక్తులు, మరొక వైపు కాంగ్రెస్, భారతీయ జనతా పార్టీలకు చెందిన రాజకీయ నాయకులు, ప్రతినిధులు దుమ్మెత్తిపోయడం ప్రారంభించారు. ఈ తీర్పును కూడ రద్దు చేయాలని అప్పీలు వెళతామని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రకటించాయి. ఇంతవరకూ అలాంటి అప్పీలుకు వెళ్లలేదు గాని, న్యాయస్థానపు ఆదేశాలను కూడ పాటించలేదని, ఎస్.పి.ఒ.లను రద్దుచేయలేదని వార్తలు వస్తున్నాయి.

ఐతే ఈ తీర్పులు ఎంత ప్రగతిశీలంగా, ప్రజాపక్షంగా ఉన్నట్టు కనబడుతున్నప్పటికీ, కొనసాగుతున్న రాజకీయార్థిక వ్యవస్థలో వీటికి ఎటువంటి ప్రభావం ఉండబోదనే సూచనలు ఇప్పటికే మొదలయ్యాయి. ఈ తీర్పులలో వ్యక్తమయిన అభిప్రాయాల ఆధారంగా విశాల సంఘటిత ప్రజా ఉద్యమాలు సాగినప్పుడు మాత్రమే, ప్రజాశక్తి మాత్రమే ఈ తీర్పుల స్ఫూర్తిని ముందుకు తీసుకుపోగలదు.

*(రచయిత పాత్రికేయులు)* వీ

*జార్ఖండ్ ప్రజాకళాకారులను ఒక అక్రమ కేసులో ఇరికించి మరణశిక్ష విధించిన తీర్పును వివరిస్తున్నారు*

**ఒక విలేఖరి**

# ప్రజల పాటకు ప్రతిఫలం మరణశిక్ష

జార్ఖండ్ ప్రజా కళాకారుడు, పదిహేను సంవత్సరాలకు పైగా ఖొత్తా, సంథాలీ, నాగ్‌పురి, హిందీ భాషలలో ప్రజా చైతన్య గీతాలు ఆలపిస్తూ తిరుగుతున్న ప్రముఖ గాయకుడు జీతన్ మరాండీకి ఒక అబద్ధపు కేసులో, దొంగ సాక్ష్యాల ఆధారంగా గిరిది న్యాయస్థానం మరణ శిక్ష విధించింది. ఈ కేసు వివరాలు చూస్తే ఈ దేశంలో, ముఖ్యంగా జార్ఖండ్ వంటి పోరాట ప్రాంతాలలో పాలకవర్గాలు ప్రజా ఉద్యమకారుల మీద, ఉద్యమ సమర్థకుల మీద, ప్రచారకుల మీద ఎంత దుర్మార్గమైన దమననీతిని అనుసరిస్తున్నాయో అర్థమవుతుంది. ఒక సాంస్కృతిక సంస్థ నాయకుడిగా, గాయకుడిగా, సాంస్కృతిక కార్యకర్తగా బహిరంగ జీవితంలో ఉన్న వ్యక్తి మీద తప్పుడు సాక్ష్యాలతో హత్యానేరాన్ని ఆరోపించడమే ఒక కుటిలనీతి కాగా, సాక్ష్యాల బోలుతనం స్పష్టంగా బయటపడుతున్నా, బధిరాంధ న్యాయస్థానం మరణశిక్ష విధించడం మరింత నీచం.

జీతన్ మరాండీ జార్ఖండ్ లోని గిరిది జిల్లాలో సుదూర్ అనే ఊళ్లో 1980లలో పుట్టాడు. "మా కుటుంబంలో చదువుకున్న వాళ్లెవరూ లేదు. దుర్భర దారిద్ర్యంలో ప్రతి ఒక్కరూ పనిచేసి పొట్టనింపుకోవలసి ఉండేది. అలా నా జీవితం కూడ పశువుల కాపరిగా మొదలయింది. పలకా బలపం పట్టుకోవలసిన వయసులో ఆ చేతులతో పశువులను అదిలించే కర్ర పట్టుకున్నాను. పశువుల లెక్క కోసం కూడ గులకరాళ్లే ఉపయోగించేవాణ్ని. అతి కష్టం మీద మూడో తరగతి చదివాను. నా బడి చదువు అంతే" అని ఆయన ఒక రచనలో అన్నాడు.

కాని త్వరలోనే ఆయన లోకం పోకడ తెలుసుకున్నాడు. లోకాన్ని మార్చవలసి ఉందని అనుకున్నాడు. మొదట గాంధేయ ప్రభావంతో పాటలు పాడడం, జానపద కళా ప్రదర్శనలు ఇవ్వడం ప్రారంభించాడు. క్రమంగా ప్రాచుర్యంలోకి వచ్చాడు. ఆదివాసి సాంస్కృతిక కళారూపాల సంరక్షకుడిగా, వారసుడిగా గుర్తింపు పొందాడు. "అలా మేం పల్లె నుంచి పల్లెకూ, పట్నాలకూ చేరుకున్నాం. ఇతర ప్రాంతాల ప్రగతిశీల వ్యక్తులతో, బృందాలతో పరిచయం పెంచుకున్నాం. మా భావాలూ ఉద్వేగాలూ హారంలో పూలలా కలిసిపోయాయి" అని ఆయన చెప్పుకున్నాడు. అలా ఆయన విప్లవోద్యమ సమర్థకుడిగా, విప్లవోద్యమ సాంస్కృతిక గళంగా ఎదిగాడు. జార్ఖండ్ ఎబెన్ అనే సాంస్కృతిక బృందాన్ని నిర్వహించాడు. అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితిలో భాగమయ్యాడు.

"మేం వేలాది మంది ప్రజల ప్రేమాదరాలను చూరగొన్నాం. రచయితలు, కళాకారులు, సాహిత్యకారులు, సామాజిక కార్యకర్తలు ఎందరో నన్ను ప్రోత్సహించారు. వాళ్లందరికీ నేను ఒక ప్రజా కళాకారుడిగా, ప్రగతిశీల సామాజిక కార్యకర్తగా, ప్రజలను మేల్కొలిపిన గాయకుడిగా తెలుసు. నా చేతుల్లో నగారా, ఢోలక్, హార్మోనియం వంటి సంగీత సాధనాలే తప్ప ఆయుధాలు ఎప్పుడూ చూడలేదని వాళ్లెవరయినా చెప్పగలరు. ఒక జానపద సాంస్కృతిక కళాకారుడిగా ధోతి, జుబ్బా, గజ్జెలు ధరించి ఉండగానే చూశారు గాని మరే ఇతర యూనిఫారంలో చూడలేదు. నా గళమూ నా సంస్కృతీ మాత్రమే నా సాధనాలు. నా చుట్టూ ఎప్పుడు చూసినా కళాకారుల గుంపే ఉండేది. ముఖ్యంగా బాల కళాకారులు ఉండేవారు. మేం జానపదకళలను ప్రచారం చేస్తూ గ్రామాలూ పట్టణాలూ తిరిగాం. నేనెన్నడూ ఒక కలం పేరు వాడలేదు. నాకొక అలియాస్ లేదు. నేను నా పేరుతోనే, జీతన్ మరాండీగానే ప్రచారమయ్యాను. నా పేరుమీదనే నా గొంతుతోనే నాలుగైదు భాషల్లో పాటల కాసెట్లు విడుదలయ్యాయి. ఆ పాటలేవీ అసభ్యమైనవి కాదు, తప్పుదారి పట్టించేవి కాదు. అవన్నీ సామాజిక స్పృహను రేకెత్తించేవి" అని ఆయన జైలు నుంచి రాసిన ఉత్తరంలో అన్నాడు.

అసలు ఆయన జైలుకు ఎందుకు వెళ్లవలసి వచ్చింది? గిరిది జిల్లా దేవరి పోలీస్ స్టేషన్ పరిధిలోని చిల్ఖారా గ్రామంలో 2007 అక్టోబర్ 26న మావోయిస్టు గెరిల్లా దళం జరిపిన దాడిలో అప్పటి ముఖ్యమంత్రి బాబూలాల్ మరాండీ కొడుకు అనూప్ మరాండీతో సహా 20 మంది మరణించారు. చిల్ఖారీ హత్యాకాండగా ప్రసిద్ధమైన ఈ ఘటన తర్వాత ఆ హత్యాకాండలో "జీతన్ మరాండీ" అనే పేరుగల నాయకుడు పాల్గొన్నాడని వార్తలు వచ్చాయి. ఒక పత్రిక అయితే కళాకారుడు జీతన్ మరాండీ ఫొటో కూడ వేసి వార్త రాసింది. వెంటనే జీతన్ మరాండీ దాన్ని ఖండించాడు. పత్రికల్లో ఆ ప్రకటన కూడ వచ్చింది. పోలీసులు కూడ ఈ జీతన్ మరాండీ, ఆ జీతన్ మరాండీ వేరు వేరు అన్నారు.

కాని ఐదు నెలల తర్వాత, 2008 ఏప్రిల్ లో జీతన్ మరాండీ రాంచీ నుంచి ప్రయాణంలో ఉండగా పోలీసులు పట్టుకుపోయారు. పది రోజుల పాటు రహస్య ప్రదేశంలో అక్రమ నిర్బంధంలో చిత్రహింసలకు, వేధింపులకు గురిచేసి, ముఖ్యమంత్రి ఇంటి ముందు ప్రదర్శన జరిపి, ఉపన్యాసం ఇచ్చాడనే కేసు పెట్టి జైలుకు పంపారు. జైలులో ఉండగానే ఆయన మీద మరెన్నో కేసులు బనాయించారు. అలా బనాయించిన కేసులలో ఒకటి చిల్ఖారీ హత్యాకాండ కేసు.

మరొక కేసు కోసం కోర్టుకు తీసుకువచ్చినప్పుడు పోలీసు అధికారి జీతన్ మరాండీని కొందరు వ్యక్తులకు పరిచయం చేశాడు. ఆ వ్యక్తులు చిల్ఖారీ కేసులో సాక్షులనీ, వారు జీతన్ మరాండీని కోర్టులో గుర్తించడానికే ఈ పరిచయం అనీ ఆ తర్వాత తేలింది. ఆ ఇద్దరు "సాక్షులు" తప్ప మరెవరూ, చివరికి హతుల బంధువులుగాని, గ్రామస్తులు గాని ఈ జీతన్ మరాండీ హత్యాస్థలంలో ఉన్నాడని సాక్ష్యం చెప్పలేదు.

ఈ అబద్ధపు కేసుల, దొంగ సాక్ష్యాల తతంగాలను ఎప్పటికప్పుడు జీతన్ మరాండీ కింది నుంచి పైదాకా అధికారుల దృష్టికి తెస్తూనే ఉన్నాడు. అయినా గిరిది మొదటి అదనపు జిల్లా, సెషన్స్ జడ్జి ఐ డి మిశ్రా జూన్ 23న ఇచ్చిన తీర్పులో జీతన్ మరాండీకి, ఛత్రపతి మండల్, మనోజ్ రాజ్‌వర్, అనిల్ రామ్ అనే మరో ముగ్గురు నిందితులకు మరణశిక్ష విధించాడు. ఆరుగురు నిందితులను నిర్దోషులుగా వదిలిపెట్టాడు.

ఈ కేసు నడిచిన పద్ధతి గాని, సాక్షుల విచారణ గాని, శిక్ష విధించిన తీరు గాని కేవలం ఒక ప్రజా సాంస్కృతిక కార్యకర్త మీద కక్ష సాధింపు ధోరణిలో మాత్రమే సాగాయి. ఈ మరణ శిక్షను ఖండించడం, ఈ మరణ శిక్ష రద్దు చేయాలని పోరాడడం ప్రజాస్వామిక వాదుల, ప్రజా సాంస్కృతిక కార్యకర్తల కర్తవ్యం. వీ

**ఆర్.ఎస్. రావు** తెలుగు వ్యాసాలన్నీ 2010 అక్టోబర్ లో 'కొత్తచూపు' పేరుతో వీక్షణం ప్రచురణగా వెలువడ్డాయి. కాని 1995లో వెలువడిన 'టువర్డ్స్ అండర్ స్టాండింగ్ సెమి ఫ్యూడల్ సెమి కలోనియల్ సొసైటీ' లోనూ, పత్రికలలోనూ ఇంకా తెలుగులోకి రాని వ్యాసాలున్నాయి. ఆ రచనలను కూడ తెలుగుచేసి పాఠకులకు అందించే ప్రణాళికలో భాగంగా ఈ వ్యాసం. ఇది 1984 మార్చ్ 10-11 లలో వరంగల్ కాకతీయ విశ్వవిద్యాలయంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ ఎకనమిక్ అసోసియేషన్ రెండవ వార్షిక సదస్సులో సమర్పించిన పత్రం -సం.

# వ్యవసాయ సంబంధాల సిద్ధాంతం దిశగా...

పంజాబ్‌లో వ్యవసాయ సంబంధాలపై ఆర్థికవేత్త అశోక్ రుద్ర, ఆయన సహచరులు 1970లలో చేసిన విస్తృతమైన కృషి మీద నా అభిప్రాయం చిత్తుప్రతిని ఆర్థికవేత్త ప్రొఫెసర్ అమలేందు గుహకు చూపెట్టే అవకాశం కలిగింది. ఆ చిత్తుప్రతిని మొత్తంగా ఆమోదిస్తూనే, దానిలో ఒక వాక్యం చేరిస్తే బాగుంటుందని ఆయన సూచించారు. సామాజిక సంబంధాల అధ్యయనంలో "ఉన్నస్థితి" కన్న "రూపొందుతున్నస్థితి"ని అధ్యయనం చేయడం ముఖ్యం అనే వాక్యం చేర్చమని ఆయన అన్నారు[1]. మరో మాటల్లో ఆ సూచనకు అర్థం ఏమంటే, స్థిరత్వాన్ని అధ్యయనం చేయడం కన్న చలనాన్ని అధ్యయనం చేయడం ముఖ్యం అని, ఒక సిద్ధాంత భూమికపై ఆ చలన పర్యవసానాలను ఊహించడం ముఖ్యం అని.

రైల్వేలు, నీటి పారుదల సౌకర్యాలు రావడంతో, కొత్త పంటలను ప్రవేశపెట్టడంతో, పరిశ్రమలు నెలకొల్పడంతో సామాజిక ఉత్పత్తి పద్ధతిలో మార్పులు వచ్చాయి. ఆ మార్పులన్నీ పెట్టుబడి ప్రవేశాన్ని సూచిస్తున్నాయి. ఈ పెట్టుబడి ప్రవేశం స్థలాన్నీ కాలాన్నీ బట్టి అసమానంగా ఉన్నప్పటికీ, రెండు యుద్ధాల మధ్యకాలంలో తీవ్రంగా ఉండింది, రాజకీయ స్వాతంత్ర్యం తర్వాత ఇంకా తీవ్రతరమయింది. ఈ పెట్టుబడి ప్రవేశం ఒక విచిత్రమైన స్థితికి దారితీసింది. సాంకేతిక పరిజ్ఞాన స్థాయిలో, లేదా ఉత్పత్తి శక్తుల స్థాయిలో చాల అభివృద్ధి చెందిన సాంకేతిక పరిజ్ఞానం చాల ప్రాథమిక స్థాయి సాంకేతిక పరిజ్ఞానంతో ఆశ్చర్యకరంగా సహజీవనం సాగిస్తోంది. ఆస్తి సంబంధాల స్థాయిలో చూస్తే, ఒక పక్కన పెట్టుబడికి శ్రమశక్తిని అమ్ముకునే శ్రామికులు ఉండడమూ కనిపిస్తుంది, మరొకపక్కన శ్రామికులు తమను తాము అమ్ముకోవడమూ కనిపిస్తుంది. ఇక సామాజిక సమస్యలకు స్పందనల స్థాయిలో చూస్తే, చాల అభివృద్ధి చెందిన ప్రజాస్వామిక సూత్రాలు మితిమీరిన వ్యక్తిగత ప్రవర్తనతో సహజీవనం సాగిస్తుంటాయి. మార్పుకు లోనవుతున్న ఏ సమాజంలోనైనా ఇటువంటి విచిత్ర స్థితులన్నీ ఉండడానికి అవకాశం ఉన్నమాట నిజమే గాని, ఆ మార్పు ఏ బిందువు దగ్గర మొదలవుతున్నదో అధ్యయనం చేయడం చాల అవసరం. ఆ బిందువు ఎంతవరకు పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంగా ఉన్నదో, అది యావత్తు సమాజానికి వ్యాపించిందో లేదో చూడడం అవసరం. అసలు సమాజాన్ని మార్చే శక్తిగానీ, తాళం చెవిగానీ పెట్టుబడిదారీ విధానానికి ఉన్నాయా? ఈ పత్రం ఈ ప్రశ్నకు జవాబు వెతకడానికి ప్రయత్నిస్తుంది. ఆ క్రమంలో అటువంటి మార్పుకు కీలకమైన మూడు అంశాలను ఈ పత్రం గుర్తిస్తుంది. అవి ఒకటి, ఉపరితలాన్ని అధ్యయనం చేయడం. రెండు, స్థానిక/దేశీయ మార్కెట్ ను అధ్యయనం చేయడం. మూడు, పెట్టుబడి సంచయనానికి మౌలిక దోహదకారి అయిన శ్రమశక్తి సమస్యలను అధ్యయనం చేయడం.

ఈ పత్రంలో రెండవ భాగం ఉపరితల అంశాలను చర్చించి, పెట్టుబడి పెరుగుదల పెట్టుబడిదారీ ఉపరితలంతో కలిసి సాగడం లేదనీ, పెట్టుబడిదారీ పూర్వ ఉపరితలమే ఉనికిలో ఉందనీ చూపుతుంది. అందువల్ల పెట్టుబడిదారీ పూర్వ ఉపరితలం పెట్టుబడిదారీ విధాన పెరుగుదలకు అనువైనదిగా లేదనీ, అది పెట్టుబడినే మార్చగలదిగా ఉందనీ వాదిస్తుంది.

మూడో భాగం భారతీయ పెట్టుబడి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ద్వారా పెట్టుబడిదారీ సంబంధాలను ప్రవేశపెట్ట దలచుకున్నదని చూపుతూ, అటువంటి పద్ధతివల్ల స్థానిక/దేశీయ మార్కెట్ ను సాధించడంలో వచ్చే వైరుధ్యాన్ని ఎత్తిచూపుతుంది.

నాలుగో భాగం వ్యవసాయ శ్రామికుల గురించి చర్చిస్తుంది. ఈ శ్రామికులు ఒకపక్కన మిగులుకు పునాది, మరొకపక్కన మార్కెట్ కు పునాది. కాని వారి నిరుద్యోగం పెట్టుబడిదారీ విధాన వృద్ధికి ప్రధాన ఆటంకంగా నిలుస్తుంది. వారి నిరుద్యోగం వ్యవస్థ అస్థిరతకు కూడ ప్రధాన వనరుగా ఉంటుంది.

ఐదో భాగం ఒక ఆలోచనాత్మక పరికల్పనను సమర్పిస్తుంది. భారతదేశంలో పెట్టుబడి సామ్రాజ్యవాద దశలో, సామ్రాజ్యవాదంలో భాగంగా ప్రవేశించినది. అందువల్ల దాని మార్గం ఇతర పెట్టుబడి మార్గాల కన్న భిన్నమైనది. పెట్టుబడిదారీ దేశాలయితే శ్రామికులకు సంబంధించిన విప్లవంతో ప్రారంభమయ్యాయి. జపాన్ వంటి ఆలస్యంగా పెట్టుబడిదారీ విధానంలో చేరిన దేశాలయితే ఉత్పత్తి సాధనాలలో విప్లవంతో ప్రారంభమయ్యాయి. కాగా, భారతదేశంలో జరిగిన మార్పు సరుకులద్వారా, అంటే ఉత్పత్తి ప్రక్రియకు ఫలితం ద్వారా ప్రవేశించింది. అందువల్ల సామాజిక వ్యవస్థ నిర్మాణంగాని, సాంకేతిక పరిజ్ఞాన నిర్మాణంగాని, ఏ మార్పులూ జరగకుండానే సరుకుతో రాజీ పడి తమను తాము సర్దుబాటు చేసుకున్నాయి. అంటే మార్పులు బయటినుంచి, బాహ్యంగా వచ్చాయి. కాని సామాజిక సంబంధాలు ఎప్పుడైనా అంతర్గతంగా ఉంటాయి. అందువల్ల సామాజిక సంబంధాల అధ్యయనం వాస్తవంగా ఉన్న సజీవ సామాజిక సంబంధాల ఆధారంగా జరగాలి గాని, అమూర్త ప్రత్యయాల ఆధారంగా కాదు అని ఈ చర్చ ద్వారా ఈ పత్రం ముగిస్తుంది.

**ఉపరితల అధ్యయన అవసరం**

ఇంతకాలం గడిచిన తర్వాత[2] ఆ చర్చను పరిశీలిస్తే మొత్తంగా చర్చ రెండు దశల్లో జరిగిందని అర్థమవుతుంది. మొదటి దశలో మొత్తం సమాజం నుంచి నమూనాలు సేకరించి, వాటిని చర్చించారు. రెండో దశలో మొత్తం సమాజ ప్రత్యేకతలను సూత్రీకరించడం మీద కేంద్రీకరించారు. మొదటి దశ చాల ఉద్రిక్తంగా సాగింది. ఉత్సా పట్నాయక్, ప్రధాన్ ప్రసాద్, అమిత్ భాదురి వంటి అర్థశాస్త్రవేత్తలు వేరువేరు అంశాల మీద, వేరువేరు ప్రాంతాల

నుంచి సమాచారం తీసుకువచ్చి, వ్యవసాయ సంబంధాల గురించి విభిన్నమైన సాధారణీకరణలకు పూనుకున్నారు. ఈ సాధారణీకరణలలో "అర్ధ భూస్వామ్యం" సూత్రీకరణ నుంచి, "ఎదుగుతున్న పెట్టుబడిదారీ విధానం" సూత్రీకరణ వరకు అనేకం ఉన్నాయి. రెండో దశలో మొత్తం సమాజ ప్రత్యేకతల ఆధారంగా వేరువేరు సూత్రీకరణలు చేయడానికి ప్రయత్నం జరిగింది. ఈ దశలో 'పెట్టుబడిదారీ సంబంధాలు' అనే సూత్రీకరణ నుంచి 'ద్వంద్వ సంబంధాల విధానం' అనే వరకూ అనేక సూత్రీకరణలు వచ్చాయి. కాని ఇలా చర్చించిన సమాజ ప్రత్యేకతలలో ఇంతకాలమూ విస్మరణకు గురైన ఉపరితలం అనే ప్రత్యేకతను ఈ భాగంలో చర్చించదలిచాం. సాధారణంగా 'ధనిక రైతు', 'భూస్వామ్య ప్రభువు' వంటి నిర్దిష్టమైన ఆర్థిక ప్రత్యయాల ఆధారంగాగాని, 'కౌలు', 'స్వేచ్ఛాయుతమైన వేతన శ్రమ' వంటి ప్రత్యయాల ఆధారంగాగాని సామాజిక స్వభావాన్ని చర్చిస్తున్నారు. ఐతే ఈ ప్రత్యయాలన్నీ కూడ ఒక సందర్భంలో, నేపథ్యంలో పనిచేస్తుంటాయి. మొత్తంగా చూస్తే ఈ ప్రత్యయాలు పునాది స్థాయిలోని ఆర్థిక ప్రత్యయాలకు సూచికలుగా ఉంటాయి. ఈ ప్రత్యయాలు వాటికవే తమ సందర్భాన్ని, నేపథ్యాన్ని సృష్టించుకుంటాయనే, అంటే పెట్టుబడిదారీ విధానాన్ని సృష్టిస్తాయనే అభిప్రాయం ఉంది. పెట్టుబడిదారీ విధానమనేది ఒక ప్రగతిశీల శక్తి గనుక, దానికి తన సందర్భాన్ని తానే సృష్టించుకునే శక్తి ఎక్కువనే అభిప్రాయం కూడ ఉంది. కాని గతంలో ఒక వ్యాసంలో నేను సూచించినట్టు, పెట్టుబడిదారీవిధానం సామ్రాజ్యవాదంగా మారిన తర్వాత, అది తన సందర్భాన్ని తానే సృష్టించుకునే ప్రగతిశీల స్వభావాన్ని వదులుకుంటుంది[3]. అందువల్లనే సందర్భాన్ని అధ్యయనం చేయడానికి ప్రాముఖ్యత పెరుగుతుంది. ఆ సందర్భాన్నే మనం సాధారణంగా ఉపరితలం అని పిలుస్తుంటాం. పునాది స్థాయి సంబంధాలను సరిగా అర్థం చేసుకోవాలంటే ఉపరితలాన్ని అధ్యయనం చేయడం అత్యవసరమని మావో సే టుంగ్ తన 'సోవియట్ అర్థశాస్త్ర విమర్శ'లో ఎత్తిచూపాడు. వ్యవసాయ సంబంధాలను అధ్యయనం చేసేటప్పుడు ఉపరితలాన్ని అధయ్యనం చేయడం ఎంత అవసరమో ఇక్కడ చూద్దాం.

వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం తలెత్తిందనేందుకు సూచనగా వ్యవసాయ కార్మికులు పుట్టుకురావడాన్ని అధ్యయనం చేస్తే చాలుననే వాదనమీద ఇప్పటివరకూ చర్చలు ఆధారపడ్డాయి. వ్యవసాయ కార్మికులు అనే ప్రత్యయం నిజానికి వలసవాద కాలంలోనే తలెత్తింది. భారతదేశం రాజకీయంగా స్వతంత్రమయ్యే సమయానికి సంఖ్యాత్మంగా గణనీయమైన అభివృద్ధి కూడ సాధించింది. ఎస్ జె పటేల్ వేసిన తొలి అంచనాల ప్రకారం[4] 1930ల నాటికే భారత సమాజంలో వ్యవసాయ కార్మికుల సంఖ్య 38 శాతంగా ఉండింది. ఆ అంచనాలో కట్టు బానిసలు, అల్పోద్యోగంలోని కార్మికులు, పూర్తిస్థాయి స్వేచ్ఛాయుత వేతన కార్మికులు అనే మూడు విభాగాలు ఉండగా, 1931లో పూర్తిస్థాయి వేతన కార్మికులు 3.6 శాతం ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ కు సంబంధించినంతవరకు జి ఎన్ రావు, నట దువ్వూరి, అచ్చిరెడ్డి జరిపిన అధ్యయనాల[5] ప్రకారం స్వాతంత్ర్యానికి పూర్వమే వ్యవసాయ కార్మికులు ఉన్నారని, వ్యవసాయ కార్మికుల 'మార్కెట్' ఉందని తేలింది. ఈ అధ్యయనాలు ఆ కాలంలో వ్యవసాయం గణనీయంగా విస్తరించిందని చూపాయి. కాని ఆ కాలంలో వ్యవసాయ సంబంధాలను భూస్వామ్యం అనే నిర్వచించారు. అందుకు కారణం రాజ్యాంగయంత్రపు వలస స్వభావం, పరిమిత పెట్టుబడి సంచయనం అనే సాధారణ పరిస్థితులు. ఆ తర్వాత రాజకీయ స్వాతంత్ర్యం రావడంతో, వ్యవసాయంలో 'పెట్టుబడి ఉత్పాదకాలు' పెరగడంతో, చర్చలో వ్యవసాయ సంబంధాలు కేంద్రస్థానానికి చేరాయి.

వ్యవసాయ కుటుంబాల శ్రమశక్తిని వినియోగించుకోవడం మాత్రమే కాక, మిగులును గణనీయంగా మళ్లీ పెట్టుబడిగా మార్చే 'ధనిక రైతు/పెట్టుబడిదారీ రైతు' ఎక్కడ ఉన్నాడా అని వెతకడమే ఆ చర్చలో పరిశోధకులు చేసిన ప్రయత్నం. అటువంటి రైతులు కనబడగానే 'వ్యవసాయ రంగంలో పెట్టుబడిదారీ సంబంధాల పెరుగుదల' అనే సూత్రీకరణ వెల్లువడేది. అలా కాక, అటువంటి రైతులు లేకపోయినా, 'మితిమీరిన వడ్డీ వ్యాపారం', 'కౌలు', 'వ్యాపారం', వగైరా ఆర్థికేతర రూపాలలో మిగులును కొల్లగొట్టేవారు అటువంటి రైతులకన్న ఎక్కువమంది ఉన్నా, ఆ వ్యవసాయ సంబంధాలను 'అర్ధ భూస్వామ్యం' అని అభివర్ణించడం జరిగేది. దేశం మొత్తం మీద 80 మంది పెద్ద రైతులు ఉండడమే పెట్టుబడిదారీ సంబంధాల పెరుగుదలకు చిహ్నమయిన, తగిన గణాంక ఆధారమని ఒకరికి అనిపించగా, బీహార్ లో తాను పరిశీలించిన 23 గ్రామాలే అర్ధ భూస్వామ్య సూత్రీకరణకు తగిన గణాంక ఆధారమని మరొకరికి అనిపించింది. మరొక పరిశోధకుడు 1950లలో జరిపిన క్షేత్ర పర్యటనలోనేమో, పెట్టుబడి కొరత వల్లనే వ్యవసాయాభివృద్ధి జరగడం లేదనే అభిప్రాయానికీ, 1960లలో జరిపిన క్షేత్ర పర్యటనలోనేమో వ్యవసాయాభివృద్ధి సమస్యలు ప్రధానంగా సాంకేతికమైనవనే అభిప్రాయానికీ వచ్చారు.

ఈ అన్నిరకాల సూత్రీకరణలలో ఉమ్మడి అంశం ఒకటుంది. కొన్ని ఆర్థిక ప్రత్యయాలు ఉనికిలో ఉంటే చాలు, ఆ ప్రత్యయాలు ఏ సాంఘిక సంబంధాలకు ప్రతినిధులో ఆ సాంఘిక సంబంధాలు ఉన్నట్టే అని ఈ పరిశోధకులందరూ భావించారు. ఉదాహరణకు, ఒక ధనిక రైతు ఉంటే, ఆయన కూలికి శ్రామికులను వాడుతుంటే, తన మిగులు 'పునఃపెట్టుబడి' గా మారుస్తుంటే, ఆ స్థలంలోనూ, కాలంలోనూ విస్తృత పునరుత్పత్తి అవకాశాలు ఉన్నాయనడానికి సరిపోతుందన్నమాట. కేవలం తర్కపరంగా మాత్రమే చూస్తే, ఉత్పత్తి వేతనశ్రమ మీద ఆధారపడి ఉంది, అంటే పెట్టుబడి - శ్రమ సంబంధం ఉంది. మిగులును పునఃపెట్టుబడిగా మార్చడం జరుగుతోంది. అంటే విస్తృత పునరుత్పత్తి జరుగుతున్నట్టే.

కాని చారిత్రకంగా చూస్తే, ప్రస్తుత భారతదేశం బ్రిటిష్ వలసగా ఉన్నప్పుడే, ఇరవయో శతాబ్ది తొలిరోజులనాటికే, దేశంలోని అనేక ప్రాంతాలలో ఇటువంటి పరిస్థితులు ఏర్పడి ఉన్నాయి. భూమి శిస్తును డబ్బు రూపేణా వసూలు చేసే పద్ధతి మొదలు కావడం, జనుము, పత్తి, చెరకు వంటి వాణిజ్య పంటల ప్రవేశం, దేశంలోని అనేక ప్రాంతాలలో నీటిపారుదల సౌకర్యాల కల్పన వంటి వేరువేరు పరిణామాల ప్రభావం వల్ల వ్యవసాయ కార్మికులు రూపొందారు. అంత మాత్రమే కాదు, వ్యవసాయ కార్మికులను విస్తృత స్థాయిలో వినియోగించడం కూడ జరిగింది. ఈ కారణాలన్నీ కలిసి, ఆ ప్రాంతంలో రైతాంగం చేసిన పోరాటాల మీద కూడ ఆధారపడి, జమీందారులు పారిశ్రామికవేత్తలుగా, భూస్వాములు ధనికరైతులుగా, కొంతమంది ధనిక రైతులు వ్యాపారులుగా, పారిశ్రామికవేత్తలుగా మారారు. బ్రిటన్ సామ్రాజ్యవాద శక్తిగా మారి, భారతదేశానికి పెట్టుబడిని ఎగుమతి చేస్తుండడంతో ఇటువంటి పరిణామం అత్యవసగంగా తలెత్తింది. బహుశా ఈ పరిణామమే భారత జాతీయోద్యమానికి, దాని హింసాత్మక, అహింసాత్మక రూపాలు రెండిటిలోనూ, వెన్నెముకగా నిలిచింది. ఇటువంటి పరిణామాలన్నీ ఉనికిలో ఉన్నప్పటికీ అప్పటి పరిశోధకులెవరూ భారత వ్యవసాయం పెట్టుబడిదారీ పంథాలో పెరుగుతున్నదని నిర్ధారించలేదు. అప్పటి స్థల కాలాల రీత్యా పెట్టుబడిదారీ సంబంధాల విస్తృత పునరుత్పత్తికి అనువైన రాజకీయ ఉపరితలం లేదనే సాధారణ కారణమే అలా సూత్రీకరించకపోవడానికి పునాది కావచ్చు. అప్పటి రాజకీయ ఉపరితలం వ్యవసాయంలో మాత్రమే కాదు, పరిశ్రమలో కూడ అభివృద్ధికి ఆటంకంగా నిలిచింది. రాజకీయ ఉపరితలం కల్పించిన ఈ అవరోధాలను 'అసమగ్ర పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం' అనవచ్చునని ఉత్సా పట్నాయక్ సూచించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికీ భూస్వామ్య శక్తులకూ మధ్య కుదిరిన పొత్తుగా గెయిల్ ఆమ్ వెడ్ట్ సూచించారు. ఇంకా సాధారణ స్థాయిలో చెప్పాలంటే అప్పటికి ఎన్నికైన ప్రతినిధుల

# ఆర్.ఎస్. రావు సంస్మరణ సభ

జూన్ 30 గురువారం సాయంత్రం 6 గంటలకు హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ ప్రెస్ క్లబ్‌లో ఆర్.ఎస్. రావు సంస్మరణ సభ సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సి.డి.ఆర్.సి.) - వీక్షణంల ఆధ్వర్యంలో జరిగింది. ఈ సభను వీక్షణం కరస్పాండెంట్/సర్క్యులేషన్ మేనేజర్ వై.రామచంద్రం తొలి పలుకులతో ప్రారంభించారు. సి.డి.ఆర్.సి. - వీక్షణంలకు ఆర్.ఎస్.రావుగారు అందించిన ఆలోచనలు, రచనలు, సంభాషణలు గుర్తు చేశారు. ఆర్.ఎస్.రావు ఆలోచనలను, ఆయన వేగాన్ని అందుకోవడంలో తెలుగు సమాజం వెనుకబడిందేమోనని అన్నారు. కొత్తతరాన్ని ప్రోత్సహించడంలో ఆయన చాలా ముందున్నారు. ఆయన రచనలను విస్తృతంగా అధ్యయనం చేయాల్సిన అవసరాన్ని గుర్తుచేశారు.

ఈ సభకు సి.డి.ఆర్.సి. చైర్మన్ ప్రొ. కె.ఆర్. చౌదరి అధ్యక్షత వహించారు. ఎస్. సుధాకర్ (పాత్రికేయులు), ప్రొ. వి. శివలింగ ప్రసాద్ (హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం), వరవరరావు (విప్లవ రచయితల సంఘం), ఎన్. వేణుగోపాల్ (వీక్షణం సంపాదకులు) వక్తలుగా పాల్గొన్నారు.

సభాధ్యక్షులు ప్రొ. కె.ఆర్. చౌదరి మాట్లాడుతూ ఆర్.ఎస్. రావును అరుదైన మార్క్సిస్టు మేధావిగా పేర్కొన్నారు. సి.డి.ఆర్.సిలో ఆయన చురుకైన పాత్రను, ఆ క్రమంలో ఆయనతో సాన్నిహిత్యాన్ని గుర్తుచేసుకున్నారు. ఆయన రచనలపై తెలుగు సమాజం పరిశోధన చేయాల్సిన అవసరముందని అన్నారు. ఎన్. వేణుగోపాల్ మాట్లాడుతూ దాదాపు మూడు దశాబ్దాలుగా ఆర్.ఎస్. రావుతో తనకు ఉన్న అనుబంధాన్ని గుర్తుచేసుకున్నారు.

ప్రొ. వి. శివలింగ ప్రసాద్ మాట్లాడుతూ, ఆర్.ఎస్. రావు గారి దృష్టి చాలా సునిశితమైందనీ, పదునైందనీ అన్నారు. ఆయనను గొప్ప సామాజిక శాస్త్రవేత్తగా పేర్కొన్నారు. ఆయన పట్ల విద్యార్థులకు చాలా గౌరవం ఉండేదని అన్నారు. ఆర్.ఎస్.రావు గారు ఎప్పుడూ - 'ప్రభుత్వ పాలనను ప్రజా పాలన (పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్) గా ఎప్పుడు మారుస్తారు' అని అడిగేవారని అంటూ, సమాజ శాస్త్రాలు చదవడం వలన సమాజం అర్థం కావట్లేదు కాబట్టి దానికదే ఒక సంక్షోభమని అనే వారని గుర్తు చేసుకున్నారు. పర్టిక్యులర్, జనరల్ గురించి చెబుతూ పర్టిక్యులర్ గురించి ఆలోచించినప్పుడు మనకు జనరల్ తెలియదని, జనరల్ గురించి ఆలోచించినప్పుడు పర్టిక్యులర్ తెలియదని అనేవారన్నారు. హేతుబద్ధ జ్ఞానం అనేది విద్యావేత్తలలో కొరవడు తోందని, సోషల్ సైన్సెస్‌కి, సోషల్ సైంటిస్ట్‌కి మధ్య అఖాతం ఉందని అనేవారని చెప్పారు. అభివృద్ధి - వృద్ధి పదాల గురించి చాలా చర్చించేవారని, మార్పుకి దోహదపడేదే అభివృద్ధి అని చెప్పేవారని గుర్తుచేశారు. ఆర్.ఎస్. రావు నిత్య పరిశోధకుడని, తాను చేసే పనిని ప్రేమించేవాడని చెప్పారు. 'సోషల్ ప్రొడక్షన్ ఆఫ్ నాలెడ్జ్ అండ్ ఓనర్‌షిప్ ఆఫ్ ఇండివిడ్యుయల్' అనేది సంక్షోభానికి కారణమని చెప్పేవారని అన్నారు.

ఎస్. సుధాకర్ మాట్లాడుతూ తెలుగు నేల మీద, ఉద్యమాల పైన ఆర్.ఎస్. రావుకు గొప్ప నమ్మకం, ప్రేమ ఉండేవని అన్నారు. ఆయనను కలిసినప్పుడు నాతో సరిగా పనిచేయించుకోవడం లేదని అనేవారని గుర్తు చేసుకున్నారు. పీస్ ఇనీషియేటివ్ కమిటీకి ఆయన చాలా కంట్రిబ్యూట్ చేశారని తెలిపారు. పీస్ ఇనీషియేటివ్‌కు మోరల్ సపోర్ట్ కాళోజీ అయితే, మెటీరియల్ సపోర్ట్ ఆర్.ఎస్. రావు అని అన్నారు. ఒక ప్రత్యామ్నాయ ఉద్యమం చర్చలు ఎందుకు చేయాలో చాలా అద్భుతంగా వివరించారని అన్నారు. సమాజం కోరుకున్నది చేయడానికి మనం ఎప్పుడూ ముందుండాలని అనేవారని చెప్పారు. ప్రజల పట్ల గొప్ప నిబద్ధత, నమ్మకాన్ని కలిగి ఉండేవారని తెలిపారు. ఏమి చెప్పినా ఆయన చాలా శ్రద్ధగా, ఓపికగా వినేవారని గుర్తు చేసుకున్నారు. కొద్దికాలం ఉద్యమంతో పనిచేశాం కదా అని ఉద్యమం పట్ల ఎలా పడితే అలా మాట్లాడడం కుదరదని, అలాంటి అహంకారం పనికి రాదని చాలా కటువుగా, స్పష్టంగా చెప్పేవారన్నారు. 80 సంవత్సరాల కమ్యూనిస్టు ఉద్యమంలో విమర్శ ఉన్నంత బలంగా స్వీయ విమర్శ లేదని అంటూండేవారని గుర్తు చేశారు. ఆయనను మనమంతా విస్తృతంగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఉందని సుధాకర్ తెలిపారు. ఆయన ఆలోచనలు అన్నింటినీ మనం ఆవిష్కరించు కోవాల్సిన అవసరాన్ని గుర్తు చేశారు.

విప్లవ రచయిత వరవరరావు మాట్లాడుతూ ఆర్.ఎస్. రావు గారి సునిశితమైన దృష్టి, సూక్ష్మమైన పరిశీలనలను గుర్తు చేశారు. మూడు దశాబ్దాలకు పైగా విరసంకు, విప్లవోద్యమానికి లోతైన ఆలోచనలను, దృష్టిని, మార్క్సిస్ట్ విశ్లేషణలను అందించారన్నారు. జీవితం చివరివరకు ప్రజలతోనూ, ప్రజా ఉద్యమాల తోనూ సంభాషిస్తూనే ఉన్నారని అన్నారు. 'ఉద్యమం నా పై పెట్టిన బాధ్యత నిర్వహించాలి గదా' అంటూ వినీల్ కృష్ణ సందర్భంలో తీవ్ర అనారోగ్యంతో కూడా మధ్యవర్తిగా బాధ్యత తీసుకున్నారని అన్నారు. 'కనీసం సీతన్న ఆచూకీ కూడా ప్రభుత్వంతో చెప్పించలేక పోయామండీ' అని బాధపడుతూ సీతన్న భార్య 'నా భర్తను తీసుకొచ్చారా? ఎక్కడున్నాడట? బతికే ఉన్నాడా? ఎప్పుడు వదులుతారట?' వంటి ప్రశ్నలు వేస్తుందని ఊహించుకుంటూ బాధపడ్డారని తెలిపారు. ఆర్.ఎస్. రావు గారు సీతన్న వంటి ఆదివాసుల వైపు నుంచి ప్రపంచాన్ని చూసారన్నారు. పోగొట్టు కోవడానికి సంకెళ్ళు తప్ప ఏమీలేని కార్మికుల వైపు నుంచి ప్రపంచాన్ని మార్చడం నేర్చుకున్నవాడు అన్నారు. ఆ ప్రాపంచిక దృక్పథాన్ని ఆయన నలభై ఏళ్లపాటు పంచారని చెప్పారు. ఆయన ఆలోచనా ప్రవంతిలో ముదునూరి భారతిగారి ఆలోచనలూ కలిసే ఉన్నాయంటూ ఇప్పుడు ఇద్దరి ఆలోచనలను పంచుకునే భారం భారతిగారిపై పడిందని అన్నారు.

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం ఉపాధ్యక్షులు డి. సురేష్ కుమార్ పౌరహక్కుల సంఘానికి ఆర్.ఎస్. రావు గారు అందించిన ఆలోచనల గురించి గుర్తు చేశారు. పౌరహక్కుల సంఘంలో సంక్షోభం తలెత్తినప్పుడు ఆర్.ఎస్.రావు గారితో చర్చించి స్పష్టతకు వచ్చినట్లు, సమాధానం కనుగొన్నట్లు తెలిపారు.

---

తీవ్రవాదాన్ని రాజకీయ ఉపరితలం అడ్డుకున్నదని గాడ్గిల్ అన్నారు.

అంటే, పెట్టుబడిదారీ సంబంధాల అభివృద్ధి క్రమాన్ని నిర్ధారించడానికి, ఉత్పత్తి క్రమంలో ఉన్న ఆర్థిక ప్రత్యయాలను గుర్తించడంతో పాటే, ఉపరితలాన్ని అధ్యయనం చేయడం సమానమైన ఆవశ్యకతగా ఉంటుంది. ఆ ఉపరితలమే ఉత్పత్తి ప్రక్రియలో సంబంధాల పనితీరును, పరిస్థితులను నిర్ణయిస్తుంది. ఉన్నస్థితికీ, రూపొందుతున్నస్థితికీ మధ్య తేడాను ఉపరితల సంబంధాలే నిర్ణయిస్తాయని ప్రస్తుత రచయిత అభిప్రాయం కూడ. అందువల్ల, రూపొందుతున్న స్థితి ఏమిటో తెలుసుకోవాలంటే ఉపరితల సంబంధాలను అధ్యయనం చేయడం అవసరం.

సందర్భంతో సంబంధం లేకుండా కేవలం ఆర్థిక ప్రత్యయాలను మాత్రమే అధ్యయనం చేస్తే తప్పుడు సాధారణీకరణలకు వచ్చే ప్రమాదం ఉంటుంది. అందువల్ల, ఇంతకుముందు ప్రస్తావించిన చర్చలో జరిగినట్టుగా, అవగాహనను మార్చుకోవలసి వస్తుంది. ఆ చర్చనంతా క్రోడీకరిస్తూ ఆలిస్ థార్నర్ రాసినట్టు, 'మొట్టమొదటి ప్రతిపాదకులు తమ అవగాహనను ప్రకటిస్తారు, సమర్థకులనూ, విమర్శకులనూ ఆకర్షిస్తారు. ఏ వైఖరీ లేని స్వేచ్ఛాజీవులు కూడ చర్చలోకి దూరి చర్చా పరిధిని విస్తరిస్తారు. ఇంతలో ఒక ప్రముఖవ్యక్తి తన అవగాహన మార్చుకుంటారు. మళ్లీ కొత్త సమీకరణాలు మొదలవుతాయి...'

'ఆ చర్చలో కౌలు పద్ధతి ఎంత ఉందనే విషయం మీద, దాని పాత్ర ఏమిటనే విషయం మీద చాల వివాదాలు చెలరేగాయి. కౌలు అనే సంబంధం ఇటు పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి విధానంలోనూ ఉండవచ్చు, అటు పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలోనూ ఉండవచ్చు. రాజకీయ స్వాతంత్ర్యం, ఆ తర్వాత జరిగిన భూసంస్కరణలు కౌలు కింద ఉన్న భూమి పరిమాణాన్ని చాల వరకు తగ్గించాయి. 1975-76లో జరిగిన వ్యవసాయ గణాంకాల నివేదిక ప్రకారం, ఆంధ్రప్రదేశ్ లో 94 శాతం భూమిని సొంతదారులే సాగు చేస్తున్నారు. కాని పరిశోధకులు కొందరు ఈ లెక్కలను ప్రధానంగా పాలకుల

మాయగా అభివర్ధిస్తారు. భూసంస్కరణలు విజయవంతమయ్యాయని చెప్పడానికి రాజకీయంగా స్వతంత్రులయిన భూమి సొంతదారులు చెపుతున్న విషయమని అంటారు. సూక్ష్మస్థాయిలో జరిగిన గ్రామ అధ్యయనాల ప్రకారం సొంత సాగు అంతగా లేదు. కొన్ని అధ్యయనాల ప్రకారం గుంటూరు జిల్లా వంటి అభివృద్ధి చెందిన ప్రాంతాలలో కూడ కౌలు పద్ధతి అంతరించలేదు. గుంటూరు జిల్లాలోని అనంతవరం, కాజ గ్రామాలలో జరిపిన పరిశోధనా ఫలితాలను సుందరయ్య రాశారు. నీటిపారుదల సౌకర్యాలు ఉన్న అనంతవరంలో 'భూమి కౌలుకు తీసుకున్న కుటుంబాలు 149, మొత్తం కుటుంబాలలో 18.2 శాతం. మొత్తం కౌలుకు తీసుకున్న భూమి 363 ఎకరాలు. అది గ్రామంలోని మొత్తం సాగుభూమిలో 30 శాతం. ఇక కాజలో గ్రామంలోని భూమిలో 26 శాతం, అంటే 409 ఎకరాలు కౌలుకు సాగు అవుతున్నది. ఇక్కడ భూమి కౌలుకు తీసుకున్న కుటుంబాలు 254, మొత్తం గ్రామంలోని కుటుంబాలలో 25 శాతం. వీరు గ్రామంలోని 409 ఎకరాలతో పాటు ఇరుగుపొరుగు గ్రామాలలోని 71 ఎకరాల భూమిని కూడ కౌలుకు సాగుచేస్తున్నారు. అంటే, గ్రామంలోని మొత్తం భూమిలో 25 శాతం కన్న ఎక్కువ భూమి కౌలు పద్ధతిపై కౌలుదార్ల చేతుల్లో ఉన్నది, వారు మొత్తం గ్రామంలోని 25.1 శాతం కుటుంబాలు.' ఈ అధ్యయనం 1974లో జరిగింది.

కౌలు పద్ధతి గురించి దొరుకుతున్న సమాచారం అసమగ్రంగా ఉందని ఈ ఉదాహరణను బట్టి అర్థం చేసుకోవచ్చు. కాని, ఈ అసమగ్రతకు తోడుగా, కౌలు సంబంధాల లోపలనే ఏమైనా తేడాలున్నాయా కూడ అధ్యయనం చేయవలసి ఉంది. పోటీతత్వం నిండి ఉండే పెట్టుబడిదారీ విధానపు ప్రధాన లక్షణాలలో ఒకటేమంటే, అది అన్ని ఉత్పత్తి సంబంధాలనూ, ఒక ఒప్పందంలో చేరే మనుషుల మధ్య సంబంధాలను మానవేతర సంబంధాలుగా మార్చేస్తుంది. కౌలు పద్ధతి కూడ అలా మారే ఉత్పత్తి సంబంధమే. కాగా పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి సంబంధాలేమో అన్ని సంబంధాలనూ వ్యక్తిగత, మానవ సంబంధాలుగా చూస్తాయి. అంటే పెట్టుబడిదారీ పూర్వ ఉత్పత్తి విధానంలో ఎవరి నుంచి ఎవరు కౌలుకు తీసుకుంటున్నారు అనేది చాల ముఖ్యమైపోతుంది. భూమి కౌలు గాని, శ్రమ కౌలు గాని పెంచాలా తగ్గించాలా అనేదాన్ని మాత్రమే కాదు, సాంఘిక, రాజకీయ అధికారాన్ని నిర్వహించే విషయాన్ని కూడ ఈ సంబంధాలే నిర్ణయిస్తాయి. మెంచర్ అధ్యయనం[6]లో చెప్పినట్టు, 'భూమిలేని నిరుపేదలను గాని, చిన్నరైతులను గాని సంఘటితం చేసే శక్తి ఉన్న వ్యక్తిని అదుపులో పెట్టడానికి ఒక మార్గం ఉంది. వచ్చే పంటల కాలంలోనో, మరుసటి సంవత్సరంలోనో ఆయనకు పొత్తుకు గాని, కౌలుకు గాని భూమి ఇవ్వబోమని ఎప్పటికప్పుడు బెదిరిస్తూ అదుపులో పెట్టుకోవచ్చు'. అలాగే భరద్వాజ్, పి కె దాస్ ల అధ్యయనం[7]లో మరొక ఆసక్తికరమైన విషయం బయటపడింది. పెద్ద భూస్వాములు తమ భూమిని చిన్నచిన్న కమతాలుగా మార్చి కౌలుకు ఇస్తున్నారు. చిన్న కమతాల కౌలుదార్లయితే తమ మడిచెక్కమీద ఎక్కువ కష్టపడి ఎక్కువ పండిస్తారనే అభిప్రాయమే ఇందుకు కారణం. అలాగే చిన్న కౌలుదార్లకయితే భూస్వాములకు ఉచితంగా గాని, తక్కువ కూలికి గాని సేవలు అందించవలసిన నిర్బంధం కూడ పెరుగుతుంది. అంటే ఈ కౌలు పద్ధతులు దోపిడీని పెంచడానికే ఉపయోగపడుతున్నాయి. అయినా, ఈ ఉదాహరణలు ఎక్కడో ఒకచోట ఉన్న కౌలు గురించి ఉదాహరణలే కావచ్చు. మొత్తం మీద కౌలు పద్ధతి తగ్గిపోతూ ఉండవచ్చు. అలాగే పెట్టుబడిదారీ రైతులే భూమిని కౌలుకు తీసుకునే పద్ధతి, 'ఎదురుకౌలు' పద్ధతి అమలులోకి వస్తూ ఉండవచ్చు. కొన్నిసార్లు ఈ 'ఎదురుకౌలు' పద్ధతి ఉనికిలోకి రావడమే పెట్టుబడిదారీ సంబంధాలు తలెత్తడానికి సూచన అనే వాదన కూడ ఉంది. పెట్టుబడిదారీ విధానంలో భూకేంద్రీకరణ జరుగుతుందనే సూత్రాన్ని బట్టి ఈ వాదనను బలంగా వినిపిస్తున్నారు. కాని ఇటువంటి కౌలు పద్ధతికి కూడ ఆర్థిక ప్రయోజనం మినహా మరే ప్రయోజనం లేదని ఊరికే వాదించడం కుదరదు. ముఖ్యంగా కుల ప్రయోజనాలు లేవని చెప్పలేం.

మొత్తంగా దేశంలో గాని, ప్రత్యేకించి వ్యవసాయ రంగంలోగాని సామాజిక, రాజకీయ సంబంధాలను నిర్ణయించడంలో కుల ప్రయోజనాలు, మత ప్రయోజనాలు కీలకపాత్ర వహిస్తున్నాయని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. కాని అవి ఉత్పత్తి సంబంధాలను, అంటే ఆర్థిక పునాదిని, ఏమేరకు సవరిస్తున్నాయనే విషయం, అవి ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని ఏ మేరకు అడ్డుకుంటున్నాయనే విషయం, పెద్దగా పరిశోధన జరగలేదు. మనం ఉపరితలం అని పిలిచే రాజకీయ, సామాజిక వ్యవస్థలు పెట్టుబడిదారీ సంబంధాలను కూడ సవరిస్తాయి. మెంచర్, సుందరయ్య చూపిన ఉదాహరణలలోగా కులరూపంలో కావచ్చు, దొర తన గరిష్టపరిమితి మిగులు భూమిని తన జీతగాడికే ఇప్పించడం కావచ్చు, లేదా మధ్య దళారీ అజమాయిషీ కావచ్చు, ఇటువంటి ప్రధానంగా పెట్టుబడిదారీ పూర్వ ఉపరితల అంశాలు చేసే మార్పులు పెట్టుబడిదారీ సంబంధాల అభివృద్ధి మీద తీవ్రమైన ప్రభావం వేస్తున్నాయి. భూస్వామ్య వ్యతిరేక ఉద్యమాల వల్ల తలెత్తిన ధనిక రైతాంగం మీద ఈ మార్పులు ఎటువంటి ప్రభావం చూపగలవో అధ్యయనం చేయవలసే ఉంది. ఉదాహరణకు కృష్ణా జిల్లాలో జరిగిన భూస్వామ్య వ్యతిరేక ఉద్యమాలు, సుదీర్ఘ నీటిపారుదల సౌకర్యాల చరిత్రతో కలగలసి, ఒక ధనిక రైతాంగవర్గాన్ని సృష్టించాయి. ఈ ధనిక రైతులు, కుల అంశాన్ని వినియోగించుకునో, మరోరకంగానో కాలక్రమం లో ఒక కొత్త భూస్వామ్య వర్గంగా అభివృద్ధి చెందారా పరిశీలించడం ఆసక్తికరంగా ఉంటుంది. అటువంటి అధ్యయనం జరగవలసిన అవసరం ఉంది. కృష్ణా జిల్లాకు చెందిన ధనిక రైతులు స్వాతంత్ర్యానికి ముందూ తర్వాతా కూడ భూస్వామ్య వ్యవసాయంతో ఎంత ఎక్కువ కాలం, ఎంత సన్నిహితంగా ఉన్నారంటే వాళ్లు ఆ భూస్వామ్య సాంస్కృతిక, రాజకీయ వ్యవస్థల ప్రభావానికి లోనుకాకుండా ఉండడం, అందువల్ల ఆర్థికంగా తిరోగమన మార్గం పట్టకుండా ఉండడం కష్టం.

ఈ సందర్భంలో 'బెంగాల్ లో 1920-1947 మధ్య వలస రాజ్యమూ, రైతాంగ ప్రతిఘటనా' అనే పార్థా ఛటర్జీ వ్యాసం కొంత వెలుగు ప్రసరిస్తుంది. వలస పాలనలోని బెంగాల్ లో భూమికి సంబంధించి చట్టపరమైన చట్రాన్ని మౌలికంగా 1793 శాశ్వత శిస్తు వ్యవస్థ (పర్మనెంట్ సెటిల్మెంట్) నిర్ణయించింది. ఈ పర్మనెంట్ సెటిల్మెంట్ కు మేధోమూలాలు అర్థశాస్త్రంలో ఫిజియోక్రాట్ హేతుబద్ధ పద్ధతి అనబడే ఆలోచనా ధోరణి[8]లో ఉన్నాయి. ఆ ఆలోచనాధోరణి ఇంగ్లిష్ సామంత ప్రభువుల నమూనాలో, అటువంటి వనరులే ఉన్న బెంగాల్ లో కూడ ఒక పెట్టుబడిదారీ భూయజమానుల వర్గాన్ని తయారు చేయవచ్చునని భావించింది. కాని అంతిమంగా, ఆ జమీందారీలు భూస్వామ్య సంస్థలుగా మారిపోయాయి. ఐతే ఆ సమయానికి బ్రిటనే సామ్రాజ్యవాదంగా మారిపోయింది గనుక, వ్యవసాయాన్ని వ్యాపారీకరించడం, దాన్ని అంతర్జాతీయ మార్కెట్ కు అనుసంధానం చేయడం అవసరమయ్యాయి.

వలసవాదపు మిగులు స్వాధీన ప్రక్రియ, రైతు ఉత్పత్తిని ఇంకా విశాలమైన మార్కెట్ ఆర్థిక వ్యవస్థతో సమ్మిళితం చేసింది. కాని వ్యవసాయాన్ని సంపూర్ణమైన పెట్టుబడిదారీ విధానంగా మార్చడం ఆ సమ్మేళనానికి ఇష్టం లేదు. అంతర్జాతీయ ధరల ఊగిసలాటల వల్ల రైతులు తమ భూమి కోల్పోవలసి వచ్చింది, అలా కోల్పోయిన భూమి జోతేదార్ అనే ధనిక రైతుల దగ్గరికి చేరింది. వాళ్లు వడ్డీ వ్యాపారాన్నీ, ధాన్యం వ్యాపారాన్నీ కూడ సాగించేవారు. చాల సందర్భాలలో వాళ్లకు రైస్ మిల్లుల వంటి చిన్నపాటి వ్యవసాయ అనుబంధ పరిశ్రమలు కూడ ఉండేవి. ఈ సమ్మేళన ప్రక్రియ పాత జమీందారీ భూయాజమాన్య నిర్మాణాలను బలహీనం చేసి, గ్రామంలోని ప్రాథమిక స్థాయి మిగులు స్వాధీన సంస్థల ద్వారా మిగులు స్వాధీనం జరిగే పరిస్థితులను రూపొందించాయి, బలోపేతం చేశాయి. తత్ఫలితంగా, పెల్లుబికిన వైరుధ్యాలు

జమీందార్లకూ జోతేదార్ – కులక్ వంటి ప్రాథమిక మిగులు స్వాధీన నిర్మాణాలకూ మధ్య కాదు. కులక్ లు ఒకపక్కనా నిరుపేద రైతులూ, కౌలుదార్లూ మరో పక్కనా ఈ వైరుధ్యాలు పెల్లుబికాయి. ఆ రకంగా నైరుతి బెంగాల్ లో రూపొందిన స్థితిలో, అప్పుడే తలెత్తుతున్న ధనికరైతులు (భవిష్యత్తులో నయా భూస్వాములుగా మారనున్న శక్తులు) గ్రామ స్థాయిలో తమ రాజకీయ అధికారాన్ని సంఘటితం చేసుకునే ప్రయత్నాలు మొదలు పెట్టారు.

ఛటర్జీ మాటల్లో చెప్పాలంటే, 'ఉద్యమ నాయకులుగా ఉన్న ధనిక రైతాంగ శక్తుల నిర్దిష్ట ప్రయోజనం కేవలం పన్నుల గురించి ప్రశ్నించడం మాత్రమే కాదు. అది నేరుగా స్థానిక అధికారానికి సంబంధించిన రాజకీయ ప్రశ్న. రైతాంగంలో విభజన మరింత ఎక్కువగా జరిగిన ఇరవయో శతాబ్ది తొలి సంవత్సరాల గురించి సన్యాల్ కొన్ని అంశాలు చెప్పారు. అవి ధనిక రైతాంగంలో కులక్ పద్ధతి కార్యకలాపాలు హెచ్చుగా జరగడం, మహిస్య కులం పురోగమించడానికి మూలమైన బలమైన సాంస్కృతికోద్యమం సాగడం, ధనిక రైతాంగ నాయకత్వంలో సాగిన ఆ ఉద్యమం కొంటాయి, తుములుక్ ప్రాంతాలలో మొత్తంగా రైతాంగాన్ని ఆకర్షించడం, ఆ ప్రాంతంలోని గ్రామీణ సమాజంపై జోతేదార్ – మహాజన్ వర్గాల సంపూర్ణ ఆధిపత్యాన్ని సాధించడం వంటి పరిణామాలు. 1919లో వారిని ఎదుర్కొన్న రాజకీయ సమస్య జమీందారీ అధికారాన్ని ఎలా ఎదుర్కోవడం అనేది కాదు, గ్రామీణ సమాజ వ్యవహారాలలో వలస రాజ్య జోక్యాన్ని, దురాక్రమణను ప్రతిఘటించడం ఎలా అనేది.'

'వ్యవసాయ వ్యాపారీకరణ, ప్రపంచ మార్కెట్ తో సమ్మేళనం వల్ల తలెత్తి బలపడిన జోతేదార్లు, జమీందారీ వ్యతిరేక, వలస ప్రభుత్వ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న జోతేదార్లు కాలక్రమంలో తామే మరొక భూస్వామ్య శక్తిగా మారారని చూడడం చాల విలువైన విషయం. ఆ జోతేదార్లకు వ్యతిరేకంగా మరొక బలమైన భూస్వామ్య వ్యతిరేక పోరాటం 1960 దశకం చివరిలో జరగవలసి వచ్చింది. జోతేదార్లలో ఉండిన జమీందారీ వ్యతిరేక స్వభావం సహజంగా, తార్కికంగా వారిని భూస్వామ్య వ్యతిరేకతలోకీ, బ్రిటిష్ వ్యతిరేకతలోకీ, మొత్తంగా సామ్రాజ్యవాద వ్యతిరేకతలోకీ పరిణమింప జేయలేదు. కొనసాగుతుండిన సాధారణ ఉపరితలం వల్ల, చిట్టచివరికి జోతేదార్ తనలోకి భూస్వామ్య, వలసవాద స్వభావాలను జీర్ణం చేసుకుని, గ్రామ నాయకత్వాన్ని తనతోనే నిలుపుకున్నాడు.

చారిత్రకంగా చూస్తే, పెట్టుబడి ప్రాతినిధ్యం వహించిన అభివృద్ధికర ఉత్పత్తి సంబంధాలకూ, పాత భూస్వామ్య వ్యవస్థకూ మధ్య వైరుధ్యం మొత్తంగా ఉపరితలంలో విప్లవాత్మక మార్పుకు దారి తీయవలసింది. ఆ మార్పులో పెట్టుబడిదారు కీలకపాత్ర వహించవలసింది. అటువంటి మార్పు జరిగితే పెట్టుబడీ, శ్రమా స్వేచ్ఛగా ప్రవహించడానికి అవకాశం దొరికేది. ఆర్థికేతర అవసరాల దిశగా సాగుతున్న మిగులు ప్రవాహాన్ని అడ్డుకోగలిగేది. అంతేకాదు, అది నూతన ఆవిష్కరణలకు దారితీసే సాంకేతిక మార్పుకు తగిన పరిస్థితులను సృష్టించి ఉండేది. కాని అవేమీ జరగలేదు. సామ్రాజ్యవాద బ్రిటన్ వంటి పెట్టుబడిదారీ ప్రాతినిధ్య రాజ్యం కూడ ఈ దేశాన్ని పాలించడానికి మతం, కులం వంటి పెట్టుబడిదారీ పూర్వ సాధనాలను వాడుకుంది. ఇక భారత వ్యవస్థ లోపలి భూస్వామ్య శక్తులలోని గణనీయమైన భాగం పెట్టుబడిదారీ శక్తులుగా రూపాంతరం చెందింది. ఈ రూపాంతరానికి సంబంధించి ఎన్నో ఆధారాలు పైన ప్రస్తావించిన చర్చలో బయటపడ్డాయి. ఆంధ్రప్రదేశ్ లో పారిశ్రామిక కార్యకలాపాల విజృంభణ గురించి వ్యాఖ్యానిస్తూ సంజయ బారు ఆ పరిశ్రమ మూలాల గురించి, ప్రభావం గురించి అదే మాట అన్నారు: 'గతంలో భూస్వామ్య ప్రభువులు కాకపోయినా, సట్టా వ్యాపారులుగానో, కంట్రాక్టర్లుగానో ఉన్న ఈ పెట్టుబడిదారులకు మార్క్స్ చెప్పినట్టుగా 'పాత ఉత్పత్తి విధానాన్ని కూలదోసే' శక్తి లేదు. గత దశాబ్దంలో జరిగిన పారిశ్రామిక కార్యకలాపాల అభివృద్ధికి వీరే నాయకత్వం వహించడం వల్ల, ఆంధ్రప్రదేశ్ సామాజిక వ్యవస్థలో ఏవైనా గణనీయమైన మార్పులు వస్తాయని ఊహించడానికి అవకాశమే లేదు.'

'అంటే, మొత్తం మీద పెట్టుబడిదారీ విధాన ప్రవేశంతో, పరస్పరం సంఘర్షించి విస్ఫోటనానికి దారి తీయవలసిన పదార్థం, భూస్వామ్య శక్తులను పెట్టుబడిదారీ చట్రంలో కలుపుకుని మిలాఖత్తు అయిన పదార్థంగా మారిపోయింది. దానితో ఉపరితల మార్పులకు అవరోధం ఏర్పడింది. అటువంటి మార్పు జరగనప్పుడు, పెట్టుబడిదారీ విధానంలో ఏ ఆవిష్కర్త ఉంటాడని షుంపీటర్ చెప్పాడో, ఎటువంటి పెట్టుబడిదారీ పోటీ ప్రపంచం ఏర్పడి, కొత్త పెట్టుబడిదారు కొత్త మార్కెట్లను, కొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని, కొత్త సరుకులను సృష్టిస్తూ ఉంటాడని మార్క్సియన్ అవగాహన చెపుతుందో అటువంటి పెట్టుబడిదారు ఉనికిలో లేకుండా పోయాడు. వారి స్థానంలో మనకు ఇంకెక్కడో ఇదివరకే తయారయిన ఏ సరుకునయినా, ఏ సాంకేతిక పరిజ్ఞానాన్నయినా, ఏ మార్కెట్ నయినా తమలోకి తీసుకునే ఔత్సాహిక వ్యాపారవేత్తలు తయారయ్యారు. ఆవిష్కర్తల బదులు మిలాఖత్తుదార్లు తయారయ్యారు.

అటువంటి సందర్భంలో పెట్టుబడిదారీ సంబంధాలు ఎలా మారుతాయనేది, అంతర్జాతీయ పెట్టుబడి ఏమి ఇవ్వజూపుతుందనే దాని మీద ఆధారపడి ఉంటుంది. ఆ ఇచ్చేవారు ఎరువుల దిశలోకి తమ ప్రవాహాన్ని మళ్లిస్తే, భారతదేశంలో ఎరువుల కర్మాగారాలు పెరుగుతాయి. వారు ట్రాక్టర్లు ఇవ్వాలని అనుకుంటే దేశంలో ట్రాక్టర్ల అమ్మకాలు పెరుగుతాయి. ఉత్పత్తి కారకాల లభ్యతను బట్టి గణాంకాలు ఎప్పటికప్పుడు మారిపోతుంటాయి. ఇలా గణాంక ఆధారాలు ఎప్పటికప్పుడు మారిపోతుండడం వల్ల, గణాంక సమస్యలు కూడ చర్చలో మరొక ముఖ్యమైన కోణంగా మారడం ఆశ్చర్యకరం కాదు. అందుకే, ఈ అంశాలపైన విస్తృతంగా రాసిన గెయిల్ ఆమ్ వెడ్ట్, గణాంక ఆధారాలు తగినంతగా లేనందువల్లనే తన తొలి వ్యాసాలలో భారత వ్యవసాయం అర్ధ భూస్వామ్యం అని నిర్ధారించానని అన్నారు.

*(మిగతా వచ్చే సంచికలో)*

*పాదసూచికలు :*

*1. తర్వాత ఆ వ్యాసం ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, 1970 డిసెంబర్ సంచికలో ఇన్ సర్చ్ ఆఫ్ ఎ కాపిటలిస్ట్ ఫార్మర్ పేరుతో అచ్చయింది.*

*2. భారతదేశంలో, వ్యవసాయంలో ఉత్పత్తి విధానం ఏమిటి అనే ఈ చర్చ 1970ల మొదట్లో ఇంగ్లిష్ పత్రికలలో, ముఖ్యంగా ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో విస్తృతంగా జరిగింది. ఈ పత్రం, దాదాపు పదిహేను సంవత్సరాల తర్వాత 1984లో రాసినది.*

*3. ఈ వ్యాసం తెలుగు అనువాదం 'సామాజిక సంబంధాల సరళ నమూనా – ఒక అభిప్రాయం' 'కొత్తచూపు'లో ఉంది.*

*4. ఎస్.జె. పటేల్, ఎస్సేస్ ఆన్ ఎకనమిక్ ట్రాన్సిషన్, 1965.*

*5. జి.ఎన్. రావు – 'కన్‌స్ట్రెయింట్స్ ఆన్ అగ్రికల్చరల్ గ్రోత్ ఇన్ ఎ సబ్ సిస్టెన్స్ ఎకానమీ – ఎ స్టడీ ఆఫ్ గోదావరి డిస్ట్రిక్ట్ 1860–1980'; నట దువ్వూరి – 'ఎవల్యూషన్ ఆఫ్ ది అగ్రేరియన్ స్ట్రక్చర్ ఇన్ గుంటూర్ డిస్ట్రిక్ట్ ఫ్రమ్ ది ప్రి కలోనియల్ పీరియడ్ టు 1940'; ఎం. అచ్చిరెడ్డి – 'కమర్షియలైజేషన్ ఇన్ అగ్రికల్చర్ అండ్ రియల్ వేజెస్ ఇన్ మద్రాస్ ప్రెసిడెన్సీ 1850–1890'.*

*6. జోన్ పి మెంచర్ – ప్రాబ్లమ్స్ ఇన్ అనలైజింగ్ రూరల్ క్లాస్ స్ట్రక్చర్'.*

*7. కె. భరద్వాజ్, పి.కె. దాస్ – 'టెన్యూరియల్ కండిషన్స్ అండ్ మోడ్ ఆఫ్ ఎక్స్‌ప్లాయిటేషన్ ఇన్ సమ్ ఒరిస్సా విలేజెస్'.*

*8. దేశ సంపద భూమి, భూ అభివృద్ధి ద్వారా మాత్రమే వస్తుందని వాదించిన పద్దెనిమిదో శతాబ్దపు అర్థశాస్త్ర ధోరణి.* వీ

ప్రపంచీకరణతో తీవ్రంగా దెబ్బతిన్న గ్రీస్, స్పెయిన్ దేశాలలో ఇటీవల ఉవ్వెత్తున ఎగసిన కార్మిక, ప్రజా పోరాటాలను వివరిస్తున్నారు **ఎ. నర్సింహారెడ్డి**

# గ్రీస్, స్పెయిన్ ప్రజా ఆందోళనలు

పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ ఒక సంక్షోభం నుండి మరో సంక్షోభంలోకి వెళ్లడం గత 150 సంవత్సరాలుగా మనం చూస్తూనే ఉన్నాం. 1930 తర్వాత మళ్లీ 2007లో అమెరికాలో బద్దలైన ద్రవ్య సంక్షోభం ఆర్థిక సంక్షోభంగా మారి ప్రపంచంలోని అన్ని దేశాలకు వ్యాపించింది. సంక్షోభాన్ని అధిగమించడానికి వివిధ దేశాలు చేపట్టిన ద్రవ్య, ఆర్థిక ఉద్దీపన పథకాలేవి దానిని నివారించలేకపోయాయి. దీని పర్యవసానంగా ప్రపంచవ్యాప్తంగా ఉత్పత్తులు తగ్గడం, పరిశ్రమలు మూతపడడం, నిరుద్యోగం పెరగడం, ధరలు పెరగడం, బ్యాంకులు, బీమా సంస్థలు దివాలా తీయడం, ఆస్తుల విలువలు తగ్గడం జరిగింది.

పెట్టుబడిదారీ విధాన ఆర్థిక సంక్షోభం బద్దలైనప్పటి నుండి కార్మిక వర్గం, ఉద్యోగుల, ప్రజల జీవన పరిస్థితులపై దాడి ప్రారంభమైంది. సంక్షోభ భారాన్ని ప్రజలపై మోపడానికి, పోరాటాల ద్వారా సాధించుకున్న కార్మికుల హక్కులను హరించడానికి పాలకులు ఏమాత్రం సంకోచించడం లేదు. సంక్షోభాలకు కారణమైన బహుళ జాతి సంస్థలు, బ్యాంకులు, బీమా సంస్థలు, ద్రవ్య సంస్థలపైన బాధ్యత మోపడానికి ప్రభుత్వాలు నిరాకరిస్తూ ప్రజల గోళ్లు ఊడగొట్టడానికి మాత్రం ఉత్సాహం చూపుతున్నాయి. పైగా ఆర్థిక వ్యవస్థ ఒడ్డున పడాలంటే ప్రజలు త్యాగాలు చేయక తప్పదని పనికి మాలిన బోధలు, సూత్రాలు ఉద్బోధిస్తున్నారు. త్యాగాలు చేసేవారు ఎప్పుడూ ప్రజలే కాగా సంక్షోభాలను రుద్దిన పెట్టుబడిదారీ సంస్థలకు మాత్రం వందల బిలియన్ డాలర్లు బెయిల్-అవుట్‌గా ప్రభుత్వాలు అప్పనంగా అందిస్తున్నాయి. ప్రైవేట్ సంస్థలకిచ్చిన బెయిల్ - అవుట్ భారం కూడా ప్రజల నెత్తినే పడుతోంది. ఆర్థిక సంక్షోభానికి గానీ, రుణసంక్షోభానికి గానీ ప్రజల పాత్ర ఏమీ లేకపోయినా వాటి ఫలితం మాత్రం అంతిమంగా ప్రజలే ఎదుర్కోవలసి రావడం పెట్టుబడిదారీ దోపిడి లక్షణం.

## గ్రీస్

నయా ఉదారవాద ఆర్థిక విధానాల అమలులో భాగంగానే ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థల సూచనల మేరకు అన్ని దేశాల లాగే గ్రీస్, స్పెయిన్ దేశాలు కూడా గత రెండు దశాబ్దాలుగా సంస్కరణలు అమలు చేస్తున్నాయి. అమెరికాలో ఏర్పడిన ఆర్థిక సంక్షోభ ప్రభావం గ్రీస్, స్పెయిన్ దేశాలపై కూడా పడింది. యూరోపియన్ యూనియన్‌లో భాగస్వామి అయినందున 2002లో గ్రీస్ దేశ కరెన్సీ 'దచ్మ'ను రద్దు చేసి యురోపియన్ యూనియన్ కరెన్సీ అయిన 'యూరో'నే తమ కరెన్సీగా మార్చుకుంది. దీంతో గ్రీస్ దేశం యూరోపియన్ యూనియన్ దేశాల నుండి రుణాలు పొందడం సులభమయింది. వివిధ యూరోపియన్ దేశాల బ్యాంకుల నుండి అందినకాడికి రుణాలు తెచ్చుకుంది. తెచ్చిన రుణాలు దేశ అభివృద్ధికి కాక, పెట్టుబడిదారులకు లాభాలనార్జించి పెట్టే విధంగా ఖర్చు చేయడంతో ప్రస్తుత సంక్షోభం ఏర్పడింది. అంతేగాక అప్పులు తెచ్చే సందర్భంలో ఆయా బ్యాంకులు, ఐఎంఎఫ్ విధించిన షరతులు అమలు చేయడం వలన నేడు అప్పులపై వడ్డీలను కూడా చెల్లించలేని స్థితిలోకి గ్రీస్ వెళ్లింది.

భౌగోళికంగాను, జనాభాపరంగా చూస్తే గ్రీస్ చాలా చిన్నదేశం. దాని జనాభా ఒక కోటి పదమూడు లక్షలు అయినా అప్పు మాత్రం 340 బిలియన్ యూరోలకు పైగా ఉంది. ఆ దేశ బడ్జెట్ లోటు 2009లో జిడిపిలో 13 శాతం. అమెరికాలోవలె గ్రీస్‌లో కూడా గృహ నిర్మాణం, స్థలాల ధరల పెరుగుదల వలన ఏర్పడిన బుడగ పేలిపోవడం వలననే సంక్షోభం ఏర్పడింది. వందల కోట్ల లాభాలు ఆర్జించిన పెట్టుబడిదారులు క్షేమంగానే ఉన్నారు. కానీ మధ్యతరగతి, సాధారణ ప్రజలు తీసుకున్న వ్యక్తిగత గృహ నిర్మాణ రుణాలు సకాలంలో చెల్లించలేక పోవడంతో ఈ సంక్షోభం ఏర్పడింది. గ్రీస్‌లో పెట్టుబడులు పెట్టిన వివిధ దేశాల యూరోపియన్ బ్యాంకులు కూడా దివాళాకు చేరువలో ఉన్నాయి. స్టాక్ మార్కెట్లు పతనమయ్యాయి. గ్రీస్‌ను ఈ సంక్షోభం నుండి బయట పడవేయడానికి 2009 లోనే యూరోపియన్ యూనియన్ ప్రయత్నాలు ప్రారంభించింది. రానున్న మూడు సంవత్సరాలలో ఐఎంఎఫ్, జర్మనీ, యూకె వంటి దేశాల సహకారంతో 110 బిలియన్ యూరోల రుణ సహాయం అందిస్తామని 2009 చివరలో యూరోపియన్ యూనియన్ ప్రకటించింది. ఈ రుణాన్ని ఇవ్వడానికి అనేక షరతులు పెట్టింది. ప్రస్తుతం 13 శాతంగా ఉన్న బడ్జెట్‌లోటుకు 2010లో 9 శాతానికి, 2011 నాటికి 4 శాతానికి, 2012 నాటికి యూరోపియన్ యూనియన్ నిర్దేశించుకున్న ప్రమాణం మేరకు 3 శాతానికి బడ్జెట్‌లోటును తగ్గించుకోవాలి. బడ్జెట్‌లోటును తగ్గించుకోవడమంటే పాలన వ్యయాన్ని తగ్గించుకోవడం, ప్రజాహిత సంక్షేమ కార్యక్రమాలకు చేసే వ్యయాన్ని తగ్గించుకోవడమే. గ్రీస్ ప్రధాని జార్జి పపాండ్రో ఈ షరతులను అంగీకరించాడు. గత ఏడాది ఈ రుణంలో తొలి కిస్తీని స్వీకరించింది. ఇందులో భాగంగా 11 వేల కోట్ల డాలర్ల రుణం గ్రీస్ ఆర్థిక వ్యవస్థను పతనం నుండి కాపాడేందుకు దోహదం చేస్తుందని నమ్మబలికింది. కానీ, ఆచరణలో జరిగింది వేరు. ప్రజలను ప్రభుత్వం పూర్తిగా వంచించింది.

బెయిల్ - అవుట్ ప్యాకేజీ ద్వారా వచ్చిన ధనాన్ని సంక్షోభంలో ఉన్న బ్యాంకులు, ఆర్థిక సంస్థలు తిరిగి కోలుకోవడానికి మాత్రమే వినియోగించారు. బెయిల్ - అవుట్ ప్యాకేజీ ద్వారా వచ్చిన ధనాన్ని

నిరుద్యోగులకు ఉపాధి కల్పించడానికిగానీ, ప్రజల కొనుగోలు శక్తిని పెంపొందించడానికిగానీ, తద్వారా ఆర్థికాభివృద్ధి సాధించడానికి గానీ వినియోగించలేదు. ప్రజాహితం కొరకు, అభివృద్ధి కొరకు ధనాన్ని వినియోగించడానికి ఐఎంఎఫ్, యురోపియన్ బ్యాంకులు రుణాలను మంజూరు చేయవుకదా. అందువలన బెయిల్-అవుట్‌ల ద్వారా సాధారణ ప్రజలకు జరిగే మేలు ఏమీలేదు. గ్రీస్ స్వతంత్ర ప్రతిపత్తిని ఎంతగానో గౌరవించి సంరక్షించుకునే అత్యధిక ప్రజానీకం విదేశీ సంస్థల ప్రమేయంతో, గ్రీస్ సార్వభౌమాధిపత్యానికి భంగం కల్గించే విధంగా అమలవుతున్న ఈ పొదుపు చర్యలను, ప్రభుత్వరంగ సంస్థల ప్రైవేటీకరణను గట్టిగా వ్యతిరేకిస్తున్నారు.

గ్రీస్ ప్రధాని జార్జి పపాండ్రో బడ్జెట్ లోటును తగ్గించుకోవడానికి అనేక పొదుపు చర్యలను 2010లోనే ప్రకటించాడు. ఈ పొదుపు చర్యలలో ముఖ్యమైనవి ఉద్యోగుల వేతనాల్లో కోత, పెన్షన్‌లో పదిశాతం కోత, బోనసు రద్దు, అనేక భత్యాలలో కోత, పదవి విరమణ వయస్సు 60 సంవత్సరాల నుండి 65కు పెంపు, ఉద్యోగి మరణిస్తే అవివాహిత కూతుర్లకు ఇచ్చే పెన్షన్‌ను 18 సంవత్సరాలకు పరిమితం చేశారు. దీంతో 40 వేల మంది మహిళలు పెన్షన్‌ను కోల్పోయారు. వాణిజ్య పన్నులు, ఇంధన ధరలను విపరీతంగా పెంచారు. నిత్యావసర ధరలు పెరిగాయి. గ్రీస్‌లో ద్రవ్యోల్బణం 14 శాతానికి పైగా ఉంది. నిరుద్యోగం 21 శాతానికి పైగా ఉంది. ఒకవైపు నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదల మరోవైపు వేతనాల కుదింపు దేశాన్ని అతలాకుతలం చేశాయి.

ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్ నిర్దేశిత పొదుపు చర్యలను అమలు చేస్తున్న గ్రీస్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా గత రెండు సంవత్సరాలుగా వివిధ రంగాలకు చెందిన కార్మికులు, ఉద్యోగులు, యువకులు, మహిళలు నిరంతరాయంగా ఆందోళనలను కొనసాగిస్తున్నారు. పెన్షన్, వేతనాల్లో కోతతో ప్రజల ఆదాయం గణనీయంగా పడిపోయింది. నిరుద్యోగం రోజు రోజుకు పెరిగిపోతోంది. సాధారణ ప్రజల జీవితాలు ఛిద్రమవుతున్నాయి. ఆర్థిక మాంద్యం, లే-ఆఫ్‌ల నేపథ్యంలో ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్, యూరోపియన్ యూనియన్ కేంద్ర బ్యాంకుల నుండి పొందిన నూతన ప్యాకేజీలను కాపాడు కోవడానికి పొదుపు చర్యలు అనివార్యమని ప్రభుత్వం చెబుతోంది. ప్రజలు మాత్రం ప్రభుత్వ విధానాల పట్ల తీవ్ర ఆగ్రహాన్ని వ్యక్తం చేస్తున్నారు. ప్రజా ఆందోళనలతో గ్రీస్ అట్టుడుకుతోంది.

ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలకు, పొదుపు చర్యలకు వ్యతిరేకంగా ప్రభుత్వ ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు, డాక్టర్లు, విమానయాన సిబ్బంది, యువకులు, మహిళలు 2010 ఫిబ్రవరి, మార్చి, మే నెలలో జరిగిన సమ్మెలలోను, ప్రదర్శనలోను వేలాది సంఖ్యలో పాల్గొన్నారు. మే 20న జరిగిన ప్రదర్శనలో ఏథెన్స్‌లోని పార్లమెంటు భవనాన్ని చుట్టు ముట్టారు. గ్రీస్ రాజధాని దద్దరిల్లేలా నినాదాలు హోరెత్తాయి. యూరోపియన్ యూనియన్ నుండి గ్రీస్ బయటకు రావాలని, యూరో బదులుగా గ్రీస్ పాత కరెన్సీ 'దచ్మ'నే తిరిగి పునరుద్ధరించాలని, ఐఎంఎఫ్, ఇతర ద్రవ్యసంస్థల షరతులు అంగీకరించవద్దని, పెన్షన్ వేతనాలపై విధించిన పదిశాతం కోత ఎత్తివేయాలని, యూరోపియన్ యూనియన్ సభ్య దేశాలు ఇచ్చే రుణాలు తీసుకోవద్దని వాటికి లొంగవద్దని పెద్దపెట్టున నినాదాలు చేశారు.

గత ప్రభుత్వం అనవసరంగా చేసిన ఆడంబరాలు, రుణాలు ముఖ్యంగా 2004 ఒలంపిక్ క్రీడల నిర్వహణ వంటి విలాసవంతమైన ఖర్చుల కారణంగా దేశంలో ఈస్థితి ఏర్పడిందని గ్రీస్ ప్రధాని జార్జి పపాండ్రో పేర్కొంటున్నారు. సంక్షోభంలో ఉన్న ఆర్థిక వ్యవస్థను గాడిలో పెట్టాలంటే పొదుపు చర్యలు తప్పవని, ప్రజలు కొంతకాలం త్యాగాలు చేయాలని ప్రధాని బుకాయిస్తున్నారు. నిజానికి ప్రభుత్వం తీసు కుంటున్న పొదుపు చర్యలు ప్రజల కొనుగోలుశక్తిని మరింత కుదించే విధంగా, ఆర్థిక వ్యవస్థను మరింతగా దిగజార్చే విధంగా ఉన్నాయి.

2010 నవంబర్ 25న ప్రభుత్వం చేపట్టిన పొదుపు చర్యలకు వ్యతిరేకంగా వేలాది మంది కార్మికులు, ఉద్యోగులు, యువకులు, మహిళలు గ్రీస్ రాజధాని సెంట్రల్ ఏథెన్స్ వీధులగుండా భారీ ప్రదర్శన నిర్వహించారు. 'లే ఆఫ్‌లు వద్దు - రుణాలు రద్దు చేయాలి' అనే నినాదాలతో కూడిన బ్యానర్లు ప్రదర్శించారు. అదే రోజున పదవి విరమణ చేసిన 250 మంది సైనికాధికారులు పెన్షన్ కోతను, ఆరోగ్య రక్షణ సంస్కరణలను వ్యతిరేకిస్తూ రక్షణ మంత్రిత్వ శాఖ కార్యాలయం వద్ద ధర్నా నిర్వహించారు.

2010 డిసెంబర్ 3న గ్రీస్ ప్రధాని జార్జి పపాండ్రో ఐఎంఎఫ్‌తో కుదుర్చుకున్న ఒక సరికొత్త సంస్కరణల ఒప్పందాన్ని పార్లమెంటు ఆమోదించింది. దీని ఫలితంగా మరింతగా జీతాల్లో, వేతనాల్లో కోత, ప్రభుత్వ రంగ సంస్థలలో నిర్బంధ బదిలీలను ఈ నూతన సంస్కరణల్లో పొందుపరిచారు. ట్రేడ్ యూనియన్లు ఇక మీదట ప్రైవేట్ రంగ సంస్థల యాజమాన్యంతో బేరసారాలాడే విధానాన్ని రద్దు చేసింది.

2010 డిసెంబర్ 8న గ్రీస్ రాజధాని ఏథెన్స్‌లో అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ స్ట్రాస్‌కాన్ గ్రీస్ పర్యటనను నిరసిస్తూ ఒక పెద్ద నిరసన ప్రదర్శన కార్యక్రమాన్ని నిర్వహించారు. గ్రీస్ దేశానికి రుణ సహాయం పేరుతో ఐఎంఎఫ్ షరతులు విధించడాన్ని నిరసిస్తూ వేలాది మంది కార్మికులు, ఉద్యోగులు, యువకులు, మహిళలు ఈ నిరసన ప్రదర్శనలో పాల్గొన్నారు. ఏథెన్స్ నగరంలోని కాన్‌స్టిట్యూషన్ స్క్వేర్‌లో అతిపెద్ద బ్యానర్ను ప్రదర్శించారు. దానిపై 'యూరప్ ప్రజలారా, మేల్కొనండి!' అని రాశారు. మరొక బ్యానర్‌పై 'స్ట్రాస్‌కాన్‌కు గ్రీస్‌లో ప్రవేశం లేదు. ట్రియాకా ప్రజావ్యతిరేక విధానాలను ప్రతిఘటించండి' అని రాసి బహిరంగ వేదికపై ఉంచారు. గ్రీస్ కమ్యూనిస్టు పార్టీతో కలిసి అన్ని ట్రేడ్ యూనియన్లు, ఇతర ప్రజా సంఘాలు ఈ ప్రదర్శన, ధర్నాను నిర్వహించాయి. గ్రీస్ దేశవ్యాప్తంగా డిసెంబర్ 15న ఏడవ సారిగా ప్రభుత్వ పొదుపు చర్యలను నిరసిస్తూ సార్వత్రిక సమ్మె నిర్వహించారు. ఈ సమ్మెతో గ్రీస్ దేశమంతటా జనజీవనం స్తంభించిపోయింది.

2011 ఫిబ్రవరి 1న ఏథెన్స్ నగరంలోని రవాణా కార్మికులు పథకం ప్రకారం అమలు చేస్తున్న ప్రభుత్వరంగ సంస్కరణలను, ప్రభుత్వ రంగంలోని రవాణా కంపెనీలను పునర్వ్యవస్థీకరించాలనే ప్రతిపాదనలను నిరసిస్తూ సమ్మె చేశారు. బస్సు, లారీ, ట్రక్కు కార్మికులు, విద్యుత్, రైల్వే విభాగ కార్మికులు ఈ సమ్మెలో పాల్గొనడం ద్వారా ప్రజా రవాణా వ్యవస్థ స్తంభించింది. 2011 ఫిబ్రవరి 15న ప్రభుత్వ ఆధ్వర్యంలో నిర్వహించే రవాణా సంస్థలను ప్రైవేటీకరించే బిల్లును పార్లమెంటులో ప్రవేశపెట్టనున్నందుకు నిరసనగా రవాణా రంగ కార్మికులు ఈ సమ్మె నిర్వహించారు. దీనికి ప్రజల నుండి పూర్తి మద్దతు లభించింది. 2011 ఫిబ్రవరి 2న ఆసుపత్రి వైద్యులు, నర్సులు, పారామెడికల్ సిబ్బంది ఆరోగ్య మంత్రిత్వ శాఖ కార్యాలయం వద్ద పెద్ద సంఖ్యలో బైఠాయించి వైద్యరంగం లో ప్రభుత్వం విధించే పొదుపు చర్యలను తీవ్రంగా నిరసించారు. 2011

ఫిబ్రవరి 4 నుండి 7 వరకు గ్రీస్ దేశంలోని అతిపెద్ద సామాజిక సంస్థ ఐకెయులోని ఏడు వేల మంది డాక్టర్లు నాలుగు రోజులు సమ్మె చేశారు. జాతీయ ఆరోగ్యవ్యవస్థను అస్తవ్యస్తం చేయడాన్ని వారు తీవ్రంగా వ్యతిరేకించారు.

ఫిబ్రవరి 27న దేశవ్యాప్తంగా 72 పట్టణాల్లో, నగరాల్లో సాధారణ సమ్మె నిర్వహించారు. ఈ సమ్మెలో దాదాపు అన్ని పరిశ్రమల, వ్యాపార, వాణిజ్య సముదాయాల, ఆసుపత్రుల, నౌకాశ్రయాల కార్మికులు, ఇతర సేవ సంస్థల సిబ్బంది పాల్గొన్నారు. యువకులు, మహిళలు పాల్గొన్న ఈ సమ్మె సందర్భంగా పోలీసులు పలు చోట్ల ఆందోళనకారులపై బాష్పవాయువును ప్రయోగించారు. ఏప్రిల్ 7 నుంచి 10 వరకు జర్నలిస్టులు నాలుగు రోజులు సమ్మె చేశారు. ప్రభుత్వం అమలు చేస్తున్న పొదుపు చర్యలను విరమించు కోవాలని డిమాండ్ చేస్తూ వీరు జాతీయ పార్లమెంటుకు నిరసన ప్రదర్శన నిర్వహించారు. మే 11న అన్ని రంగాలకు చెందిన కార్మికులు, ఉద్యోగులు పొదుపు చర్యలను నిరసిస్తూ పేద ప్రజలపై సాగిస్తున్న దాడులను విరమించుకోవాలని డిమాండ్ చేస్తూ జర్నలిస్టులకు సంఘీభావంగా ఒకరోజు సాధారణ సమ్మె చేశారు.

గ్రీస్‌లో ప్రస్తుతం ప్రధానిగా ఉన్న జార్జి పపాండ్రో సోషలిస్టు పార్టీకి చెందినవాడు. పేరుకు సోషలిస్టు పార్టీ అయినా ప్రజలపై అపరిమితమైన భారాలు మోపి కార్పొరేట్లను కాపాడడంలో మాత్రం వెనుకాడడం లేదు. ప్రతిపక్ష పార్టీ అయిన కన్జర్వేటివ్ ఈ సంస్కరణలకు పూర్తిగా మద్దతు అందిస్తుందని ఆ పార్టీ నేత ప్రకటించాడు. అతివాద, మితవాద పార్టీలు రెండూ ఏకం కావడానికి సిద్ధమయ్యాయి. కొద్ది కాలంలో రానున్న ఎన్నికలు, తీవ్రమవుతున్న ప్రజా ఉద్యమాలు చూసి కన్జర్వేటివ్ పార్టీ కొంత వెనుకడుగు వేసింది. అయినా సంపన్నులపై పన్నులు విధించడాన్ని తీవ్రంగా కన్జర్వేటివ్ పార్టీ వ్యతిరేకించింది. సంపన్నులపై పన్నులు విధిస్తే పెట్టుబడుల రాక తగ్గి అభివృద్ధి కుంటుపడుతుందని కుంటి సాకు చెప్పింది.

2011 జూన్‌లో గ్రీస్ ప్రధాని పపాండ్రో రెండవ విడత ప్రవేశపెట్టిన పొదుపు చర్యలు మరింత దారుణంగా ఉన్నాయి. వీటిలో పూర్తిస్థాయిలో పెన్షన్ పొందడానికి చందా చెల్లించాల్సిన కాలాన్ని 37 నుండి 40 సంవత్సరాలకు పెంచారు. ప్రభుత్వ రంగ సంస్థలలో పని చేసే కార్మికుల వేతనంలో 12 శాతం కోత విధించారు. పదవి విరమణ చేసిన ప్రతి ఐదు మంది ఉద్యోగుల స్థానంలో ఒక్క స్థానాన్ని తిరిగి భర్తీ చేయాలని గత ఏడాది పొదుపు చర్యల్లో చెప్పగా, తాజా పొదుపు చర్యల్లో దాన్ని పది మంది పదవి విరమణ చేస్తే ఒక్కరిని మాత్రమే భర్తీ చేస్తామని చెప్పారు. ప్రభుత్వ రంగ సంస్థలు ప్రైవేట్ రంగ సంస్థలతో విలీనమైనప్పుడు మిగులు ఉద్యోగులను తొలగిస్తున్నారు. 2015 నాటికి 50 బిలియన్ యూరోలను ప్రభుత్వం ఆర్జించే విధంగా ప్రభుత్వరంగ సంస్థలను భారీగా ప్రైవేటీకరించ నున్నారు. ప్రత్యేకించి రవాణా, తపాలా, విద్యుత్, వైద్య రంగాలను లక్ష్యంగా ఎన్నుకున్నారు. ఈ ప్రైవేటీకరణ ఫలితంగా రానున్న కాలంలో వేల సంఖ్యలో ఉద్యోగాలు కోల్పోనున్నారు. గ్రీస్ పార్లమెంటు తాజాగా ఆమోదించిన షరతులు చాలా దారుణంగా ఉన్నాయి. ఈ షరతుల ప్రకారం నూతనంగా నియామకమయ్యే ఉద్యోగులకు వేతనాల్లో 20 శాతం కోత విధిస్తున్నారు. పన్ను పరిధిలోకి వచ్చే ఆదాయ పరిమితిని 12 వేల యూరోల నుండి 8 వేల యూరోలకు తగ్గించారు. ప్రతి కార్మికుని నుండి, ఉద్యోగి నుండి వేతనంలో 5 శాతాన్ని 'సంఘీభావ' లేవీగా వసూలు చేస్తున్నారు. స్వయం ఉపాధి పొందేవారు కూడా 450 యూరోలు పన్ను చెల్లించాల్సి ఉంటుంది. సామాజిక సేవలపై భారీగా కోత విధించారు. నిరుద్యోగ భృతి, వృద్ధాప్య పెన్షన్, గృహ వసతి పొందేందుకు షరతులను కఠినతరం చేశారు. పరోక్ష పన్నులు 13 శాతం నుండి 18 శాతానికి పెరిగాయి. దైనందిన వినియోగ సరుకులపైన వ్యాట్‌ను 19 నుండి 22 శాతానికి పెంచారు. అల్కహాల్ పై 20 శాతం, పొగాకుపై 63 శాతం పన్ను పెంచారు. ఇంధన, విద్యుత్ చార్జీలు మరింత పెంచుతున్నారు.

గ్రీస్ ప్రభుత్వ ప్రతిష్ట పతనమైంది మంత్రివర్గ మార్పులు చేసి ప్రధాని పార్లమెంట్ విశ్వాసాన్ని పొందడానికి జూన్ 15న పార్లమెంటు సమావేశం ఏర్పాటు చేశారు. స్వల్ప మెజారిటీతో జూన్ 22న విశ్వాస తీర్మానం నెగ్గింది. పార్లమెంటు ప్రారంభమైన రోజు వేలాది మంది కార్మికులు పార్లమెంటును ముట్టడించారు. సభ్యులను పార్లమెంటులోనికి వెళ్లకుండా అడ్డుకునే ప్రయత్నం చేశారు. ఆందోళనకారులు ఆర్థిక మంత్రిపైన గ్యాసోలిన్ బాంబులు విసిరారు. ప్రతిగా పోలీసులు టియర్ గ్యాసు వదిలారు. ఈ ఆందోళనను పిఎఎంఇ నిర్వహించింది. గత రెండు సంవత్సరాలలో 17 సార్లు సార్వత్రిక సమ్మె నిర్వహించారు. ప్రధాని పపాండ్రో మరిన్ని పొదుపు చర్యలను జూన్ 29న పార్లమెంటు చేత ఆమోదింపచేసుకున్నాడు. ఇది ప్రజలను మరింత ఆగ్రహోద్రులను చేసింది. నిరసనగా జూన్ 28, 29 తేదీలలో 48 గంటలు సార్వత్రిక సమ్మె చేశారు. 'ప్రజలు పోరాట యోధులు, వారు ఎన్నడూ లొంగిపోరు, ఎదురుదాడి చేస్తారు' అని గ్రీక్, ఆంగ్ల భాషల్లో రాసిన పెద్ద బ్యానర్‌ను చారిత్రాత్మక ఆక్రోపొలిస్ వద్ద ప్రదర్శించారు. ఈ ఉద్యమాల్లో ఎడిఇడివై (ప్రభుత్వరంగ ఉద్యోగుల సంఘం), జిఎస్ఇఇ (ప్రైవేట్‌రంగ ఉద్యోగుల సంఘం), పిఎస్ఇవిఇ (వ్యాపార వేత్తల సంఘం), ఎంఎఎస్ (విద్యార్థుల సంఘం), ఒజిఇ (మహిళల సమాఖ్య), పిఎఎస్‌వై (రైతుల సంఘం) చురుకుగా పాల్గొంటున్నాయి.

## స్పెయిన్

నయా ఉదారవాద ఆర్థిక విధానాలను అమలు చేయకముందు స్పెయిన్ ఒక పర్యాటక కేంద్రంగా, దృఢమైన ఆర్థిక వ్యవస్థను కలిగి ఉండేది. 2008 వరకు స్పెయిన్ ఆర్థిక వ్యవస్థ ప్రపంచ దేశాలలో 12వ స్థానంలో, యూరోపియన్ సమాఖ్య దేశాలలో ఐదవ స్థానంలో ఉండేది. అభివృద్ధి చెందిన దేశాలలో 12వ స్థానంలో కొనసాగింది. గృహ నిర్మాణం ద్వారా జిడిపిలో 16 శాతం ఆదాయం, 12 శాతం ఉపాధి కల్పించింది. అయితే 2009 నాటికి 28 శాతం గృహాలు అమ్ముడుపోలేదు. కొనుక్కున్న వాళ్లు కిస్తీలు చెల్లించడం లేదు. యూరోపియన్ కమిషన్ స్పెయిన్ ఆర్థిక వ్యవస్థ 2008 చివరి నాటికి పతనమవుతుందని ముందుగానే హెచ్చరించినట్లే 2009లో సంక్షోభంలో కూరుకుంది.

అమెరికాలో 2008లో ఆర్థిక సంక్షోభం ఏర్పడినప్పుడు స్పెయిన్ ఆర్థిక వ్యవస్థ నిలకడగానే ఉన్నట్లు కనిపించింది. ఆర్థికాభివృద్ధి 4 శాతం ఉంది. మితిమీరిన వినియోగం, రియల్ ఎస్టేట్ వ్యాపారం ఆకాశాన్ని అంటింది. ఇది భ్రమగానే మిగిలింది. ప్రభుత్వంలో అవినీతి పెచ్చరిల్లింది. 2008 చివరి నాటికి స్పెయిన్ ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయింది. ధనిక - పేదల మధ్య అంతరాలు పెరిగాయి. జనవరి 2010 చివరి నాటికి నిరుద్యోగం 21 శాతం చేరుకుంది.

స్పెయిన్ జనాభా దాదాపు 5 కోట్లు. 20 శాతం ప్రజలు పేదరికంలోకి నెట్టబడ్డారు. మార్చి 2011 నాటికి స్పెయిన్ ఆర్థికాభివృద్ధి 0.4 శాతానికి పడిపోయింది. సామాజిక సంక్షేమ కార్యక్రమాలకు ప్రభుత్వం కోత విధించింది.

స్పెయిన్ ప్రభుత్వం తీసుకుంటున్న పొదుపు చర్యలను, ప్రైవేటీకరణను వ్యతిరేకిస్తూ స్పెయిన్ విమానయాన సిబ్బంది 2010 డిశంబర్ 3న సామూహికంగా సమ్మె చేశారు. 2010 డిసెంబర్ 18న వేలాది మంది కార్మికులు పదవీ విరమణ వయస్సును 65 నుండి 75 సంవత్సరాలకు పెంచడాన్ని నిరసిస్తూ దేశవ్యాప్త ప్రదర్శనలు నిర్వహించారు. కార్మిక వ్యతిరేక విధానాలను నిరసిస్తూ 120 మిల్స్, ప్లాంట్లకు చెందిన 17500 మంది కార్మికులు 2011 మార్చి 3న ఒకరోజు సమ్మె నిర్వహించారు. ప్రభుత్వ పొదుపు చర్యలకు వ్యతిరేకంగా, యూరోపియన్ యూనియన్ 'యూరో' ను స్థిరీకరించే చర్యలను నిరసిస్తూ 2011 మే 15న 1 లక్ష 25 వేల మంది నిరసనకారులు స్పెయిన్ రాజధాని మాడ్రిడ్‌లో ప్రదర్శన చేశారు. జూన్ 19న రెండు లక్షల యాబది వేల మంది నిరసనకారులు రెండవసారి మాడ్రిడ్‌లో ప్రదర్శనలు నిర్వహించారు.

2009 జూలైలో 12 లక్షల మందిని ఉద్యోగాల నుంచి స్పెయిన్ ప్రభుత్వం తొలగించింది. అప్పటికే నిరుద్యోగం 17.4 శాతానికి చేరుకుంది. చరిత్రలో ప్రప్రథమంగా స్పెయిన్ దేశం 40 లక్షల మంది నిరుద్యోగులను కలిగి ఉంది. జనవరి 2010లో ప్రకటించిన పొదుపు చర్యలను ధృవపరుస్తూ 2010 మే 23న ప్రభుత్వం మరిన్ని పొదుపు చర్యలు ప్రకటించింది. పార్లమెంటును కాదని రాయల్ డిక్రీ ద్వారా స్పెయిన్ ప్రభుత్వం పొదుపు చర్యలు ప్రకటించడాన్ని నిరసిస్తూ ఉద్యమకారులు న్యాయస్థానాన్ని కూడా ఆశ్రయించారు. ప్రభుత్వ ఉద్యోగుల వేతనాల్లో కోత విధించడాన్ని నిరసిస్తూ 2011 జూన్ 8న ప్రభుత్వరంగ సంస్థల ఉద్యోగులు, కార్మికులు ఒక రోజు ధర్నా చేశారు. ధరల పెరుగుదలకు, నిరుద్యోగానికి, వేతనాలలో కోతను నిరసిస్తూ ప్రదర్శనలు చేపట్టారు. ప్రైవేటీకరణకు, వేతనాల కోతకు, ఉద్యోగుల తొలగింపుకు, ధరల పెరుగుదలకు నిరసనగా పలుమార్లు సమ్మెలకు, వీధి పోరాటాలకు సైతం పూనుకుంటున్నారు. ఈ హింసాకాండలో అనేకమంది ప్రాణాలు సైతం కోల్పోతున్నారు. ప్రజలు ఇంతగా తెగించి ముందుకు రావడానికి ఆయా దేశాలు ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయి, ఆ భారాన్ని కార్మికులు, ఉద్యోగులు, ఇతర సామాన్య ప్రజానీకంపై మోపడానికి పూనుకోవడమే అసలు కారణం.

రాజకీయపార్టీలకు అతీతంగా, ట్రేడ్ యూనియన్లతో సంబంధం లేకుండా స్పెయిన్ ప్రజలు ఒక ఉద్యమ వేదికను ఏర్పాటు చేసుకొని ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నారు. ఉద్యమకారుల్లో అతివాద, మితవాద అనే తేడా లేకుండా ప్రజలకు ఉపయోగపడే విధానాలు ప్రభుత్వం రూపొందించి అమలు చేయాలని ఈ ఉద్యమ వేదిక డిమాండ్ చేస్తుంది. పని గంటలు ముగిసిన తర్వాత సాయంకాలం 6 గంటల నుండి నిరసనకారులు ఖజానా మంత్రి కార్యాలయం వద్ద, అన్ని పట్టణాలలోని ప్రభుత్వ కార్యాలయాల వద్ద వినూత్న పద్ధతిలో ఆందోళనలు చేపడుతున్నారు. ఈ సందర్భంలో 14 మంది ఉద్యమ నాయకులను ప్రభుత్వం అరెస్టు చేసి అక్రమ కేసులు పెట్టింది. నాయకులపై పెట్టిన కేసులు ఉపసంహరించుకొని వారిని విడుదల చేసే వరకు ఉద్యమకారులు మాడ్రిడ్ సెంట్రల్ స్క్వేరు వదిలి వెళ్లలేదు. అతి స్వల్ప వ్యవధిలోనే మాడ్రిడ్, బార్సిలోనా, సెవిల్లా, వాలెన్సియా లాంటి అనేక పట్టణాలు నిరసనకారులతో కిక్కిరిసి పోయాయి. ఉద్యమకారులు విరివిగా ప్రజాకోర్టులు నిర్వహించి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకుంటున్నారు: ఏ రాజకీయ పార్టీ తమ సమస్యలను పట్టించుకోవడం లేదని 70 శాతం అభిప్రాయపడ్డారు. ప్రభుత్వ విధానాల పట్ల తమ ఆగ్రహం సరైనదనే అభిప్రాయం 81 శాతం తెలిపారు. అశేష ప్రజానీకం ఎదుర్కొంటున్న సమస్యలపైన ఉద్యమం సాగుతోందన్న అభిప్రాయాన్ని 84 శాతం తెలిపారు.

స్పెయిన్ ఉద్యమకారులు రూపొందించిన డిమాండ్లు : 1) ఏకాభిప్రాయంతో నూతన కార్మిక సంబంధాలను రూపొందించాలి. 2) పెంచిన పదవి విరమణ వయోపరిమితిని తగ్గించాలి. పనిగంటలు తగ్గించాలి. 3) కనీస వేతనాన్ని పెంచి అన్ని రంగాలకు వర్తింప జేయాలి. 4) ఆస్తులు కోల్పోయిన కుటుంబాలకు ప్రభుత్వం సహాయం అందించాలి. 5) ఖాళీగా ఉన్న ప్రభుత్వ గృహాలను సబ్సిడీపై కార్మికులకు ఇవ్వాలి. 6) ప్రభుత్వ - ప్రైవేట్ పరిశ్రమలు విలీనమైనపుడు కార్మికులను తొలగించవద్దు. 7) బహుళజాతి సంస్థలు పన్ను ఎగవేయకుండా చర్యలు తీసుకోవాలి. దగా చేసిన సంస్థలపై విచారణ జరుపాలి. 8) భవిష్యత్ బెయిల్-అవుట్ ప్యాకేజీలపై ప్రజా ఆమోదం పొందడానికి జనాభిప్రాయం సేకరించాలి. 9) ప్రభుత్వ-ప్రైవేట్ బ్యాంకులపై సామాజిక నిఘా పెంచాలి. 10) పన్ను ఎగవేతదారుల రక్షణ స్థావరాలను రద్దు చేయాలి. 11) విదేశీ రుణాలపై తాత్కాలిక నిషేదం విధించాలి. 12) ప్రభుత్వ ద్రవ్య వ్యవస్థను బలోపేతం చేయాలి. సేవింగ్ బ్యాంక్స్ ప్రైవేటైజేషన్‌ను స్తంభింపజేయాలి.

'ఆర్థికాభివృద్ధి కాదు - మానవాభివృద్ధి కావాలి', 'ఉపాధి కల్పించని పెరుగుదల కాదు - ఉపాధి కల్పించే పెరుగుదల కావాలి', 'తారతమ్యాలు పెంచే పెరుగుదల కాదు - అభివృద్ధి ఫలాలను అందరికి పంచే పెరుగుదల కావాలి' అనే చర్చ ఈ మధ్య కాలంలో ప్రపంచ వ్యాప్తంగా విస్తృతంగా సాగుతోంది. ప్రపంచంలోని చాలా దేశాల్లో ప్రపంచీకరణ విధానాలకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాలు సాగుతున్నాయి. ఇటీవలనే అంతర్జాతీయ కార్మిక సంస్థ - ఐఎల్ఓ 'ప్రపంచ ఉపాధి దోరణులు - 2011' అనే పేరిట ఒక అధ్యయన నివేదికను విడుదల చేసింది. ప్రపంచ ఆర్థిక రికవరీ ఉపాధిని కల్పించడం లేదని, కల్పించిన మేరకు కూడా పని భద్రతలేదని, ఏ హక్కులు లేని ఉద్యోగాలు మాత్రమే కల్పించబడుతున్నాయని, కార్మికుల వేతనాలు అత్యంత దారుణంగా వారిని దారిద్ర్యంలో మగ్గేట్లు చేసే విధంగా ఉన్నాయని పేర్కొంది. ఈ విధానం ఆర్థిక సంక్షోభం నుండి గట్టెక్కించక పోగా మరింత తీవ్ర సంక్షోభంలోకి నెడుతుందని హెచ్చరించింది. పూర్తి ఉపాధికి, పని భద్రతకు, గౌరవంగా జీవించగలిగే వేతనాలను పొందగలిగే విధంగా ఆర్థిక పెరుగుదల లక్ష్యం ఉండాలని ఐఎల్ఓ ప్రపంచ దేశాలను కోరింది.

వరల్డ్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్ ఆధ్వర్యంలో 16వ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఏప్రిల్ 6 నుండి 10 వరకు ఐదు రోజులు గ్రీస్ రాజధాని ఏథెన్స్‌లో జరిగింది. ఈ సమావేశానికి 101 దేశాల నుండి 881 మంది ట్రేడ్ యూనియన్ల ప్రతినిధులు హాజరయ్యారు. నయా ఉదారవాద ఆర్థిక విధానాలు అమలు, ఆర్థిక సంక్షోభ ప్రభావం కార్మిక వర్గ హక్కులను ఎలా హరించి వేస్తుందో చర్చించారు. 'దోపిడి,

*కుంటాల జలపాతంపై నిర్మించ తలపెట్టిన జల విద్యుత్ కేంద్రం వల్ల అక్కడ నివసిస్తున్న ఆదివాసులూ, వారి సంస్కృతీ, వనరులూ ధ్వంసమౌతాయనీ, ఈ సీమాంధ్రుల దోపిడీని అడ్డుకుందామనీ అంటున్నారు* **పిట్టల రవీందర్**

# ప్రమాదం అంచున కుంటాల జలపాతం

ఆదిమానవులు తిరుగాడినట్లుగా చారిత్రక ఆధారాలున్న ఆదిలాబాద్ జిల్లా అటవీప్రాంతాలు భావితరాలకు మిగలకుండా సీమాంధ్ర పాలకులు అమలు జరుపుతన్న కుట్రలు వేగమంతమవుతున్నాయి. అక్షర క్రమంలో మాత్రమే అగ్రభాగంలో నిలబడి, అభివృద్ధి క్రమంలో ఆఖరు స్థానానికి నెట్టివేయబడిన ఈ అడవుల జిల్లాలో లభ్యమయ్యే సహజ వనరుల దోపిడీ ఉమ్మడి రాష్ట్రంలో విలీనం నుండి వేగవంతంగా కొనసాగుతూనే ఉన్నది. తాజాగా ఈ జిల్లాలో ప్రకతిసిద్ధంగా ఏర్పడిన అటవీ అందాలను సైతం 'వ్యాపార సరుకు'గా మార్చేందుకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

రాష్ట్రంలోనే అత్యంత సుందరమైన జలపాతంగా ప్రసిద్ధికెక్కిన కుంటాల జలపాతం పెట్టుబడిదారుల దోపిడీ ప్రవాహంలో కొట్టుకుపోవడానికి సిద్ధంగా ఉన్నది. 'తెలంగాణ నయాగరా'గా పిలువదగిన ఈ జలపాతాన్ని మింగేయడానికి 12 సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్న ఒక కంపెనీ ఇచ్చిన ప్రతిపాదనలను రాష్ట్ర ప్రభుత్వం హఠాత్తుగా తెరమీదికి తీసుకువచ్చింది. 'తెలంగాణ విద్యావంతుల వేదిక' చొరవతో ఈ అంశం ఇప్పుడు తెరమీదికి వచ్చింది. కుంటాల జలపాతంపైన జల విద్యుత్ కేంద్రాన్ని నిర్మించుకునేందుకు ప్రభుత్వ అనుమతిని కోరుతూ 1999లోనే 'రాజీ పవర్ ప్రాజెక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్' అనే సీమాంధ్ర కంపెనీ దరఖాస్తు చేసుకున్నది. ఆదివాసీ సంఘాలు, స్థానిక ప్రజలు తీవ్రంగా ప్రతిఘటించడంతో ఇంతకాలంగా ఈ ప్రతిపాదనలు ప్రభుత్వం పక్కన పెట్టింది. అయితే అధికారం కోల్పోయిన అధికార పార్టీకి చెందిన స్థానిక అగ్రనాయకుని అండదండలతో మరోమారు ఈ ప్రతిపాదనలను తెరమీదికి తీసుకువచ్చారు. ఇందుకు అనుకూలంగా జిల్లా అధికార యంత్రాంగం కట్టగట్టుకుని వేగంగా కదిలింది.

కుంటాల జలపాతంపై మినీ జల విద్యుత్ కేంద్రం ఏర్పాటు చేసేందుకు తమకు ఎలాంటి అభ్యంతరం లేదని గ్రామ పంచాయతీతో తీర్మానం చేయించి కథ నడపడం మొదలుపెట్టారు. రెవెన్యూ అధికారులు ఆగమేఘాలమీద ఫైళ్లు కదిలించారు. ఏడవ నెంబరు జాతీయ రహదారికి 13 కిలోమీటర్ల దూరంలో, దట్టమైన అడవిలో సహజ సిద్ధంగా ఏర్పడిన ఈ కుంటాల జలపాతంపైన మినీ జలవిద్యుత్ కేంద్రాన్ని ఏర్పాటు చేయడంవల్ల అడవికి వచ్చే ముప్పు ఏమీలేదని అటవీ శాఖ తేల్చి చెప్పింది. తరతరాలుగా అటవీ. సంపదపై ఆధారపడి జీవిస్తున్న వందలాదిమంది ఆదివాసీ కుటుంబాలకు జీవనోపాధిని దూరం చేసే ఈ ప్రాజెక్టు వల్ల ఆదివాసీలకు ఎలాంటి నష్టం కలగబోదని గిరిజన సంక్షేమశాఖ తాఖీదు ఇచ్చింది. కడెం ప్రాజెక్టుకు నీటిని జీవధారగా చేరవేసే 'కడెం' వాగుపై ఏర్పడిన ఈ జలపాతానికి అడ్డంగా జలవిద్యుత్తు కేంద్రాన్ని నిర్మిస్తే నీటివనరులకు ఎలాంటి ప్రమాదం రాదని నీటిపారుదలశాఖ ప్రకటించింది. జలవిద్యుత్ కేంద్రాన్ని ఏర్పాటు చేయవలసిన ఆంధ్రప్రదేశ్ పవర్ జెనరేషన్ కార్పోరేషన్ (ఏ.పి. జెన్‌కో) వాళ్లు ఏకంగా కుంటాల జలపాతాన్ని సాంప్రదాయేతర ఇంధన వనరుల కార్పోరేషన్ (నెడ్‌క్యాప్) వాళ్లకు హక్కులు ధారాదత్తం చేసారు. కుంటాల జలపాతంపైన మినీ జలవిద్యుత్ కేంద్రాన్ని ఏర్పాటు చేసిన పక్షంలో పర్యాటక రంగానికి వచ్చే ముప్పు ఏమీ లేదని పర్యాటక శాఖ పత్రాలు జారీ చేసింది. ఇక అందరికంటే మరో అడుగు ముందుకు వేసిన జిల్లా

---

పీడన లేని వ్యవస్థ కోసం, ఒక వ్యక్తిని మరో వ్యక్తి దోపిడి చేయనీ, చేయలేని వ్యవస్థ కోసం, అన్ని దేశాల శ్రామికవర్గంతో కలిసి, సంఘటితంగా ఉద్యమాలు నిర్వహిద్దాం" అని కాంగ్రెస్ తీర్మానించింది.

సంక్షోభంలో పడి దివాలా స్థితిలో ఉన్న తమ బ్యాంకులను కాపాడుకునేటందుకు యూరోపియన్ యూనియన్ బెయిల్ అవుట్ ప్యాకేజీకి సహాయ మందిస్తున్నదీ గానీ, గ్రీస్ ప్రజలపై ప్రేమతోకాదు. బెయిల్-అవుట్ ప్యాకేజీ ఇవ్వడం ద్వారా గ్రీస్ సంక్షోభ ప్రభావం తమ దేశాల మీద పడకుండా జర్మనీ, ఇంగ్లాండ్ లాంటి యూరోపియన్ దేశాలు ప్రయత్నిస్తున్నాయి. అయినా గ్రీస్ సంక్షోభ ప్రభావం వలన 'యూరో' విలువ అనూహ్యంగా పతనమైంది. డాలర్‌కు పోటీగా అంతర్జాతీయ కరెన్సీగా 'యూరో'ను నిలపాలని ప్రయత్నించిన యూరోపియన్ యూనియన్ ఆశలు అడుగంటాయి. గ్రీస్‌లోనే కాక ఐర్లాండు, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, పోలాండ్, పోర్చుగల్, స్పెయిన్ మొదలగు దేశాలలో కూడా ఆర్థిక సంక్షోభం తీవ్రతరమవుతున్నది. ఈ సంక్షోభం యూరప్ అంతటా క్రమంగా వ్యాపిస్తున్నది. పాలకులు, శ్రామికవర్గంపై ఈ సంక్షోభ భారాన్ని నెడుతున్నారు. ఆ కారణంగా కార్మిక వర్గ ఆందోళనలు తీవ్రమవుతున్నాయి. పెట్టుబడిదారీ వర్గం తాను సృష్టించుకున్న సంక్షోభం నుండి తానే బయటపడలేని పరిస్థితి. ఆఫ్రికా, ఆసియా, యూరప్, దక్షిణ అమెరికా ఖండాలలోని చాలా దేశాలలో సాగుతున్న ప్రజా ఉద్యమాల తీవ్రత కళ్లకు కట్టినట్లు కనబడుతోంది. వివిధ దేశాలలో కొనసాగుతున్న ప్రజా ఉద్యమాలు తాము పోరాడి సాధించుకున్న ప్రయోజనాలను పరిరక్షించుకునేందుకు మాత్రమే కాకుండా ఉజ్వల భవిష్యత్తుకు దోహదం చేస్తాయని ఆశిద్దాం.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

గ్రామీణ అభివృద్ధి సంస్థ (డి.ఆర్.డి.ఏ)వారు "కుంటాల జలపాతంపైన మినీ జలవిద్యుత్ కేంద్రాన్ని నిర్మించడంవల్ల స్థానికంగా మౌలిక వసతులు అభివృద్ధి జరుగుతాయనీ, పరిసర ప్రాంతాలకు విద్యుత్ సదుపాయం కలుగుతుందనీ, అంతేకాకుండా పర్యాటకుల సంఖ్య బాగా పెరుగుతుందనీ" భుజం తట్టింది. విద్యుత్ కేంద్రం ఏర్పాటుకు అనుమతిని ఇస్తే స్థానిక ఆదివాసీలకు కుటుంబానికి ఒకరికి చొప్పున ఉద్యోగం ఇస్తామని స్థానికులను మభ్యపెట్టేందుకు కాంట్రాక్టు కంపెనీ ప్రతినిధులు ప్రయత్నిస్తున్నారు. జలవిద్యుత్ కేంద్రంపై నిర్మించే రిజర్వాయర్ నిలువనీటిలో చేపలు పట్టుకునే అవకాశం స్థానిక మత్స్యకారులకే ఇస్తామంటూ నమ్మబలుకుతున్నారు.

స్థానిక ఆదివాసీల కథనం ఇందుకు పూర్తి భిన్నంగా ఉన్నది. కొంతమంది స్థానిక ప్రజాప్రతినిధులు, రాజకీయపార్టీలకు చెందిన ముఖ్య నాయకులు సీమాంధ్ర కాంట్రాక్టర్‌తో కుమ్మక్కై కుంటాల జలపాతాన్ని జలసమాధి చేసేందుకు ప్రయత్నిస్తున్నారని ఆరోపిస్తున్నారు. కుంటాల జలపాతం నుండి జాలువారే ప్రవాహంపై ఆధారపడి అనేక మత్స్యకారుల కుటుంబాలు తరతరాలుగా జీవనం సాగిస్తున్నాయి. అటవీ ఉత్పత్తులనే నమ్ముకున్న ఆదివాసీ కుటుంబాలు పూర్తిగా జీవనాధారం కోల్పోతారు. జలపాతం చూడటానికి వచ్చే సందర్శకులను చేరవేసేందుకు ఆటోలు, జీపులను నడుపుకుని జీవనం సాగిస్తున్న స్థానిక యువకులు తమ ఉపాధిని కోల్పోతారు. జలపాతం ఎగువ భాగంలో కడెంవాగు వాలుపై మోటార్లు ఏర్పాటు చేసుకుని వ్యవసాయం చేస్తున్న అనేకమంది రైతులు ఈ అవకాశాన్ని కోల్పోతారు. మినీ విద్యుత్ ప్రాజెక్టులోకి నీరురాకుండా చేస్తున్నారని ప్రాజెక్టు యాజమాన్యం వీరితో ఘర్షణకు దిగుతుంది. వాగుధారపై అక్రమంగా మోటార్లు బిగించుకుని నీటిని తరలిస్తున్నారని పోలీసులు, రెవెన్యూ అధికారులు స్థానిక రైతులపై కేసులు నమోదు చేస్తారు. ఈ పరిస్థితి ప్రాజెక్టు యాజమాన్యానికి, ప్రభుత్వ శాఖలకు, రైతులకు మధ్యన భవిష్యత్తులో నిత్య సమరంగా రూపుదాలుస్తుంది.

మినీ జలవిద్యుత్తు ప్రాజెక్టు నిర్మాణం చేపట్టిన వెంటనే కుంటాల జలపాతం రెండు కిలోమీటర్ల పరిధిలోని ప్రాంతమంతా 'రక్షిత ప్రదేశం'గా ప్రభుత్వం ప్రకటిస్తుంది. ముందస్తు అనుమతి లేకుండా ఆ ప్రదేశానికి ఎవ్వరినీ అనుమతించరు. అటవీ ఉత్పత్తుల పైన ఆధారపడిన ఆదివాసీలు, జలపాత ప్రవాహంపైన జీవిస్తున్న మత్స్యకారులు ఈ ప్రాంతానికి పరాయిలుగా మారిపోతారు. సుమారు ఇరవై కోట్ల రూపాయల అంచనా వ్యయంతో కుంటాల జలపాతంపై నిర్మించతలపెట్టిన మినీ జలవిద్యుత్ కేంద్రంలో ప్రైవేటు కంపెనీ ఉత్పత్తి చేసే ఆరు మెగావాట్ల విద్యుత్తును ఓపెన్‌మార్కెట్‌లో విక్రయించుకునే అవకాశం కల్పిస్తే ఈ విద్యుత్తు స్థానిక ప్రజలకు ఏవిధంగానూ అందుబాటులోకి రాదు. రాజీ పవర్ ప్రాజెక్ట్స్ ప్రైవేట్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ పి. సూరపరాజు తన దరఖాస్తులో పొందు పరచిన విధంగా ఈ మినీ జలవిద్యుత్ కేంద్రంలో కేవలం ముగ్గురు నుండి ఐదుగురికి మాత్రమే ఉద్యోగ అవకాశం లభిస్తుంది. అంటే స్థానికంగా ఎవ్వరికీ ఉద్యోగ, ఉపాధి అవకాశాలు ఈ ప్రాజెక్టు ద్వారా లభించే అవకాశాలు ఏ కోశానా కనిపించడం లేదు. 'రక్షిత ప్రాంతం'గా ప్రకటించిన తర్వాత జలపాతాలున్న ప్రదేశానికి పర్యాటకులను అనుమతించేందుకు అవకాశముండదు.

కుంటాల జలపాతంపైన మినీ జల విద్యుత్ కేంద్రాన్ని నిర్మించే ప్రతిపాదనలను అనుమతించేదిలేదని స్థానికులు చెబుతున్నారు. వీరికి అండగా 'తెలంగాణ విద్యావంతుల వేదిక' నిలబడింది. ప్రజాభిప్రాయాన్ని కూడగట్టేందుకు ప్రయత్నిస్తున్నది. ఇందులో భాగంగా మే 30న అఖిలపక్ష రౌండ్ టేబుల్ సమావేశాన్ని నిర్వహించింది. వివిధ రాజకీయ పార్టీలతోపాటు ఉద్యోగ, ఉపాధ్యాయ, ప్రజా సంఘాలు, ఆదివాసీ సంఘాలు కుంటాల జలపాతాన్ని రక్షించుకు నేందుకు ఉమ్మడి పోరాటానికి తమ సంసిద్ధతను వ్యక్తం చేసాయి. కుంటాల జల విద్యుత్ కేంద్రం పేరుతో సీమాంధ్ర సంపన్న వర్గాలు ఇక్కడి అటవీ సంపదను, విలువైన ఖనిజాలను, కలపను, గ్రానైట్‌ను దోచుకునేందుకు కుట్రలు పన్నుతున్నారని ఈ రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొన్న ప్రతినిధులు ఆరోపించారు. ఈ దోపిడీ ప్రయత్నాలను అడ్డుకునేందుకు అన్ని రకాలుగా ప్రయత్నిస్తామన్నారు.

'తెలంగాణ విద్యావంతుల వేదిక' నిర్వహించిన రౌండ్ టేబుల్ సమావేశం సందర్భంగా ఆదిలాబాద్ జిల్లా చుట్టూ అల్లుకుని ఉన్న అనేక సమస్యలు వెలుగులోకి వచ్చాయి. నిర్మల్ కేంద్రంగా ఈ ప్రాంతాన్ని ఒక ముఖ్యమైన పర్యాటక కేంద్రంగా అభివృద్ధి పరిచేందుకు అనేక అవకాశాలున్నప్పటికీ వలస పాలకులు ఇంతకాలంగా నిర్లక్ష్యం చేస్తున్నారని స్థానికులు అభిప్రాయపడుతున్నారు. అత్యంత పురాతనమైన నిర్మల్ పట్టణం చుట్టూ సుమారు నాలుగువందల సంవత్సరాలక్రితం నిర్మించిన 64కోటలు, 32దుర్గాలు ఉన్నాయి. వీటి చుట్టూ ఏర్పాటు చేసిన సొరంగమార్గాలు, రక్షక కవచాలనుబట్టి ఈ ప్రాంతంలో రాజకుటుంబాలకు చెందిన ధనాగారాలు, ఆయుధాగారాలు ఉండేవని స్థానికులు నమ్ముతున్నారు. నిర్మల్ చుట్టూ నిర్మించిన అనేక గొలుసుకట్ట చెరువులు తెలంగాణలో సాగునీటి ప్రాముఖ్యతను తెలియజేస్తాయి. నిర్మల్‌కు చుట్టుపక్కల ఉన్న కుంటాల, పొచ్చెర జలపాతాలతోపాటు ఒకవైపున బాసర సరస్వతీ దేవాలయం, మరోపక్కన జైనథ్‌లోని సూర్యదేవాలయం, ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన నిర్మల్ పెయింటింగ్స్, చెక్కబొమ్మల పరిశ్రమ, సిమెంటు విగ్రహాల తయారీ, ఉట్నూరు ఏజెన్సీలోని ఆదివాసీల జీవనవైవిధ్యం, ప్రత్యేక సంస్కృతి, కొమురం భీం నివసించిన 'జోడెన్‌ఘాట్', ఆదివాసీలు కొలుచుకునే 'నాగోబా' జాతర, 'ఇంద్రవెల్లి' స్మారకస్థూపం, గోదావరినదీ తీరం వెంబడి విస్తరించిన సింగరేణి బొగ్గుగనులు, ఇంకా అనేక ఆకర్షణలు ఇక్కడి పర్యాటకులను ఆకట్టుకుంటాయి. 2009 జూలైలో 13కోట్ల రూపాయల వ్యయంతో జిల్లాలోని 11 ప్రదేశాలలో పర్యాటకుల సౌకర్యం కోసం ప్రత్యేక ఏర్పాటు చేయాలని పర్యాటకశాఖ అధికారులు ప్రతిపాదించినప్పటికీ, ఇంతవరకూ ఈ విషయంలో ఎలాంటి చర్యలు తీసుకోలేదు కానీ, ప్రకృతి ప్రసాదించిన వనరులను, అందాలను కొల్లగొట్టేందుకు మాత్రం దారులు తెరుస్తున్నది.

అటవీ ప్రాంతాల్లోని విలువైన సహజ వనరులమీద ఆధిపత్యం కోసం సాయుధ బలగాల సహకారంతో 'గ్రీన్‌హంట్' పేరుతో ఆదివాసీలపై యుద్ధం ప్రకటించిన ప్రభుత్వాలు, అటవీ ప్రాంతంలోని ప్రకృతి అందాలను సైతం వ్యాపారవనరుగా మార్చేందుకు ప్రయత్నిస్తున్నారనడానికి కుంటాల జలపాతంపై మినీ జలవిద్యుత్ కేంద్రం ప్రతిపాదించడమే ఒక ఉదాహరణ! కుంటాల జలపాతాన్ని రక్షించుకుందాం.

*(రచయిత రాష్ట్ర ప్రధాన కార్యదర్శి, తెలంగాణ విద్యావంతుల వేదిక)* వీ

విత్తనాల కోసం మొదలుపెట్టి, గిట్టుబాటు ధర దాకా రైతు పడుతున్న యాతనను, పంటకు విరామం ప్రకటించే వైపుగా సాగుతున్న రైతు ప్రస్థానాన్ని వివరిస్తున్నారు **వై. రామచంద్రం**

# రైతాంగం ఎదుర్కొంటున్న సమస్యలు

దేశ జనాభాలో నేటికీ నూటికి 60 శాతం పైగా జనాభా గ్రామాల్లో వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్నారు. గ్రామాల్లోని వృత్తి పనివారు జీవించడానికి వ్యవసాయం తోడ్పడుతోంది. ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన సంక్షోభాలను తట్టుకొని మన దేశం నిలబడడానికి వ్యవసాయరంగంలో పనిచేస్తున్న రైతాంగమే ప్రధాన కారణం. దేశానికి వెన్నెముకైన రైతాంగం ప్రభుత్వాలు అవలంబిస్తున్న విధానాల కారణంగా, విత్తనాల కోసం, గిట్టుబాటు ధరల కోసం రోడ్డెక్కుతున్నారు. గిట్టుబాటు ధరలు లేక నష్టపోతున్న రైతాంగం పంటలకు సెలవు ప్రకటిస్తున్నారు. చేసిన అప్పులు తీరక విశ్వాసం కోల్పోయి పురుగుల మందును రైతులు పెరుగన్నంగా తీసుకుని తనువు చాలిస్తున్నారు. పంట చేన్లో పనిచేసి సెదదీరే చెట్టుకే ఉరితాడు బిగించుకొని వేలాడుతున్నారు. ఇది మన 64 ఏళ్ల స్వతంత్ర భారత దేశంలో రైతు పరిస్థితి.

గత రబీ సీజన్‌లో పండిన ధాన్యం అమ్మడానికి రైతు మార్కెట్‌లోకి వెళితే గిట్టుబాటు ధర లేదు. మిల్లర్లు, మార్కెట్‌లో అడ్తి దారులు క్వింటాలుకు రు. 850 మాత్రమే ఇచ్చారు. అమ్మిన ధాన్యం మొత్తం రు. పదివేల లోపు ఉంటే అప్పుడే డబ్బులు ఇస్తున్నారు. అంతకంటే ఎక్కువ అయితే పదిహేను నుండి నెల రోజులకు వాయిదా పద్ధతిన ఇస్తున్నారు. కనీస మద్దతు ధరకు అమ్మాలనుకుంటే, ప్రభుత్వం నిర్వహించే మార్కెట్ యార్డుల దగ్గర ఆరు బయట వడ్లు పోసి రోజుల తరబడి రాత్రి, పగలు అక్కడే కావలి కాస్తూ ఉండాలి. వాన పడితే రక్షణ లేక ధాన్యం తడిసి ముద్దవుతున్నాయి. అటువంటి ధాన్యాన్ని కొనలేమంటూ, చివరికి కొన్నా తక్కువ ధరకు కొంటున్నారు. ఇక్కడ కొన్నా డబ్బులు ఇవ్వడానికి మళ్లీ నెల రోజుల సమయం పెడుతున్నారు. దీంతో తక్షణ అవసరాలకోసం రైతులు ప్రైవేట్ మార్కెట్ మీద ఆధార పడాల్సి వస్తోంది. ఇక్కడ రైతు తాను అమ్మే పంట అమ్మకం ధరను నిర్ణయించలేక పోతున్నాడు. దీన్ని ఆసరాగా చేసుకొని ప్రైవేట్ సంస్థలు తమకు అనుకూలమైన ధరను నిర్ణయిస్తున్నారు. దీంతో రైతుకు పెట్టిన పెట్టుబడి రాక అప్పుల ఊబిలో చిక్కుకుంటున్నాడు.

తొలకరి వర్షాల వల్ల మండుటెండల నుంచి బయట పడ్డందుకు ప్రకృతిలో ఉన్న సకల జీవులు ఆనందిస్తాయి. అలాగే ఎన్నో ఆశలతో రైతు కూడా విత్తనం వేయడానికి ముందుకు సాగుతాడు. కాని ఈ ఖరీఫ్ సీజన్‌లో విత్తనాల సరఫరాలో ప్రభుత్వం విఫలం కావడంతో, చేతిలో విత్తనాలు లేక రైతుకు మొదట్లోనే సమస్యలు ఎదురొచ్చాయి.

ఈ ఖరీఫ్‌లో దాదాపు 45 లక్షల ఎకరాల్లో పత్తి సాగు అవుతుందని వ్యవసాయ అధికారులు ఒక అంచనాకు వచ్చారు. దీనికి అనుగుణంగా ప్రైవేటు కంపెనీలతో 96 లక్షల విత్తనాల ప్యాకెట్లు అందించాలనె ఒప్పందాన్ని కుదుర్చుకున్నారు. అందులో సగం కూడా ప్రైవేటు సంస్థలు అందించలేదు. దీంతో ప్రభుత్వం ఉన్న కొద్ది పత్తి విత్తనాల ప్యాకెట్లను ప్రభుత్వ అధకారులతో, పోలీసు పహారాలో లాటరీ పద్ధతిలో పాస్ పుస్తకాల ఆధారంగా రైతులకు పంపిణీ చేసింది. భూమిలో విత్తనం నాటాల్సిన సమయంలో వేలాది మంది రైతులు విత్తనాల కోసం ఎండలో, వానలో గంటల తరబడి నిలబడాల్సివచ్చింది. అవసరమైన మేరకు విత్తనాలు దొరక్కపోవడంతో 930 రూపాయలున్న విత్తనాల ప్యాకెట్లను ప్రైవేట్ సంస్థల వద్ద రు. 2500 పెట్టి కోనాల్సివచ్చింది.

కడుపు మండిన రైతులు జాతీయ రహదారులపై ధర్నాలు, రాస్తా రోకోలు చేశారు. అధికారులను నిర్బంధించారు. ప్రభుత్వ కార్యాలయాలకు తాళాలు వేశారు. కృత్రిమ కొరత సృష్టించి అధిక ధరలకు విత్తనాలను, పురుగుల మందులను అమ్ముతున్న వ్యక్తుల ప్రైవేట్ దుకాణాలను ధ్వంసం చేశారు. అసలు సమస్య పరిష్కరించకుండా పోలీసులు ఎప్పటిలాగే వచ్చి లాఠీచార్జ్‌తో రైతులపై తమ ప్రతాపం చూపించారు.

చివరికి తాము పండించిన పంటలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గిట్టుబాటు ధర కల్పించకపోవడంతో, ప్రభుత్వ నిర్లక్ష్యానికి నిరసనగా మూడు లక్షల ఎకరాల్లో ఖరీఫ్ పంటలు వేయరాదని రైతులు నిర్ణయించుకున్నారు. నీరు బాగా లభించే తూర్పు, పశ్చిమ గోదావరి, క్రిష్ణ, ప్రకాశం, నెల్లూరు జిల్లాల్లోని రైతులు ఈ నిర్ణయాన్ని తీసుకున్నారు. ఇది తీవ్ర వ్యవసాయ సంక్షోభానికి, వ్యవసాయంలో కార్పొరేటీకరణకు దారి తీయవచ్చు. వ్యవసాయ ఆధారిత వృత్తులవారికి ఉపాధి లేకుండా పోయింది. రైతులకు ఉత్పత్తికయ్యే ఖర్చుల ఆధారంగా కనీస మద్దతు ధరను ప్రకటించాలి.

గ్రామీణ వ్యవసాయ విధానంలో రైతులు పండించే పంటలోంచి నాణ్యమైన ధాన్యాన్ని సేకరించి తరువాత పంటకు విత్తనాలుగా వాడుకునే స్వయం పోషక విధానం ఉండేది. ఈ విత్తనాలు స్థానిక భౌగోళిక వాతావరణ పరిస్థితుల్ని తట్టుకునేవి. నేడు అందుకు భిన్నంగా మన దేశంలో ప్రపంచీకరణ విధానాలు అమలవుతున్నాయి. ఈనాడు ముఖ్యంగా పత్తి విత్తు నాటాలంటె, విత్తనాల కోసం విదేశీ బహుళజాతి

కంపెనీల మీద ఆధారపడాల్సి వస్తోంది. పండిన పంటలోంచి విత్తనాలు తీసుకొని వేస్తే అవి మొలకెత్తవు. దీంతో ప్రతి ఏటా విత్తనాలు అధిక ధరలకు కోనాల్సి వస్తోంది. నకిలీ, కల్తీ విత్తనాల వల్ల సరిగా మొలకెత్తడం లేదు. దానికి తోడు ఎక్కువ మొత్తంలో తెగుళ్లు రావడంతో చీడపీడల నివారణకు మందులు ఎక్కువగా వాడాల్సి వస్తోంది. దీంతో ఖర్చు పెరిగిపోయి, చివరికి పంట దిగుబడి సరిగా రాకా రైతులు అప్పుల పాలవుతున్నారు. వాణిజ్య పంటలన్నీ జూదంగా మారుతున్నాయి.

వ్యవసాయరంగంలో మార్పుల కోసం ప్రభుత్వం అనేక కమిషన్‌లు వేసింది. అందులో జస్టిస్ పి.ఎ. చౌదరి కమిషన్, రైతు సంక్షేమ (జయతీఘోష్) కమిషన్, స్వామినాథన్ కమిషన్, రాధాకృష్ణ కమిషన్, కోనేరు రంగారావు కమిషన్ ఇవి. అయితే కమిషన్‌లు చేసిన ఏ ఒక్క సూచనా అమలు కాలేదనడానికి ఈనాడు రైతాంగం విత్తనాల కోసం, గిట్టుబాటు ధరల కోసం రోడ్లెక్కడాన్నీ, చివరికి పంటకు విరామం ప్రకటించడాన్ని కారణంగా చూడవచ్చు.

ఈ నాటికీ గ్రామాలలో నూటికి ముప్పయి నుంచి నలభై శాతం గడపలకు అసలే భూమి లేనివారున్నారు. ఉన్న భూమికి సాగు నీరు లేదు. మెట్ట భూముల్లో బావులు, బోర్లు వేసి సరిపడ నీరు రాక అప్పుల బారినపడుతున్నారు. అప్పుల పాలై కుటుంబాల్ని పోషించలేక పిల్లల్ని అమ్ముకుంటున్నారు. ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. తల్లి తండ్రులను, భార్యా పిల్లలను వదిలి ఇతర ప్రాంతాలకు వలస పోతున్నారు. దీంతో కుటుంబాలు సంక్షోభానికి గురవుతున్నాయి. బతకడానికి వలస వెళ్లిన వారు తిరిగి వచ్చే వరకు నమ్మకం ఉండడం లేదు. ఇతర దేశాల్లో అనారోగ్యంతో, ప్రమాదవశాత్తు మరణిస్తే చనిపోయిన శవం ఇంటికి చేరడానికి నెలలు పడుతుంది. అప్పుల బాధ భరించలేక 1995 నుండి 2010 వరకు రెండు లక్షల ఇరవై ఐదు వేల మందికి పైగా రైతులు దేశ వ్యాప్తంగా ఆత్మహత్యలు చేసుకున్నట్లు తెలుస్తోంది.

ఒక వైపు సామాన్యులు గూడు కోసం భూమి కావాలంటే ప్రభుత్వాలు లేదంటున్నాయి. మరొక వైపు ప్రభుత్వ భూములను, రైతుల వ్యవసాయ భూములను ప్రత్యేక ఆర్థిక మండలాల పేరుతో లక్షలాది ఎకరాలను విదేశీ సంస్థలకు అప్పగిస్తున్నాయి. ఇవ్వకుంటే బలవంతంగా బెదిరించి తీసుకుంటున్నాయి. అప్పుడు కూడా లొంగకుంటే లాఠీ చార్జీలు, తుపాకీ కాల్పులతో చంపయినా ప్రైవేటు సంస్థలకు, విదేశీ బహుళజాతి సంస్థలకు మన సహజ సంపదను కట్టబెట్టడానికి సిద్ధపడుతున్నాయి.

మన ప్రభుత్వాలు అమలు చేస్తున్న విధానాలు, దేశ ప్రజల ప్రయోజనాల కోసం కాకుండా, బడా పెట్టుబడి సంస్థల, విదేశీ బహుళజాతి సంస్థల ప్రయోజనాల కోసమేననే విషయం ఈ కింది విషయాలను గమనిస్తే మనకు మరింత అర్థమౌతుంది.

ప్రపంచంలో ఆకలితో నకనకలాడుతున్న వారి సంఖ్య 87 కోట్లకు చేరుకోగా అందులో 25 కోట్ల మంది మన దేశంలోనే ఉన్నారని ఐక్యరాజ్య సమితి నివేదికలు తెలియజేస్తున్నాయి. గిడ్డంగుల్లో గింజలకు బదులు మత్తు పానీయాలు ఉంచి, ఆరు బయట బియ్యం బస్తాలు తడిసి ముక్కిపోతున్న పరిస్థితిని మనం చూస్తూనే ఉన్నాం.

ప్రభుత్వాలు వలస చట్టాలను ఆసరా చేసుకొని పచ్చని పంట భూములను రైతుల నుంచి అతి తక్కువ ధరకు లాక్కుని, వాటిని ప్రైవేటు సంస్థలకు కట్టబెడుతూ, రైతుకు కడుపు మంట మిగులుస్తున్నాయని స్వయంగా సుప్రీంకోర్టు అంది. పంట మొక్కలు పెంచాల్సిన భూముల్లో మల్టీప్లెక్సులు, షాపింగు మాల్‌లు, పెద్ద పెద్ద భవనాలు వెలుస్తున్నాయంది. ఢిల్లీ శివార్లు, పరిసర ప్రాంతాల్లో భూసేకరణ కోసం వేసిన నోటిఫికేషన్లను అలహాబాద్ హైకోర్టు కొట్టివేసింది. దీంతో గ్రేటర్ నోయిడా పారిశ్రామికాభివృద్ధి సంస్థతో పాటు పలు సంస్థలు, బిల్డర్లు సుప్రీం కోర్టులో దాఖలు చేసిన అప్పీలును జూలై 5న విచారించిన సుప్రీం ధర్మాసనం పైవిధంగా వ్యాఖ్యానించింది.

ఈ మధ్య ముంబైలో ఇందిరాగాంధీ ఇన్‌స్టిట్యూట్ ఫర్ డెవలప్‌మెంట్ రీసర్చ్ సంస్థ రూపొందించిన 'ఇండియా డెవలప్ మెంట్ రిపోర్ట్ 2011'ను ఆర్.బి.ఐ గవర్నర్ దువ్వూరి సబ్బారావు విడుదల చేశారు. ఈ కార్యక్రమంలో సుబ్బారావు మాట్లాడుతూ గత ఇరవై ఏళ్లుగా వృద్ధి చెందుతున్న సేవల రంగం వాటా జిడిపిలో 70 శాతంగా ఉందన్నారు. ముందు ముందు సేవల రంగంపై ఆధార పడకూడ దన్నారు. సేవల రంగంలో సాధిస్తున్న అభివృద్ధి ఎంతవరకు నిలదొక్కుకో గలుగుతుందన్న ప్రశ్నలు రేకెత్తుతున్నాయని ఆయన అన్నారు. వస్తు తయారీ రంగంపైనా, మరీ ముఖ్యంగా వ్యవసాయ రంగంపైనా దృష్టిని సారించి నిలకడయిన అభివృద్ధిని సాధించుకోవాలన్నారు.

వ్యవసాయంలో ఇది వరకే అవసరానికి మించిన మిగులు మనుషులున్నారు. దానికి తోడు వ్యవసాయంలోకి యాంత్రీకరణ వచ్చి చేరింది. దీంతో వ్యవసాయంపై మరింత మంది మిగులు మనుషుల ఒత్తిడి పెరిగింది. వీరికి ప్రత్యామ్నాయ ఉపాధి దొరకడంలేదు. గ్రామీణ ఉపాధి హామీ పథకంలో అరాకొరా పనులు మాత్రమే దొరుకుతున్నాయి. గ్రామాల్లో ఒక సంవత్సర కాలంలో నాలుగు నుంచి ఐదు నెలలు మాత్రమే పని దొరుకుతోంది. మిగతా రోజులు అప్పులుచేసి తమ జీవనాన్ని నెట్టుకొస్తున్నారు. గ్రామాల్లో దాదాపుగా అప్పులేని ఇల్లు లేదు.

అభివృద్ధి చెందిన దేశాల్లో రైతాంగానికి ఇస్తున్న సబ్సిడీలు మన దేశ రైతాంగానికి అందడం లేదు. ప్రపంచీకరణ నేపథ్యంలో 1991లో వచ్చిన నూతన ఆర్థిక విధానాల వల్ల, విదేశాల నుండి వచ్చిపడుతున్న దిగుమతులతో మన దేశ రైతాంగం పోటీ పడలేకపోతోంది.

వ్యవసాయరంగంలోని సంక్షోభాల్ని నివారించాలంటే వ్యవసాయాధారిత విధానాలు రూపొందించాలి. భూమికి సరిపడా సాగు నీరు అందించాలి. పండించిన పంటకు గిట్టు బాటు ధర కల్పించాలి. స్థానిక ప్రజల అవసరాలకు అనుగుణంగా, ప్రజల ప్రమేయంతో వ్యవసాయరంగానికి అనుబంధమైన పరిశ్రమల నిర్మాణాన్ని చేపట్టాలి. పునరుత్పత్తిలో మట్టి ఆరోగ్యం కీలకమైంది. ఆ మట్టి ఆరోగ్యాన్ని పరిరక్షిస్తూ, దేశ ప్రజలకు అన్నంబెడుతున్న రైతాంగాన్ని ఆదుకోవాల్సిన బాధ్యత మనందరి మీదా ఉంది. రైతాంగం అప్పుల నుండి, ఆత్మహత్యల నుండి బయటపడే విధాన నిర్ణయాలు తీసుకునే విధంగా మనమంతా ప్రభుత్వాలపై ఒత్తిడి తేవాల్సిన అవసరం ఉంది. అలా చేయకపోతే మన దేశ పరిస్థితి కూడా సోమాలియాలా అలమటించే పరిస్థితి ఎంతో దూరంలో లేదు.

*(రచయిత వీక్షణం కరస్పాండెంట్)*

ప్రజల పేదరికాన్ని ఆసరాగా చేసుకుని, వారి ప్రాణాలతో చెలగాటమాడుతూ కోట్ల రూపాయల లాభాలు చేసుకుంటున్న ఔషధ కంపెనీల దుర్మార్గాలను, ప్రభుత్వ నిర్లిప్తతను వివరిస్తున్నారు ఎస్. కిషోర్

# పేదరికంపై ఔషధ ప్రయోగాలు

ఆరోగ్యకరమైన శరీరాలు.. అజ్ఞానం, నిరక్షరాస్యత తోడైన నిరుపేద జీవితాలు... ఔషధ ప్రయోగాలకు నిలయాలవుతున్నాయి. రాష్ట్రంలో అభివృద్ధి కొంగు చాటున దాగున్న కటిక దారిద్ర్యంపై కాసుల కొరకు దళారుల కక్కుర్తి దాడులు, ప్రోత్సహిస్తున్న ఔషధ కంపెనీలు, నిర్లక్ష్యం వహిస్తున్న ప్రభుత్వ యాంత్రాంగం, బలహీనమైన చట్టాలు, బలౌతున్న నిండు జీవితాలు.

ఔషధాల తయారీలో ఏటా పాతికవేల కోట్ల రూపాయల వ్యాపారంతో దేశంలోనే అగ్రగామిగా ఉన్న మన రాష్ట్రంలో నిబంధనలకు పూర్తి విరుద్ధంగా మనుషులపై స్వేచ్ఛగా సాగుతున్న ఔషధ ప్రయోగాలు. తీగలాగితే డొంక కదిలినట్లుగా జూన్ 16న గుంటూరు జిల్లా పిడుగురాళ్లలో వెలుగు చూసిన చేదునిజాలు, హైదరాబాద్ శివారులోని మియాపూర్‌లో ఉన్న ఔషధాల తయారీ సంస్థ యాక్సిస్ క్లినికల్స్ లిమిటెడ్‌లో చోటు చేసుకుంటున్న అక్రమ ఔషధ ప్రయోగాలను బహిర్గతం చేశాయి. చివరకు ఈ సంస్థలో జరుగుతున్న ప్రయోగాలకు బాధితులు కేవలం పిడుగురాళ్లకే పరిమితం కాకుండా రాష్ట్రంలోని అనేక ప్రాంతాల లో వందల సంఖ్యలో ఉన్నారని తేలింది. వీరంతా నిరక్షరాస్యులు, నిరుపేదలు. దళారుల మాయమాటల వలలో చిక్కుకున్న అభాగ్యులు. వీరిపై క్యాన్సర్, కీళ్ల సంబంధ వ్యాధులకు సంబంధించిన ఔషధ ప్రయోగాలు జరుగుతున్నాయి. ఈ విషయాన్ని అధికారులు ధృవీకరించి సంబంధిత సంస్థపై విచారణ మొదలు పెట్టారు. యాక్సిస్ క్లినికల్స్ బాటలో రాష్ట్రంలో మరికొన్ని ఔషధ తయారీ సంస్థలు మనుషులపై అక్రమంగా ఔషధ ప్రయోగాలను నిర్వహిస్తున్నాయి. వాటిలో జివికె బయోసైన్సెస్, డాక్టర్ రెడ్డీస్ ల్యాబ్స్ వంటి ప్రముఖ సంస్థలు కూడా ఉన్నట్లు బాధితుల వద్ద లభించిన ఆధారాలు చెబుతున్నాయి.

నిబంధనల ప్రకారం ఔషధ ప్రయోగంలో పాల్గొంటున్న లేదా సహకరిస్తున్న వ్యక్తులకు వారిపై చేస్తున్న ఔషధ పరీక్షలు, తదనంతరం తలెత్తే దుష్ప్రభావాల గురించి ముందుగా సంపూర్ణ అవగాహన కల్పించాల్సిన బాధ్యత కూడా ఆయా సంస్థలపై ఉంది. అంతేగాకుండా ఈ ప్రయోగాల వలన వారికి ఆరోగ్య సమస్యలు తలెత్తితే అవసరమైన చికిత్స చేయించాల్సిన బాధ్యత కూడా ఆయా సంస్థలపై ఉంటుంది. అయితే ఔషధ తయారీ యాజమాన్యాలు మాత్రం ఇలాంటి ప్రాథమిక నిబంధనలను సహితం ఉల్లంఘిస్తూ కేవలం తమ తమ అవసరాలకు ప్రాధాన్యతనిస్తూ, అమాయక ప్రజలను తప్పుదోవ పట్టిస్తూ వారిని జంతువులుగా వాడుకుంటున్నాయి. ఫలితంగా ప్రయోగాలలో పాల్గొన్న వారు పలురకాల ప్రాణాంతక వ్యాధులకు గురవుతున్నారు. చివరకు సదరు సంస్థల నుంచి వారికి వైద్యసహాయం గాని, నష్టపరిహారం గాని లభించక నిస్సహాయులుగా మిగిలిపోతూ మృత్యువాత పడుతున్నారు.

మార్గదర్శకాల ప్రకారం ఔషధ ప్రయోగాలలో పాల్గొనే వారిని పరీక్షల అనంతరం సుమారు పదిహేను రోజులపాటు ఔషధ ప్రయోగ సంస్థలు తమ పర్యవేక్షణలో ఉంచుకొని పౌష్టికాహారం అందించాలి. ఒకవేళ వారు అస్వస్థతకు గురయితే తిరిగి సంపూర్ణ ఆరోగ్యవంతులయ్యేంత వరకూ వారికి వైద్య సహాయం అందించాలి. అయితే ఇక్కడ జరుగుతున్నది పూర్తి విరుద్ధంగా ఉంది. తమకు అవసరమైన ఔషధ పరీక్షల ఫలితాలు అందగానే ఇక వారి అవసరం తీరిపోయిందనే విధంగా వ్యవహరిస్తున్నాయి ఔషధ ప్రయోగ సంస్థలు.

ఇటీవల వైజాగ్ నగరంలో బయటపడిన ఉదంతాన్ని పరిశీలిస్తే ఔషధ సంస్థల నిర్లక్ష్య ధోరణి ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఇక్కడ ఆక్టిమస్ బయో ప్రైవేట్ లిమిటెడ్ అనే ఔషధ సంస్థ స్థానికంగా నివసించే నలభై మంది యువకులకు డబ్బును ఎరగా జూపి, మభ్యపెట్టి వారిపై శనివారం సాయంత్రం నుంచి సోమవారం ఉదయం 11 గంటల వరకు దాదాపు 40 గంటలపాటు అనేక రకాల పరీక్షలు నిర్వహించింది. సోమవారం మధ్యాహ్నం ఇంటికి చేరుకున్న ఆ యువకులు జ్వరం, వాంతులు, ఒళ్లు నొప్పులు, నీరసం, దురద వంటి సమస్యలకు గురయ్యారు. విషయం తెలుసుకుని విస్తుపోయిన తల్లిదండ్రులు సదరు సంస్థ యాజమాన్యాన్ని నిలదీసారు. తమ అధీనంలో ఉన్నంతవరకూ వారంతా ఆరోగ్యంగానే ఉన్నారని ఆ యాజమాన్యం జవాబిచ్చింది. అంతేగాకుండా పరీక్షల అనంతరం కేవలం గంటల వ్యవధిలోనే ఆ యువకులపై ఔషధ ప్రయోగ దుష్ఫలితాలు కనిపించినప్పటికీ, వాటితో తమకేమీ సంబంధం లేదని తేల్చిచెప్పింది. ఇది నగరవాసులు, విద్యార్థులు అయిన యువకులు, వారి తల్లిదండ్రులు ఎదుర్కొన్న చేదు అనుభవం.

ఇక రెక్కాడితేగాని డొక్కాడని నిరుపేద, నిరక్షరాస్య, నిస్సహాయ జీవులు డబ్బుకు ఆకర్షింపబడి, మాయమాటల వలలో చిక్కుకుని అజ్ఞానంతో అక్రమ ప్రయోగాలకు లొంగిపోవడం చాలా సులువు. ఈ పరిస్థితికి తోడు దేశంలో మనుషులపై ఔషధ పరీక్షల నిర్వహణ తీరుపై పర్యవేక్షణకు సంబంధించిన చట్టాలు, చట్టబద్ధసంస్థలు, నిఘా సంస్థల పనితీరు అధ్వాన్నంగా ఉంది. అందుకు చిన్న ఉదాహరణగా, పైన చర్చించిన ఆక్టిమస్ బయో ప్రైవేట్ లిమిటెడ్ సంస్థ అక్రమాలపై గతంలో ఓ దినపత్రిక ప్రత్యేక కథనంతో ప్రభుత్వం దృష్టికి తీసుకువచ్చినప్పటికీ ఆ సంస్థపై ఎలాంటి చర్యలు తీసుకోలేదు. అది నేడు తొండ ముదిరి ఊసరవెల్లిలా మారినట్లు తయారైంది. అంతేగాకుండా, 2008 నుంచి 2010 వరకు దేశంలో ఔషధ పరీక్షల బారిన పడి 1500 మందికి పైగా చనిపోయినట్లు భారత ఔషధ కంట్రోలర్ జనరల్ విడుదల చేసిన అధికారిక గణాంకాలు చెబుతున్నాయి. ఈ రకంగా అధికారిక మరణాల

ఒక పక్క తెలంగాణ తెలుగే వేరు అంటూ, మరో పక్క హిందీయేతర భాషలన్నిటినీ కలిపి హిందీ భాషా రాష్ట్రాలు అనడం ఎంతవరకు ప్రజాస్వామికం అని ప్రశ్నిస్తున్నారు **మరింగంటి అప్పలాచారి**

# అవన్నీ హిందీ రాష్ట్రాలు కావు

ప్రత్యేక తెలంగాణ నినాదం సందర్భంగా పదేపదే వినిపిస్తున్న వాదనల్లో ఇదొకటి. రాజకీయవేత్తలేకాక, సాంస్కృతికోద్యమకారులు, భాషావేత్తలు, ఇతర మేధావులూ కూడా ఈ వాదన తెస్తున్నారు. మన దేశం బహుజాతుల సమ్మేళనం అన్న భావన, దాని ఆధారంగా వ్యూహం గల కమ్యూనిస్టులు, విప్లవకారులు, ప్రజాతంత్రవాదులూ కూడా చాలామంది ఇలా అంటున్నారు. వారు నిజానిజాలు పరిశీలించి, తెలిసి ఇలా అంటున్నారా? లేక తెలంగాణ నినాదాన్ని సమర్థించడానికి ఏవాదనైనా మంచిదే అని చెప్తున్నారా? 2000లో ఛత్తీస్‌ఘడ్, జార్ఖండ్, ఉత్తరాఖండ్లు ఏర్పడిన పదేళ్ళకైనా ఈ సమస్యని పరిశీలించారా? దానితో పాటు ఈ సందర్భంగా, హిందీ భాష, హిందీ భాషా రాష్ట్రాలకు సంబంధించిన కొన్ని వాస్తవాలను తెలుసుకోవడం అవసరం. శాస్త్రీయ విశ్లేషణ అవశ్యం.

## రాజ్యాంగంలో గుర్తింపు సమస్య

భారతరాజ్యాంగంలోని 8వ షెడ్యూలులో 1992కి ముందు 15 (నేడు 22) భాషలు పేర్కొనబడినాయి. రాజ్యాంగం గుర్తించిన 'జాతీయ భాషలు'గా వాటిని పేర్కొనవచ్చు. హిందీ మనదేశ 'జాతీయ భాష' అని చెప్తుంటారు, పాఠ్య పుస్తకాల్లో రాస్తుంటారు. కానీ కచ్చితంగా చెప్పాలంటే అది సరికాదు. రాజ్యాంగంలో అలా ఎక్కడా పేర్కొనలేదు. హిందీ యూనియన్ స్థాయిలో ఒక 'అధికార భాష' మాత్రమే (ఇంగ్లిషుతో పాటు), 'జాతీయ భాష' కాదు. రాజ్యాంగంలో అలా ఎక్కడా పేర్కొనలేదు. రాజ్యాంగంలో (ఆర్టికల్ 343-1) ఈ విధంగా పేర్కొనడానికి కారణాన్ని వివరించారు: కేవలం హిందీయే కాదు, ప్రాంతీయ భాషలన్నీ - అవేమీ విదేశీ భాషలు కాదు కాబట్టి - 'జాతీయ భాషలు'గానే పరిగణించ బడుతాయి - అని రాజ్యాంగ నిపుణుడు ప్రొ. ఎం.పి. జైన్ తన ఉద్గ్రంథంలో వ్యాఖ్యానించారు. (ఇండియన్ కాన్‌స్టిట్యూషనల్ లా - 6వ ఎడిషన్, 2010, పే. 841).

నిజానికి భారత రాజ్యాంగం మౌలికంగా ప్రజాతంత్రమైనదేమీ కాదు. బ్రిటిష్ వలస పాలకుల 'గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్ట్ 1935'కు నకలు అది. ఆ పరిధికి లోబడి కొన్ని మార్పులూ, చేర్పులూ జరిగాయి. వివిధ భాషలకు రాజ్యాంగపరమైన గుర్తింపుకు కూడా ఇది వర్తిస్తుంది. దేశంలోని కోట్లాది ప్రజలు మాట్లాడే అనేక జాతీయ భాషలకు రాజ్యాంగంలో గుర్తింపు లేదు. అలాంటి గుర్తింపు కోసం పోరాడుతున్న జాతులూ, భాషలూ కూడా ఉన్నాయి. భారత పాలకులు వాటిలో కొన్నింటిని ఆలస్యంగానైనా గుర్తించాల్సి వస్తున్నది. పూర్తి ప్రజాస్వామిక దృష్టితో కాకపోయినా, కొన్ని తమ రాజకీయ అవసరాలతోనే అయినా.

రాజ్యాంగం 8వ షెడ్యూలులో చేర్చాలని ఇంకా 38 భాషలు డిమాండు చేస్తున్నాయని, ఆ కోర్కెలు పరిశీలనలో ఉన్నాయని, దీనికై

---

సంఖ్య ఏటా పెరుగుతూనే ఉంది. ఈ తరహా మరణాలు రికార్డులకెక్కనివి మరెన్నో? పైగా ఔషధ ప్రయోగాల బారినపడి దుష్ప్రభావాలకు లోనై జీవచ్ఛవాలుగా బతుకీడుస్తున్న వారి సంఖ్య ఇంతకంటే ఎక్కువ. అయినప్పటికీ అక్రమ ఔషధ ప్రయోగాల నియంత్రణలో ప్రభుత్వం బాధ్యతారాహిత్యాన్ని ప్రదర్శిస్తోంది.

దురదృష్టవశాత్తు దేశంలో నెలకొని ఉన్న ఈ రకమైన జాడ్యమే బహుళజాతి సంస్థలకు ఆకర్షణీయంగా మారింది. పర్యవసానంగా భారతదేశంలో అనేక విదేశీ ఔషధ సంస్థలు ప్రస్తుతం సుమారు తొమ్మిదివేల కోట్ల రూపాయల విలువైన ఔషధ పరీక్షలు నిర్వహిస్తున్నాయి. అందులో మన రాష్ట్రం వాటా రూ.2500 కోట్లు. క్యాన్సర్, ఆర్థరైటీస్, కాలేయం, గుండెజబ్బుల వ్యాధులకు సంబంధించిన నూతన ఔషధ పరీక్షల నిర్వహణకు విదేశాల్లో నిబంధనలు కఠినతరం, పైగా ఖర్చు ఎక్కువ. తమ ఔషధ ప్రయోగాలను అత్యంత చౌకగా, నిరాటంకంగా నిర్వహించుకునేందుకు బహుళజాతి ఔషధ తయారీ సంస్థలకు భారతదేశం ప్రీతిపాత్రమైన ప్రత్యామ్నాయంగా కనిపించింది. స్థానిక ఔషధ సంస్థలతో ఒప్పందం కుదుర్చుకుని ఔట్‌సోర్సింగ్ పేరిట బహుళజాతి మందుల తయారీ సంస్థలు తమ ఔషధ పరీక్షలను భారతదేశానికి తరలిస్తున్నాయి. ఈ రకంగా మనదేశంలో సుమారు పదిహేను వందల ఓషధాల పనితీరుపై ప్రయోగాలు జరుగుతున్నాయని, ఈ ప్రయోగాలకు దేశవ్యాప్తంగా దాదాపు లక్షమంది బలి పశువులవుతున్నారని సర్వేలు వెల్లడిస్తున్నాయి. వారిలో అధిక శాతం నిరక్షరాస్యులు, నిరుపేద కూలీలు. సంబంధిత ఔషధ ప్రయోగాల గురించి ఏమాత్రం పరిజ్ఞానం లేనివాళ్ళు. వారి అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకుని దళారుల సహాయంతో ఔషధ ప్రయోగ సంస్థలు వారిచేత అంగీకార పత్రంపై సంతకం చేయించుకుని వారి చావుకు వారినే బాధ్యుల్ని చేస్తున్నాయి. ఈ విపరీత, విచ్చలవిడి ధోరణిని మననం చేసుకుని భవిష్యత్తును ఊహించుకుంటే మిగిలేది భయమే. ఓ వైపు దేశంలో, రాష్ట్రంలో రోజురోజుకూ విస్తరిస్తున్న ఫార్మా రంగం మరోవైపు దాని అవసరాలకు తగ్గట్లుగా పెరిగిపోతున్న పేదరికం. బలహీనతలను దబ్బు చేసుకునే క్రమంలో బలమైన చట్టాలు, కఠినమైన శిక్షలు లేని వ్యవస్థలో బహుళజాతి కంపెనీలు, పెట్టుబడిదారుల నీతికి స్వేచ్ఛా పరిధి అనంతం. వీ

*(రచయిత పాత్రికేయులు)*

గిటురాళ్ల నిర్ణయానికై ఒక కమిటీ వేస్తామని - హోంమంత్రి చిదంబరం పార్లమెంటులో ప్రకటించారు. ఈ విషయంలో పార్లమెంటులో కాల్ అటెన్షన్ మోషన్, చర్చ జరిగాయి. ముఖ్యంగా భోజ్‌పురి, రాజస్థానీ భాషల గురించి గలభా జరిగింది. ప్రజల నుంచి వస్తున్న డిమాండ్లు, అప్పుడున్న పరిస్థితులను బట్టి ఇప్పటివరకూ నిర్ణయాలు తీసుకున్నారని వివరించారు. (2010 ఆగష్టు 8న, 30న పార్లమెంటులో చర్చలు).

## 1992 దాకా ఉన్న 15 భాషలు

అస్సామీ, బెంగాలీ, గుజరాతీ, హిందీ, కన్నడ, కాశ్మీరీ, మళయాళం, మరాఠీ, ఒడియా, పంజాబీ, సంస్కృతం, సింధీ, తమిళం, తెలుగు, ఉర్దూ (ఇంగ్లిషు అక్షర క్రమంలో రాజ్యాంగంలో ఈ వరుసలో పేర్కొనబడినాయి). ఇందులో ప్రాచీనమైన సంస్కృతం తప్ప మిగతావన్నీ నేడు కోట్లాది ప్రజలు మాట్లాడే జాతీయ భాషలు. సంస్కృతం, సింధీ తప్ప మిగతా భాషలన్నీ వివిధ భాషా - జాతీయ రాష్ట్రాలుగా కూడా ఉన్నాయని గమనించవచ్చును. సింధ్ రాష్ట్రం పాకిస్తాన్లో ఉంది, కాని మన దేశంలోనూ సింధీలున్నారు.

1992లో 71వ రాజ్యాంగసవరణ ద్వారా మరో నాలుగు భాషలు 8వ షెడ్యూలులో చేర్చారు: డోగ్రీ, మణిపురీ, నేపాలీ, కొంకణి. ఇవన్నీ కూడా నిర్దిష్ట భాషా - జాతీయ ప్రాంతాల్లో మాట్లాడే భాషలు. కొంకణి (గోవా) రెండు భాషా రాష్ట్రాలకు చెందినది. నేపాలీ మాట్లాడే ప్రాంతం మనదేశంలో (ముఖ్యంగా బెంగాల్లో) ఉండి, ఒక రాజకీయ వివాదంగా తయారైంది (గూర్ఖాలాండ్ నినాదం). కాశ్మీర్‌కి చెందిన డోగ్రీ చేర్పుకు రాజకీయ - సాంస్కృతిక కారణాలున్నాయి.

ఆ తర్వాత 2003లో 92వ రాజ్యాంగ సవరణ ద్వారా మరి 3 భాషలు చేర్చారు. బోడో, మైథిలీ, సంథాలీ. ఇవి కూడా ఆయా భాషాజాతుల కోర్కెల మేరకు చేర్చబడినవే. బోడో రాష్ట్రం కోసం అస్సాంలో ఉద్యమం ఒకటి ఉన్నది. (కేంద్రం నుంచి దానికి కొంత ప్రోత్సాహం కూడా ఉన్నది. అందుకే రాష్ట్రం ఏర్పడకపోయినా, రాజ్యాంగంలో గుర్తింపు నిచ్చారు. ఇది నేపాలీకి కూడా కొంత వర్తిస్తుంది.)

## మూడు కొత్త రాష్ట్రాలు : హిందీ రాష్ట్రాల విభజన కాదది

నవంబర్ 2000లో మూడు కొత్త రాష్ట్రాలు వేర్పడి, ఏర్పడ్డాయన్నది తెలిసిందే : జార్ఖండ్ (బీహారు నుంచి), ఉత్తరాఖండ్ (ఉత్తరప్రదేశ్ నుంచి), చత్తీస్‌గడ్ (మధ్యప్రదేశ్ నుంచి). 'హిందీ రాష్ట్రాల' విభజన క్రమంలో ఇదొక భాగంగా చెప్తున్నారు. కానీ నిజానికి అవి హిందీ రాష్ట్రాలు కావు, వివిధ విభిన్న, విశిష్ట భాషలతో కూడిన మిశ్రమ భాషల రాష్ట్రాలు.

'జార్ఖండ్' అంటే అర్థం - అడవులు, చిట్టడవుల ప్రాంతం. జనాభాలో 28 శాతంగా ఉన్న 32 గిరిజన తెగలు, మరో 12 శాతంగా వున్న ఎస్.సి.లుగా గుర్తించబడిన వారు (మొత్తం 40 శాతం) కల ఆదివాసీ రాష్ట్రం ఇది. క్రీ.శ. 1200 నుంచీ గిరిజన (ముఖ్యంగా సంథాలీ, ముండా) జాతుల రాజులు పాలించిన ప్రాంతం. 1765లో ఈస్ట్ ఇండియా పాలన నాటి నుంచీ ఈ ప్రాంతం పేరు జార్ఖండ్, ఈ కొత్త రాష్ట్రం జనాభా 2.7 కోట్లలో 70 శాతం మంది 'జార్ఖండీ' పేర్కొనే ఆదివాసీ భాషలవారు. అందులో ముఖ్యమైనవి సంథాలీ, ముండారీ, హో భాషలు. కొన్ని ద్రావిడ భాషలు కూడా (కురుఖ్, కోర్వా మొ.) ఉన్నాయి. ఈ భాషలన్నీ నిర్దిష్ట ప్రాంతాలు కల జనావాసాలు. సంథాలీకి 'ఓల్చికి' అనే ఆధునిక లిపి కూడా వినియోగంలో ఉంది. హో భాషవారు "వరాంగ్ చీటీ" అనే లిపిని వాడుతున్నారు. కురుఖ్ భాషకు 'తొలాంగ్ సికి' అనే లిపిని అభివృద్ధి చేశారు (సవర భాషకు లాగా, కానీ పూర్తి వినియోగంలో లేదు). ఈ రాష్ట్రంలో పది శాతం మంది బెంగాలీ వారున్నారు (ఆ సరిహద్దులో). 70 శాతం మంది 'జార్ఖండీ', పదిశాతం మంది బెంగాలీ, కొందరు ద్రావిడ భాషలు మాట్లాడే ఈ రాష్ట్రం 'హిందీ రాష్ట్రాల' విభజన క్రమంలో ఏర్పడినట్టు చెప్పడం సరైందా?

జార్ఖండ్‌లోని విశాల భాగంలో ప్రజలు మాట్లాడే విభిన్న, విశిష్ట భాష సంథాలీకి రాజ్యాంగ గుర్తింపు లభించింది, ఆలస్యంగా నైనా 2003లో రాజ్యాంగ సవరణ పూర్తయింది. జార్ఖండ్ విడిపోయిన తర్వాత మిగిలిన బీహారులో ఒక ముఖ్యమైన భాష మైథిలీ. దాని గుర్తింపు కోసం దశాబ్దాలుగా ఒక డిమాండు ఉంది. జార్ఖండ్ రాజకీయ విభజన తర్వాత, మైథిలీకీ ఆ గుర్తింపు లభించింది. ఇంకా అనేక భాషలు రాజ్యాంగంలో గుర్తింపుకై పోరాడుతున్నాయి. భోజ్‌పురి అందులో ముఖ్యమైనది. ఇప్పటికే పరిశీలనలో ఉన్న డిమాండ్లలో ఇదొకటి. రాజ్యాంగంలో గుర్తింపు ఇంకా అసంపూర్ణ ప్రక్రియగానే ఉంది.

చత్తీస్‌గడ్ అధికార భాష చత్తీస్‌గడీ, హిందీకి కూడా ఆ హోదా ఉంది. రెండు కోట్ల జనాభా కల ఈ ఆదివాసీ రాష్ట్రంలో చత్తీస్‌గఢ్ మాట్లాడేవారు 1.2 కోట్లని అంచనా. ఇది విభిన్న, విశిష్ట భాష. ఇది హిందీ కాదు. హిందీ మాండలికాల్లో ఒకటి కాదు. చత్తీస్‌గడ్‌కే 8 మాండలికాలున్నాయి. ఈ భాషలో అరవైకి పైగా సినిమాలు తీశారు. ఇది కాక తెలుగు, కోయ తదితర ద్రావిడ భాషలు మాట్లాడేవారు ఉన్నారు. అన్నీ కలిపితే 90 భాషలూ, మాండలికాలున్నాయి. ఇలాంటి రాష్ట్రాన్ని హిందీ రాష్ట్రాల్లో ఒకటిగా చెప్పటం తప్పు.

కొత్త రాష్ట్రాల్లో మూడోది ఉత్తరాఖండ్. యు.పి. నుంచి వేర్పడ్డ ఈ రాష్ట్రం జనాభా 85 లక్షలు (2001). అందులో 40 లక్షల మంది ఈ పడమటి భాగంలో ఉండే జనం గఢ్వాలీ భాష మాట్లాడుతారు. తూర్పుభాగంలోని 24 లక్షల మందిది (1998 డేటా) కుమావోని భాష. మిగతా జనం వివిధ 'పహాడీ' మాండలికాల్లో మాట్లాడుతారు. ఇవన్నీ హిందీ మాండలికాలు కాదు, 'పహాడీ' మాండలికాలు. కుమావోనీకి స్వంత లిపి ఉంది. అధికారికంగా దానికి సెకండ్ లాంగ్వేజ్ హోదా ఇచ్చారు. (హిందీలో కాక విడిగా) ఈ భాషలో 55 శాతం అక్షరాస్యత ఉంది. 'పహాడీ' భాషలు కొన్ని ప్రాచీనమైనవే కాక లిఖిత భాషలు కూడా. సంస్కృతంలో ఉన్న వైదిక రచనలకు విరుద్ధంగా ఈ 'పహాడీ' భాషల్లో బౌద్ధుల రచనలూ, ప్రచారమూ సాగినట్టుగా ఆధారాలున్నాయి. అశోకుడి కాలంలో వాటి దాఖలాలున్నాయి. తర్వాత వాటి అధికారిక హోదా దెబ్బ తిన్నది. అవి భాషలే కాదు, భాషా జాతులు కూడా. ఉదాహరణకి: గఢ్వాలీ జనం, కుమావోనీ జనం అని వాడుక ఉంది.

ఈ విధంగా కొత్తగా ఏర్పడిన మూడూ హిందీ రాష్ట్రాలు కాదు. 3 హిందీయేతర భాషా రాష్ట్రాలను విడదీసి ఏర్పరిచారని చెప్పవచ్చు. వీటిని విడదీయగా మిగిలినవీ హిందీ రాష్ట్రాలు కాదు. బీహార్లో కూడా హిందీ కాక, 'బీహారీ'గా చెలామణి అయ్యే భాషా సముదాయం ప్రధానం (భోజ్‌పురీ, మైథిలీ, మగధి మొ.). బీహార్ జనాభా 8.29 కోట్లు (2001). ఇప్పుడు సుమారు 10 కోట్లు. అందులో భోజ్‌పురి మాట్లాడేవారు 7 కోట్లు, మైథిలీ 1.2 కోట్లు, మగధి 1.75 కోట్ల మంది ఉన్నరని అంచనా. ఈ అన్నిటినీ కలిపి బీహారీ భాష అని కూడా అంటారు. 'బీహారీ' హిందీ వలెనే ఇండో ఆర్యన్ భాషా జాతికి చెందినది, అది హిందీ కాదు.

ఉత్తరాఖండ్ పోగా మిగిలిన యు.పి. జనాభా 16.6 కోట్లు (2001). ఇప్పుడు సుమారు 20 కోట్లు. అందులో భోజ్‌పురి మాట్లాడేవారు 7 కోట్లు, మైథిలీ 1.2 కోట్లు, అవధి 2 కోట్లు. కోటి మంది కనౌజీ, ఇంకా అంతే మంది బ్రజ, బుందేలీ భాషలు మాట్లాడే జనం. ఇవన్నీ నిర్దిష్ట ప్రాంతాల్లో మాట్లాడే భాషలు. ఆయా భాషా ప్రాంతాల వారీగా బీహార్, యు.పి. మ్యాపులు ఉన్నాయి. ఆ రకంగా యు.పి. నేటికీ బహు భాషా రాష్ట్రం. అందులో హిందీ మైనారిటీ భాషే.

చత్తీస్‌గడ్ పోగా మిగిలిన మధ్యప్రదేశ్ ప్రధానంగా హిందీ మాట్లాడే రాష్ట్రంగా చెప్పవచ్చు. కొన్ని ప్రాంతాల్లో బుందేలీ ఉన్నా. అందుకే ఉత్తరాదిలో, ముఖ్యంగా యు.పి.లో, కొత్త రాష్ట్రాలకై డిమాండ్లు ఉన్నాయి. పూర్వాంచల్, హరితప్రదేశ్, బ్రజభూమి, బుందేల్‌ఖండ్ మొదలైనవి వీటిలో కొన్ని పొరుగు రాష్ట్రాలతో ముడిపడినవి. వీటిని కాంగ్రెసు, బి.జె.పి., బి.ఎస్.సి., అజిత్‌సింగ్ బలపరుస్తున్నారు. బలంగా వ్యతిరేకించేవారెవరూ లేరు.

### అవన్నీ హిందీ రాష్ట్రాలూ కాదు, హిందీ మాండలికాలూ కాదు

ఈ విషయంలో తప్పుడు అభిప్రాయాలకు మూలాలేమిటి? అసలు ఈ భాషల పూర్వాపరాలేమిటి? కొంత తెల్సుకుందాం. దక్షిణాది వారందరినీ మద్రాసీలంటున్నారనీ. తెలుగువారి గురించి తెలియదనీ, ఉత్తరాదిలో ఈ మాత్రం విషయం పరిజ్ఞానంలేదనీ, ఎన్.టి.ఆర్. ప్రభుత్వం తర్వాత పరిస్థితి మారిందనీ చెప్తుంటారు. అక్కడ వదిలినా అలాంటి అజ్ఞానం ఉత్తరాది వారి గురించి దక్షిణాది వారిలో నేటికీ పోలేదని చెప్పవచ్చు. అందుకే పది దాకా హిందీ రాష్ట్రాలున్నాయని చెప్తుంటారు. దక్షిణాదిలో ద్రావిడ జాతికి చెందిన వివిధ భాషలున్నట్టే, ఉత్తరాదిలో ఇండో ఆర్యన్ జాతి భాషలున్నాయని, అవి వేర్వేరు, విశిష్ట భాషలనీ గ్రహించాలి.

ఈస్టిండియా రోజుల్లో యు.పి., మధ్యప్రదేశ్, బీహార్‌లను వరుసగా యునైటెడ్ ప్రావిన్సెస్, సెంట్రల్ ప్రావిన్సెస్, నార్దన్ ఫ్రాంటియర్ ప్రావిన్సెస్ అనే పేర్లతో పిలిచేవారు. రాజస్థాన్‌ని యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ రాజస్థాన్ అనేవారు. ప్రావిన్సెస్, స్టేట్స్ అనే బహువచనం వాటి మిశ్రమ స్వభావాన్ని ఎత్తి చూపగలుగుతుంది. గత చరిత్ర సరే, ఇప్పుడైనా వాస్తవాల్ని గుర్తిస్తున్నామా? హర్యానా జనాభా 2.1 కోట్లలో (2001) డెబ్బై శాతం మంది హిందీ కాదు, హరియాన్వీ మాట్లాడే జనం. హిందీలో అక్షరాస్యత 68 శాతం అయితే, హరియాన్వీలో 55 శాతం. స్కూళ్లలో హరియాన్వీని సెకండ్ లాంగ్వేజ్‌గా బోధిస్తున్నారు. పంజాబునించి భాష ప్రాతిపదికపైనే విడిపోయి 1966లో హర్యానా, 1971లో హిమాచల్ ప్రదేశ్ ఏర్పడినాయి. హిందీ మాండలికాలు కాదు, హరియాన్వీకే అనేక మాండలికాలు ఉన్నాయి. అలాగే హిమాచల్‌లో కినౌరీ వంటి అనేక పహాడీ భాషలు, వాటి మాండలికాలు ఉన్నాయి. పహాడీ భాషల్లో అశోకుడి నాటి లిఖిత సాహిత్యం ఉంది. అవి హిందీ మాండలికాలు కాదు.

అలాగే రాజస్థాన్ జనాభా 5.6 కోట్లలో (2001) 3.8 కోట్ల మంది రాజస్థానీ మాట్లాడే జనం. దేశ విదేశాల్లో రాజస్థానీ మాట్లాడే జనం మొత్తం 8 కోట్ల మంది అని అంచనా. రాజస్థానీకే అనేక మాండలికాలు ఉన్నాయి. అవి హిందీ మాండలికాలు కాదు. 1980లోనే రాజస్థానీని విశిష్ట భాషగా భాషావేత్తలు గుర్తించారు. కేంద్ర సాహిత్య అకాడమీ, యు.జి.సి. మొదలగు సంస్థలు గుర్తిస్తున్నాయి. 1973 నుంచీ స్కూళ్లలో ఆప్షనల్‌గా బోధిస్తున్నారు. రాజస్థానీ పత్రికలు, సినిమాలు ఉన్నాయి. రాజస్థానీని 8వ షెడ్యూలులో చేర్చాలన్న డిమాండ్ పరిశీలనలో ఉంది. వాస్తవాలు ఇలా ఉన్నా, పై మూడింటినీ పది హిందీ రాష్ట్రాలున్నాయని చెప్పే దానిలో నేటికీ చేర్చే వారున్నారు. మైథిలీ, సంథాలీలకు రాజ్యాంగపు 8వ షెడ్యూలులో స్థానం లభించాక కూడా ఆయా రాష్ట్రాలను హిందీ రాష్ట్రాలుగా చెప్తూనే ఉన్నారు.

1961, 1971 జనాభా లెక్కల్లో భాగంగా మాతృభాషల సర్వే కూడా జరిగింది. దేశంలో 1652 భాషలను గుర్తించారు. 1971లో హిందీ రాష్ట్రాలుగా చెప్పబడే వాటి జనాభా ఇరవై కోట్లైతే అందులో 5 కోట్ల మంది – అంటే నాల్గో వంతు – తమ భాష హిందీ కాదని చాటి చెప్పారు. భోజ్‌పురీ, మైథిలీ, మగధీ, రాజస్థానీ, గడ్వాలీ, కుమావోని, సంథాలీ మొదలగు భాషలను పేర్కొన్నారు. ఆ తర్వాత కాలంలో ఈ లెక్కలను మానేశారు. నిరక్షరాస్యులైన ప్రజలు చెప్పినా, రాసే ఉద్యోగుల బట్టి నమోదు కావడం వల్ల హిందీ జన సంఖ్య ఆ మాత్రమైనా ఉంది. ప్రభుత్వ ప్రోత్సాహం, వత్తిడి, అధికార భాషా ప్రచారం వల్ల అలా నమోదైంది. (కొన్ని వివరాలు మనోరమ ఇయర్ బుక్ వెనుకటి సంచికల్లో ఉన్నాయి. లాంగ్వేజ్ హ్యాండ్‌బుక్ నుంచి ప్రచురించారు)

### అవి మూల భాషలు, మాండలికాలు కాదు

ప్రభుత్వ ప్రోత్సాహం, వత్తిడి, భారీ ఖర్చుల ఫలితంగా కాల క్రమంలో హిందీ అనుసంధాన, అధికారిక భాషగా ఏర్పడింది అని చెప్పవచ్చునే కానీ, అది మూల భాష, మిగితావి దాని మాండలికాలు అనడానికి ఎలాంటి ఆధారమూ లేదు. భాషా వేత్తలు దీన్ని తేల్చి చెప్పారు. ప్రభుత్వం చేసేది తప్పుడు ప్రచారం. ఉదాహరణకి కొన్ని వాస్తవాలను గమనిద్దాం.

భోజ్‌పురి : 15 కోట్ల మంది మాతృ భాష. (7 కోట్లు యు.పి.లో, 8 కోట్లు బీహార్లో ఉన్నారని అంచనా.) పడమటి బీహార్లో, తూర్పు యు.పి.లో (పూర్వాంచల్ డిమాండ్ ఇక్కడే), వాయవ్య జార్ఖండ్లో మాతృభాష. అనేక మాండలికాలు ఉన్నాయి. 4 తూర్పు యు.పి.లోనే. 3.3 కోట్ల మంది మాతృభాషగా 2001 జనాభా లెక్కల్లో నమోదు చేసుకున్నారు. రాజ్యాంగంలో గుర్తింపు లేదు కాబట్టి, హిందీ సబ్ గ్రూపుగా రాశారు. ఆధునిక హిందీ పుట్టుకకు ఒక మూలం ఈ భాష అని నిపుణులు చెప్తారు. మనం తల్లిని బిడ్డగా చూస్తున్నాం. ఈ భాషలో 50 ఏళ్ళుగా సినిమాలు తీస్తున్నారు. రవికిషన్ అనే హీరో 150 భోజ్‌పురి సినిమాల్లో వేశాడంటే మనం నమ్మగలమా? భోజ్‌పురికి కనీసం 16వ శతాబ్ది నించీ కైతీ లిపి వాడుకలో ఉంది. మొఘల్ పాలనలో నాస్తా లిఖ్‌లో రాశారు. మళ్ళీ 1880 తర్వాత కైతీ లిపి – కోర్టుల్లో, ఆఫీసుల్లో కూడా–వాడారు. బ్రిటిషు వారు ప్రమాణీకరించారు. ప్రాథమిక పాఠశాలల్లో బోధన, లిఖిత భాష ఇదే. కొన్ని జిల్లాల్లో 1960ల దాకా అలాగే కొనసాగింది. 1894లో దేవనాగరిలో కూడా రాయడం మొదలైంది. రాహుల్ సాంకృత్యయాన్ ఆరు నాటికలు భోజ్‌పురిలోనే రాశారు. 5 భోజ్‌పురి దినపత్రికలున్నాయి. మహువా, హమార్ టి.వి. ఛానెల్స్, వికీపీడియా, అనేక వెబ్‌సైట్లు ఉన్నాయి. అరిందం చౌదరి పత్రిక ది సండే ఇండియన్‌కి హిందీ, భోజ్‌పురి రెండు ఎడిషన్‌లు ఉన్నాయి. హబీబ్ తన్వీర్, భికారి ఠాకూర్ నాటక ప్రముఖులు. ఇంత సంపన్నమైన ఈ మూల భాషను హిందీ మాండలికాల్లో ఒకటిగా చెప్పడం. యు.పి., బీహార్లను హిందీ రాష్ట్రాలుగా చెప్పడం ఎంత తప్పు? ఇది తెలిసీ ప్రత్యేక వాదులు తప్పుడు ప్రచారం చేయడం, ఇక్కడి

భాషవేత్తలూ, విప్లవకారులూ, ప్రజాతంత్రవాదులూ మౌనం దాల్చడం దీన్ని ఏమనాలి?

మైథిలీ : 2003లో రాజ్యాంగంలో చేర్చిన ఈ భాషను 2001 లెక్కల ప్రకారం 1.22 కోట్ల మంది అనధికారికంగా 4.5 కోట్లమంది మాట్లాడుతున్నారు. కేంద్ర సాహిత్య అకాడెమీ హిందీకి కాక విడిగా ఈ భాషలో బహుమతులిస్తుంది. 1911, 1931 భాషాగణన సర్వేలో ఉన్న ఈ భాషను 1981 తర్వాత హిందీలో కలిపేశారు. కానీ తప్పక రాజ్యాంగంలో చేర్చిన భాషగా మళ్ళీ అవతరించింది. అపార చరిత్ర కల భాష, 1224 నాటి వర్ణ రత్నాకరం (జోతీశ్వర్ ఠాకూర్ రచన) నించీ లిఖిత సాహిత్యం ఉంది. విద్యాపతిని (1350-1450) మైథిలీ కాళిదాసు అంటారు. నేటికీ విద్యాపతి సమరోహ్ జరుపుతారు. ఆయనే నాటి దర్భంగా రాజ్యంలో సంస్కృతం స్థానంలో అధికార భాషగా చేయించాడు. క్రీ. పూ. 1500-500 నాటి మూల మగధి భాష నుంచి భోజ్‌పురీ, మైథిలీ, మగధీ, బెంగాలీ, ఒడియా వేరు పడ్డాయని నిపుణులు చెపుతారు. ఇంత సంపన్నమైన ఈ మూలభాషను హిందీ మాండలికాల్లో ఒకటిగా చెప్పడం ఏమిటి?

ఈ సందర్భంగా గమనించాల్సిన విషయం : 1905లో ఈ భాషలో మొదలైన మైథిలీ హిత సాధన మాసపత్రిక తర్వాత మిథిల మోద పేరిట 22 ఏళ్ళ పాటు 1927 దాకా నడిచింది. పదేళ్ళ అంతరాయం తర్వాత 1937లో మళ్ళీ వచ్చి, 1941లో మూత బడింది. హిందీని సోదర భాషగా గుర్తించి, కొన్ని పేజీలు దానికీ కేటాయించారు. 1914లో బీహారు హిందీ సమ్మేళనం మైథిలీని హిందీ మాండలికాల్లో ఒకటిగా చెప్పడంతో నిరసనగా హిందీ పేజీలు ఆపేశారు. ఏది మూలం? ఏది మాండలికం? 1989లో కేంద్ర సాహిత్య అకాడెమీ ప్రచురించిన ఎన్ సైక్లో పీడియా ఆఫ్ ఇండియన్ లిటరేచర్‌లో ఇలా రాశారు - తర్వాతి కాలంలో కొందరు హిందీ ఔత్సాహికులు మైథిలీ హిందీ మాండలికాల్లో ఒకటిగా రుజువు చేయడానికి వృథా ప్రయత్నం చేశారు. ఈ దురభిప్రాయం తప్పని శాస్త్రీయంగా భాషా వేత్తలు (గ్రియర్సన్, ఎస్.కె. చటర్జీ, విలియం కేరీ మొదలైనవారు రుజువు చేశారు. "మైథిలీ ఒక భాష, మాండలికం కాదు... పద సంపదలోనూ, వ్యాకరణంలోనూ అటు హిందీ నుంచి, ఇటు బెంగాలీ నుంచి వేరైన భాష. మరాఠీ ఒడియాలు ఎంత వేరో అంత వేరైన భాష మైథిలీ." అని రాశారు గ్రియర్ సన్.

మైథిలీకి విడిగా మిథిలాక్షర్ అనే లిపి ఉంది. తిర్హుటా, కైతీ అనే లిపులు కూడా ఉన్నాయి. (కొంకణికి ఇలాగే మూడు లిపులున్నాయి : దేవనాగరి, కన్నడ, రోమన్). తిర్హుటా గుప్తుల కాలం నాటి లిపి నుంచి రూపాంతరం చెందింది. ఆ లిపిలో అనేక రచనలు మిథిల, నేపాల్, టిబెట్లలో లభించాయి. మైథిలిని నేడూ బనారస్, కలకత్తా, అలహాబాద్, ఖాట్మండూ విశ్వవిద్యాలయాల్లో బోధిస్తున్నారు. తెలుగుకి లాగే దీనికీ ఇటాలియన్ ఆఫ్ ఈస్ట్ అని పేరుందిట (ఓ కారాంత, ఆ కారాంత శబ్దాల వల్ల). మైథిలీకే ఆరు మాండలికాలున్నాయి. అందులో ఉన్నత వర్గాలు మాట్లాడే శిష్ట వ్యావహారికమూ ఉంది. మిథిలా మిహిర్ అన్న పత్రిక 1909లో ప్రారంభమై ఉత్తమ సాహిత్యాన్ని ప్రచురించింది. 1954లో మూతబడి, 1960లో మళ్ళీ అవతరించింది. 1984లో దిన పత్రికగా మారి, రెండేళ్ళు నడిచి, 1987 నుంచి మాస పత్రికగా నడుస్తున్నది. అంటే నూరేళ్ల పత్రిక. (ఈ వివరాలు పై ఎన్‌సైక్లోపీడియావే.)

నేటికీ యు.పి.లో పధ్నాలుగు జిల్లాల్లోను, యు.పి. బైట అనేక రాష్ట్రాల్లోను కోట్లాది మంది మాట్లాడే అవధి. అలాగే బ్రజ భాషలకూ ఇలాంటి ఉజ్వల చరిత్ర ఉంది. అవే మూల భాషలు. వందేళ్ళ కిందటి వరకూ సాహిత్యం వాటిలోనే వచ్చింది. తులసీదాస్, సూర్‌దాస్, అమీర్ ఖుస్రో వంటి భక్తి - సూఫీ కవులు, రాసింది ఈ భాషల్లోనే. వాటిని మరిపించి, అధికార బలంతో, కోట్లాది రూపాయల ఖర్చుతో హిందీని నిరంకుశంగా రుద్దాలని వృథా ప్రయత్నం చేస్తున్నారు. ఇవన్నీ హిందీ మాండలికాలనీ, హిందీ రాష్ట్రాలనీ చెప్పడం, మనమూ ప్రచారం చేయడం ఎంత అపచారం? ఎంత అప్రజాస్వామికం?

తెలంగాణ మాండలికాలకున్న ప్రత్యేకతల గురించి కొందరు అది వేరే భాష అనేదాకా వెళ్ళారు. చెప్పున్న ప్రత్యేక వాద మేధావులు ఎంతో చరిత్ర, ప్రత్యేకతలూ ఉన్న అనేక భాషలను హిందీతో కలిపికొట్టి, తమ వాదాన్ని బలపరచుకోవడం తగని పని. ఇక్కడి సమస్యను హిందీ రాష్ట్రాలను విడదీయడంతో పోల్చడం తెలిసి చేసినా, తెలియక చేసినా చెల్లని వాదన. తమ భాష గురించి చెప్పుకొని, ఇతర భాషలను ఇలా చూడడాన్ని ప్రజాతంత్ర లక్షణంగా భావించలేం. దీన్ని ఏమనాలో వారే చెప్పాలి. విప్లవ, ప్రజాతంత్ర వాదులుగా చెప్పుకునే వారు కూడా ఇలాంటి ధోరణి ప్రదర్శించడం విచారకరం. బాగా తెల్సిన పెద్దలు కూడా ఇలాంటి వాటి వల్ల మౌనం దాల్చడం విషాదకరం. వారి చిత్తశుద్ధిని శంకించే స్థితిని కల్పిస్తున్నారు. వీక్షణం జనవరి 2010 సంచిక సంపాదకీయంలో చెప్పినట్టు తెలుగు జాతి ఇలాంటి తప్పుడు వాదనలపై, అబద్ధాలపై ఆధారపడి ఉద్యమాలు నిర్మించజూడడం ఇంకా విషాదకరం.

ప్రత్యేక తెలంగాణ ఏర్పాటు ఒక కీలక నిర్ణయం అనీ, ఇతర ప్రాంతాల్లో దాని ప్రభావం ఏమిటో చూడాలనీ శ్రీ కృష్ణ కమిటీ పేర్కొంది. దాన్ని కొట్టి పారేస్తే చాలదు. అందులో తప్పులొక ఎత్తయితే, నిరంకుశ కేంద్ర పాలక వర్గాల్లోని ఆలోచన తెలుసుకోవడం అవసరం మరొక ఎత్తు: తెలంగాణ సందర్భంగా దేశంలో రాష్ట్రాల పునర్ విభజన తర్వాత మొదటి సారిగా భాషా రాష్ట్రాన్ని విడదీయడం జరుగుతుందని అన్నది. దీని పర్యవసానాలేమిటో ఆలోచించాలి అని చెప్పింది. (పే. 452). 2000లో ఏర్పడిన మూడూ హిందీ రాష్ట్రాలు కాదనీ, అవి కొండ ఆదివాసీ ప్రాంతాలనీ మరోచోట సూచించింది. ఒక ప్రాంతం తన స్టేటస్ని తాను నిర్ణయించుకుంటామంటే కేంద్రం అనుమతిస్తుందా అని ప్రశ్నించింది. భారత హోం శాఖలో ఒక బలమైన అభిప్రాయం అది.

దేశంలో కేంద్రానికి వివిధ భాషా జాతులకు కల మౌలిక వైరుధ్యం దృష్ట్యా రాజకీయంగా, వ్యూహాత్మకంగా కూడా విప్లవకారులూ, విప్లవ ప్రజాతంత్ర వాదులూ ఆలోచించవలసిన ఒక ముఖ్యాంశం ఇది. జనతా ప్రజాతంత్ర విప్లవంలో ఒక భాగం ఇది అన్నప్పుడు దానిలో ఇమిడి ఉన్న సమస్యలేమిటి అనేది చూడాలి. కమిటీ అభిప్రాయం మంచీ చెడూ అలా ఉంచి ఈ అంశాన్ని ఈ కోణం నుంచి ఆలోచించడం అవసరం. అంతేకాక, అలా ఆలోచించేవారు ఉంటారన్న స్పృహ ఉండాలి. ఏ ఉన్మాదమైనా సమస్యకు పరిష్కారం కాజాలదు. శాస్త్రీయ ఆలోచనకు ఉన్మాదం ప్రత్యామ్నాయం కాజాలదు. ఆలోచన చేసే సందర్భంగా ప్రజాతంత్ర వాతావరణం ఉండాలి. అది తీవ్రంగా లోపిస్తున్నదని పరిస్థితి ఇలా ఉంటే రేపటి తెలంగాణ ఎలా ఉంటుందోనన్న ఆందోళన కలుగు తున్నదని ప్రొ. హరగోపాల్ అన్న మాటను సీరియస్‌గా తీసుకోవాలి. (వరంగల్ దశదిశలో ఆయనతో పాటు వరవరరావు కూడా ఇలా భావించినట్టు హరగోపాల్ చెప్పారు).

*(రచయిత రిటైర్డ్ ఉపాధ్యాయులు)* వీ

స్వాతంత్ర్యం వచ్చి ఆరు దశాబ్దాలు దాటినా మహిళలూ, దళితులూ, ఆదివాసులూ, మైనారిటీలూ, బహుజనులూ ఇలా ఏ ప్రజాసమూహాన్ని చూసినా సమస్యల సుడిగుండంలో కొట్టుమిట్టాడుతున్నాయని అంటున్నారు **లోకే రాజ్‌పవన్**

# చీకటిలోంచి చీకటిలోకి...

"భారతదేశం అతిగొప్ప ప్రజాస్వామ్యదేశం. ఇది ప్రపంచ ప్రజాస్వామ్యాలలోకెల్లా తలమానికమైనది. దేశ సమగ్రత, సార్వభౌమాధికారం లాంటి అపూర్వమైన లక్షణాలు ఈ దేశ పౌరపురోభివృద్ధికి దోహదం చేస్తూ సమైక్య జాతీయతను ప్రోత్సాహ పరుస్తున్నాయి..." సెంటర్ ఫర్ ఎకనామిక్స్ అండ్ సోషల్ స్టడీస్ (సెస్) లో ఎంఫిల్ తరగతులు వింటున్నపుడు ఒక ప్రొఫెసర్ ఇలా చెప్తుంటే అతని మాటల్లో కదలాడుతున్న హిపోక్రసీ చూసి చాలా జాలి వేసేది. 65 సంవత్సరాల స్వాతంత్ర్యం నిజంగా దేశానికి ఆ లక్షణాలను అందించిందా? స్వయంపాలన వల్ల జాతి మొత్తానికి కనీసంగా కొన్ని సాధారణ ప్రయోజనాలైనా ఒనగూడాయా? అనే చర్చ ద్వారానే నిజానికి భారతదేశ స్వాతంత్ర్యానంతర ఫలితాలను విశ్లేషించడం సాధ్యమవుతుంది. ఆ చర్చ కూడా తాత్విక కోణంలో విశ్లేషించడానికి మాత్రమే ఉపయోగపడే కొలమానం అవుతుంది. తప్ప ఈ 65 సంవత్సరాలలో ఆచరణలో దేశం ఏ నైతిక విలువలకు, మానవీయ స్వభావాలకు దూరమైందో ఆ ఆచరణకు కొలబద్దగా మాత్రం ఉపయోగపడదనే చెప్పవచ్చు.

నాలుగు వందల సంవత్సరాలు పరాయి పాలనలో మగ్గిన ఒక దేశం కేవలం 65 సంవత్సరాలలో ఇతోధిక వృద్ధి సాధించాలనుకోవడం అత్యాశే అవుతుంది అని ఇప్పటికీ వాదించే వాళ్లున్నారు. అయితే అభివృద్ధి చెందకపోవడానికి గానీ, ప్రస్తుత సమస్యలకు గానీ కారణభూతమైన పరిస్థితులు ఆ పరాయి పాలన కొనసాగింపు ఫలితాలే అయినపుడు నిజంగానే ఈ 65 సంవత్సరాలు సరిపోవు. పరాయి పాలన అవశేషాలు సామాజిక స్థితిగతులలో ఇంకా నిక్షిప్తమై ఉండి అడుగడుగునా దేశ పురోగమనానికి అడ్డుపడుతూ పోతుంటే అప్పుడు ఇంకొక యాభై సంవత్సరాలో, వంద సంవత్సరాలో గడవనిదే గానీ లాభం లేదని స్వీయసంతృప్తి పొందవచ్చు. కానీ నిజంగా పరాయి పాలన ప్రభావం ఇంకా ప్రజాజీవితాల మీద, దేశాభివృద్ధి మీద అలాగే పరుచుకుని ఉందా? దీనికి సమాధానం ఖచ్చితంగా 'లేదు' అనే చెప్పాలి. స్వయంపాలనను సాగిస్తూ పరాయి బీజాలను స్వాతంత్ర్యానంతరం తమ విధానాలతో చాలా మట్టుకు తొలగించ గలిగారు. అయితే పరాయి విధానాలనే మక్కీ కొడుతూ, పరాయి వ్యాపారాలను స్వదేశంలో ప్రోత్సహిస్తూ రావడం వంటి పరోక్ష చర్యలు చేస్తుండవచ్చు. అది వేరే సంగతి. కానీ నాలుగు వందల సంవత్సరాల పరాయి పాలన, 65 సంవత్సరాల స్వయం పాలనను అణిచివేస్తూ ఇంకా దేశం వృద్ధి చెందకపోవడానికి కారణంగా లేదనే చెప్పుకోవచ్చు.

అసలు భారతదేశం ఈ 65 సంవత్సరాలలో అభివృద్ధి చెందిందా? లేదా? అనేది ఒక ప్రధానమైన చర్చనీయాంశం. ఏ దేశం అయినా నూటికి నూరుశాతం అభివృద్ధి చెందకుండా ఉండదు. ఎంతో కొంత వృద్ధి జరుగుతూనే ఉంటుంది. అయితే నూటికి నూరు శాతం వృద్ధి జరగాలనే లక్ష్యం కోసం మాత్రం కొన్ని సంస్థలు, మనుషులు ఇప్పటికీ పోరాడుతూనే ఉన్నారు. ఉరికొయ్యలందుకుని ఊగుతూనే ఉన్నారు. వారిది కూడా దురాశే అనేవారున్నారు. అదే నిజమని తాత్కాలికంగానే భావించినా, కనీసం నూటికి యాభై శాతమైనా ఒక దేశం వృద్ధి చెందకపోతే 65 సంవత్సరాల ఆ స్వయంపాలనకు అర్థం ఏమిటి? సాధించిందేమిటి? అని ప్రశ్నించడం తెలిసిన ఏ ఒక్కరైనా అడుగుతారు. బహుశా ప్రస్తుతం మనకు మనం ఆ కోణంలోనే ప్రశ్నించుకోవలసిన సందర్భం వచ్చిందేమో!

అసలు స్వాతంత్ర్యోద్యమాన్ని నిశితంగా గమనిస్తే ఆ ఉద్యమ మౌలిక స్వభావంలోనూ, ఆచరణలోనూ ప్రధానంగా లోపాలున్నాయి. స్వాతంత్ర్యోద్యమ నాయకులు ఆనాటికి సమకాలీనమైన అనేక ఆదివాసీ ఉద్యమాలను, రైతాంగ ఉద్యమాలను, విముక్తి ఉద్యమాలను, సామాజిక ఉద్యమాలను స్వాతంత్ర్యోద్యమంలో మమేకం చేసుకోలేక పోయారు. ఆయా ఉద్యమాలను కలుపుకుని తద్వారా బలమైన సంఘటిత ఐక్య ఉద్యమాన్ని గ్రామిక ప్రాతిపదికన నిర్మించడంలో విఫలమయ్యారు. అసలు ఆ దిశగా అడుగులు వేయడానికే విముఖత ప్రదర్శించారు. అందుకే భారతదేశ స్వాతంత్ర్యోద్యమం చాలా మంది భావించినట్లుగా ఆశా జనితంగా సాగలేదు. కోట్లాది మంది పేదలను నిర్లక్ష్యపరిచి, నిరాశాజనితంగా మార్చే మార్గంలో దేశీయ పెట్టుబడీదారుల అనుకూల ఉద్యమంగా సాగింది. అందుకే ఆ ఉద్యమ ఫలితంగా ఏర్పాడిన స్వాతంత్ర్య భారతంలో ఆయా పెట్టుబడిదారులే ఉన్నత పదవులను, స్థానాలను, చట్ట సభలను ఆక్రమించి పెట్టుబడిదారీ విధానాన్ని పదిలంగా కాపాడుతూ వచ్చారు. స్వాతంత్ర్య భారతదేశానికి పెట్టుబడిదారీ భావజాలమున్న (మాటలలో సోషలిజాన్ని వల్లించినమా) జవహర్‌లాల్ నెహ్రూ ప్రథమ ప్రధానమంత్రి అవడం ఇందుకు చక్కని సాక్ష్యం. నెహ్రూ బాసటగా దేశవ్యాప్తంగా విజృంభించిన ఫ్యూడల్ శక్తుల, పెట్టుబడిదారీ వర్గాల ఆధిపత్యం ఈనాటికీ ఏదో ఒక రూపంలో కొనసాగుతూనే వస్తున్నది. అందుకే కేవలం స్వాతంత్ర్యానంతర పరిస్థితులలో, పరిణామాలతోనే స్వాతంత్ర్య ఫలితాలను అర్థం చేసుకోలేం. దానికి సంబంధించిన మూలాలను స్వాతంత్ర్యోద్యమంలో ఉన్నాయని గ్రహిస్తేనే సమస్యను సరిగ్గా అర్థం చేసుకున్నట్లు అవుతుంది.

స్వయం పాలనకు దిక్సూచిగా ఉండేందుకుగాను ప్రతిష్ఠాత్మకంగా రాసుకున్న అతిపెద్ద లిఖిత రాజ్యాంగం మనది. ఏ ఆదర్శాలకూ, విలువలకూ కట్టుబడేలా రాజ్యాంగం రాయబడిందో అందులోని అంశాలు, నియమాల పట్ల అవి నిర్మించబడిన ప్రాతిపదికల పట్ల భేధాభిప్రాయాలు ఉన్నా ఆ ఆదర్శాలు, విలువలను పౌరజీవితంలో వ్యవస్థీకరింప చేసేందుకు రాజ్యాంగం కొంతవరకైనా కృషి చేసిందని ఒప్పుకోక తప్పదు. కానీ ఆ రాజ్యాంగం అందించిన విలువల విషయానికి వస్తే 65 సంవత్సరాలుగా అవన్నీ సంపూర్ణంగా నిర్లక్ష్య పరచబడుతూ వచ్చాయి. ఉదాహరణకు ఈ రోజున ప్రభుత్వానికి వ్యతిరేకంగా మనం ఘాటుగా మాట్లాడగలిగే స్వేచ్ఛ ఉందా? మాట్లాడితే వెంటనే రాజద్రోహం కేసు రేడీగా ఉంటుంది. దేశంలోని ఏ ప్రాంతంలోనైనా ఏ రకమైన సమానత్వమైనా ఉందా? ప్రజలందరూ సమానంగానే చూడబడుతున్నారా? అంతదాకా ఎందుకు - సమానత్వం సాధించాలనే భావన దిశగా ప్రభుత్వాలు మొదలుకొని ప్రజల దాకా ఎవరైనా అడుగులు వేస్తున్నారా? హక్కుల గురించి గొప్పగా చెప్పుకుంటాం కదా! ఏ ఒక్క హక్కునైనా హక్కుగా వినియోగించుకోగలమా మనం? హక్కుల పరిరక్షణకు సంస్థలను ఏర్పరచుకుంటున్నాం అంటే, హక్కులను కాలరాసే ప్రభుత్వాలే హక్కుల కోసం కమిషన్‌లు ఏర్పాటు చేస్తున్నాయంటే 65 సంవత్సరాల స్వాతంత్ర్య భారతదేశంలో హక్కుల దైన్య పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. ఇలా చెప్పుకుంటూపోతే రాజ్యాంగంలో ప్రవచించిన ఏ విలువలూ నిత్యజీవితంలో ఆచరించబడడం లేదు. తప్పు ప్రభుత్వాలదా? ప్రజలదా? అనేది పక్కనబెడితే ఆ విలువలు ప్రజలకు అందని ద్రాక్షే అయ్యాయి. ఇంకా చెప్పాలంటే అసలు దేశంలోని 80 నుంచి 90 శాతం ప్రజలకు రాజ్యాంగం మౌలిక సూత్రాలపై అవగాహనే లేదు. అదీ మన పరిస్థితి!

ప్రపంచంలో భారతదేశానికి మాత్రమే ప్రత్యేకమైనది కుల సమస్య. కోట్లాది మంది ప్రజలు కులాల పేరుతో విభజించబడి చాంధస భావజాలానికి తలొగ్గుతూ కులాలను తరాల తరబడి రక్షిస్తూ వస్తున్నారు. కొన్ని కులాలు అంటరానివిగా చూడబడుతూ సామాజిక వ్యవస్థలో కేవలం కుల ప్రాతిపదికన అట్టడుగు స్థాయిలో జీవిస్తూ వస్తున్నారు. అసలు కులాలవారీ విభజనే పూర్తిగా అశాస్త్రీయం. అలాంటి విభజనను రూపుమాపే దిశగా స్వాతంత్ర్యం భారతంలో జరిగిన పోరాటాలు చాలా తక్కువ. విదేశీపాలనలో గ్రామీణ, పట్టణ ప్రాంతాలలోని జమీందార్లు, భూస్వామ్య వర్గాలు, ఇంకా చెప్పాలంటే చాలా మంది ప్రజలు ఉన్నతంగా భావించే స్వాతంత్ర్యోద్యమ నాయకులతో సహా అనేక ఆధిపత్య వర్గాలు కులాన్ని పెంచిపోషిస్తూనే వచ్చాయి. అయితే ఆ తప్పిదాన్ని స్వాతంత్ర్యానంతరం సరిచేసుకునే దిశగా కులనిర్మూలన జరిపే విధంగా ఉద్యమాలు రావలసి ఉండగా ఆ దిశగా జరిగిన ప్రయత్నాలు చాలా తక్కువ. రాజ్యాంగంలో అణగారిన కులాలకు ఏర్పరచబడిన రక్షణల ద్వారా ఆయా కులాల వారు పురోగతి సాధించవలసి ఉండగా ఆ పురోగతి కూడా అరవై సంవత్సరాలలో చాలా మందకోడిగా సాగడం బాధాకరమే. స్వాతంత్ర్యం కంటే ముందువలెనే ఈనాటికీ కొన్ని కులాల వారికి దేవాలయ ప్రవేశం లేదు. రెండు గ్లాసుల పద్ధతి, కుల అహంకార దాడులు, జోగిని, బసివిని దురాచారాలు ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. చుండూరు, కారంచేడు, ఖైర్లాంజి తరహా హేయమైన ఘటనలు పదే పదే పునరావృతమవుతూనే ఉన్నాయి. ఆ అనుభవాల పునాదిగా కుల నిర్మూలన కోసం వ్యవస్థీకృత, శక్తివంతమైన ఉద్యమాలు జరగడమే లేదు. ఒకటీ అరా కులవివక్షకు వ్యతిరేకంగా సంస్థలు ఏర్పడి అస్తిత్వ ఉద్యమాలు సాగిస్తున్నా, వాటిలోకి రాజకీయాలు చొరబడి ఆ సంస్థల లక్ష్య సాధనను నిర్వీర్యం చేస్తున్నాయి. తద్వారా కులనిర్మూలన అనే లక్ష్యం ఎండమావిగానే మిగిలిపోతోంది.

అడవిని కన్నతల్లి కంటే ఎక్కువగా ప్రేమించే ఆదివాసులు, గిరిజనులు అరవై ఐదేళ్ల స్వేచ్ఛా భారతంలో తీవ్రమైన అన్యాయాలకు గురైనారు. దేశంలో వీరికంటే ఎక్కువగా వివక్షకు గురైన వర్గం మరొకటిలేదంటే అతిశయోక్తి కాదు. అటవీ భూములను ఆధారంగా చేసుకుని అనేక అటవీ ఉత్పత్తులను తయారుచేస్తూ, అమూల్యమైన అటవీసంపదను, విలువైన ఖనిజాలను రక్షిస్తూ వస్తున్న గిరిజనుల భూములకు ప్రభుత్వం నుంచే కనీస రక్షణ లేదు. 1/70 చట్టం అమలు తీరులో ప్రభుత్వాల లీలలు, మహత్యాలు చూసే ఉన్నాం. గిరిజనులను అడవి నుంచి దూరం చేస్తూ ఆ భూములను రహేజా, వేదాంత, టాటాలాంటి కంపెనీలకు దారాధత్తం చేస్తూ ప్రభుత్వమే మధ్యవర్తిగా గిరిజన జీవితాల, సంస్కృతుల విధ్వంసీకరణకు పాల్పడుతున్నది. తమ ఆచారవ్యవహారాలను, సాంప్రదాయాలను, అస్తిత్వాలను కాపాడుకునే క్రమంలో నిరసన వెలిబుచ్చితే అందుకు సమాధానంగా ప్రభుత్వాలు అణిచివేత అస్త్రాన్ని ప్రయోగిస్తున్నాయి. తద్వారా గిరిజనులు సర్వం కోల్పోయి అచేతన స్థితిలో కాలం వెళ్లదీయడమో లేదా సాయుధులై ప్రతిఘటనా పోరాటాలు సాగించడమో చేస్తున్నారు. స్వాతంత్ర్య ప్రతిఫలాలను ఇన్నేళ్లైనా కనీసంగానైనా అనుభవించని జాతి ఒకటి ఉందంటే అది గిరిజన జాతే. ఈ అన్యాయానికి మూల్యం ఎవరు చెల్లించాలి?

స్వాతంత్ర్య భారతదేశంలో మహిళలు పడ్డ బాధలు వర్ణనాతీతం. భారతదేశం కంటే అతి చిన్న దేశాలలో కూడా మహిళల స్థాయి చాలా మెరుగ్గా ఉంటే మనదేశంలో మాత్రం ఇంకా వరకట్నం వంటి దురాచారాలు కొనసాగుతూనే ఉన్నాయి. మహిళలపై యాసిడ్ దాడులు, ట్రాఫికింగ్, లైంగిక వేధింపులు, పురుషాధిపత్యం పెరుగుతూనే వచ్చాయి. కేవలం చట్టాల ద్వారానే ఆయా సమస్యలకు పరిష్కారాలు లభించి మహిళలకు న్యాయం జరుగుతుందని మాత్రమే ప్రభుత్వాలు భావించాయి తప్ప సామాజిక పరివర్తన ద్వారా సమస్యలకు మౌలిక పరిష్కారాలు వెతికే ప్రయత్నం చేయలేదు. తద్వారా ఆయా సమస్యలు రూపం మార్చుకుని ఎప్పటికప్పుడు తలెత్తుతూనే ఉన్నాయి తప్ప రవ్వంతైనా తగ్గుముఖం పట్టలేదు. ఈ రోజుకు కూడా స్త్రీలు తమ హక్కుల కోసం, అస్తిత్వాలకోసం ఉద్యమాలు చేస్తూనే ఉన్నారు. ప్రభుత్వాలు నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తూనే ఉన్నాయి. ఒక స్వాతంత్ర్యదేశం ఇన్నేళ్లైనా నేటికీ భ్రూణహత్యలు, వరకట్నం వేధింపులు వంటి రుగ్మతలను, దురాచారాలను, వివక్షను వదులుకోలేని స్థితిలో ఉందంటే అది నిజంగా సిగ్గుపడాల్సిన విషయం కాదా?

65 సంవత్సరాల స్వాతంత్ర్యం ఫలితంగా దేశంలో కనీసం సగం సంఖ్యలో రాష్ట్రాలైనా సంతృప్తితో, ఆశావహ గమనంతో ఉండాలనుకోవడం అత్యాశ ఏమీ కాదు కదా! కానీ ఇప్పటికీ దేశంలోని ప్రతి రాష్ట్రం తీవ్ర నిరాశతోనే ఉంది. దేశంలోని అన్ని ప్రాంతాల ప్రజలు తీవ్రమైన బాధలతో, అశాంతితో కాలం వెళ్లదీస్తున్నారు. కాశ్మీర్‌లో స్వయం ప్రతిపత్తి పోరాటాలు, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, పశ్చిమ బెంగాల్, ఉత్తరప్రదేశ్‌లలో ప్రత్యేక రాష్ట్ర పోరాటాలు, ఈశాన్య రాష్ట్రాలలో పేదరిక బాధలు... చెప్పుకుంటూ పోతే ప్రతి రాష్ట్రమూ అనేకానేక సమస్యలతో సతమతమవుతూనే ఉంది. రాష్ట్రాల అసమ అభివృద్ధి రాష్ట్రాలలో తీవ్రమైన అంతరాలకు కారణభూతమవుతున్నది. ప్రాంతాల అసమ అభివృద్ధి

ప్రాంతీయ ఉద్యమాలకు, తద్వారా విభజన ఉద్యమాలకు దారితీస్తున్నది. అయినా రాష్ట్రాలు, ప్రాంతాల అసమ అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వాలు గానీ, రాష్ట్ర ప్రభుత్వాలు గానీ కారణాలు అన్వేషించిన దాఖలాలు ఈ 65 సంవత్సరాలలో ఒక్కటి కూడా లేదంటే ఎంతటి నిర్లక్ష్యం నీడలో దేశం పాలించబడుతున్నదో అర్థం చేసుకోవచ్చు.

1950వ దశకం నుండి నేటివరకు పాలకులెవరైనా, పాలించే విధానాలు మాత్రం పూర్తిగా అభివృద్ధి విధ్వంసక నమూనాలే. అభివృద్ధి అంటే కేవలం భౌతిక అవసరాల అభివృద్ధి అనే భావనతో, రోడ్లు, కార్యాలయాలు, ఎస్ఇజెడ్‌లే అభివృద్ధి అని ప్రచారం చేస్తూ మానవీయ విలువలను మరచిపోయారు. మనిషికి, మనిషికి మధ్య నెలకొల్పాల్సిన మానసిక సుహృద్భావాలను నెలకొల్పడంలో విఫలమయ్యారు. తమ స్వార్థ ప్రయోజనాల కోసం అంతరాలను పెంచతూ వచ్చారు. 1991లో విదేశీ కంపెనీలకు తలుపులు బార్లా తెరిచిన సరళీకృత ఆర్థిక విధానాలు, దానికి కొనసాగింపుగా నేటికీ కొనసాగుతూ వస్తున్న ప్రపంచీకరణ విష ఫలితాలు మానవీయతను మరింత దెబ్బతీశాయి. రైతులకు, వ్యవసాయ ఉత్పత్తులకు కనీసం ఒక ఎకరానికైనా నీళ్లివ్వని ప్రభుత్వాలు, ఎస్ఇజెడ్‌ల పేరిట వేలాది, లక్షలాది ఎకరాల భూములను బడాబాబులకు అప్పగిస్తున్నాయి. అటవీ ప్రాంతాలలోని విలువైన ఖనిజాల వెలికితీతకు అక్రమ కాంట్రాక్టులిస్తూ వేలాది ఎకరాల అటవీ భూములను కూడా కారుచౌకగా అమ్మి వేస్తున్నాయి. ఇది చివరకు ఏ స్థాయికి చేరుకుందంటే మైనింగ్ రంగంలో ఇలాంటి అక్రమ కాంట్రాక్టుల వల్ల వేల కోట్లరూపాయలు దండుకున్న గాలి జనార్దన్‌రెడ్డి లాంటి మైనింగ్ మాఫియాలు ఆంధ్రప్రదేశ్, కర్ణాటక లాంటి రాష్ట్రాలలో రాజకీయాలనే శాసించే స్థాయికి చేరుకున్నారు. ప్రభుత్వాలను కూల్చడం, ఎక్కించడం అంతా తమ ఇష్టానుసారంగానే జరిగేంతగా తయారయ్యారు. అంటే ప్రజాస్వామ్య వ్యవస్థ మొత్తం ఈ తరహా మాఫియాల చేతుల్లో బందీ అయిపోయే పరిస్థితి ఏర్పడింది.

ఇక రాజకీయాల విషయానికి వస్తే ఈ అరవై ఐదేళ్లలో రాజకీయాలు పూర్తిగా కుళ్లిపోయాయి. ప్రజాస్వామ్య విధానంలోని లొసుగులను, లోపాలను ఉపయోగించుకుని నాయకులు రాజకీయాలను భ్రష్టు పట్టించారు. కాస్తో కూస్తో విశ్వసనీయత ఉన్న చట్టబద్ధ సంస్థలు, వ్యక్తుల ప్రాధాన్యాన్ని తగ్గించారు. వారిని రబ్బరు స్టాంపులుగానే మిగిల్చారు. రాష్ట్రపతి, గవర్నర్ పదవులకు విలువే లేకుండా పోయింది. పదవుల కోసం వెంపర్లాటలు, పదవుల పందేరాలు ఆ పదవులను ఉపయోగించుకుని వందల, వేల కోట్లు సంపాదించుకునే ట్రెండ్ మొదలైంది. ప్రజా సేవ కోసమే రాజకీయాలలోకి రావడమనే ఉన్నతా దర్శాలు పక్కనబెడితే గెలిచిన తర్వాత కనీసం నెలకొకసారైనా నియోజక వర్గంలో పర్యటించే ఉదాహరణలే కనుమరుగైపోయాయి. ఇక రాజకీయ నాయకుల నుంచి ఉద్యోగుల దాకా లంచగొండితనం చాలా పెరిగిపోయింది. ఒకరకంగా చెప్పాలంటే లంచగొండితనం సమాజానికి వ్యవస్థీకృత భాగస్వామి అయిపోయింది. అవినీతి సర్వసాధారణమైపోయింది. అవినీతి, లంచగొండితనం లేని వ్యవస్థను, వ్యక్తులను పరిహాసమాడే స్థితి వచ్చింది. అన్నా హాజారే లాంటి వ్యక్తుల డిమాండ్‌లను నెరవేరుస్తామని వాగ్దానం చేసి పబ్లిక్‌గా చెత్త బుట్టదాఖలు చేయడం అరవై ఏళ్ల అవినీతి పరిణామ క్రమానికి చక్కని ఉదాహరణ.

రాజకీయాలు, నాయకుల పనితీరు ఇలా ఉంటే న్యాయస్థానాల తప్పుడు తీర్పులు ప్రజా జీవితాన్ని చాలానే ఛిద్రం చేస్తున్నాయి. 1950ల నుంచి మొదలుకొని నిన్న మొన్నటి బినాయక్‌సేన్, రామజన్మభూమి, అయోషామీరా కేసుల దాకా న్యాయస్థానాలు చెప్పిన ప్రజా వ్యతిరేక తీర్పులు ప్రజలలో న్యాయవ్యవస్థపై ఉన్న విశ్వాసాన్ని దెబ్బతీశాయి. సమ్మె అనేది హక్కు కాదని చెప్పిన తీర్పుతో పాటు అనేక ఉద్యోగి వ్యతిరేక తీర్పులు కూడా ఉద్యోగిలోకాన్ని అశనిపాతానికి గురిచేశాయి. తద్వారా న్యాయవ్యవస్థ ప్రజల దృష్టిలో పూర్తిగా నమ్మకాన్ని కోల్పోయే దశకు చేరుకుంది. కోర్టులు పెట్టుబడిదారులకు, డబ్బున్న వారికే వత్తాసు పలుకుతాయని, అధికారం, ఆధిపత్యం, రాజకీయాలకు అతీతంగా ఉండవలసిన న్యాయస్థానాలు సరిగ్గా వాటిపైనే ఆధారపడి న్యాయప్రకటన చేస్తున్నాయని సగటు మనిషి అభిప్రాయపడేంతగా న్యాయవ్యవస్థ దిగజారిపోయింది.

స్వాతంత్ర్యానంతరం భారత రాజ్యాంగం ఆధారంగా ప్రజా పరిపాలనరీత్యా ఏర్పరచబడిన అనేక చట్టాల పనితీరు నిరాశాజనకంగా తయారైంది. చట్టాల పైనే ఆధారపడి ప్రజా పాలన జరగాలని ప్రభుత్వాలు నెలకొల్పిన శాసింపు స్థితి వల్ల ప్రజలు కూడా తమ సంక్షేమం కోసం చట్టాలపైన ఆధారపడడమే సరైందనే భావనకు వచ్చారు. అలా చట్టాలను ఏర్పరచిన పాలకులు క్రమంగా ప్రజా వ్యతిరేక చట్టాలు చేస్తూ వచ్చారు. ఉన్న కొద్దిపాటి ప్రజానుకూల చట్టాల పనితీరును పూర్తిగా దిగజార్చి నియంతృత్వ విధానాలకు తెరలేపారు. టాడా, పోటా వంటి చట్టాలు ఈ క్రమంలో వచ్చినవే. గృహహింస నిరోధక చట్టం, సమాచార హక్కు, విద్యాహక్కు చట్టాలవంటివి క్రమంగా బలహీనమవుతుండడాన్ని కూడా ఇందులో భాగంగానే చూడాలి.

ప్రజా జీవితానికి పేదరికం ఒక పెద్ద శాపం. పేదరిక నిర్మూలన అనేది సామ్యవాద ఆదర్శం అయినా నెహ్రూ మొదలుకొని మన్మోహన్‌సింగ్ వరకు ప్రతి ప్రధాని పేదరికాన్ని రూపుమాపే ప్రయత్నాలు చేస్తున్నట్లు నటిస్తూ వచ్చారు. వివిధ దేశాలను అధ్యయనం చేసి ఏవేవో పథకాలు సృష్టించి, పేదరికాన్ని నిర్మూలిస్తామని ఎప్పటికప్పుడు ప్రగల్భాలు పలుకుతూనే వచ్చారు. కానీ పేదరిక నిర్మూలన విషయంలో వృద్ధి మాత్రం ఇప్పటికీ ఎక్కడవేసిన గొంగడి అక్కడే అన్నట్లుంది. అంతరాల నిర్మూలన కోసమే ఏర్పడ్డామని గొప్పలు చెప్పుకునే సిపిఐ, సిపిఎం లాంటి కమ్యూనిస్టు పేరుపెట్టుకున్న పార్టీలు బూర్జువా చక్రబంధంలో ఇరుక్కుపోయి చతికిలబడ్డాయి. ఇప్పటికీ అంతరాల సమాజాలు నిర్విఘ్నంగా కొనసాగుతూనే ఉన్నాయి.

ఇన్ని సమస్యలు, వైరుధ్యాల నడుమన స్వాతంత్ర్యానంతర భారతదేశం కుంటినడక సాగిస్తూనే ఉంది. విదేశీ పాలకులు పోయి స్వదేశీపాలకులు రావడం అనేది కేవలం ఒక పరిమాణాత్మక మార్పు మాత్రమే. గుణాత్మకంగా ఇరువురు పాలకుల స్వభావంలో పెద్దగా తేడా ఏమీ లేదు. స్వదేశీ పాలకులు ఆచరిస్తున్న ప్రస్తుత ప్రజాస్వామ్యం వైఫల్య బాటలో ప్రయాణిస్తున్నదనే భావన ప్రజల మనసులలో నిక్షిప్తమయ్యే దశలో ప్రస్తుత భారతదేశం ఉంది. అయినా ప్రజాస్వామ్యమే అవసరమని భావిస్తునా మరేదో ప్రత్యామ్నాయం అవసరమనే ఆలోచన ఈ అరవై ఐదు సంవత్సరాలలో కొందరికైనా కలగకపోలేదు. దైనందిన వ్యవహారాలలో గానీ, నిత్యజీవిత సమస్యల విషయంలో గానీ విదేశీ పాలకుల కాలంలో ప్రజలు ఏ బాధలైతే పడ్డారో, స్వల్ప మార్పులతో నేటీ స్వదేశీ పాలకుల కాలంలో కూడా అవే బాధలను అనుభవిస్తూనే ఉన్నారు. అందుకే నేటి స్వాతంత్ర్య భారతదేశ ప్రయాణం 'చీకటిలో నుంచి చీకటిలోకి సాగుతోంది.

*(రచయిత ఉపాధ్యాయులు, తెలంగాణ ఉద్యమ కార్యకర్త)* వీ

ప్రజలను ఉత్పత్తి నుంచి దూరం చేస్తూ, వారిని ఉత్పత్తి శక్తులుగా కాకుండా పథకాల లబ్ధిదారులుగా, బిచ్చగాళ్లుగా మారుస్తున్న పాలకవర్గాల 'అభివృద్ధి' నమూనాను వివరిస్తున్నారు **ఎస్. శేషయ్య**

# అభివృద్ధి నమూనా - రెండు ముఖాలు

భారతదేశం ప్రపంచ పటంలో వెలిగిపోతుందనీ, చైనాతో పోటీ పడుతుందనీ గర్వపడి పోతున్నాం. అరవై నాలుగు సంవత్సరాల తర్వాత జరిగిన అభివృద్ధి, స్థితి, స్థాయిల గురించి ఐక్యరాజ్య సమితి మానవాభివృద్ధి సూచిక ప్రకారం మన దేశం అభివృద్ధిని పరిశీలిస్తే ఆశ్చర్యంతో పాటు, ఆవేదన కలుగుతుంది. ప్రపంచంలో 180 దేశాల్లో భారతదేశం 134వ స్థానంలో ఉంది. భూటాన్ కంటే వెనుకబడి ఉంది. ప్రపంచబ్యాంకు అంచనాల ప్రకారం స్థూల జాతీయ ఉత్పత్తి ప్రమాణాలతో పోల్చితే భారతదేశం 143వ స్థానంలో ఉంది. ప్రపంచ ఆకలి సూచిక (గ్లోబల్ హంగర్ ఇండెక్స్) ప్రకారం 88 దేశాల్లో మన దేశం 66వ స్థానంలో ఉంది. ఐక్యరాజ్య సమితి రూపొందించిన మల్టీ డైమెన్షన్ పావర్టీ ఇండెక్స్ (ఎం.పి.ఐ.) (ఆదాయం, ఆరోగ్యం, విద్య మొదలైన ప్రమాణాలు) ప్రకారం 2008 నాటికి భారతదేశంలో 46 శాతం పిల్లలు (ఐదు సంవత్సరాల లోపు) అంటే 6.5 కోట్లు పౌష్టికాహారం లేక బాధపడుతున్నారు. అభివృద్ధి సూచికల్లో ఆత్మహత్యలను కలిపి పరిశీలిస్తే పరిస్థితి మరింత దారుణంగా ఉంది. 1997-2008ల మధ్య రెండు లక్షల మంది రైతులు ఆత్మహత్యకు పాల్పడ్డారని గణాంకాలు చెబుతున్నాయి.

గత అరవై నాలుగు సంవత్సరాలుగా పది పంచవర్ష ప్రణాళికలు పూర్తయిన తర్వాత ఈ ఆర్థిక పరిస్థితి చూస్తే ఒకవైపు దేశంలో కొంతమంది చేతుల్లో సంపద విపరీతంగా పోగుపడుతుండగా, మరోవైపు అసమానతలు, పేదరికం తీవ్ర స్థాయిలో పెరుగుతూ ఉన్నాయి. ప్రపంచంలోని అత్యంత సంపన్నుల్లో (బిలీనియర్స్) 55 మంది భారత దేశానికి చెందినవారే. ప్రపంచంలోని పది మంది సంపన్నుల్లో లక్ష్మీ మిట్టల్ రెండవ స్థానంలో ఉండగా, ముకేష్ అంబానీ 9వ స్థానాన్ని ఆక్రమించారు. మన దేశంలో 'అభివృద్ధి'తో పాటు అవినీతి, పేదరికం కవల పిల్లల్లా పెరుగుతున్నాయి.

గత పన్నెండు సంవత్సరాలలో (1992) నుండి జరిగిన ఆర్థిక కుంభకోణాల్లో జరిగిన అవినీతి 80 లక్షల కోట్ల రూపాయలుగా అంచనా వేశారు. అరవై నాలుగు సంవత్సరాలుగా ప్రణాళికాబద్ధ అభివృద్ధి ఫలితంగా 5-9 శాతం వృద్ధిరేటు సాధించిందనీ చెప్పుకోవడం వలన ప్రయోజనం లేదు. పేదరికం ఎందుకు పెరుగుతూ ఉంది? అసమానతలు ఎలా వ్యవస్థీకృతమవుతున్నాయి? అనే ప్రశ్నలకు కూడా సమాధానం చెప్పుకోవాలి. పంచవర్ష ప్రణాళికలు అమలు చేయడంలో రాజకీయ సంకల్పం లేదనీ, అభివృద్ధి విధానాలను రూపొందించడలో చిత్తశుద్ధి లేదనీ, లొసుగులున్నాయనీ సమాధానం చెప్పుకుంటే సరిపోదు.

వర్ధమాన దేశాల్లోనూ, ప్రత్యేకించి మన దేశంలో 'అభివృద్ధి' ఒక భావజాలం. అభివృద్ధి నమూనా, లేదా విధానాలు పాలకవర్గాల ఆర్థిక ప్రయోజనాల, రాజకీయాల కొనసాగింపే. మన దేశంలో అమలవుతున్న అభివృద్ధి నమూనాను, దాని మాయజాలాన్ని తెలుసుకోవడానికి పాలకవర్గాల భావజాలం ముసుగును తొలగించి వారి అసలు స్వభావాన్ని, వ్యూహాన్ని అర్థం చేసుకోవాలి. పాలకవర్గాల (రాజ్యం) వ్యూహాన్ని స్థూలంగా ఈ విధంగా చెప్పుకోవచ్చు.

1) సామ్రాజ్యవాదం ప్రయోజనాలకు ప్రమాదం రాకుండా, పాలకవర్గాలు తమ ప్రయోజనాలు దెబ్బతినకుండా ఆర్థిక వ్యవస్థను రూపొందించడం .

2) పాలక వర్గాల మధ్య విభేదాలు, వైరుధ్యాలు తలెత్తితే వాటిని సామరస్యంగా పరిష్కరించుకుంటూ రాజ్యాధికారాన్ని కొనసాగించడం.

3) ప్రజల విశ్వాసాన్ని పొందడానికి సంస్కరణలను, రాయితీలను ప్రవేశపెట్టడం, తమ ఆధిపత్యాన్ని నెలకొల్పడం. ప్రజల సంస్కరణలతో సంతృప్తి చెందకుండా, మౌలికమైన మార్పుల కోసం తిరుగుబాటు చేసినా, ఉద్యమించినా సాయుధంగా అణిచివేయడం. ఈ వ్యూహాన్ని స్వతంత్రం వచ్చినప్పటి నుండి నేటి వరకు అమలు చేస్తూ ఉన్నారు. సరళీకృత ఆర్థిక విధానాలు మొదలైనప్పటి నుండి సంకీర్ణ ప్రభుత్వాల పేరుతో పాలకవర్గాలు కలసికట్టుగా రెట్టింపు ఉత్సాహంతో వాటిని అమలు చేస్తున్నారు. రాజ్యాంగం ప్రజల హక్కులను గౌరవించాలని చెబితే ప్రస్తుతం పాలకవర్గాలు, కార్పొరేట్ సంస్థల, మార్కెట్టు శక్తుల హక్కులను గౌరవిస్తున్నాయి. రాజ్యాంగ యంత్రం బలవంతుల వైపు, సంపన్నుల వైపు నిలబడింది.

1947లో వలసపాలన అంతమైంది. భారతదేశం స్వతంత్ర దేశంగా ప్రకటించబడింది. రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది గానీ, ఆర్థిక స్వాతంత్ర్యం రాలేదని ఆనాడు నెహ్రూ అన్నాడు. దేశం పారిశ్రామికంగా, వ్యవసాయంగా అభివృద్ధి చెందడానికి పంచవర్ష ప్రణాళికలు రూపొందించబడ్డాయి. మొదటి పంచవర్ష ప్రణాళిక రచనకు రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలను ఆదర్శంగా, వాటిని అమలు చేయడం లక్ష్యంగా చెప్పుకున్నాడు. పారిశ్రామిక విధానాన్ని, వ్యవసాయ విధానాలను రూపొందించారు. భూ సంబంధాల్లో అసమానతలను తొలగించడానికి జమిందారీ విధానాన్ని రద్దుచేశారు. పారిశ్రామిక రంగంలో ప్రభుత్వ రంగానికి ప్రాధాన్యత ఇస్తూ, ప్రైవేట్ రంగాన్ని ప్రోత్సహిస్తూ మిశ్రమ ఆర్థిక విధానాన్ని అనుసరించారు. సోవియట్ రష్యా సహకారంతో పెద్ద పెద్ద పరిశ్రమలను నెలకొల్పారు. ఈ

పరిశ్రమలన్నీ పారిశ్రామిక అభివృద్ధికి అవసరమైన మౌలిక సదుపాయాలను ఉత్పత్తి చేసేవే. ఈ అభివృద్ధి నమూనా అమలు చేయడం ద్వారా దేశాన్ని ప్రగతి పథంలో నడిపించవచ్చనీ, అసమానతలను, పేదరికాన్ని నిర్మూలించవచ్చనీ పాలకులు పదే పదే ప్రకటించారు. అభివృద్ధి మంత్రాన్ని జపించారు. సాధించిన అభివృద్ధి ఫలితాలు పేద ప్రజలకు వాటంతట అవే చేరువవ్వుతాయని చెప్పారు. (ట్రికల్ డౌన్ థీయరీ).

మూడవ పంచవర్ష ప్రణాళిక వరకు 'అభివృద్ధి' గురించి జపం చేసిన పాలకవర్గాలు 1970లో 'పేదిరక నిర్మూలన' నినాదాన్ని చేపట్టాయి. 20 సూత్రాల పథకం అమల్లోకి వచ్చింది. పారిశ్రామిక విధానం, వ్యవసాయ విధానం, భూ సంబంధాల్లో మార్పుకు ఉద్దేశించిన పథకాలు ఇరవై మూడు సంవత్సరాల్లో ఏం సాధించినట్టు? జమీందార్లు రాజకీయ నాయకులయ్యారు, పారిశ్రామికాధిపతులుగా అవతార మెత్తారు. జమిందారీ రద్దు చట్టాలను కోర్టులు రద్దు చేయగా, రాజ్యాంగ సవరణలు తెచ్చి అధిక మొత్తంలో నష్టపరిహారం చెల్లించి జమిందారీ విధానం రద్దయింది. వారు నష్టపోయింది ఏమీలేదు. ప్రభుత్వరంగంలో మౌలిక పరిశ్రమలను నెలకొల్పి ప్రైవేట్‌రంగానికి మౌలిక సదుపాయాలను కల్పించి, రాయితీలు ఇచ్చింది ప్రభుత్వం. పారిశ్రామిక రంగంపై ప్రైవేట్ రంగం ఆధిపత్యం పెరిగింది. 1967లో ప్రభుత్వం నియమించిన హజారే కమిషన్, దత్తు కమిషన్‌లు అధ్యయనం చేసి దేశంలో 73 పారిశ్రామిక కుటుంబాల ఆధిపత్యం ఉందని తేల్చాయి. ఈ కుటుంబాలు ఇతర వ్యక్తులను, సంస్థలను ఎదగకుండా అడ్డుకున్నాయని ఆరోపించాయి.

ప్రభుత్వం ప్రకటించిన పారిశ్రామిక విధానం, లైసెన్సు విధానం ద్వారా లాభపడింది బడా పారిశ్రామికవేత్తలే. బ్యాంకుల నుండి, ఇతర రుణ సంస్థల నుండి 47 శాతం పారిశ్రామికవేత్తలే రుణాలను పొందారు. మొత్తంగా ప్రభుత్వ రంగంలోని పరిశ్రమలు, ప్రైవేటు రంగం బలపడడానికి దోహదపడింది. కొంతమేరకు ఉద్యోగాలు, కార్మికుల జీవన ప్రమాణాలు పెరిగినా గ్రామీణ జీవితం సంక్షోభంలో పడింది. కరువు, కాటకాలతో, ఆహార భద్రత లేకుండా పోయింది. 1960ల చివర్లో సంక్షోభం తీవ్రమైంది. ఈ సంక్షోభం నుండి బయటపడడానికి, ప్రజా ఉద్యమాలను బలహీనం చేయడానికి ఒకవైపు సంస్కరణలు, మరోవైపు ఉద్యమాలను అణిచివేయడం జరిగింది. బ్యాంకుల జాతీయకరణ, రాజభరణాల రద్దు, వెట్టిచాకిరీ నిర్మూలన చట్టాలు, 20 సూత్రాల పథకాలు ప్రవేశపెట్టబడ్డాయి. ఈ ఆర్థిక సంక్షోభం రాజకీయ సంక్షోభానికి దారితీసింది. వీటినుండి బయటపడడానికి ఇందిరా గాంధీ ఎమర్జెన్సీని ప్రకటించింది. నిజమైన అభివృద్ధి ప్రజల ఆర్థిక అవసరాలతో పాటు, పౌర, ప్రజాస్వామిక హక్కులను అనుభవించే అవకాశాలను కలిగించాలి. కాని ఎమర్జెన్సీ విధించని అభివృద్ధి పేరుతో హక్కులను కాలరాచింది ఆనాటి ప్రభుత్వం. పాలకవర్గాల్లో వైరుధ్యం తాత్కాలికం అనీ, ఐక్యత శాశ్వతం అని ఎమర్జెన్సీ తర్వాతి రోజుల్లో రుజువైంది. సంస్కరణల కంటే అణచివేతనే ప్రధానంగా పాలక వర్గాలు ఎంచుకుంటాయనీ నక్సల్బరీ, శ్రీకాకుళం రైతాంగ, గిరిజన పోరాటాలు, వాటి మీద అమలయిన అణచివేత స్పష్టం చేస్తున్నాయి.

1980ల నుండే నయా ఉదారవాద ఆర్థిక విధానం మొదలైన 1991 నుండి అధికారికంగా, శీఘ్రంగా అమలు చేయడం ప్రారంభమయింది. రెండు దశాబ్దాల సరళీకృత విధానాల అమలు ఫలితంగా ఆర్థిక వ్యవస్థలో గణనీయమైన మార్పులు చోటు చేసుకున్నాయి. ఒకవైపు సంపద పోగు పడుతూ, మరోవైపు పేదిరకం, అభద్రత పెరుగుతూ ఉంది. కులం, లింగం, వర్గం మధ్య అసమానతలు, వివక్షతలు వ్యవస్థీకృతమవుతున్నాయి. ప్రస్తుతం అమలవుతున్న అభివృద్ధి నమూనా సామ్రాజ్యవాదుల నమూనా. ప్రపంచ బ్యాంకు రూపొందిస్తున్న నమూనా. ఈ విధానంలో సమానత్వానికి, సామాజిక న్యాయానికి చోటు లేదు. ఆర్థిక విధానాలను రూపొందించడంలో ప్రజల ప్రమేయం లేదు. మార్కెట్టు శక్తులు (కార్పొరేట్) ప్రభుత్వాలను శాసిస్తున్నాయి. విధానాలను రచిస్తున్నాయి. దీనికి ఉదాహరణ ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు. దేశంలోని వనరులను, అడవి సంపదను, ఖనిజాలను బహుళజాతి కంపెనీలకు కట్టబెడుతున్నాయి. ఆదివాసులను నిర్వాసితులను చేస్తున్నాయి.

సెజ్‌ల యాజమాన్యాలు నయా జమీందారులుగా అవతార మెత్తారు. వీటికి భూములను అప్పజెప్పడానికి ప్రభుత్వం బ్రోకర్‌గా తయారయ్యింది. వివిధ రకాల పన్నులు, సుంకాలలో రాయితీలను ఇస్తూ ఉంది. గత ఆరు సంవత్సరాల వార్షిక బడ్జెట్‌లను పరిశీలిస్తే కార్పొరేట్ రంగానికి ఇచ్చిన రాయితీలు 21 లక్షల కోట్ల రూపాయలు. అదే సమయంలో ఆహార భద్రతకు, వ్యవసాయ రంగానికి సబ్సిడీలను తగ్గించి వేశారు. కార్పొరేట్ శక్తులు, బ్యూరాక్రసీ, రాజకీయ నాయకులు కుమ్మక్కై అవినీతికి పాల్పడుతూ సంపదను పెంచుకుంటున్నారు. అసోసియేషన్ ఫర్ డెమోక్రటిక్ రిఫార్మ్స్ (ఎ.డి.ఆర్.) అంచనా ప్రకారం దేశంలోని 835 మంది ఎం.ఎల్.ఎ.ల ఆస్తుల విలువ రు. 2128 కోట్లు. వీరిలో 231 మంది రెండోసారి శాసనసభ్యులుగా కొనసాగుతున్నారు. 2006-11 మధ్య కాలంలో వీరి ఆస్తులు 262 శాతం పెరిగాయనిని ఎ.డి.ఆర్. సంస్థ పేర్కొంది. సరళీకృత ఆర్థిక విధానాల అమల్లో అవినీతి వ్యవస్థీకృతమైంది. గాలి, నీరు, తరంగాలు సరుకుగా మారిపోయి, అవినీతికి మినహాయింపు లేకుండా పోయింది. 2జీ స్పెక్ట్రమ్ కుంభకోణం దీనికి మంచి ఉదాహరణ. రాజ్యాధికారాన్ని పంచుకోవడంలో విలువల స్థానంలో అవకాశవాదం ప్రధానం అయిపోయింది. సంకీర్ణ ప్రభుత్వాలు ప్రజాస్వామిక పాలన అందించడానికి బదులు అవినీతిలో, అవకాశవాదంలో రాజకీయ పార్టీలు, వ్యక్తులు పోటీపడుతున్నారు.

ప్రభుత్వ నిధులు (ప్రజల డబ్బులు) ప్రైవేట్ వ్యక్తులకు, సంస్థలకు లాభం చేకూర్చే విధంగా మళ్లించే పద్ధతిన ప్రజా సంక్షేమ కార్యక్రమాలతో, సేవల రూపంలో పకడ్బందీగా జరుగుతూ ఉంది. దీన్ని వై.ఎస్. రాజశేఖరరెడ్డి చాలా ఆకర్షణీయంగా అమలు చేసాడు. ఆరోగ్య శ్రీ, విద్యార్థులకు ఫీజు రీయింబర్స్‌మెంట్‌లను పరిశీలిస్తే స్పష్టంగా అర్థం అవుతుంది. అదే విధంగా గ్రామీణ ప్రజలకు కల్పించిన ఉపాధి పథకం. ఈ పథకాల వల్ల ప్రజలకు ఉపశమనం కలుగుతుంది. కానీ వారి శ్రమ ఉత్పత్తిలో భాగం కాకుండా పోతున్నది. స్వయం కృషికి, స్వావలంబనకు అవకాశం ఉండదు.

ప్రజల నిస్సహాయతను, అవసరాలను గుర్తించి వారికి సహాయ పడడం ప్రభుత్వాల బాధ్యత. కానీ మనం వీటిని మరో కోణం నుండి చూస్తే ఆర్థిక వ్యవస్థ పటిష్టతకు తోడ్పడవు. ఒకవైపు ప్రజలను శ్రమ నుండి దూరం చేస్తూ, ఉత్పత్తి ప్రక్రియ నుండి తొలగిస్తూ, మరోవైపు కార్పొరేట్ శక్తులకు, రంగానికి మార్కెట్టును తయారు చేయడం జరుగుతూ ఉంది. ప్రజల ఆదాయం తగ్గిందనీ, కొనుగోలు శక్తి తగ్గిందనీ, జీవన ప్రమాణాలు పడిపోయాయనీ చెబుతున్నప్పటికీ కార్పొరేట్ శక్తులు

**మన దేశ భవిష్యత్తు యువత చేతుల్లోనే ఉందంటూ, నేడు యువత తమ చుట్టూ ఉన్న సమాజం కోసం ఆలోచించాల్సిన, బాధ్యత పడాల్సిన అవసరం మరింత పెరిగిందని అంటున్నారు వి. హనుమంతరావు**

# ఇది స్వరాజ్యమేనా?

'మనం సాధించింది స్వరాజ్యం కాదు. విదేశీ పాలన నుంచి విముక్తి మాత్రమే. మనం ఇంకా అంతర్గత స్వరాజ్యం సాధించాల్సి ఉంది. కుల మత బేధాలు నమసి పోవాలి. అంటరానితనం అంతరించాలి. అన్నార్తుల ఆకలి తీర్చాలి. అందరూ ఒకే కుటుంబంగా కలసి మెలసి జీవించాలి. ఒక నూతన జీవితాన్ని సాధించాలి. మన మనసులు మారాలి. మన దృక్పథంలో మార్పు రావాలి.'

– సర్దార్ పటేల్

సర్దార్ పటేల్ ఈ సందేశాన్ని ఇచ్చి అరవై సంవత్సరాలు గతించినా ఆయన కన్న కలలు సాధించామా? వాటిలో ఒక్క కలనైనా నిజం చేసామా? ఇటీవలనే మనం రిపబ్లిక్‌డే జరుపుకొన్నాం. ఒక్క నాయకుడైనా పై ప్రశ్నలకు జవాబు చెప్పగలిగారా? స్వతంత్రం రాకముందే ఒక బ్రిటిష్ పౌరుడన్నట్లు 'భారతదేశం ధనవంతమైన దేశం కాని భారతీయులు నిరుపేదలు.'

ఈ పరిస్థితిలో ఏమైనా మార్పు వచ్చిందా? మీరంతా యువకులు, మీరే రేపటి నాయకులు. ఈ పరిస్థితిలో ఉన్న దేశాన్ని మీ చేతుల్లో ఉంచితే, ఛిన్నాభిన్నమైన, విభజనవాదాలతో అట్టుడికిపోతున్న, నిధుల కొరతతో కుమిలిపోతున్న, అవినీతి కంపుకొడుతున్న భారతదేశం మీ చేతుల్లోకి వస్తుంది. ఒకసారి కూర్చొని ఆలోచించండి. మీలో ఎంతమంది ప్రతిరోజూ పత్రికలు చదువుతారో నాకు తెలియదు. నాకు తెలిసినంత మటుకు, బహుశా మీరు క్రికెట్ పేజీ చూస్తారు లేదా సినిమా పేజీ తిరగేస్తారు. నేనేమీ మిమ్మల్ని ఎత్తిపొడవడం లేదు. ఇతర పేజీలు కూడా చదివితే సామాన్య ప్రజలు ఎలా కృంగి కృశించిపోతున్నారో గమనించగలరు. కుళ్లు రాజకీయాల చెత్తను వదిలి పెట్టి దేశంలో, ప్రపంచంలో ఏం జరుగుతుందో గమనించండి. ప్రజలు ఎటువంటి సమస్యల నెదుర్కొంటున్నారో, ఆందోళనలు చేస్తున్నారో తెలుసుకోండి. నా ఉపన్యాసం ప్రారంభంలో సర్దార్ పటేల్ ఇచ్చిన సందేశాన్ని గుర్తు చేసుకోండి. ప్రజలెందుకు ఆందోళన చేస్తున్నారు? 'స్వతంత్ర' భారత చరిత్ర కన్నీటి చరిత్ర. అసమానతలు పెంచుతున్న చరిత్ర, అభివృద్ధి ఫలితాలను అతి కొద్దిమంది కాజేస్తున్న చరిత్ర. గత ఆరు దశాబ్దాలలో మనం చాలా అభివృద్ధిని సాధించామన్న విషయాన్ని కాదనడం లేదు. కాని నా ప్రశ్న ఈ అభివృద్ధి ఫలితాలు ఎవరు అనుభవిస్తున్నారు? అంబానీల ఆస్తుల గురించి నేను ప్రస్తావించడం లేదు. అది మీ అందరికీ తెలుసు. ఇటీవలనే కర్ణాటక ముఖ్యమంత్రి, బి.జె.పి. నాయకుడు ఎడ్యూరప్ప స్వయంగా తన ఆస్తుల గురించి ఒక ప్రకటన చేశారు. వెండి, బంగారం వస్తువులు, ఆభరణాల బరువు (బహుమానాలతో సహా) రెండేళ్ల క్రితం శాసనసభ ఎన్నికల సమయంలో ఎన్నికల అధికారికి సమర్పించిన పత్రాల ప్రకారం 25 కిలోలయితే, కేవలం రెండేళ్లలో 76 కిలోలకు పెరిగింది. బంగారు, వజ్రాభరణాల బరువు ఆ రెండేళ్లలో 1.6 కిలోల నుంచి 2.5 కిలోలకు పెరిగింది. ఆయన స్వగ్రామంలో 18.23 ఎకరాల వ్యవసాయ భూమి, బెంగుళూరు అభివృద్ధి సంస్థ కేటాయించిన 50880 ప్లాటులో సొంత ఇల్లు, షికారీపురాలో రెండు ఇళ్లు, అదే గ్రామంలో 9.12 ఎకరాల పంట భూమి ఉన్నాయి. ప్రతిపక్షంలో ఉన్న నాయకుడికే ఇంత ఆస్తి ఉంటే, కాంగ్రెస్ పార్టీ నాయకుల ఆస్తులెంత ఉంటాయో మీ ఊహకే వదిలేస్తున్నా. కార్పొరేట్ల ఆస్తులంటారా? వాటికి ఆకాశమే హద్దు. అగ్రస్థానంలో ఉన్న ముకేష్ అంబానీ ఆస్తుల విలువ రు. 1.21 లక్షల కోట్లు; లక్ష్మీ మిట్టల్ రు. 1.07 లక్షల కోట్లు; అజీమ్ ప్రేమ్‌జీ రు. 71 వేల కోట్లు. కేవలం పది మంది అగ్రశ్రేణి కార్పొరేట్ల ఆస్తుల విలువ రు. 13.5 లక్షల కోట్లు. ఈ కార్పొరేట్లు పెట్టుబడులు, లాభాలు, విదేశాల్లో వారి పెట్టుబడులు గురించి ఇలా గణాంకాలెన్నిటినైనా ఉదహరించగలను. ఇంతలేసి ఆస్తులున్న వారికి ప్రభుత్వం ఇచ్చే రాయితీలు, మినహాయింపులు, ప్రోత్సాహకా లిస్తుందంటే ఇదెవరి ప్రభుత్వమో ఊహించగలరు.

---

రిటైల్ వ్యాపారంలోకి, ఆహార పరిశ్రమల్లోకి ఎట్లా వస్తున్నాయనేది ప్రశ్న. ప్రభుత్వ పథకాలు, సంక్షేమ పథకాలు, రాయితీలు అన్నీ కూడా ప్రజలను హక్కుదారులుగా కాకుండా, లబ్దిదారులుగా, చివరికి ప్రభుత్వ రాజకీయ నాయకుల మహిమ ముందు బిచ్చగాళ్లుగా తయారైయ్యే ప్రమాదం ఉంది. ఈ పరిణామం మన కళ్లెదుట అప్రతిహతంగా జరిగిపోతూ ఉంది. ప్రస్తుతం అమలవుతున్న అభివృద్ధి నమూనా ఫలితం ఇది. ఈ నమూనాను వ్యతిరేకిస్తూ, ప్రజల చొరవను పెంచుతూ, ఉత్పత్తిలో భాగం చేస్తూ, స్వావలంబన సాధించే అభివృద్ధి నమూనా అమలు చేయడానికి, ప్రయత్నించే ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా తీవ్రంగా అణచివేస్తోంది ప్రభుత్వం. అంతిమంగా వర్గ పోరాటం ద్వారానే అభివృద్ధి సాధ్యం అనే ప్రాతిపదికన అరవై నాలుగు సంవత్సరాల 'స్వతంత్ర' భారత్‌లో జరిగిన అభివృద్ధి డొల్లతనాన్ని అర్థం చేసుకోవచ్చు. అభివృద్ధి ద్వారా ప్రసరించే వెలుగుకు ప్రస్తుతం ఉన్న చీకటిని తొలగించే శక్తి లేదు.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం నాయకులు)* వీ

ప్రపంచంలో, దేశంలో, రాష్ట్రంలో ప్రస్తుతం పరిస్థితులెలా ఉన్నాయో ఏ నేపథ్యంలో మనమున్నామో ఒకసారి సింహావలోకనం చేద్దాం.

విదేశీ పాలన నుంచి మనం విముక్తి పొందాం కాని విదేశీ పెట్టుబడుల నుంచి కాదు. కాకపోవడమే కాకుండా ఆ పెట్టుబడుల ఉచ్చు బిగుస్తోంది. ప్రపంచ పటం నుంచి సోవియట్ యూనియన్ అంతర్ధానమైన తర్వాత అమెరికా తన పెత్తనాన్ని అనేక ప్రపంచ దేశాల మీద, ముఖ్యంగా భారత దేశం లాంటి వర్ధమాన దేశాల మీద మరింత నగ్నంగా కొనసాగించడం ప్రారంభించింది. ఇరాక్ మీద యుద్ధం ప్రకటించి వశం చేసుకొంది. ఇరాన్ మీద ధాడులు కొనసాగిస్తోంది. అఫ్ఘనిస్తాన్ మీద కూడా. ఉగ్రవాదులకు రక్షణ, శిక్షణ కొనసాగిస్తోంది. ఇండియా – పాకిస్తాన్ దేశాల మధ్య తగువులు పెంచుతోంది. చైనాకు వ్యతిరేకంగా భారత దేశాన్ని ఎగదోస్తోంది. మన దేశాన్ని తన ఉచ్చులో బిగిస్తోంది. ఈ పట్టిక అనంతం. తాజాగా ఈజిప్ట్‌లో ప్రజలు నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా వీధుల్లోకి వస్తే అమెరికా ఎందుకు గిజగిజ లాడుతోంది? ఈజిప్ట్ ప్రజలు వారి పద్ధతిలో వారి సమస్యను పరిష్కరించు కొంటూంటే అమెరికా ఎందుకు ఉలిక్కి పడుతోంది? ఇతర దేశాల వ్యవహారాల్లో అమెరికా తల దూరుస్తుందనడానికి ఇదొక తాజా ఉదాహరణ. పశ్చిమాసియాలో అరబ్ దేశాలన్నింటిలో అమెరికా తొత్తులు నిరంకుశంగా దశాబ్దాలుగా పాలన సాగిస్తున్నారు. భారతదేశంలో పాలకులు ఈ పరిణామాల నుంచి పాఠాలు నేర్చుకోవాలి. అమెరికాలోనే ఆర్థిక వ్యవస్థ అస్తవ్యస్తంగా ఉంది. ఆ దేశంలో బ్యాంకింగ్ వ్యవస్థ దివాలా తీసింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ సంక్షోభం నుంచి ఆ దేశం ఇంకా బయటపడలేదు. ఆ దేశంలో నిరుద్యోగ సమస్య ఎంత తీవ్రంగా ఉందంటే, ఒబామా మన దేశానికి వచ్చి, యాభై వేల మంది అమెరికన్లకు ఉపాధి లభించే ఆర్డర్లను బుక్ చేసుకోవాల్సి వచ్చింది. ఈ శతాబ్ది ఆసియా శతాబ్ది కాబోతుందనడానికి ఇది నాంది పలుకుతుంది.

అమెరికా బోటు మునిగి పోవడం ప్రారంభమైంది. ఈ బోటులో మన్మోహన్ సింగ్ ఎక్కుతానంటారేమిటి? ఒక వ్యక్తిగా ఆయన ఏమైనా చేయవచ్చు. కాని దేశాన్ని కూడా ఆయన చంకలో పెట్టుకొని ఎక్కుతాననడానికి ఆయనకా హక్కు లేదు. యువకులైన మీరు రంగంలోకి దూకాలి. అంటే జండాలు పట్టుకొని ప్రదర్శనలు చేయమనడం లేదు. మీరంతా బృందాలుగా ఏర్పడి, ఈ పరిణామాలను చర్చించండి. మీ విద్యకు భంగం కాని రీతిలో దేశ రక్షణలో పాలుపంచుకోండి. రాజకీయ పార్టీలకు తోకలుగా కాకుండా రాజకీయ పరిణామాలను అధ్యయనం చేయండి. ప్రపంచంలో వేడిగాలులు వీస్తున్నాయి. లాటిన్ అమెరికాలో ప్రారంభమై, పశ్చిమ ఆసియా దేశాలను ముట్టడించాయి. మరో పక్క చైనా అమెరికాను అగ్రరాజ్య స్థానం నుంచి తొలగించడానికి ముందుకు దూసుకుపోతోంది. ఇటువంటి ఉత్కంఠభరితమైన పరిణామాలలో యువకులైన మీరు కూడా పాలుపంచుకోవాలి. ఇక మనదేశానికి వస్తే...

బ్రిటిష్ పాలకులు దేశం నుంచి నిష్క్రమిస్తూ అధికారాన్ని కాంగ్రెస్ నాయకులకు అప్పగించారు. కాని స్వరాజ్యం వచ్చింది దేశానికి కాదు, కాంగ్రెస్ నాయకులకు. రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది కాని ఆర్థిక స్వాతంత్ర్యం కాదు. అధికార మార్పిడి జరిగిన నాటికి మన దేశం ప్రధానంగా వ్యవసాయక దేశం. పండిట్ నెహ్రూ పారిశ్రామికీకరణకు ప్రయత్నం ప్రారంభించారు. వ్యవసాయం, పరిశ్రమలు బండికి రెండు చక్రాలాంటివి. ప్రభుత్వరంగంలో పరిశ్రమల స్థాపనతో పారిశ్రామికీ కరణకు పునాదులు పడ్డాయి. ప్రైవేట్ రంగానికి ఆను దొరికింది. సస్య విప్లవం పుణ్యమా అంటూ దేశం అప్పట్లో స్వయం పోషకత్వం సాధించింది. అయితే, ప్రజలంతా కడుపు నిండా తిండి తినడం ప్రారంభిస్తే, స్వయం పోషకత్వం మాయమవుతుందని అప్పుడే వ్యవసాయార్థిక నిపుణులు హెచ్చరిస్తూ వచ్చారు.

దేశ ఆర్థిక వ్యవస్థలో పారిశ్రామికీకరణ చోటు చేసుకోవడంతో ప్రైవేట్‌రంగం ఆ అవకాశాన్ని దొరకపుచ్చుకొని, తనకో స్థానాన్ని సంపాదించి పెట్టిన ప్రభుత్వరంగాన్నే, దాని ఉనికినే ప్రశ్నించడం ప్రారంభించింది. అది ఎంతవరకు పోయిందంటే, కేంద్ర ప్రభుత్వ విధానాలనే ప్రభావితం చేయడంతో ప్రారంభించి, ఎంత ఎత్తుకు ఎదిగిందంటే, ఫలాన ఫలాన విధానాన్ని అవలంబించమని ప్రభుత్వ నాయకత్వాన్ని, బ్యూరాక్రాట్లను శాసించే స్థాయికి ఎదిగిపోయింది. కాంగ్రెస్ నాయకుల, బ్యూరాక్రాట్ల జేబులు బరువెక్కాయి. వ్యవసాయాన్ని అటకెక్కించాయి. ముఖ్యంగా పి.వి. నరసింహారావు, మన్మోహన్ సింగ్ ద్వయం 1991లో ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టి, దేశాన్ని, ప్రజలను నట్టేముంచారు. కార్పొరేట్ రంగానికి పెద్దపీట వేశారు. ఇటీవలి కాలంలో అంటే 2008 కాలంలో రు. 66 వేల కోట్లు, 2009లో రు. 79 వేల కోట్ల ఆదాయపు పన్ను మినహాయింపు ఇచ్చింది ప్రభుత్వం. ఎక్సయిజ్, కస్టమ్స్ మినహాయింపులు 2008-09లో రు. 4.2 లక్షల కోట్లు, 2008-09లో రు. 5.02 లక్షల కోట్లు ఇచ్చింది. ఇదే కాలంలో ఆమ్ ఆద్మీకి ఇచ్చిన సహాయం రు. 37,570 కోట్లు, రు. 40,929 కోట్లు మాత్రమే. ఇవన్నీ అధికారిక గణాంకాలు. అభివృద్ధి ఫలితాలు ఎవరికి ముట్టాయో ఈ గణాంకాలు తెలియజేస్తున్నాయి. సరిగ్గా ఇదే సంవత్సరంలో సుమారు రెండు లక్షల మంది రైతులు, చేనేత కార్మికులు ఆత్మహత్యలు చేసుకొన్నారు. వారికి ప్రభుత్వ విధానాల వల్ల పడుతున్న ఈతిబాధల నుంచి స్వతంత్రం వచ్చేసింది. ఇదే కాలంలో కొండలను తవ్వేసి, పరిశ్రమలు స్థాపించుకోవడానికి, ఆ పరిశ్రమలకు కావాల్సిన నీటి కోసం నదుల మళ్లింపు లేదా అమ్మకం, చట్టాలను కార్పొరేట్ చుట్టాలకు అనుకూలంగా మార్చడం, ఖనిజ సంపదను కొల్లగొట్టి విదేశాలకు అమ్ముకోవడానికి – ఒకటేమిటి, భూగర్భంలో, భూమి మీద, ఆకాశంలో... బహుళజాతి సంస్థలు, కార్పొరేట్లు అడగడం తరువాయి, వాళ్ల పాదాల దగ్గర వచ్చి వాలుతాయి. దేశం నిధుల కొరతతో సతమతమవుతూంటే, కార్పొరేట్లు వారి వద్ద మూలుగుతున్న నిధులను ఇతర దేశాల్లో పెట్టుబడులు పెట్టి మరిన్ని లాభాలను పండించు కొంటున్నారు.

తాజా పరిణామమేమంటే ఈ కార్పొరేట్ల కన్ను వ్యవసాయం మీద పడింది. రైతులను వారి భూముల నుంచి వెళ్లగొట్టడం రోజు రోజుకూ పెరుగుతోంది. అభివృద్ధి పేరుతో వారిని నిర్వాసితులను చేస్తోంది ప్రభుత్వం. పరిశ్రమల స్థాపన, నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణం, రహదారి విస్తరణ, పట్టణాలు, నగరాల పెరుగుదల, ఇటీవల సెజ్‌ల ఏర్పాటు, ఖనిజ సంపద తవ్వకాల పేరుతో రైతులకు తృణమో ఫణమో నష్టపరిహారంగా ఇచ్చిగాని, లేక వారిని మెడపట్టి గెంటివేసి గాని ఆ భూములను, పరిశ్రమలకు అంతకు ఎన్నో రెట్ల రేటుకు అమ్మడం

నిత్యకృత్యమైపోయింది. అలా చేసే అటవీ ప్రాంతాల్లో మావోయిస్టు సమస్యను నెత్తిన తెచ్చి పెట్టుకుంది. ఇలా నిర్వాసితులను చేయడం 'స్వతంత్రం' వచ్చిన కొత్తలో భాక్రానంగల్ ప్రాజెక్ట్ నిర్మాణం నాడే ప్రారంభమైంది. ఈ పరిణామమే 40 శాతం మంది రైతులు మాకీ వ్యవసాయం వద్దు మొర్రో అనడానికి దారితీసింది. వ్యవసాయరంగంలో మరో పరిణామం ఏమంటే రైతాంగాన్ని విత్తనాల దగ్గర నుంచి, ఎరువులు, పురుగు మందులు, యాంత్రికీకరణ వరకు అన్నింటి కోసం విదేశాల మీద ఆధారపడేలా చేయడం. మన తల్లిదండ్రులు పంట పండించిన తర్వాత, ధాన్యంలో మంచి గింజలను ఏరి వాటిని తర్వాత పంటకు విత్తడం జరుగుతూ వచ్చింది. అటువంటి స్వయం పోషకత్వం, స్వావలంబన పరిస్థితి నుంచి మోన్‌సాంటో లాంటి బహుళజాతి సంస్థ ఉత్పత్తి చేసే విత్తనాల దిగుమతుల మీద ఆధారపడాల్సిన దుర్గతికి ప్రభుత్వ విధానా నిర్ణయం తీసుకొంది. ఈ విత్తనాలను ఒకే ఒక పంటకు వినియోగించాలని, రెండవ పంటకు వినియోగించరాదనే షరతును ప్రభుత్వం అంగీకరించడం, పాలకుల బానిస బుద్ధిని తెలియజేస్తుంది. రైతాంగ కుటుంబాల నుంచి వచ్చిన యువకులు ఈ పరాధీనతను ఆహ్వానిస్తారా? అంగీకరిస్తారా? ఆలోచించండి. ఇప్పటికే తిండి గింజల నుంచి వ్యవసాయ ఉత్పత్తుల ధరలు చుక్కలు చూస్తున్నాయి. మన ప్రధాని గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త అని గొప్పలు చెప్పుకొంటుంది కాంగ్రెస్ నాయకత్వం. మరి ఆ పాండిత్యం ధరల తగ్గింపుకు, ద్రవ్యోల్బణాన్ని, కరెంట్ అకౌంట్ లోటును అదుపులోకి తీసుకొని రానపుడు, ఆ పాండిత్యం నెత్తినేసి కొట్టుకోవడానికా? అలాంటపుడు ప్రధాని కుర్చీ మీద కూర్చొనే అర్హత కోల్పోవడం లేదా? అలాగే నిరుద్యోగ సమస్యకూ ఆయన శాశ్వత పరిష్కారం కనుక్కోలేక పోతున్నారు. ఉపాధి అర్హత వయస్సు (వర్క్ ఫోర్స్) గల వారు ప్రతి సంవత్సరం సుమారు 12 - 13 మిలియన్ల చొప్పున పెరుగుతూంటే, వారిలో పది శాతం మందికే ఉపాధి లభిస్తోంది. మిగతా వారి సంగతేమిటి? ఇప్పటికే 93 శాతం మంది అసంఘటిత రంగంలో చావలేక, బతకలేక సతమతమవు తున్నారు. దీనికి కార్మిక చట్టాల సవరణే పరిష్కారమని మాజీ చీఫ్ ఎకనమిక్ అడ్వయిజర్ శంకర్ ఆచార్య అంటున్నారు. దేశం దశాబ్దాలుగా నిరుద్యోగంతో సహజీవనం చేస్తోంది. విశ్వవిద్యాలయాల్లో మీరు ఉత్తీర్ణులై బయట ప్రపంచంలో అడుగిడితే నిరుద్యోగ భూతం మీకోసం ఎదురుచూస్తుంటుంది. యువకులైన మీరు ఆలోచించుకోవాలి.

దేశం అవినీతి దుర్గంధంలో పీకల్లోతు మునిగిన నేపథ్యంలో ప్రజా పంపిణీ వ్యవస్థ మడికట్టుకొని ఉండలేదు కదా. చవుక ధరల దుకాణాల యజమానుల నుంచి, స్థానిక పాలక పార్టీ నాయకుల్ను, అవినీతి అధికార గణం వరకూ అందరూ ఈ వ్యవస్థను జలగల్లా పీల్చేస్తుంటే, ఈ వ్యవస్థ కోసం ప్రభుత్వం ఖర్చు చేసే వేల కోట్ల రూపాయల్లో సింహ భాగం వారి జేబుల్లోకే పోతోంది. ఈ దోడిపీ గురించి సంవత్సరాలుగా చర్చ జరుగుతూనే ఉంది. దీనికి పరిష్కారం కనుక్కోలేక పోతున్నారు ప్రధాని. ఒక్క పక్క కోట్ల టన్నుల ఆహార ధాన్యాల నిల్వలు గోదాముల్లో ఆరు బయట పేరుకుపోతూంటే, రెండో పక్క తిండి గింజలు లభించక, కొనుక్కోలేక సామాన్యులు ఆకలితో అలమటిస్తున్నారు. దీనికి పరిష్కారం చూపలేని ప్రధాని, సబ్సిడీలను రద్దు చేస్తానంటున్నారు. అంటే పరిపాలన వ్యవస్థను సరిదిద్దలేని అశక్తుడినని ప్రధాని అంగీకరిస్తున్నారన్నమాట. పైగా, నేను పూర్తిగా అయిదు సంవత్సరాలు ప్రధానిగానే ఉంటానంటున్నారు.

మన రాష్ట్రానికి వస్తే, చెప్పుకోవడానికేమైనా ఉందా? పేరుకు రాష్ట్రం అన్నపూర్ణ. ఆచరణలో రుతు పవనాల మీద ఆధార పద్దుతూ వస్తున్న దుస్థితి. ఇదిగో ఫలానా పరిశ్రమ రాబోతోంది, వచ్చేస్తూందనే ప్రకటనలే గాని, వాటిని స్థాపించి, పని ప్రారంభించిన దాఖలాలు లేవు. ఇటీవలి కాలంలో రాష్ట్రం పెట్టుబడులు పెట్టదగిన రాష్ట్రమని గుర్తింపు సంపాదించుకొన్నా, ఆచరణకు ఇంకా ఆమడ దూరంలోనే ఉంది. విద్యుదుత్పత్తి పరిస్థితి ఇతర రాష్ట్రాల నుంచి కొనుక్కోవాల్సిన పరిస్థితి కొనసాగుతోంది. రాష్ట్రంలో రెండేళ్లుగా జరుగుతూన్న హింసాత్మక ఆందోళనలు పారిశ్రామికీకరణను వెనుకపట్టు పట్టిస్తున్నాయి. ఇటీవల గుజరాత్‌లో పారిశ్రామిక మేళా ఘనంగా జరిగితే, రాష్ట్రంలోని కొన్ని పత్రికలు చూసారా గుజరాత్ ఎలా ముందుకు దూసుకపోతుందో అంటూ మన రాష్ట్ర ప్రభుత్వాన్ని విమర్శిస్తున్నాయి. గుజరాత్‌లో కేవలం ఎం.ఒ.యు.ల మీద సంతకాలు చేయడం మాత్రమే జరిగింది. అంటే మేము ఫలానా పరిశ్రమ మీ రాష్ట్రంలో స్థాపిస్తాం అని నోటి మాటగా చెప్పడం మాత్రమే. భూమి కేటాయించాలి, నిధులు సేకరించాలి, నిర్మాణం చేపట్టాలి, పూర్తి కావాలి. కార్మికులను, అధికారులను, సాంకేతిక నిపుణులను ఏర్పాటు చేసుకోవాలి. ఏమైనా మన రాష్ట్రం కన్నా గుజరాత్ ఇప్పటికే పెద్ద ఎత్తున పారిశ్రామికీకరణ సాధించిన రాష్ట్రం. ఆ రాష్ట్రంతో పోల్చడం సరికాదు. ఉదాహరణకు 1970 ప్రారంభంలో విశాఖలో ఉక్కు కర్మాగారం నెలకొల్పడానికి పని ప్రారంభమైనదనడానికి గుర్తుగా ఒక పైలాన్‌ను ఆవిష్కరించినా, 80వ దశకంలోనే నిర్మాణం ప్రారంభ మైంది. జలయజ్ఞం ప్రారంభించి అయిదేళ్లలో పూర్తి అవుతుందన్నారు వై.ఎస్. ఇపుడు అది పూర్తి కావడానికి మరో అయిదేళ్లు కావాలంటు న్నారు. పరిస్థితులు చూస్తుంటే మరో అయిదేళ్లు పొడిగించడం ఖాయంగా కనపడుతోంది. రాష్ట్రాభివృద్ధికి మూలస్తంభాలైన వ్యవసాయం, నీటి పారుదల, పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి రంగాల్లో పరిస్థితి ఇది. పాప్యులిస్ట్ల పథకాల హోరులో అసలు, సిసలైన అభివృద్ధి అడుగున పడిపోతోంది.

రాజకీయరంగంలో కోడి పందాల్లో లాగ కొట్టుకు చస్తున్నారు. ఈ కొట్లాట ప్రజలమధ్య కాదు. ఆంధ్ర - తెలంగాణ రైతాంగం, కార్మికుల మధ్య కాదు. ఇది బూర్జువా వర్గంలో, అధికారం కోసం కుమ్ములాట. ఈ కుమ్ములాట ఫలితంగా జరిగే కాస్త అభివృద్ధి కొండెక్కింది. ప్రజలు వారి సమస్యల పరిష్కారం కోసం ఆందోళనలను చేస్తుండగా, వారి దృష్టిని ఆ సమస్యల నుంచి మళ్లించడానికి పాలకవర్గం చేపట్టిన కొట్లాట ఇది. ఒకే రాష్ట్రంగా కొనసాగినా, రెండుగా విభజించినా, రెండు చోట్లా ప్రజలు వారి సమస్యలతో సహజీవనం చేస్తూనే ఉంటారు. యువతను ఈ కీచులాటల్లో పావులుగా ఉపయోగించుకొంటున్నారు. నాయకులు క్షేమంగా ఉన్నారు. చనిపోయింది యువకులే. వారి చితుల దగ్గర నాయకులు చలి కాచుకొంటున్నారు.

ఇవాల్టి యువకులే రేపటి పాలకులు. దేశ భవిష్యత్తు యువత చేతుల్లో ఉంది. ప్రస్తుత 'డాక్టర్' రోగాన్ని నయం చేయలేకపోతున్నాడు. ఏం చేయాలో యువత ఆలోచించుకోవాలి.

*(విశాఖపట్నం గీతం విశ్వవిద్యాలయంలో ఎం.బి.ఎ. విద్యార్థులను ద్దేశించి చేసిన ప్రసంగానికి ఇది స్వేచ్ఛానువాదం)*

*(రచయిత వీక్షణం గౌరవ సంపాదకులు)* వీ

జార్ఖండ్ లోని పాలమౌ జిల్లాలో నెతర్‌హాట్ ప్రాంత ఆదివాసీలు చేపట్టిన ఉద్యమంపై క్షేత్ర పరిశీలన చేసిన టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్, ముంబై విద్యార్థిని **దాసరి స్రవంతి** అధ్యయన పత్రం

# రాజ్యాంగ విధి విధానాలు ఎవరి కోసం?

ఏ ప్రభుత్వ పథకమైనా ప్రజలను నిర్వాశితులను చేసేస్తూ, పర్యావరణానికి ముప్పుగా పరిణమిస్తూ, ఆ జాతి మనుగడకే ముప్పుగా మారుతున్నప్పుడు దాన్ని ఉపేక్షించరాదు. అయినా 'అభివృద్ధి' అనే ముసుగులో కొనసాగించడం పాలకులకు సర్వ సాధారణమై పోయింది. వారు చెప్తున్న 'అభివృద్ధి' ఎవరి కోసం? ఎంతటి వ్యయంతో? ఏ మేరకు? అన్నది నిశితంగా పరిశీలించాల్సి ఉంటుంది. 'అభివృద్ధి' అన్నది ఏ పట్టణ ప్రాంత వికాసానికో పెట్టుబడిదార్ల లాభాపేక్షకో కారాదు. ఇదే అంశాన్ని జన సంఘర్షణ సమితి కార్యకర్త ఈ విధంగా ప్రశ్నిస్తున్నారు:

"ఈ దేశ 'అభివృద్ధి' బాధ్యతను గిరిజనులే నెత్తికెత్తుకున్నారా?" అని ఎందుకంటే... తరతరాలుగా ఈ దేశంలో ప్రభుత్వం నిర్మిస్తున్న డ్యాంలు గానీ, పారిశ్రామిక కేంద్రాలుగానీ, చివరకు మిలటరీ సేనల కాల్పుల శిక్షణా కేంద్రాలు గానీ, ఈ ప్రాంతాల్లోనే నెలకొల్పాలా? దేశాభివృద్ధికి పాలకులు ఎన్నుకున్న ఒకే ఒక్క విధానమిదేనా? అని. ఈ నేపథ్యంలో...

జార్ఖండ్ ప్రాంతంలో పాలమౌ జిల్లాకు దక్షిణ దిశగా చెచపాత్రి ఘాట్ ప్రాంతంతో పాటు, గుల్మా జిల్లాలోని కొన్ని మండలాలు ప్రభుత్వం ఏర్పాటు చేయనున్న ఆర్మీ సేనల కాల్పుల శిక్షణా కేంద్రం పరిధిలోకి వస్తాయి. ఈ ప్రాంతం యావత్తూ ముండా, బిరిజ, గోండు, గోర్లైట్, కార్వార్, అసుర్, నగేశియా వంటి గిరిజన సమూహాలకు నిలయం. దశాబ్దాలుగా ఈ ప్రాంత గిరిజనులు వెదురు పెంపకం ప్రధాన వృత్తిగా, వెదురు బుట్టల తయారీయే వ్యాపకంగా జీవనాన్ని వెళ్లదీస్తుండేవారు. ఈ సైనిక కాల్పుల శిక్షణా కేంద్ర ఏర్పాటులో భాగంగా వీరు తమ వృత్తులకు దూరమై కేవలం పోడు వ్యవసాయంపై ఆధారపడాల్సి వస్తోంది. ఇక్కడ ప్రధాన సేద్యం జొన్నలు. ఈ సేద్యానికి గిరిజనలు అవిరామంగా, కృషి చేసినా కడుపు నిండని పరిస్థితి నెలకొంది.

సైనిక క్షేత్ర శిక్షణా చట్టం – 1938 మేరకు రాంచి కేంద్రాన్ని 23వ క్షేత్ర శిక్షణా బ్రిగేడ్‌గా ప్రకటించారు. దీంతో రాంచీ సమీపంలోని కంటోన్మెంట్ నుంచి అధిక సంఖ్యలో సైనిక వాహనాలు మందుగుండు సామాగ్రి, తుపాకులతో అనునిత్యం తిరుగాడడం మొదలయ్యింది. అడపాదడపా నిర్దేశిత ప్రాంతాల్లో శిక్షణా కేంద్రాలను ఏర్పాటు చేసి, శిక్షణను కొనసాగించడం ఆనవాయితీగా మారింది.

ఈ శిక్షణా కార్యక్రమం మొదలైతే, ఆ ప్రాంత గిరిజనులంతా, పిల్లలతో, ఉన్న కొద్దిపాటి పశుసంపదతో, ముసలి ముతకా, చిన్న పిల్లలతో అడవుల్లోని సురక్షిత ప్రాంతాలకు పరుగులు తీయాల్సిందే. ఈ తరలింపుల్లో సైనికాధికారుల సహకారం ఇసుమంతైనా ఉండదు. శిక్షణా కార్యక్రమం ముగిసిన అనంతరం వచ్చి చూసుకుంటే, వారి సేద్యాలు ఛిద్రమై దర్శనమిస్తాయి. మళ్లీ వాటిని బాగు చేసుకోవడం నివాసితుల బాధ్యతే. ఇందుకు సైనికాధికారులు శిక్షణా కాలానికి రోజుకు రు. 150లు గిరిజనులకు చెల్లిస్తారు. బతుకు భారానికి వెలకట్టేందుకై ఆ గిరిజనులు తమ తమ క్షేత్రాల్లో పోగులుగా పడి ఉన్న పేలని తూటాలను, షెల్స్‌ను ఏరుకుని ఇనుప సామానుల వారికి అమ్ముకుంటూ ఉంటారు. ఈ క్రమంలో పేలని తూటాలు – షెల్స్ పేలి గిరిజనులు ప్రాణాలను కోల్పోవడమూ జరుగుతుంటుంది. ఈ అభ్యాస క్రమాన్ని ప్రముఖ పాత్రికేయులు పి. సాయినాథ్ ఈ విధంగా వ్యాఖ్యానించారు... 'ఇది గిరిజన తండాల్లో జరుగుతున్నందున 'జాతి ప్రయోజన' కోసం ఆయా గిరిజనులు భరించాల్సిందే. ఇదే తరహా అభ్యాసం ఏ ముంబాయిలోని మలబార్ గిరిజన ప్రాంతంలో జరపాల్సి వస్తే మాత్రం... అది 'జాతి ప్రయోజనం' కానేరదు. బహుశా అది ప్రభుత్వ పతనానికే దారి తీయోచ్చు' అని.

ఇంతకు ఈ సైనికాధికారులు చేపడుతున్న శిక్షణా కార్యక్రమం వీరు పొందుపర్చుకున్న నిబంధనలకు వ్యతిరేకం. సైనిక క్షేత్ర శిక్షణా చట్టం – 1938 ప్రకారం... ముందస్తుగా శిక్షణా స్థలాన్ని ఎంపిక చేసి వారి అధికారిక గెజిట్‌లో ప్రకటించాలి. అదీ రెండు నెలల ముందస్తుగా గెజిట్ ప్రచురణతో పాటు స్థానిక దిన పత్రికల్లోనూ ప్రకటించాల్సి ఉంటుంది. దీంతో పాటు స్థానిక ప్రాంతాల్లో నోటీసులు అంటించడం, గిరిజన తండాల్లో దండోరా వేయించడం అనివార్యం. ఈ ప్రచార కార్యక్రమం అంతా తండా నేతల ఆధ్వర్యంలో ఓ ఇద్దరు విద్యావంతుల నేతృత్వంలో జరపాలని స్పష్టంగా పేర్కొనడం జరిగింది. శిక్షణా కార్యక్రమాన్ని నిర్వహిస్తున్న అధికారి. స్థానిక జిల్లాధికారి సమన్వయంతో ప్రమాద స్థల ప్రకటనను చేయాలి. ఆయా ప్రాంతం నుంచి ప్రజలను, పశుసంపదను తరలించడంలో సైనికాధికారులు బాధ్యతను తీసుకోవాల్సి ఉంటుంది. శిక్షణా క్రమంలో వాటిల్లిన నష్టానికి తగు నష్ట పరిహారాన్ని తక్షణం చెల్లించాల్సి ఉంటుంది. అనివార్యమైన పక్షంలో 15 దినాల గడువును వినియోగించుకునే వీలుంది.

కానీ ఆచరణలో ఇందుకు పూర్తి విరుద్ధంగా జరుగుతోంది. కేవలం 24 గంటల గడువులో గ్రామాల్ని ఖాళీ చేయాల్సి రావడం,

నష్టపరిహారాన్ని కనీస స్థాయికి కుదించేయడం. ఇది కూడా, సైనికాధికారులను సకాలంలో సమీకరించిన వారికే పరిమితం చేసెయ్యడం 'యాదృచ్ఛికం' అయితే కాదు. ఇలా దశాబ్దాలుగా సాగుతున్న క్రమంలో నెహర్‌హట్ ప్రాంతంలో సైనిక శాశ్వత శిక్షణా కేంద్ర ఏర్పాటుకై ప్రకటన వెలువడేంత వరకూ ప్రజల్లో చలనం కలగలే. ఎప్పుడైతే సైనికాధికారులు ఆ ప్రాంతాన్ని తరచూ పరిశీలించడం... పదే పదే సర్వేలు నిర్వహించడం మొదలెయ్యిందో ప్రజల్లో అనుమానాలు బలపడి, ప్రజావ్యతిరేకత పెల్లుబికింది. దీంతో 1981-82 నాటి ప్రభుత్వం తన ప్రయత్నాన్ని వాయిదా వేసుకుంది.

తిరిగి 1993 సెప్టెంబర్ మొదటివారంలో స్థానిక దినపత్రికలో సైనిక శిక్షణా కేంద్ర ఏర్పాటు విషయమై ఓ ప్రత్యేక వ్యాసం రావడంతో ప్రజల్లో కలకలం మొదలైంది. చివరకు చర్చి సమావేశాల్లో సైతం సైనిక శిక్షణా కేంద్ర ఏర్పాటు ప్రధానాంశం అయింది. గ్రామ గ్రామాన 'చహోని విస్థాపన్ సంఘర్ష్ సమితి' పేరున గ్రామ కమిటీలు వెలిశాయి. విస్తృత ప్రచారం జరిగి 23 సెప్టెంబర్ నాటికి పదివేల మందితో నిరసన సభను నిర్వహించగలిగారు. రాష్ట్ర గవర్నర్, ముఖ్యమంత్రి, ప్రధాని, రాష్ట్రపతులకు విజ్ఞాపనలను అందజేశారు. ఇంతటి ప్రజావ్యతిరేకతను సైనికాధికారులు గుర్తించకపోగా, తమ శిక్షణా కేంద్ర ఏర్పాటు ప్రాంతీయ అభివృద్ధి కోసమేనని ప్రకటించసాగారు.

సాధారణంగా ఏ విధి విధానాలనైనా రూపొందించినప్పుడు, ప్రజా భాగస్వామ్య దిశగా ఆలోచించాలి. అలా కాని పక్షంలో ప్రజా వ్యతిరేకత కార్చిచ్చులా విస్తరిస్తుంది. సామాజిక వ్యతిరేకత నలువైపులా వెల్లడైన సందర్భంగానైనా, ప్రజా వ్యతిరేకతను తేలిగ్గా తీసుకోకుండా, ప్రభుత్వం తన నిర్ణయాన్ని పునరాలోచించాలి. 'అభివృద్ధి' నిర్వచనం ప్రశ్నింపబడి, పునర్నిర్వచింపబడాలి. అలా కానందున 'అభివృద్ధి' మూల్యాన్ని ఆ ప్రాంతీయులు భరిస్తూ ఉంటే... అదనపు సౌకర్యాన్ని మాత్రం, దేశ ప్రజలంతా పొందనున్నారా? అని పి. సాయినాథ్ ప్రశ్నించారు. సహేతుకమైన ప్రశ్న.

అయినా 1993 నవంబర్ నాటికి జన సంఘర్ష్ సమితి వారు సైనిక, కాల్పుల శిక్షణా కేంద్ర ఏర్పాటు విషయమై ప్రభుత్వ ప్రకటనలను ఓ రెండు ప్రత్యేక గెజిట్‌లలో కనుక్కోగలిగారు. పాలమౌ, గుమ్లా జిల్లాలకు చెందిన 245 గ్రామాలను గుర్తించి పదేళ్ల కాల పరిమితిలో శాశ్వత శిక్షణా శిబిరాన్ని ఏర్పాటు చేయాలనీ ఈ గెజిట్‌లలో పేర్కొన్నారు. ఈ ఏర్పాటుతో సుమారు లక్షమంది ప్రజలు, లక్షా ఏడువేల ఏడువందల అరవై ఆరు హెక్టార్ల విస్తీర్ణ భూములు ప్రభావితం కానున్నాయి. అందుకోసం మొదలైన భూసేకరణా క్రమంతో ప్రజల్లో కదలిక మొదలైంది. ఈ శిక్షణా శిబిరం ఏర్పాటుతో బెట్లా జాతీయ ఉద్యాన వనంకూ, టైగర్ రిజర్వ్ ప్రాజెక్టుకూ తీవ్ర నష్టం వాటిల్లనుంది. దీనికి వ్యతిరేకంగా ఉద్యమించడానికి ప్రజలు కదిలారు. "మా ప్రాణాలైనా ఇస్తాం కానీ మా భూమిని వదులుకోం" వంటి నినాదాలతో ప్రజా ప్రతిఘటన పలురూపాల్ని సంతరించుకుంది. సంప్రదాయ వాయిద్యాల తో అనుదినం ఓ ప్రత్యేక చోటచేరి ఉద్యమ సమాచారాన్ని పంచుకునే వారు. ఇందుకు పంచాయితీలు, ప్రార్ధనా స్థలాలు సైతం మినహాయింపు కాలే. 1993 డిసెంబర్ మధ్య నాటికల్లా బనారి - భిష్ణాపూర్ విద్యార్థి సంఘం పాలమౌ జిల్లాలో డాల్టోన్ గంజ్ నుంచి 'నౌజవాన్ సంఘం' ఉద్యమ అవసరానికై పురుడు పోసుకున్నాయి.

ఈ ప్రాంతీయ నిరసన సెగ ఢిల్లీని సైతం తాకింది. అయినా, 1994 మార్చ్‌లో శిక్షణా శిబిర నిర్వహణకై (గతంలో మాదిరి తాత్కాలిక శిక్షణకై) నోటీసు వెలువడింది. వెనువెంటనే 50 వేల మందితో నెహర్‌హట్, రాంచీల కూడలిలో నిరసన సభను నిర్వహించారు. నిరసన శిబిరం మొదలైంది. రెండు రోజుల కాలినడకన ఆదివాసీలు నిరసన శిబిరాన్ని చేరుకున్నారు. సైనిక వాహనాలను నిలిపివేశారు. సైనికాధికారులు ఏప్రిల్ 25 నుంచి మే 3 వరకూ శిక్షణా శిబిరం నిర్వహించతలపెట్టారు. దీన్ని ఏప్రిల్ 22 నుంచి 27 ఏప్రిల్ వర[illegible] ఐదు రోజుల నిర్విరామ నిరసనతో నిలపగలిగారు. మళ్లీ జ[illegible]ర నుంచి శిక్షణా శిబిరాన్ని నిర్వహించనున్నట్టు ప్రకటన వెలువడి[illegible]క్షణం, నిరసన మిన్నంటడంతో ఆ ప్రయత్నాన్నీ సైనికాధికారులు విరమించక తప్పలేదు.

ఇదే సందర్భంలో అమెరికా సంయుక్త రాష్ట్రాల ఇయర్ ఆఫ్ ది ఇండీజనస్ పీపుల్స్ ప్రకటనతో ఈ ప్రజా ఉద్యమానికి కొత్త ఊపు వచ్చింది. స్థానిక ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధి విధానాల పట్ల నిరసనలు వెలువడ్డాయి. దీంతో సైనిక శిక్షణా శిబిర ఏర్పాటును ఓ పదకొండేళ్ల పాటు ఉపేక్షించాల్సి వచ్చింది. కానీ కేవలం ఓ ఐదేళ్ల విరామానంతరం బీహార్ ప్రభుత్వం విధాన నిర్ణయాన్ని తిరగదోడింది. దీంతో జన సంఘర్ష్ సమితి మళ్లీ కార్యరంగంలోకి దూకింది. శిక్షణా శిబిర ఏర్పాటును శాశ్వతంగా నిలిపి వేయడంతో పాటు, తాత్కాలిక శిక్షణా శిబిరాలను నిలిపి వేయాలని డిమాండు చేసింది. అగ్నికి ఆజ్యం తోడైనట్టు ఈ ప్రాంతంలో నక్సల్స్ ప్రభావం సైతం జోడైంది. సమస్య తీవ్రత గ్రామ గ్రామాలకు విస్తరించింది. అహింసాయుత మార్గంలో సంప్రదాయ సంగీత మేళాలతో తమదైన నేలతో వారి అనుబంధాన్ని విస్తృత పర్చగలిగారు. అంతిమంగా, సైనిక శిక్షణా శిబిరాన్ని నిలిపివేయడం తప్ప మరో ప్రత్యమ్నాయం లేదనే స్థాయికి చేరింది. గతంలో వినవచ్చిన 'మా ప్రాణాలైనా ఇస్తాం కాని మా నేలను వదులుకోం' నినాదం - 'మా ప్రాణాల్ని ఇవ్వం మా నేలనూ వదులుకోం' అన్నదిగా మారిపోయింది.

ఈ సైనిక కాల్పుల శిక్షణా శిబిరం (ఆర్టిలరీ) మొదట గయా జిల్లాలో నిర్మించేందుకు నిర్దేశితమైంది. తదుపరి చోటా నాగ్‌పూర్ [illegible] ప్రాంతానికి చెందిన గిరిజన ప్రాంతానికి మార్చబడింది. నామమాత్ర అభివృద్ధితో, రాజకీయ ప్రమేయం తక్కువగా ఉన్న ప్రాంతమైనందున ఇక్కడ ప్రతిపాదించడం జరిగింది. అధికారుల అంచనాలు ఇంతటి ప్రజా వ్యతిరేకతను అంచనా వేయలేక పోయాయి. ప్రభుత్వం తాను రూపొందించుకున్న నిబంధనల మేరకు, గిరిజన సంక్షేమాన్ని పరిరక్షించాల్సి ఉన్నప్పటికీ, ఇందుకు భిన్నంగా వ్యవహరించడం పరిపాటయ్యింది.

శిక్షణా శిబిరాన్ని నెహర్‌హట్‌కు తరలించేందుకు ప్రధానంగా రెండు కారణాలు చెప్పారు. ఈ శిక్షణా శిబిరాన్ని గయలో ఏర్పాటు చేస్తే 1) పునరావాసుల సంఖ్య అధికమౌతుంది. 2. గయ ప్రాంతం లోని చారిత్రక కట్టడాలను కోల్పోవల్సి వస్తుంది. ఆచరణరీత్యా ఈ రెండు

పిల్లల ఆత్మస్థైర్యాన్నీ, చొరవనూ, ప్రశ్నించే శక్తినీ దెబ్బతీసి, అంతిమంగా వారి సృజనాత్మకతనే హరించివేసే పద్ధతిలో బోధన ఉండకూడదని అంటున్నారు **బి. రామకృష్ణ**

# పిల్లలపై దండనలు అమానుషం

**బా**ల్యం భావి జీవితానికి పునాది వంటిది. అది మధురమైనదైతే, ఆనందకరమైతే, అహ్లాదభరితమైతే, సమాజం సానుకూలమైన దిశలో పయనించడానికి దోహదపడుతుంది. బాల్యంపై పెత్తనాలెన్నో పనిచేస్తున్నాయి. వీటిని ఇంట్లో, సమాజంలో, పాఠశాలల్లో చూడొచ్చు. ప్రపంచ వ్యాప్తంగా పిల్లలకు అనేక రూపాల్లో శిక్షలు విధించ బడుతున్నాయి. ఎన్నో ఉద్యమాలు ఫలితంగా సమాజంలో హక్కుల స్పృహ పెరుగుతున్నది. దాని ఫలితంగా అంతర్జాతీయంగా బాలల హక్కులపై ప్రకటనలు, ఒప్పందాలు వచ్చాయి. ఎన్నో దేశాలు వీటికి అనుగుణంగా తమ చట్టాల్లో మార్పులు తీసుకొచ్చాయి. అయినా పిల్లలు శిక్షలకు, చిన్నచూపుకు గురవడమేదాన్ని అనేక అధ్యయనాలు, మన స్వంత అనుభవాలు చెబుతూనే ఉన్నాయి.

మొక్కై వంగనిది మానై వంగునా అనే నానుడి తెలిసిందే. బాల్యం నుండే పిల్లలపై శిక్షలు, నియంత్రణ అమలువుతున్నాయి. అదంతా కూడా వారి మంచికేనని వారి భావి జీవితం బాగుండాలని, తపనతోటే జరుగుతున్నట్లుగా చెప్పబడుతుంటాయి. తమ మాట వినట్లేదనో, సరిగ్గా చదవట్లేదనో, చెడు మాటలు, చెడు తిరుగుళ్ళు, చెడు ప్రవర్తనలు నేర్చుకుంటున్నారనో, సినిమాలకు, టివిలకు అలవాటయ్యారనో, తాము చెప్పినట్లు నడుచుకోవట్లేదనో తదితర కారణాలు చూపి వారిని సరైన మార్గంలోకి తేవడం కొరకని దండనను ఒక సాధనంగా తరుచుగా వాడడం పెరుగుతున్నది.

తప్పు చేస్తే దండించడం తప్పు కాదనే స్పృహ ఉన్నంతవరకూ పిల్లలపై దండనలకు అదుపు ఉండదు. తప్పంటే ఏమిటో అనేది మరో విషయం – ఒకరికి తప్పనిపించింది, మరొకరికి అనిపించకపోవచ్చు. స్థల కాలాలను బట్టి ఒకరి ప్రాపంచిక ఆలోచనలను అనుసరించి అనేక పరిమితులతో ఇది నిర్ణయించబడుతుంది.

సమాజ పరిణామ క్రమంలో సమాజంలో ఒక ఆర్డర్‌ను (క్రమాన్ని) నిలిపి ఉంచడం కోసం ఆధిపత్య శక్తులు (కుటుంబ పెద్దలు, తెగ పెద్దలు, మత, ఫ్యూడల్ ప్రభువులు, కుల వ్యవస్థ, పురుషాధిక్యత, రాచరిక, భూస్వామ్య, పెట్టుబడిదారీ శక్తులు మొదలైనవి) శక్తులను సాధనంగా మార్చుకున్నాయి. అసలు శిక్షలు లేని సమాజం ఒకటుందా, అంటే, అది ఆదిమ సమాజంలో స్వంత ఆస్తి భావన రాకముందు సాధ్యమయ్యి ఉంటుంది. శిక్షలు లేని సమాజం అనేది ఒక ఆదర్శం, ఒక విలువ, ఒక సుదూర లక్ష్యం. ఆ ఉన్నత స్థాయికి సమాజ గమనం జరగాల్సి ఉంది. అందుకోసం మళ్లీ హింస, దండనలు, శిక్షలనే ఆశ్రయించే

---

కారణాలు అసంబద్ధమైనవి. నెహర్‌హట్ ప్రాంతంలో పునరావాసుల సంఖ్య స్వల్పమేమీకాదు. తరతరాల గిరిజన సంస్కృతి చరిత్ర కాలగర్భంలో కలిసిపోతుంది. అంటే ఇక్కడ ఒక వర్గ ప్రజల చారిత్రక కట్టడాల పరిరక్షణ కోసం, వేరే వర్గ ప్రజల చరిత్ర – సంస్కృతీ విలువలను బలిపెట్టడం జరిగింది.

స్వాతంత్ర్యం సిద్ధించిన నాటినుండే మనదేశంలో ఆదివాసీలను, పర్యావరణాన్నీ బలిపెట్టి పారిశ్రామికీకరణకు పెద్దపీట వేయడం జరుగుతూ వస్తోంది. ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి రూపకల్పనలోనూ వీరిని ఉపేక్షించడం జరిగింది. నీటి పారుదల ప్రాజెక్టులు, రహదారులు, గనులు, విద్యుత్ ఉత్పాదనా కేంద్రాలు పారిశ్రామిక వాడలు తదితర రంగాల్లో విస్తృత పెట్టుబడులు అవసరమయ్యాయి. ఆయా రంగాల అభివృద్ధిలో లక్షలాది మంది నిరాశ్రయులయ్యారు. పునఃపరిష్కార ఒప్పందాలు, పునరావాస ఏర్పాట్లు నిరాశ్రయులను ఆదుకునే స్థాయిలో లేవు. ఈ కారణంగానే, అభివృద్ధి పథానికి దోహదపడ్డ సామాజిక వర్గాలు పేదరికానికి చేరువైన వాస్తవం దాగి ఉంది.

పునరావాస కల్పన అంత తేలికైన అంశం ఏమీ కాదు. వారి భూములను తీసుకుని వేరే చోట ప్రత్యమ్నాయ భూములను కేటాయించడంతో సరిపోదు. ఇక గిరిజనుల విషయానికొస్తే వారి జీవనం వారి అటవీ ప్రాంతంతో ముడిపడి ఉంటుంది. ఇందుకనుగుణం గానే వారి సంస్కృతీ ఉంటుంది. పాలకవర్గాలే 'అభివృద్ధి' ముసుగులో అడవుల్ని నిర్మూలిస్తూ భృతి కోసం చెట్లను నరికిన గిరిజనులను దోషుల్ని చేస్తున్నారు. ఇన్ని మౌలిక అంశాలను వారి పునరావాస కల్పన, నష్ట పరిహార చెల్లింపుల్లో పరిగణనలోకి తీసుకోవడం లేదు. పునరావసం ఎప్పుడూ వారి గత జీవన విలువలకు ధీటుగా, మెరుగ్గా ఉండాలన్న యోచన పాలకులకు ఉండాలి. కానీ అలాంటి ఆలోచన పాలకులకు లేనే లేదు.

ఇక సామాజిక ఉద్యమాల ద్వారా సాధించిన 'అభివృద్ధి' ఫలాలు అంతిమంగా చేరుతున్నది ఉన్నత వర్గాల వారికేనన్నది చారిత్రక సత్యం. కానీ త్యాగాలకు గురౌతుంది మాత్రం అట్టడుగు వర్గాల వారే. మరీ ముఖ్యంగా ఆదివాసీలే. 'అభివృద్ధి'కి సమిధలుగా, జాతి నిర్మాతలుగా చరిత్ర పుటల్లో కన్పించేది, నిల్చేది వీరే!

(స్వేచ్ఛానువాదం : విద్యాభూషణ్, పాత్రికేయులు)

పరిస్థితి రాకుండా మానవ ప్రయత్నాలు సాగుతాయా, అనేది ఆలోచించవలసిన విషయం. పిల్లల్లో సానుకూల ప్రవర్తన మార్పుల కోసం దండనలు హింసలు కాకుండా మరే మార్గాలు లేవా? దీని కోసం మనోవైజ్ఞానిక పరిజ్ఞానంతో కూడిన నైపుణ్యాలు, ఓపిక, సహనం, పట్టుదల, ఇతరుల అభిప్రాయాలను గుర్తించడం, గౌరవించడం, మరితర సామాజిక నైపుణ్యాలు అవసరమవుతాయి. వీటిని కుటుంబం, సమాజం, బడులు, రాజ్య యంత్రాంగం అలవర్చుకోవలసి ఉంది.

పిల్లల సహజ సామర్థ్యాలను, అభిరుచులను, అభిప్రాయాలను గుర్తించడంలో వైఫల్యం జరుగుతోంది. వాటిని అభివృద్ధి చేయడానికి సమాజ పురోగమనానికి, వినియోగపడేలా చేయడానికి కుటుంబపరమైన, సామాజికపరమైన సర్దుబాటును వృద్ధి చేయవలసి ఉంది. పిల్లలకేం తెలుస్తుందిలే అని అనుకోవడం జరుగుతున్నది. ప్రతి వ్యక్తికి ప్రత్యేకమైన సామర్థ్యాలు, అవసరాలు ఉంటాయి. అవి బాల్యం నుండే సరైన ప్రోత్సాహాన్ని పొందవలసి ఉంటుంది. అసలు అవంటే ఏంటో తెలుసుకొనే జ్ఞానం కాని, పరిస్థితులు కాని ఎందరికుంటుంది అనే దగ్గరే అసలు సమస్య. ఆ జ్ఞానం పొందడానికి కృషి జరగవలసి ఉంది. నేడు చాలా వరకు తల్లిదండ్రులు చదువుల అవసరాలను గుర్తిస్తున్నారు. పిల్లల చదువులకు ప్రాధాన్యతనిస్తున్నారు. చదువులు మార్కుల చదువులుగానో, ర్యాంకుల చదువులుగానో ఉన్నాయని చాలావరకు అంగీకరిస్తున్నారు. అయినా, ఆ చదువులనే నమ్ముకునే పరిస్థితి ఉంది. ఆ చదువులే కొందరికైనా ఉపాధి, ఉద్యోగాలు, హోదాలు ఇస్తున్నాయి. ఈ చదువుల వల్ల పిల్లవాని అభిరుచులు ఆసక్తులు సహజ సామర్థ్యాలు వికసించే వాతావరణం పాఠశాలల్లో లేదు. మూస పద్ధతుల్లో పాఠాలు బోధించడం, సిలబస్ పూర్తి చేయడం, పరీక్షలు జరపడం, మార్కుల్లో, గ్రేడుల్లో ఇచ్చేయడం జరిగిపోతున్నది. ఈ క్రమాన్ని పాటించడంలో ఉపాధ్యాయులు పరికరాలుగా మారే అనివార్యత ఉన్నది తప్పిస్తే, పిల్లల సర్వతోముఖ వికాసానికి దోహదపడే పద్ధతులను ఆచరించడానికి తక్కువ అవకాశాలు ఉన్నాయి.

ప్రతి విద్యార్థిని అర్థం చేసుకుని వ్యక్తిగత శ్రద్ధ తీసుకునేటంతగా బడి వాతావరణం లేదు. ప్రతి పిల్లవాని స్వభావాన్ని, మూర్తిమత్వాన్ని అంచనా వేసేందుకు తగిన పరిస్థితులు బడుల్లో ఏర్పడేందుకు అనేక మార్పులు రావలసి ఉంది. కేవలం పాఠ్య పుస్తకాల చదువులపైనే శ్రద్ధ పెట్టే దురదృష్టకరమైన వాతావరణం నెలకొని ఉంది. ఆటపాటలు, నృత్యం, చిత్రలేఖనం మరితర ఎన్నో శారీరక, మానసిక వికాసానికి దోహదపడే విషయాలకు చోటులేని పరిస్థితిలో మన విద్యా వ్యవస్థ ఉన్నది. చాలీచాలని తరగతి గదులు, వసతుల లేమీ, టీచర్ల కొరత ఉన్న నేపథ్యంలో పిల్లల్లోని వైవిధ్యాలకు అనుగుణంగా బోధించే వాతావరణం కొరవడుతున్నది. ప్రశ్నలకు జవాబులు రాయించడం వాటిని బట్టీ పట్టించడం సాధారణంగా జరిగే విషయాలు. మెరుగైన బోధనా పద్ధతులు ఉన్నప్పటికీ వాటిని అమలు చేయడంలో తగు నైపుణ్యాలను మెరుగులు దిద్దుకోవాల్సి ఉంది.

పిల్లలను దండించే విషయంలో సమాజంలో ఉన్న అశాస్త్రీయమైన ఆలోచనలూ, ఆచరణలూ ఉపాధ్యాయులపై ఉండే అవకాశాన్ని తోసిపుచ్చలేం. అయితే విద్యా మనోవైజ్ఞానిక శాస్త్ర ఆధారాలను అధ్యయనం చేసిన వ్యక్తులుగా ఉపాధ్యాయులు ఈ విషయంలో శాస్త్రీయ దృక్పథాలను అలవరుచుకోవలసి ఉంది. దండనతో సానుకూల మార్పులు రావడం చాలా తక్కువే కాకుండా వ్యతిరేక ఫలితాలను ఇస్తాయని ప్రపంచవ్యాప్తంగా పలు అధ్యయనాలు చెబుతున్నాయి. దండించే వారిపై పిల్లల్లో అంతర్గతంగా ఏహ్య భావం, కసి పెరుగుతుంది. ఆ క్షణానికికో ఆ సంవత్సరానికో ఆ టీచర్ పట్ల భయంతో మెలుగుతారు కావచ్చు. కాని మనస్ఫూర్తిగా మాత్రం కాదు. దీని వలన పిల్లలు తమ భావి జీవితంలో అపసవ్య ఆలోచనలు, ప్రవర్తన వైపుకు మొగ్గు చూపుతారు. తాము సైతం అదే దండనలను తమకంటే బలహీనులపై ప్రయోగించడం నేర్చుకుంటారు. ఇది తప్పేమీ కాదని దృఢ పరుచుకుంటారు. దీన్ని యథేచ్ఛగా ప్రయోగించడం ద్వారా సమాజంలో హింసకు సాధికారత కలిగించే అనివార్యత వస్తుంది. ఉపాధ్యాయులు వారి ఆలోచనల్లో, ఆచరణలో శాస్త్రీయ బోధనా పద్ధతుల పరిజ్ఞానాన్ని విస్తృతం చేసుకోవాల్సి ఉంది. కృత్యాధార, అన్వేషణ, ప్రాజెక్ట్, ప్రయోగ పద్ధతుల వంటి ఎన్నో మెరుగైన బోధనా పద్ధతులున్నాయి. అయితే వీటిని ఆచరించడంలోనే అసలు సమస్యలు ఉన్నాయి. ఎన్నో ఇబ్బందులున్నాయి. వీటిని అధిగమించడం కోసం పరిశోధనలు జరగవలసిన ఆవశ్యకత ఎంతగానో ఉంది.

అధ్యయనం అనేది విషయ పరిజ్ఞానాన్ని, అవగాహన విస్తృతిని ఆచరణలో మెలుకువలను అనుభవ పరిధిని పెంచుతుంది. ప్రపంచ వ్యాప్తంగా విద్యా విధానాల్లో బోధనా పద్ధతుల్లో వస్తున్న మార్పులను, పరిశోధనలను, అనుభవాలను పరిశీలించడం ద్వారా బోధనా వ్యవస్థ ప్రక్రియను మరింత మెరుగ్గా నిర్వహించగలిగే సామర్థ్యాలు పెరుగుతాయి. గిజుబాయి, ఠాగూర్, సొసాకు కొబయాషీ, సుకోమ్లినిస్కీ మకరెంకో, ఫాలోఫ్రెయిరీ, ఎ ఎస్ నీల్ వంటి ఎందరో క్షేత్రస్థాయిలో పరిశోధనలు చేశారు. పిల్లలకు బోధించారు. చాలా మట్టుకు శిక్షించకుండానే బోధన చేసి పిల్లల్లో సానుకూల మార్పులను, అభ్యసనను సాధించారు. అటువైపుగా అధ్యయనం చేస్తే కొన్నైనా పరిష్కార మార్గాలు లభించకమానవు.

రొటీన్ పద్ధతుల్లో కాకుండా ఆకర్షణీయంగా సమర్థవంతంగా, ప్రభావవంతంగా బోధించడంలో మెలుకువలను, నైపుణ్యాలను సాధించడమెలా? అనేది నేడు ఉపాధ్యాయుల ముందున్న సవాల్. వీటిని పరిష్కరించడంలోనే దండన లేని శిక్షణ, అభ్యసనా ప్రక్రియలు సాగే అవకాశం ఉంటుంది. బోధనా రంగంలో ఉన్న వారు పిల్లల మనోవికాసాన్ని అర్థం చేసుకుంటూ సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక నేపథ్యాలను గమనంలో ఉంచుకుని తమ బోధనా వ్యూహాలను తీర్చిదిద్దుకోవాలి. కేవలం పాఠ్యాంశాల బోధనా, పరీక్షలు, మార్కులు మాత్రమే అనుకుంటే సరిపోదు. పిల్లలపై ప్రేమ, వాత్సల్యం, కన్సర్న్ ఉండాల్సి ఉంటుంది. ఉపాధ్యాయ శిక్షణా కార్యక్రమంలో సముపార్జించిన పరిజ్ఞానానికి ఎప్పటికప్పుడు మెరుగులు దిద్దుకుంటూ ముందుకు పోవాలి. థియరిటికల్‌గా నేర్చుకున్న దాన్ని తరగతి గదుల్లో వాస్తవిక సందర్భాల్లో అమలు చేస్తున్నప్పుడు అనేక సమస్యలు ఎదురవడం సహజం. వీటిని అధిగమించడానికి తమ సొంత అనుభవాలతో పాటుగా మరింత అధ్యయనం చేస్తూ, తమ మేధో సంపత్తిని పెంపొందించు కోవాలి. ఇలా తమను తాము రూపొందించుకుంటున్న తరుణంలో శిక్షలు లేకుండా శిక్షణ, బోధన చేసే ఆత్మస్థైర్యం వస్తుంది. నిరాశకు, చికాకులకు దూరంగా బోధన చేయగలిగే పరిస్థితి వస్తుంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా ఛత్తీస్‌ఘడ్‌లో ఆదివాసీ ప్రజలపైన అమలవుతున్న నిర్బంధ దమనకాండలపై క్షేత్రస్థాయి నివేదికను అందిస్తున్నారు **అమన్**

# రెండో దశకు చేరిన 'ప్రజలపై యుద్ధం'

*(గత సంచిక తరువాయి)*

### దుష్ప్రచార క్యాంపెయిన్‌లో కార్పొరేట్ మీడియా

ఈ పాశవిక దమనకాండను పూర్తిగా కప్పి పెడ్తూ డి.జి.పి. విశ్వరంజన్, ఐ.జి. లాంగ్‌కుమేర్‌లు 14న జరిగిన మావోయిస్టుల దాడి గురించి అబద్ధాలతో ప్రచారం ప్రారంభించారు. అన్ని దినపత్రికల్లో, టీవీ ఛానెళ్లలో కోయ కమెండోల వీరత్వం, వాళ్ల ఇన్‌వర్టెడ్ యారో హెడ్ ఫార్మేషన్, యుబిజిఎల్‌తో చేసిన షెల్లింగ్, 35 మంది మావోయిస్టుల మృతి మొదలైన అభూత కల్పనలతో ప్రచారం జోరుగా సాగించారు. ఆంధ్రప్రదేశ్ సరిహద్దు ప్రాంతాల్లో మావోయిస్టు అగ్ర నాయకులు సమావేశమయ్యారనీ, మొర్‌పల్లి దగ్గరలో మావోయిస్టుల ఆయుధాల కార్ఖానా ఉందనీ, మావోయిస్టులు పెద్ద సభ లేదా ప్లీనం నిర్వహించబోతున్నారనీ తమకు ముందే సమాచారం ఉన్నట్టుగా మీడియా ద్వారా అబద్ధపు ప్రకటనలు చేసి ఈ దమనకాండ గురించిన వాస్తవాల్ని పూర్తిగా తొక్కిపట్టారు. అబద్ధాల్లో గోబెల్స్‌ను కూడా మించిపోగల సామర్థ్యం కలిగిన డి.జి.పి. విశ్వరంజన్ 'మేం 35 వేర్వేరు స్థలాల్లో రక్తం మరకల్ని చూశాం. కానీ ఈ ఎన్‌కౌంటర్‌లో ఎంత మంది మావోయిస్టులు చనిపోయారో కచ్చితంగా చెప్పలేం' (ది హిందూ, 2011 మార్చ్ 15) అని బొంకాడు. ఈ వార్తను మీడియాలో ఒక పెద్ద సెక్షన్ ఎంతగా రంగులద్ది ప్రచారం చేసిందంటే పెద్ద సంఖ్యలో మావోయిస్టులు హతమయ్యారనే 'ఉత్సాహం'లో వాళ్లు తమ పని వాస్తవాల్ని రిపోర్టు చేయడమా లేక ప్రభుత్వానికి డబ్బా కొట్టడమా అనే విచక్షణను కోల్పోయారు. ఆంధ్రప్రదేశ్, ఛత్తీస్‌గఢ్‌ల నుండి వెలువడే తెలుగు, హిందీ దినపత్రికలు 35 మంది మావోయిస్టుల మృతి అనే పెద్ద పెద్ద శీర్షికల కింద రక్తం రంగు పులిమిన గ్రాఫిక్స్ ప్రచురించాయి. 'ఈ దాడిలో మా వైపు కేవలం ఒక కామ్రేడ్ మాత్రమే అమరుడయ్యాడు' అని మావోయిస్టు పార్టీ దక్షిణ రీజినల్ కమిటీ చేసిన ప్రకటనను ఈ అబద్ధాల కుప్ప కింద ఎక్కడో అడుక్కి తొక్కేశారు.

ప్రభుత్వ యంత్రాంగం వ్యాపింపజేస్తున్న అబద్ధాల్ని పాఠకులకు వడ్డించడంలో దైనిక్ భాస్కర్, హరిభూమి, ఇండియా టుడే మొదలైన మీడియా సంస్థలు ఎంతగా అత్యుత్సాహాన్ని ప్రదర్శిస్తున్నాయంటే కనీసం తమ రిపోర్టింగ్ వైరుధ్యపూరితంగా ఉందనే విషయాన్ని కూడా పట్టించుకోవడం లేదు. ఉదాహరణకు హిందీ ఇండియా టుడే తన 2011 మార్చ్ 30 సంచికలో ఐ.జి. లాంగ్‌కుమేర్ చెప్పాడంటూ రెండు డజన్ల మంది మావోయిస్టులు చనిపోయారని వార్త రాసింది. మళ్లీ అదే పత్రిక 2011 ఏప్రిల్ 6 సంచికలో ఈ వార్తను మళ్లీ రాస్తూ కోయ కమెండోల చేతుల్లో 40 మందికి పైగా మావోయిస్టులు చనిపోయారని రాసింది. కానీ ఈ వార్త ఇంకా రూఢీ కాలేదనే మాట మాత్రం ఎక్కడా పేర్కొనలేదు. అసలు ఒకే వార్తను, అదీ పచ్చి అబద్ధాన్ని వరుసగా రెండు సంచికల్లో వేయాల్సిన అవసరమేమిటి? 'ఒక్క అబద్ధాన్ని వందసార్లు.....' అనే గోబెల్స్ సిద్ధాంతం ప్రకారమే నడుచుకోవడం కాదా ఇది?

హిందీ దినపత్రిక దైనిక్ భాస్కర్ మార్చ్ 19వ తేదీన పండుగ సంబరాన్ని ప్రదర్శిస్తూ 'మావోయిస్టులు తమ 37 మంది సహచరుల శవాల్ని కాలబెట్టార'ని, 'మరో 15 మంది మావోయిస్టులు తీవ్రంగా, 21 మంది మావోయిస్టులు స్వల్పంగా గాయపడ్డార'ని రాసింది. మరో హిందీ దినపత్రిక హరిభూమి 35 నుండి 40 మంది మావోయిస్టులు చనిపోయారనే అబద్ధపు వార్తను పతాక శీర్షికల్తో రాసి దాదాపు పండుగే జరుపుకుంది. ఎందుకు జరుపుకోవు మరి? మావోయిస్టుల్ని లేదా మావోయిస్టుల పేరుతో ఆదివాసుల్ని వీలైనంత త్వరగా హతమార్చడం ఈ రెండు పెద్ద దినపత్రికల - దైనిక్ భాస్కర్, హరిభూమి - యాజమాన్యాలకు కూడా తక్షణావసరమే! రాయగఢ్ జిల్లాలోని ధరంజయ్‌గఢ్‌లో దైనిక్ భాస్కర్ గ్రూపుకు చెందిన డిబి పవర్ లిమిటెడ్ అనే కంపెనీ ఒక బొగ్గు గనిని ప్రారంభించడం కోసం 693.32 హెక్టార్ల భూముల్ని రైతుల నుండి స్వాధీనం చేసుకునేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్నదన్న ఒక్క ఉదాహరణ చాలు, వీళ్ల ప్రయోజనా లేంటో అర్థం చేసుకోవడానికి. ప్రజల ప్రతిఘటన, మావోయిస్టుల ఉనికి కారణంగా ఈ పత్రికల యజమానులు ఛత్తీస్‌గఢ్‌లోని చాలా ప్రాంతాల్లో మైనింగ్ కార్యకలాపాల్ని ప్రారంభించడంలో, రైతుల నుండి భూముల్ని లాక్కోవడంలో ఎన్నో ఇబ్బందులెదుర్కుంటున్నారు! బొగ్గు, విద్యుత్ రంగాలకు సంబంధించిన వీళ్ల ప్రయోజనాలెన్నో ప్రమాదంలో ఉన్నాయి. కాబట్టి ఇలాంటి కార్పొరేట్ ప్రభువులు నడిపే పత్రికల్లో, టీవీ ఛానెళ్లలో ఈ రకమైన రిపోర్టింగ్ పెద్దగా ఆశ్చర్యం కలిగించదు.

మొత్తంగా చూస్తే, ఈ సందర్భంగా కేవలం ప్రజల పట్ల కన్సర్న్, నిజాయితీ, నిర్భీతి కలిగిన కొద్ది మంది పాత్రికేయుల్ని మినహాయిస్తే మిగతా మీడియా రిపోర్టింగ్ అంతా చాలా చెత్తగా, అసహ్యకరంగా

ఉండింది. నిజాల్ని తెల్సుకోవడంలో, ప్రజలపై అమలైన సర్కారీ పాశవికత గురించి రిపోర్టింగ్ చేయడంలో నిజాయితీ, సంవేదన పూర్తిగా లోపించాయి.

### ఆగకుండా కొనసాగుతున్న ప్రభుత్వ దురాగతం

మొదట్లోనే చెప్పినట్టుగా గ్రామాల్ని, ఇండ్లను కాల్చడం, ఆదివాసుల్ని ఊచకోత కోయడం, మహిళలపై అత్యాచారాలు, ప్రజల్ని కొట్టడం, ఇండ్లల్లో జొరబడి లూటీలకు పాల్పడడం వగైరాలకు సంబంధించి ఇది మొదటి సందర్భం ఏమీ కాదు. చరిత్రలో తెల్లజాతి పీడకులు ఆఫ్రికా దేశాలపై దాడులు చేసి అక్కడి నల్లజాతి ప్రజల్ని చంపి, బందీలుగా పట్టుకొని ఏ విధంగానైతే బానిసలుగా మార్చుకున్నారో, అదే విధంగా నేడు ప్రజాస్వామ్యం పేరుతో ప్రజలను పాలిస్తున్న దోపిడీ దొంగల ముఠా చత్తీస్‌గఢ్‌లోని గ్రామాలపై దాడులకు పాల్పడుతున్నది. స్త్రీపురుషుల్నీ, పిల్లల్నీ, వృద్ధుల్నీ బలవంతంగా ఎత్తుకెళ్లి చిత్ర హింసలకు గురి చెయ్యడం, మహిళలపై లైంగిక అత్యాచారాలు, బలవంతంగా ఎస్‌పిఒ/కోయ కమెండోలుగా భర్తీ చేసుకోవడం, తప్పుడు కేసుల్లో ఇరికించి జైళ్లకు పంపడం – ఇవన్నీ మువ్వన్నెల జెండా నీడలో, 'ప్రజాస్వామ్యం' పేరుతో, 'అభివృద్ధి' పేరుతో ఖాకీ, ఖద్దరు, కాషాయ త్రయం అమలు చేస్తున్నది. జూన్ 2005 నుండి సల్వాజుడుం పేరుతో, ఆగస్టు 2009 నుండి ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో బస్తర్ ప్రాంతంలో సాగిస్తున్న నిర్బంధ క్యాంపెయిన్లలో భాగంగా ఇలా అనేక సార్లు జరిగింది. కేవలం బస్తర్ ప్రాంతంలోనే చూసినట్టయితే ఇక్కడ ఆపరేషన్ గ్రీన్‌హంట్ మొదలైన 2009 ఆగస్టు 10 నుండి 2010 చివరి వరకు ప్రభుత్వ సాయుధ బలగాలు కనీసం 181 మందిని (అందిన సమాచారం మేరకు పరిమితమై చెబుతున్న సంఖ్య ఇది) హత్య చేశాయి. ఇందులో 99 శాతం మంది నిరాయుధ ఆదివాసులే. వీళ్లందరినీ పట్టుకొని లేదా కనిపించగానే కాల్పులు జరిపి చంపేశారు. మహిళలపై అత్యాచారాలకు సంబంధించిన ఘటనల విస్తృతిని అర్థం చేసుకోవాలంటే ఒక లెక్క సరిపోతుంది – 2008లో బీజాపూర్ సమీపంలో కేవలం 10 గ్రామాలలో జరిపిన ఒక సర్వేలో 74 మంది మహిళలపై ప్రభుత్వ బలగాలు సామూహిక అత్యాచారానికి పాల్పడ్డట్టుగా తేలింది. (ఆధారం – మండుతున్న గాయాలు) ప్రభుత్వ సాయుధ బలగాలు ఇప్పటి వరకు కాలబెట్టిన గ్రామాల సంఖ్య 700 దాటింది. ఎన్నో గ్రామాల్ని ఒక సారి కాదు, అనేక సార్లు కాలబెట్టారు. పలు లక్షల మంది ప్రజలు గ్రామాలొదిలేసి చెల్లాచెదురైపోవల్సి వచ్చింది.

పైవన్నీ ప్రత్యక్ష హింసకు సంబంధించిన కొన్ని సంఖ్యా వివరాలు. ఇంకా అనేక రెట్ల మంది ప్రజలు పరోక్షంగా ప్రభుత్వ హింసా, బీభత్సాల కారణంగా చనిపోయారు. ఈ క్రమం ఇంకా కొనసాగుతున్నది. ఈ బర్బరత్వం కారణంగా వేలాది మంది ప్రజలు గ్రామాలొదిలేసి అడవిలో బతకాల్సిన పరిస్థితికి నెట్టబడ్డారు. దాంతో వాళ్ల తిండీతిప్పలు ఒక క్రమం లేకుండా పోయి జీవితాలే అస్తవ్యస్తమై పోయాయి. తాగేందుకు శుభ్రమైన నీళ్లు సైతం దొరకని పరిస్థితుల్లో కలుషితమైన, సురక్షితం కాని నీటిని తాగాల్సి వస్తున్నది. ఇండ్లను కాలబెట్టినపుడు ఇండ్లలో ఉన్న ధాన్యం, బట్టలు అన్నీ కాలిపోవడంతో ఆకలితో చనిపోవల్సిన పరిస్థితులు నెలకొన్నాయి. అంతే కాకుండా అనేక రోగాలు ప్రబలిపోతున్నాయి. మహిళల్లో, పిల్లల్లో ఈ సమస్యలు మరింత తీవ్రంగా ఉన్నాయి. గర్భస్రావం కేసులు పెరిగాయి. ప్రసవం సమయంలో మరణాలు పెరిగాయి. మొత్తంగా చెప్పాలంటే, ప్రభుత్వ హింస కారణంగా ఇక్కడ ప్రజా జీవనం గత చాలా ఏళ్లుగా పూర్తిగా అస్తవ్యస్తమైపోయింది.

వరుసగా ఆరు రోజుల్లో నాలుగు గ్రామాలపై దాడులు చేసి, వాటిలో మూడు గ్రామాల్ని దాదాపు పూర్తిగా విధ్వంసం చేసిన ఈ తాజా సంఘటన ప్రభుత్వ హింస ఎంత తీవ్రంగా సాగుతున్నదో తెలియజేస్తుంది. ముఖ్యంగా జనవరి నెల నుండి ప్రభుత్వ బలగాలు 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' రెండో దశగా చెబుతూ ఇలాంటి ఎన్నో బీభత్సకర చర్యలకు పాల్పడుతున్నాయి. ఈ సంఘటన తర్వాత ఇంకా అనేక గ్రామాల్లో దాడులు జరిగాయి. బెల్లంనేంద్ర గ్రామంపై దాడి జరిగింది. కిష్టారం ఏరియాలోని విమలగూడెం గ్రామంపై దాడి జరిగింది. మార్చ్ 23న నారాయణపూర్ జిల్లాలోని కుల్నెనార్ గ్రామం దగ్గర ఒక గెరిల్లా దళంపై వందలాది పోలీసు, పారామిలిటరీ బలగాలు దాడి చేశాయి. ఆ సంఘటనలో రమేష్, ప్రభాకర్ అనే ఇద్దరు మావోయిస్టు కార్యకర్తలను సజీవంగా పట్టుకొని తీవ్రమైన చిత్రహింసలు పెట్టి హత్య చేశారు. ఏప్రిల్ 19న నారాయణపూర్ జిల్లాలోని చినారీ గ్రామంలో అదే గ్రామానికి చెందిన రజ్నూ సలాం అనే పద్నాలుగేళ్ల అబ్బాయిని క్రూరంగా హత్య చేసి 'ఎన్‌కౌంటర్' కథల్లారు. ఆ అబ్బాయిని 'గుర్తు తెలియని మావోయిస్టు'గా ప్రకటించి ఒక 12 బోర్ తుపాకీని స్వాధీనం చేసుకున్నట్టుగా కట్టుకథ సృష్టించారు. ఫాసిస్టు రమణ్ ప్రభుత్వం ముఖ్యంగా బీజాపూర్, దంతెవాడ జిల్లాలపై దాడుల్ని కేంద్రీకరించగా, బస్తర్, కాంకేర్, నారాయణ్‌పూర్, రాజ్‌నాంద్‌గాం, సర్గూజ, జశ్‌పూర్ జిల్లాలలో దాడుల పరంపరను ఎడతెరపి లేకుండా కొనసాగిస్తున్నది. ఇదే తరహా దాడుల్ని ధమ్‌తరి, రాయపూర్, మహాసముంద్ జిల్లాల్లో కూడా కొనసాగిస్తున్నది.

### కాంగ్రెస్ నిరసన పచ్చి మోసం!

చింతల్‌నార్ ప్రాంతంలో చోటు చేసుకున్న ఈ సర్కారీ బీభత్సకాండ సందర్భంగా కాంగ్రెస్ ప్రజా వ్యతిరేక స్వభావం మరోసారి స్పష్టంగా రుజువైంది. ఈ ప్రాంతంలో జరిగిన సంఘటనల గురించి దానికి ముందుగానే సమాచారం ఉన్నప్పటికీ కొన్ని దినపత్రికల్లో దీనికి సంబంధించిన వార్తలు ప్రచురితమయ్యేంత వరకు అది నిద్ర నుండి మేల్కొనలేదు. అసెంబ్లీలో రెండు, మూడు రోజుల పాటు గొడవ చేయడం, ప్రకటనలు జారీ చెయ్యడం వరకే అది పరిమితమైంది కానీ ఆదివాసులపై జరిగిన ఈ ఘోర దమనకాండపై ఏ రకమైన ఆందోళనకూ దిగలేదు. గమనించాల్సిన విషయం ఏంటంటే సరిగ్గా చత్తీస్‌గఢ్‌లో కాంగ్రెస్ పార్టీ ఈ దాడి గురించి అసెంబ్లీలో గొడవకు దిగినపుడే, కాంగ్రెస్ పార్టీయే పాలిస్తున్న ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్, డిజిపి అరవిందరావులు వెంటనే సమావేశమై చత్తీస్‌గఢ్‌లోని దక్షిణ బస్తర్ ప్రాంతానికి గ్రేహౌండ్స్ బలగాల్ని తరలించారు. ఇంతే కాకుండా, హంతక 'కోయ కమెండో'లకు ఎనిమిది వేల తూటాల్ని పంపించాలని కూడా నిర్ణయం తీసుకున్నట్టు విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసింద'ని

ఆంధ్రజ్యోతి పత్రిక (మార్చ్ 16, 2011) ఒక వార్త రాసింది. అసలు సంగతి ఏంటంటే ఈ బీభత్సకాండ కేంద్రంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్ పాలకులు ప్రారంభించిన 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' రెండో దశలో భాగమనేది మొదటి విషయం.

ప్రధానంగా చత్తీస్‌గఢ్, మహారాష్ట్ర, జార్ఖండ్, బీహార్, పశ్చిమ బెంగాల్, ఒడిశా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో సాగుతున్న ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో జనవరి 2011 నుండి రెండో దశ మొదలైందని చెబుతున్నారు. ఈ రాష్ట్రాల్లో అధికారంలో ఉన్నది ఏ పార్టీ ప్రభుత్వమైనా మావోయిస్టు ఉద్యమ అణచివేతలో కేంద్ర ప్రభుత్వంతో సమన్వయం నెరపుతూ దాడుల్ని కొనసాగిస్తున్నాయి. ఈ బీభత్సకర క్యాంపెయిన్‌కు 'సిఇఒ'గా వ్యవహరిస్తున్న కేంద్ర హోంమంత్రి చిదంబరం మావోయిస్టు ప్రభావిత రాష్ట్రాలలో రెగ్యులర్‌గా పర్యటిస్తూ మావోయిస్టు ఉద్యమ అణచివేత క్యాంపెయిన్లను తీవ్రతరం చేయాలని నొక్కి చెబుతూ ఉంటాడు. ప్రతి రెండు నెలలకోసారి మావోయిస్టు ప్రభావిత రాష్ట్రాల ముఖ్యమంత్రుల, పోలీసు-పారామిలిటరీ బలగాల ఉన్నతాధికారుల సమావేశాలు జరుపుతుంటాడు. ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ సామ్రాజ్యవాదులతో, ప్రత్యేకించి అమెరికాతో కుమ్మక్కయ్యి దేశంలో నయా ఉదార విధానాల్ని అమలు చేస్తూ ప్రజాస్వామిక, విప్లవ, జాతీయ విముక్తి ఉద్యమాలపై ఫాసిస్టు నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నాడు. కాబట్టి చింతల్‌నార్ సంఘటనలపై విధానసభలో కాంగ్రెస్ చేసిన హంగామా అంతా ఉత్తుత్తి నాటకమే తప్ప మరేమీ కాదు. దేశంలో కార్మికులపై, రైతులపై, ఆదివాసులపై, దళితులపై, మత మైనారిటీలపై జరుగుతున్న దాడులకు కాంగ్రెస్, బిజెపిలు రెండూ సమానంగా బాధ్యులే.

### ఈ అమానుష హింస ఎందుకోసం?

దేశ పాలకవర్గాలు మావోయిస్టు ఉద్యమాన్ని తమ నెంబర్ వన్ శత్రువుగా గుర్తించాయి. ఎందుకంటే ఈ ఉద్యమం మూలంగా వాళ్ల ప్రజా వ్యతిరేక, సామ్రాజ్యవాద అనుకూల విధానాలకు రాజకీయంగా తీవ్ర ప్రతిఘటన ఎదురవుతున్నది. ప్రత్యేకించి ప్రపంచవ్యాప్తంగా పెట్టుబడిదారీ వ్యవస్థ ఎన్నడూ లేనంత తీవ్రమైన సంక్షోభంలో చిక్కుకొన్న సమయంలో, దీని నుండి బైట పడేందుకై ప్రపంచవ్యాప్తంగా, ముఖ్యంగా సహజ వనరులు సమృద్ధిగా ఉన్న భారతదేశం వంటి వెనుకబడిన దేశాల్లో భారీ సామ్రాజ్యవాద దోపిడీ కొనసాగుతున్న సమయంలో దోపిడీ పాలకులు ఎలాంటి నిరసననూ సహించలేరు. సామ్రాజ్యవాదులు తమ సంక్షోభ భారాన్ని పేద దేశాలపై మోపుతూ వనరుల దోపిడీని తీవ్రం చేస్తున్నారు కాబట్టి ఈ దేశాల దళారీ పాలకులు ఇక్కడ ఎలాంటి సంఘటిత ప్రతిఘటనా పెంపొంద కుండా కట్టడి చేయాలని చూస్తున్నారు. భారత దళారీ పాలకవర్గాలు, కేంద్రంలో వాటికి ప్రాతినిధ్యం వహిస్తున్న సోనియా- మన్మోహన్‌ల ప్రభుత్వం మావోయిస్టు ఉద్యమాన్నే అతి పెద్ద అడ్డంకిగా చూస్తున్నది. మరోవైపు, మావోయిస్టు ఉద్యమం ఫలితంగా దండకారణ్యం, బీహార్-జార్ఖండ్ సహా దేశంలోని మరి కొన్ని ప్రాంతాల్లో రూపు దిద్దుకుంటున్న ప్రజల ప్రజాస్వామిక రాజ్యాధికారం కూడా వాళ్లకు ఒక సవాలుగా నిలిచింది. దేశ దోపిడీ పాలకులు ముందుకు తెస్తున్న 'అభివృద్ధి' నమూనాపై ఎల్లెడలా నిరసనలు, విమర్శలు, ప్రతిఘటన ఎదురవుతున్నాయి. మరోవైపు స్వావలంబన, స్వాతంత్ర్యం, సమానత్వం మొదలైన విలువలపై ఆధారపడిన ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా తెర మీదికి వచ్చింది. దేశంలోని అత్యంత దారుణ అణచివేతకు, అమానుష దోపిడీ, పీడనలకు గురవుతున్న ప్రజారాశులు ముందుకు తెచ్చిన ఈ నమూనా కూడా వాళ్లకు మింగుడు పడడం లేదు. అందుకే, దీన్ని నామరూపాలు లేకుండా చేయాలనే తలంపుతోనే వాళ్లు ఈ దాడిని ప్రారంభించారు.

మరోవైపు, ఇంకొక వాస్తవం ఏంటంటే ఈ తాజా దాడిలో ధ్వంసమైన గ్రామాలన్నీ జనతన సర్కార్, అంటే విప్లవ ప్రజా కమిటీల నాయకత్వంలో అనేక అభివృద్ధి పనులు చేపట్టిన గ్రామాలే. ఈ నాలుగు గ్రామాల్లో జనతన సర్కార్‌లు అనేక చెరువుల నిర్మాణం చేశాయి. చేపల పెంపకాన్ని చేపట్టాయి. నీటిపారుదల సౌకర్యాలు నెలకొల్పాయి. భూమి లేని వాళ్లకు భూములు పంచాయి. ఈ గ్రామాలపై పాలకులు ఇంత క్రూరత్వం ప్రదర్శించడానికి తగిన కారణాలే ఇవన్నీ! కాబట్టి ఈ దాడి జరిగింది కేవలం నాలుగు గ్రామాలపై కాదు, ఒక అభివృద్ధి నమూనాపై కూడా. దీనిని బట్టి ఏ 'అభివృద్ధి' నమూనా అమలు కాకపోవడంతో పాలకవర్గాలు వెర్రెత్తిపోతున్నాయో, ఏ నమూనా పురోగమిస్తున్నందుకు అవి ఆందోళన చెందుతున్నాయో స్పష్టంగానే అర్థం చేసుకోవచ్చు.

### పాలకులు చెబుతున్న 'అభివృద్ధి' ఒక దగా!

ముఖ్యంగా ఆపరేషన్ గ్రీన్‌హంట్ మొదలైనప్పటి నుండి సోనియా, మన్మోహన్, చిదంబరం, రమణ్‌సింగ్, విశ్వరంజన్‌లు పదే పదే 'అభివృద్ధి' మంత్రం జపిస్తున్నారు. అసలు వీళ్లు మాట్లాడుతున్నది బస్తర్‌లో ఎవరి అభివృద్ధి గురించి? ఎటువంటి అభివృద్ధి గురించి? వెయ్యికి పైగా మంది ప్రాణాల్ని బలిగొని, కొన్ని లక్షల మందిని నిలువనీడ లేకుండా చేసిన ఫాసిస్టు సల్వాజుడుం ఇప్పుడు ఎస్.పి.ఒ., కోయ కమెండోలుగా అవతారమెత్తింది. ప్రస్తుతం 'మాతా దంతేశ్వరీ స్వాభిమాన్ మంచ్', ఎస్‌పిఒ, కోయ కమెండో తదితర ముఠాలు సాగిస్తున్న క్రూరత్వం సల్వాజుడుంతో పోలిస్తే అనేక రెట్లు ఎక్కువ. ఇక ఇప్పుడు సైన్యాన్ని దించడం కూడా ప్రారంభమైంది. వాయు సైన్యానికి 'ఆత్మరక్షణార్థం' దాడులు చేసే అధికారం ముందే ఇచ్చారు. నారాయణ్‌పూర్ జిల్లాలో సైనిక శిక్షణా స్కూలు ఏర్పాటు కోసం ప్రభుత్వాలు 750 చదరపు కిలోమీటర్ల భూమిని ఇవ్వాలని నిర్ణయించాయి. దుర్గ్ జిల్లాలోని నందిని సమీపంలో ఎయిర్‌బేస్ నిర్మాణానికి 350 ఎకరాలకు పైగా భూమిని స్వాధీనం చేసుకునే ప్రయత్నాలు ప్రారంభించారు. బిలాస్‌పూర్‌కు సమీపంలో 1800 ఎకరాల భూమిని తీసుకొని బ్రిగేడ్ హెడ్‌క్వార్టర్స్, ప్రత్యేక బలగాల యూనిట్‌ను నెలకొల్పనున్నారు. అంతే కాకుండా పదుల వేల సంఖ్యలో పోలీసు, పారామిలిటరీ బలగాల్ని మోహరిస్తున్నారు. ఈ చర్యలన్నిటితో ఆదివాసులను నిర్మూలించి లేదా వాళ్లను తమ నివాస స్థలాల నుండి వెళ్లగొట్టి ఎటువంటి 'అభివృద్ధి'ని, ఏ వర్గాల 'అభివృద్ధి'ని చేయనున్నారో ఊహించడం కష్టమేమీ కాదు.

### ప్రజాపోరాటాలే ప్రజల అస్తిత్వానికి హామీ

ప్రజల నిరసన, ప్రతిఘటనల కారణంగానే బస్తర్ ప్రాంతంలో అనేక బడా పెట్టుబడిదారుల, బహుళజాతి కంపెనీల ప్రాజెక్టులు అమలు కాకుండా నిలిచిపోయాయి. రమణ్ ప్రభుత్వం జూన్ 2005లో టాటాతో

లోహండిగూడలో, ఎస్.ఆర్.తో భాంసీలో స్టీలు ఫ్యాక్టరీలు తెరవడం కోసం ఎం.ఒ.యు.లపై సంతకాలు చేసింది. ఈ ఎం.ఒ.యు.లలో రాసుకున్న షరతులేమిటో ప్రభుత్వం ఈనాటికీ వెల్లడించ లేదన్నది వేరే విషయం కాగా, ప్రజల ప్రతిఘటన కారణంగా ఈ బడా కంపెనీలు ఇప్పటికీ భూములను స్వాధీనం చేసుకోలేక పోయాయి. ఈ రెండు ప్లాంటుల్ని నిర్మించడం కోసం ప్రభుత్వం నానా పాట్లు పడుతున్నప్పటికీ సాధ్యం కావడం లేదు. నిర్బంధం, ప్రలోభాలు, అబద్ధాలు, బెదిరింపులు - అన్ని రకాల ఎత్తుగడలను ప్రజలు విఫలం చేసి తమ భూముల్ని కాపాడుకుంటున్నారు. ఉత్తర బస్తర్‌లోని చార్‌గాం ప్రాంతంలో నెకో జయస్వాల్' కంపెనీ ఇనుప గనుల్ని తెరవాలని ఎన్నో ఏళ్లుగా ప్రయత్నిస్తున్నప్పటికీ ప్రజల ప్రతిఘటనతో అది సాధ్యం కావడం లేదు. దానికి పక్కనే ఉన్న దుర్గ్‌కొందల్ సమీపంలో రమణ్ ప్రభుత్వం అనేక నియమాల్ని ఉల్లంఘిస్తూ పుష్ప స్టీల్స్ అనే కంపెనీకి గని తవ్వకాల్ని ప్రారంభించే అనుమతి ఇచ్చినప్పటికీ ప్రజల వ్యతిరేకత కారణంగా అది మొదలు కాలేదు.

రాజ్‌నాంద్‌గాం జిల్లాలోని మాన్‌పూర్ ప్రాంతంలో 2008 చివరలో దాదాపు వెయ్యి మంది ప్రజలు కదిలి పల్లామాడ్ ఇనుప గనిని బంద్ పెట్టించారు. అప్పటి నుండి దాన్ని తిరిగి ప్రారంభించాలని ప్రభుత్వం చేసిన ప్రయత్నాలన్నీ ప్రజా ప్రతిఘటన మూలంగా విఫలమయ్యాయి. నారాయణపూర్ జిల్లాలోని ఆమ్‌దాయ్‌మెట్టలో నెకో కంపెనీ యాజమాన్యం ప్రజలను మోసం చేసి దొంగతనంగా గని తవ్వకం ప్రారంభించడంతో ప్రజలు వాళ్లను తన్ని తరిమేశారు. భానుప్రతాప్‌పూర్ సమీపంలో చార్‌గాం దగ్గర పాగా వేసిన మైనింగ్ మాఫియాను ప్రజలు తన్ని తరిమేశారు. బస్తర్‌లో మహా వినాశనానికి గేట్లు తెరిచే బోధ్‌ఘాట్ ప్రాజెక్టును ప్రభుత్వం ప్రజల ప్రతిఘటన కారణంగా ప్రారంభించలేకపోతున్నది. ఇంకా కువ్వెమారి, బుధియారీమాడ్‌లలో ఉన్న సమృద్ధమైన బాక్సైట్ నిల్వల్ని తవ్వి తీసే పనిని ప్రభుత్వం ప్రారంభించలేకపోతున్నది. ఈ ప్రాంతంలో కేవలం 20 హెక్టార్ల భూమిలో 3 లక్షల టన్నుల బాక్సైట్ ఉన్నట్టు తేలింది. దీనిపై ప్రత్యేకంగా కుఖ్యాత వేదాంత కంపెనీ కన్నేసి ఉంది. ప్రతిపాదిత రావ్‌ఘాట్ ప్రాజెక్టును కూడా ప్రజలు ప్రస్తుతం తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు. ఎందుకంటే దీని మూలంగా ఒక విశాల ప్రాంతంలో జల్-జంగల్-జమీన్ వినాశం కావడంతో పాటు ప్రజలు పెద్ద ఎత్తున నిర్వాసితులయ్యే ప్రమాదం ఉంది. అందులో భాగమైన రైల్వేలైన్ నిర్మాణం పనులు కూడా ప్రజా ప్రతిఘటన మూలంగా ముందుకు సాగడం లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రజల సంఘటిత శక్తి కారణంగా బస్తర్ ప్రాంతంలో కార్పొరేట్ దోపిడీదొంగల భారీ 'అభివృద్ధి' బుల్‌డోజర్ ముందుకు సాగలేకపోతున్నది. దీంతో పాలకవర్గాల పాలనాధిపతి రమణ్‌సింగ్, వాళ్ల నమ్మకమైన సేవకుడు విశ్వరంజన్ తదితరులంతా వెర్రెత్తిపోయి ఉన్నారు.

నేడు బస్తర్ ప్రజలు, మొత్తంగా దండకారణ్య ప్రజలు మాత్రం తమ సర్వస్వాన్ని ఒడ్డి ఒక కొత్త చరిత్రను రచిస్తున్నారు. తమ జల్-జంగల్-జమీన్‌ను కాపాడుకోవడం కోసం వాళ్లు తెగించి పోరాడుతున్నారు. నిజమైన ప్రజాస్వామ్యాన్ని స్థాపించడం కోసం, తమ నిజమైన అభివృద్ధికి బాటలు వేసుకోవడం కోసం, 'జనతన సర్కార్' రూపంలో ఉదయిస్తున్న నవ ప్రజాతంత్రాన్ని రక్షించుకోవడం కోసం పోరాడుతున్నారు. దోపిడీ పీడకులు చేపట్టిన ప్రతి దాడినీ వీలైన మేరకు ప్రతిఘటిస్తున్నారు. నిత్య నిర్బంధం మధ్యలో సైతం పోరు బావుటా నెగురేస్తున్నారు. వాస్తవానికి దోపిడీ పీడనలకు, అన్యాయానికి, అవమానాలకు వ్యతిరేకంగా పోరాడడం వాళ్లకు కొత్తేమీ కాదు. బ్రిటిష్ వలసవాదుల సమయం నుండి నేటి వరకూ దాదాపు గత 200 ఏళ్లుగా అనేక సార్లు వాళ్లు తిరుగుబాటు జెండానెగురేశారు. అప్పుడూ, ఇప్పుడూ ప్రతి సందర్భంలోనూ రాజ్యం వాళ్లపైన నిర్బంధాన్నే ప్రయోగించింది. అయినప్పటికీ బస్తర్‌వాసులు పోరాడుతూనే ఉన్నారు. న్యాయం కోసం, ఆత్మగౌరవం కోసం, జల్-జంగల్-జమీన్ కోసం. ఈ పోరాటం కేవలం తమకోసమే చేయడం లేదు వాళ్లు. ఈ పోరాటంలో ఒంటరిగా కూడా లేరు వాళ్లు.

## ప్రతిఘటన తప్ప మరో మార్గం లేదు!

దండకారణ్యంలో ప్రభుత్వాలు విప్లవోద్యమాన్ని నిర్మూలించే లక్ష్యంతో గత ముప్పయ్యేళ్లలో అనేక సార్లు నిర్బంధ క్యాంపెయిన్లను నడిపాయి. కానీ ప్రజలు తమ రక్తం చిందించి ఈ క్యాంపెయిన్లన్నిటినీ ఓడించారు. దాని ఫలితంగా విప్లవోద్యమం ఉన్నత స్థాయికి అభివృద్ధి చెందగలిగింది. ముఖ్యంగా బస్తర్ ప్రాంతంలో సల్వాజుడుం నిర్బంధ క్యాంపెయిన్‌ను ఎదిరిస్తూ ప్రజలు ఎంతో అనుభవం సంపాదించారు. ఆ అనుభవం ఆధారంగా ఇప్పుడు ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను కూడా ఎదిరిస్తున్నారు. దేశవ్యాప్త బహుముఖ దాడి రూపంలో 'ప్రజలపై సాగుతున్న అన్యాయమైన యుద్ధం' ఇది. దీన్ని ఓడించాలంటే ప్రతిఘటనా పోరాటాన్ని తీవ్రతరం చేయడం మినహా ప్రజలకు మరో ప్రత్యామ్నాయం లేదు.

వాస్తవం ఇది కాగా, మావోయిస్టులు పోలీసు బలగాలపై దాడి చేసి నలుగురు కోయ కమెండోలను హతమార్చి, తొమ్మిది మందిని గాయపర్చడం వల్లనే పోలీసు/కోయ కమెండో బలగాలు ఇలా రెచ్చిపోయి ప్రజలపై, గ్రామాలపై దాడులకు పాల్పడ్డాయని కొందరు తెలిసో, తెలియకో వాదిస్తున్నారు. రాస్తున్నారు. మావోయిస్టులు కోయ కమెండోలను ఆంబుష్‌లో హతమార్చింది మార్చ్ 14వ తేదీన కాగా, మార్చ్ 11ననే మొర్‌పల్లి గ్రామం మంటల్లో మాడి మసైపోయిందనీ, ఒక నిండు ప్రాణం గాలిలో కలిసిపోయిందనీ, ముగ్గురు ఆదివాసీ మహిళలపై లైంగిక అత్యాచారం, మరెందరిపైననో ఇతర రూపాల్లో హింసాకాండ సాగిందనే వాస్తవాల్ని తెలుసుకోవడానికి నిజానికి పెద్ద తర్కమేమీ అవసరం లేదు. నిజాయితీ, ఓపిక ఉంటే చాలు. ఎలాగైనా సరే మావోయిస్టులపై బురదజల్లాలనే తాపత్రయంతో ఇలాంటి వాదనలు చేసేవాళ్లకు వాస్తవాలతో పనేమిటి? పులాన్‌పాడులో దాడి, ఒక మహిళపై అత్యాచారం, తిమ్మాపురంలో సాగించిన దహనకాండ కూడా కోయ కమెండోల మరణానికి దారి తీసిన మావోయిస్టు ఆంబుష్ జరగక ముందే జరిగాయి. ఈ వాదనల్ని పక్కనబెడితే, నిజానికి మావోయిస్టుల పాత్ర, మావోయిస్టుల ప్రతిఘటనలకు సంబంధించిన ప్రధాన పార్శ్వాన్ని గమనించడం చాలా ముఖ్యం.

మొర్‌పల్లిలో దాడి జరుగుతున్న సమయంలోనే పిఎల్‌జిఎ బలగాలకు కబురు తెలిసింది. కానీ వాళ్లు అక్కడికి చేరుకునే సరికి ప్రభుత్వ సాయుధ బలగాలు వెళ్లిపోయాయి. వెంటనే వాళ్లు సహాయ కార్యక్రమాల్లోకి దిగడం మూలంగా మంటల్ని ఆర్పి 30 క్వింటాళ్ల ధాన్యం కాలిపోకుండా రక్షించారు. పిఎల్‌జిఎ అండతోనే, అది రక్షణ ఇస్తుందన్న భరోసాతోనే చుట్టుపక్కల అడవిలో తలదాచుకున్న ప్రజలు త్వరగా గ్రామంలోకి వచ్చి చిన్నా చితకా సామాన్లను కాలిపోకుండా కాపాడుకోగలిగారు. మొర్‌పల్లి నుండి ప్రభుత్వ బలగాలు తీసుకెళ్లిన మాడివి గంగాల్‌నూ, అతని కూతురు లక్కె, కొడుకు భీమాల్‌ను మరుసటి రోజే చింతల్‌నార్ క్యాంపు నుండి విడిపించుకోగల్గిందీ మొర్‌పల్లి మహిళల ప్రతిఘటనా పోరాటమే. 13వ తేదీన పులాన్ పాడులో గ్రామంలో ఒక చిన్న మిలిషియా దళం ప్రతిఘటించి నందువల్లనే కోబ్రా/కోయ కమెండోలు ఆ గ్రామాన్ని కాలబెట్టకుండా త్వరత్వరగా ముందుకు కదిలారు. ఇరుపక్షాల మధ్య ఆ కాల్పులే జరగకుంటే తిమ్మాపురం వాళ్లు ప్రమాదాన్ని ముందుగా ఊహించి పారిపోగలిగేవాళ్లు కాదు. తిమ్మాపురం గ్రామం వాళ్లకు ప్రాణనష్టం కాకపోవడం ఈ ప్రతిఘటన ఫలితమే.

తిమ్మాపురం నుండి బోడికెల్ గ్రామానికి వెళ్లి అక్కడ విధ్వంసం, హత్యాకాండలు సాగిద్దామన్న వాళ్ల పథకం పారనిది తోవలో మరో చిన్న పిఎల్‌జిఎ దళం చేసిన ప్రతిఘటన వల్లనే. దాంతో సగం దూరం నుండి వాళ్లు వెనక్కి రాక తప్పలేదు. అలా బోడికెల్ గ్రామం మొత్తంగానే దాడికి గురి కాకుండా రక్షించబడింది. తిమ్మాపురం నుండి దోచుకున్న విలువైన సామాన్లలో చాలా వాటిని ప్రజలు తిరిగి దక్కించుకున్నది మావోయిస్టుల ఆంబుష్‌లో కోయ/కోబ్రా బలగాలు మడమతిప్పి పారిపోయినందు వల్లనే. అంతేకాదు, ఈ గ్రామాల్లో సర్కారీ 'సహాయ' కార్యక్రమాల ప్రచారం ఎలా జరిగినా, ఈ గ్రామాల ప్రజలకు తక్షణం అవసరమైన సహాయం (తిండిగింజలు, బట్టలు, డబ్బు) అందించింది జనతన సర్కారుతో పాటు మావోయిస్టు పార్టీ ఆధ్వర్యంలో పని చేసే విప్లవ ప్రజా సంఘాలే. అప్పటికప్పుడు జిల్లా జనతన సర్కార్ తన నిధుల నుండి కొంత డబ్బు విడుదల చేయగా, పక్కనే ఉన్న ఉత్తర తెలంగాణ స్పెషల్ జోనల్ కమిటీ ఒక వైపు ప్రజలకు పిలుపునిస్తూనే అత్యవసరంగా రెండు లక్షల రూపాయల్ని పంపించింది. జరిగిన నష్టం తీవ్రతతో పోలిస్తే ఈ సహాయాలు ఎటూ సరిపోనివనేది వాస్తవమే అయినా ప్రజలకు తక్షణం అవసరమైన సహాయాన్ని అందించిన వాళ్లూ, ఆదుకున్న వాళ్లూ మావోయిస్టులే. ఆ తర్వాత ప్రజలకు పెద్ద మొత్తంలో సహాయం అందింది పౌరహక్కుల సంఘాలు, జర్నలిస్టులు, ప్రజాస్వామికవాదుల నుండి. ఇదంతా అక్కడి ప్రజలే కాదు, వాస్తవాల్ని చూడగల నిజాయితీ గల ప్రతి ఒక్కరూ గుర్తించే విషయం.

నిజానికి 2007 జూలై 9 నాటి ఉర్పల్‌మెట్ట సంఘటన గానీ, 2009 సెప్టెంబర్ 17న జరిగిన సింగన్‌మడుగు ఆంబుష్ గానీ ఇంకా మరెన్నో సంఘటనల్లో పోలీసు/పారామిలిటరీ బలగాలు మరింత మంది ప్రజలను చంపకుండా అడ్డుకోగలిగింది, పట్టుబడిన ప్రజల్ని విడిపించుకోగలిగింది, గ్రామాల్ని బూడిద కాకుండా కాపాడగలిగింది, పంటల్ని కాలబెట్టకుండా అడ్డుకున్నది ప్రతిఘటనే. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రజలు, ప్రజా సైన్యం చేస్తున్న ప్రతిఘటనే లేకపోతే ప్రజల ఉనికే లేదు. అందుకే దండకారణ్య ప్రజలపై సాగుతున్న అమానుష ప్రభుత్వ దాడిని, మొత్తంగా దేశ ప్రజలపై ప్రభుత్వాలు సాగిస్తున్న 'అన్యాయమైన యుద్ధా'న్ని ఖండించడంతో పాటు దండకారణ్య ప్రజల ఉద్యమాన్నీ, వాళ్లు సాగిస్తున్న న్యాయమైన ప్రతిఘటననూ హృదయపూర్వకంగా సమర్థించడం, వాళ్లకు అన్ని విధాలుగా అండదండగా నిలవడం, వీలైన సహాయం అందించడం మనందరి బాధ్యత.

## 'ఆప్ హీ కాజీ, ఆప్ హీ కాతిల్'!

చింతల్‌నార్ ప్రాంతంలో ప్రభుత్వ సాయుధ బలగాలు సాగించిన హింసాకాండపై, సుప్రీంకోర్టు ఆదేశంపై మే 12న ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం ఒక న్యాయవిచారణ కమిషన్‌ను ఏర్పాటు చేసింది. ఈ కమిషన్‌కు బిలాస్‌పూర్ హైకోర్టు జస్టిస్ టి.పి. శర్మను అధ్యక్షునిగా నియమించింది. 'ఛత్తీస్‌గఢ్ ప్రత్యేక ప్రజా రక్షణ చట్టం' (సిఎస్‌పిఎస్‌ఎ) ను నోటిఫై చేసిన హైకోర్టు జడ్జ్ ఈయనే! మానవహక్కుల కార్యకర్త డా. బినాయక్ సేన్ సహా వందలాది ఆదివాసులు, పదుల మంది మావోయిస్టు పార్టీ కార్యకర్తలు ఏళ్ల తరబడి ఎలాంటి విచారణా లేకుండా, బెయిల్స్ దొరకకుండా జైళ్లలో మగ్గిపోవడానికి, అన్యాయంగా శిక్షల పాలవడానికి కారణమైన ఈ నల్లచట్టానికి ఎవరి చేతులైతే పచ్చజెండా ఊపాయో ఆ చేతులకే ఇప్పుడీ హింసాకాండపై న్యాయ విచారణ బాధ్యత ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ ఎంతో నమ్మకంగా అప్పజెప్పాడు! దీనిపై వ్యాఖ్యానిస్తూ ఒక జర్నలిస్టుమిత్రుడు వినిపించిన ఒక ఉర్దూ షేర్‌తో దీన్ని ముగిస్తాను.

'ఆప్ హీ కాజీ, ఆప్ హీ కాతిల్, ఆప్ హీ మున్సిఫ్ ఠహరే, మేరా జో ఖూన్ హువా హై, మేరే అకర్బా ఖూన్ కా దావా కరే కిస్ పర్?!'
(న్యాయమూర్తి మీరే, హంతకులూ మీరే, న్యాయవాదీ మీరే అయినప్పుడు, నా హత్యపై నా కుటుంబ సభ్యులిక దావా ఎవరిపై వేసేది?!)

(అయిపోయింది)

*(రచయిత దండకారణ్య ఉద్యమ నాయకులు)* వీ

వీక్షణం పత్రికను వెబ్ పేజీల్లో కూడా చూడవచ్చు!

www.veekshanam.wordpress.com

మీ అభిప్రాయాలను, సూచనలను ఎప్పటికప్పుడు మాకు తెలియజేయండి!

తెలుగు సమాజం తన గురించి తాను చేసుకుంటున్న అన్వేషణలో మీరూ పాలుపంచుకోండి!

Email : veekshanam2003@gmail.com

సామ్రాజ్యవాద దేశాలకు సింహస్వప్నంగా పరిణమించిన ఒసామా బిన్ లాడెన్ జీవితం, జీహాద్‌ల నేపథ్యం వివరిస్తున్నారు **పి. ప్రసాద్**

# లాడెన్‌పై సామ్రాజ్యవాదుల నిందా ప్రచారాలు

*(గత సంచిక తరువాయి)*

## దేశ బహిష్కరణకి ఉగ్రవాద చర్యలే కారణమా?

తన మీద ఇస్లామిక్ ఉగ్రవాద దాడులు సాగించినందునే లాడెన్‌ను బహిష్కరించినట్లు అమెరికా మీడియా ద్వారా ప్రపంచానికి ప్రచారం చేసింది. కానీ అది నిజం కాదు. 1998 ఆగస్ట్‌లో నైరోబీ, దార్‌ఎస్ సలామ్‌లలోని అమెరికా రాయబార కార్యాలయాల మీద ఆల్‌ఖైదా తొలి బాంబింగ్ దాడి సాగించింది. కానీ అంతకు ముందే లాడెన్, ఆల్‌ఖైదాల మీద బహిష్కరణలకి అమెరికా పూనుకున్నది. బాంబింగ్ వంటి చర్యలు చేపట్టక ముందు నాలుగేండ్ల పాటు ఆల్‌ఖైదా కేవలం రాజకీయ ప్రచారాన్ని సాగించింది. సెల్లుల నిర్మాణాన్ని చేపట్టింది. ఈ నిర్మాణ దశలోనే లాడెన్ పౌరసత్వాన్ని సౌదీ అరేబియా (1994) రద్దు చేసింది. అంతకంటే ఏడాది ముందే లాడెన్ వ్యాపార కార్యకలాపాలను నిషేధించింది. సౌదీ అరేబియా ప్రభుత్వం లాడెన్‌ను దేశం నుంచి బహిష్కరించాక సూడాన్ రాజకీయాశ్రయమిచ్చింది. రెండేండ్లు తిరక్కముందే సూడాన్ చేత కూడా అమెరికా దేశ బహిష్కారం (1996) చేయించింది. ఇంతలో అఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్ ప్రభుత్వం ఏర్పడింది. లాడెన్‌కు అక్కడ రాజకీయాశ్రయం దొరికింది. పుట్టి పెరిగిన మాతృభూమి మీద నిలవనీడ లేకుండా చేసిన దాష్టికమిది.

1998కి ముందు ఆల్‌ఖైదా తీవ్రవాద రాజకీయ ప్రచారం, సెల్లుల నిర్మాణాలను మాత్రమే చేపట్టింది. చర్యల ప్రాతిపదిక మీద కాకుండా, ప్రచార ప్రాతిపదిక మీదే దేశ బహిష్కార శిక్షలు విధింపజేసింది. ఇలా అమలు చేయడాన్ని యు.ఎన్.ఒ. కూడా ఆమోదించడం సిగ్గుచేటు. ఆలోచనలను, భావాలను రాజకీయాలనే 'టెర్రరిస్టు చర్యలు'గా చిత్రించింది. తద్వారా లాడెన్‌కు ఏ దేశంలో నిలువ నీడ లేకుండా చేసింది. నిజానికి అమెరికాయే ఒక పెద్ద టెర్రరిస్టు రాజ్యంగా వ్యవహరించింది.

ఇంతకూ లాడెన్ అంటే అమెరికాకి అంతటి ముందస్తు భయం ఎందుకు? ఇరాక్‌పై గల్ఫ్ యుద్ధాన్ని (1991) ఆల్‌ఖైదా వ్యతిరేకించింది. కువాయిత్‌ను అమెరికా సైనిక విడిది కేంద్రంగా చేయడాన్ని వ్యతిరేకించింది. సద్దాం బూచితో సౌదీ అరేబియాలో అమెరికా సేనలు దింపడాన్ని వ్యతిరేకించింది. పాలస్తీనియన్ల స్వయం నిర్ణయాధికార హక్కును పాతరవేసిన ఓస్లో విద్రోహ ఒప్పందాన్ని వ్యతిరేకించింది. అల్జీరియా ఎన్నికలలో గెలిచిన ఇస్లామిక్ ప్రభుత్వాన్ని అధికారం చేపట్టనివ్వని అమెరికా కుట్రలను వ్యతిరేకించింది. క్షామ బాధితులకి సాయం చేసే పేరిట సోమాలియాలో అమెరికా సైనిక క్యాన్ని వ్యతిరేకించింది. లాడెన్ టెర్రరిస్టు అయినందుకే దేశ బహిష్కార శిక్ష విధించినట్లు ప్రపంచాన్ని అది నమ్మించింది. ప్రపంచ ప్రగతిశీల శక్తులు సైతం ఈ ప్రచారాన్ని తిప్పి కొట్టలేకపోయాయి. పైగా అందులో కొన్ని శ్రేణులు అపోహలకి కూడా గురయ్యాయి.

## దేశ బహిష్కరణకి ఉగ్రవాద చర్యలే కారణమా?

11 సెప్టెంబర్ 2001న న్యూయార్క్ ట్విన్ టవర్స్ పై దాడి (9/11) ప్రపంచ కార్మిక విప్లవాన్ని పక్కదారి పట్టించేందుకు జరిగిందని అమెరికా మీడియా ఆనాడు పక్క కథనాల (సైడ్ స్టోరీస్) ను ప్రచారం చేసింది. ఒకవైపు ట్విన్ టవర్స్ విధ్వంసానికి ప్రతీకారం పేరిట అమెరికా దురాక్రమణలకి దిగింది. మరోవైపు అదే అమెరికాలోని కుహనా ప్రజాస్వామిక మేధావులు ఆల్‌ఖైదా దాడుల వెనక అమెరికా సామ్రాజ్యవాద ప్రయోజనాలున్నాయని కథనాలు అల్లారు. ఈ రెండు రకాల ప్రచారాల మధ్య లోపాయికారీ అవగాహన ఉంది.

అమెరికా ప్రపంచాధిపత్యానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టు సోషలిస్టు, విప్లవ ప్రజాస్వామిక, లౌకిక శక్తులు ప్రపంచంలో వెల్లువెత్తుతున్నాయట. వాటిని అణచడం చేతగాక ఆనాడు అమెరికా గడగడలాడిపోతున్నదట. సియాటల్‌లో కార్మికవర్గం అమెరికాతో గొప్ప వీరోచిత ప్రతిఘటనకి దిగిందట. అలాంటి ప్రగతిశీల విప్లవ వెల్లువల నుంచి తనను తాను రక్షించుకోవడానికి తంటాలు పడుతున్నదట. సరిగ్గా ఆ సమయంలో అమెరికా సామ్రాజ్యవాదానికి ఆల్‌ఖైదా ఊడిగం చేసిందట. ట్విన్ టవర్స్‌ను కూల్చి, గొప్పగా మేలు చేసిందట. ఇక మరికొందరు అమెరికన్ 'సోషలిస్టు' పండితులు ఇంకా ముందుకు వెళ్లారు. ఆల్‌ఖైదాతో బుష్ ప్రభుత్వమే తమ ట్విన్ టవర్స్ మీద దాడి చేయించుకున్నదట. ఈ అన్ని కట్టు కథల వెనుక కుట్రలున్నాయి.

నిజానికి ప్రచ్ఛన్న యుద్ధానంతర కాలంలో సోషలిస్టు విప్లవ శక్తులు బాగా బలహీనపడ్డాయి. ఇది జగమెరిగిన సత్యమే. ఈ స్థానంలో అమెరికా దౌర్జన్యాన్ని ప్రతఘటించే పాత్రను ప్రపంచంలో ప్రధానంగా ఇస్లామిక్ దేశాలే (క్యూబా, ఉత్తర కొరియాలు తప్ప) పోషించాయి. బాత్ పార్టీ (ఇరాక్, సిరియా), ముస్లిం బ్రదర్ హుడ్ (ఈజిప్ట్), హమాస్ (పాలస్తీనా), హిజ్‌బుల్లా (లెబనాన్) వంటి సంస్థలు, అమెరికాను సాయుధంగా ప్రతిఘటించే రాజకీయాలతో పనిచేస్తున్నాయి. అయితే ఇవన్నీ ఒక్కొక్క దేశానికే పరిమితమైనవి. కానీ 1988లో స్థాపించిన ఆల్‌ఖైదా 50 దేశాలకి తన రహస్య నెటవర్క్‌ను విస్తరించుకున్నది.

అఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, సోమాలియా, అల్జీరియా, యెమెన్, సూడాన్, మొరాకో, మారిటేనియా, సౌదీ అరేబియాలలో బాగా వేళ్లూనుకున్నది. లాడెన్ మరణానంతర పాలస్తీనా హమాస్ నేత పేర్కొన్నట్లు 'ఏకధృవ అగ్రరాజ్యాన్ని ప్రతిఘటించడంలో అల్‌ఖైదీ ఒక అడ్డుపడే సాధనం (బ్యాలెన్స్ ఫాక్టర్)'గా పనిచేసింది.

కానీ అమెరికన్ కుహనా సోషలిస్టు మేధావులు ఒకవైపు అమెరికాకి ఆనాడు తక్షణ ప్రమాదం లేని ప్రపంచ సోషలిస్టు విప్లవ శక్తులను భూతద్దంలో పెద్దవిగా చూపించారు. మరోవైపు అమెరికా దూకుడును వాస్తవంగా అడ్డుకుంటున్న ఇస్లామిక్ తీవ్రవాదాన్ని అమెరికాకి సహకరిస్తున్న శక్తిగా చిత్రించారు. నిజంగా తనకి సహకరిస్తుంటే, అల్‌ఖైదా, తాలిబన్ల అణచివేత కోసం లక్షల సేనలతో అమెరికా యుద్ధాలు చేయనక్కరలేదు. దానిని అమెరికా తన ప్రధాన శత్రువుగానే చూస్తున్నది. అమెరికన్ కుహనా సోషలిస్టు మేధావుల నాటకీయ ప్రచారం కొంతమేరకి ఫలించింది. నిజమైన ప్రపంచ సోషలిస్టు మేధో వర్గాలు అపోహలకి గురయ్యాయి. ఇస్లామిక్ తీవ్రవాదం పట్ల గుడ్డి వ్యతిరేకత (జెలసీ)ను పెంచుకున్నాయి.

అమెరికా ఆధిపత్యాన్ని సవాలు చేసి, నిలబడ్డ రాజకీయ శక్తిగా అల్‌ఖైదా గుర్తింపు పొందింది. ప్రపంచ విప్లవ మేధావుల్లో కూడా ఇటీవల పరివర్తన కలుగుతున్నది. యూరప్, అమెరికా ముస్లిం ఉన్నత విద్యావంతులు కూడా దానికి బాగా ఆకర్షితులవుతున్నారు. ఇప్పుడు మరో కొత్త కథను అల్లుతున్నారు. ట్విన్ టవర్స్‌ను కూల్చగల శక్తి అమెరికా యేతలులెవరికీ లేదట. అమెరికా పౌర సమాజంలోని కొందరు రాజకీయ అసమ్మతివాదులే ట్విన్ టవర్స్‌ని కూల్చారట. ఇది తాజాగా తమ అపరాధ పరిశోధనలో తేలిందట. దీనిమీద డాక్యుమెంటరీ చిత్రాలు కూడా విడుదలయ్యాయి. అల్‌ఖైదా హీరో పాత్ర పట్ల లక్షల మంది విద్యార్థులు సైతం ఆకర్షితులు కావడంతో ఈ కాకమ్మ కథల ప్రచారానికి అమెరికన్ కుహనా మేధావులు దిగారు.'

వియత్నాం యుద్ధంలో తమ యుద్ధ విమానాన్ని కమ్యూనిస్టు గెరిల్లాలు తొలుత కూల్చినప్పుడు దాన్ని విపరీత ప్రచారం చేశారు. కమ్యూనిస్టుల అణచివేతకి దీన్నొక బూచిగా అమెరికా వాడుకున్నది. కానీ ఈ ప్రచారం వికటించింది. తమ దేశ గెరిల్లాలకి అమెరికన్ విమానాలను సైతం కూల్చివేసే శక్తి ఉందని తెల్సి వియత్నాం యువకులు విప్లవోత్తేజితులయ్యారట. గెరిల్లా యోధులుగా మరింత ముందుకు వచ్చారట. దీని నుంచి అమెరికా గుణపాఠం తీసుకున్నదట. ఆ తర్వాత యాంత్రిక వైఫల్యాల వల్లనే తమ విమానాలు కూలుతున్నట్లు వార్తలు ప్రసారం చేసిందట. అల్‌ఖైదా విషయంలో కూడా అమెరికా అనేక సర్కస్ ఫీట్లు చేస్తున్నది.

ట్విన్ టవర్స్‌ను తామే కూల్చివేశామని అల్‌ఖైదా అధికారికంగా ప్రకటించింది. అందులో పైలట్లు, సహాయకులు కలిసి 19 మంది మరణించారు. వారి వివరాలన్నీ వెల్లడయ్యాయి. వారు అల్‌ఖైదాలో చేరిందీ, పైలట్ శిక్షణ పొందిందీ తదితర వివరాలన్నింటినీ సి.ఐ.ఏ. సేకరించింది. ఇస్లామేతర ప్రపంచంలోని కమ్యూనిస్టు విప్లవ శక్తులను దెబ్బతీసే పక్కదారి పథకం కాదా ఇది. తమ ముస్లిందేశాల అణచివేత, దాష్టీకాలు, సహజ వనరుల లూటీ, ప్రజల కన్నీళ్లు, ఆకలి, దారిద్ర్యాలకు సహజ ప్రతిఘటన మాత్రమే. అల్‌ఖైదా రాజకీయ వ్యూహం, ఎత్తుగడలతో ఏకీభవించనక్కరలేదు. అందులో అనేక పొరపాట్లు ఉండొచ్చు. కానీ వారిని అమెరికా ఆధిపత్యాన్ని ధిక్కరించిన సమరశీల ప్రతిఘటనా శక్తులుగా గుర్తించాల్సిందే.

## ఇండియా అస్థిరతకు లాడెన్ పూనుకున్నాడా?

లాడెన్ మార్క్ ఇస్లామిక్ తీవ్రవాదం ముందుకొచ్చాక భారత దేశానికి కొత్త ప్రమాదం ముంచుకొచ్చిందట. దీనిని అమెరికా మీడియా విస్తృత ప్రచారం చేసింది. భారతదేశంలోని హిందూత్వ శక్తులు దాన్ని అంది పుచ్చుకున్నాయి. కాశ్మీర్‌తో పాటు ఉత్తర భారతదేశంలో అల్‌ఖైదా సెల్లులు విస్తరిస్తున్నాయంట. ఇలాంటి ప్రచార కథనాలు తరచుగా వెలువడుతున్నాయి. చివరకు హైదరాబాద్ మక్కా మసీదులో పేలుళ్లు (తర్వాత హిందూత్వ శక్తుల పనేనని వెల్లడైనది) జరిగినా, లుంబినీ పార్కులో జరిగినా, లాడెన్, అల్‌ఖైదా గురించి కథనాలు మీడియాలో ప్రచారమవుతున్నాయి. కానీ వాస్తవాలు దీనికి విరుద్ధంగా ఉన్నాయి.

నిజానికి అల్‌ఖైదాకి ప్రధాన శత్రువు అమెరికా, ఇజ్రాయిల్ కూటమి మాత్రమే. అల్‌ఖైదాకి అనుబంధించుకునే సంస్థలన్నీ ప్రథమ శత్రువును, ఈ కూటమిని యథాతథంగా అంగీకరించాలి. ఆ తర్వాత ఆయా అనుబంధ సంస్థలు పని చేస్తున్న దేశాల ప్రభుత్వాలను రెండవ లేదా మూడవ శత్రువులుగా ఎంచుకోవాలి. ఇదీ అల్‌ఖైదా ప్రణాళిక. ఉదాహరణకు, ఆఫ్ఘన్ తాలిబన్ సంస్థ కర్జాయి కీలుబొమ్మ ప్రభుత్వాన్ని రెండో శత్రువుగా ప్రకటించింది. పాకిస్తాన్‌లోని తెహ్రీక్-ఎ-తాలిబన్ సంస్థ పాక్ ప్రభుత్వాన్ని రెండో శత్రువుగా, కర్జాయ్ ప్రభుత్వాన్ని మూడో శత్రువుగా ప్రకటించింది. కానీ లష్కర్-ఎ-తోయిబా, జైషే-ఎ-మహమ్మద్, హర్కల్ ముజాహిద్దీన్, లష్కర్-ఎ-జంగ్వీ వంటి పాక్ తీవ్రవాద సంస్థలు అల్‌ఖైదాకి ఈనాటికీ అనుబంధించలేదు. దీనికి కారణం శత్రువుల ప్రాధాన్యాల ఎంపికలో అల్‌ఖైదాతో అవి ఏకీభవించకపోవడమే. ఇవన్నీ కాశ్మీర్ విమోచన లక్ష్యంకై తమ ప్రథమ శత్రువుగా భారతదేశాన్ని ఎంచుకున్నాయి. అల్‌ఖైదా కృషి వల్ల ఇటీవలనే లష్కర్-ఎ-తోయిబా తన ప్రధాన శత్రువుగా అమెరికాను ఎంచుకున్నది. భారత్‌ను రెండో శత్రువుగా తగ్గించింది. దీనికి కూడా అల్‌ఖైదా అంగీకరించడం లేదు.

పాక్ తీవ్రవాద సంస్థలన్నీ తమ ప్రథమ శత్రువుగా అమెరికా ఇజ్రాయిల్‌లను, రెండో శత్రువుగా పాక్ ప్రభుత్వాన్ని, మూడో శత్రువుగా కర్జాయ్ ప్రభుత్వాన్ని, నాల్గవ శత్రువుగా భారత్‌ను ఎంచుకోవాలని అల్‌ఖైదా అభిప్రాయపడుతున్నది. కాశ్మీర్ విముక్తి కంటే అఫ్ఘనిస్తాన్‌కే పాక్ తీవ్రవాద సంస్థలు అధిక ప్రాధాన్యతనివ్వాలని అల్‌ఖైదా కోరుతున్నది. పాక్ తీవ్రవాద సంస్థలకి 'తూర్పు సరిహద్దు వైపు కాదు, పడమర సరిహద్దు వైపు మీ శక్తులను కేంద్రీకరించండి' అనే పిలుపును అల్‌ఖైదా ఇవ్వడం గమనార్హం. (తూర్పు అంటే ఇండియా; పడమర అంటే అఫ్ఘనిస్తాన్ అని అర్థం) అందుకే అల్‌ఖైదాతో పరస్పర ఐక్య కార్యాచరణ లేదా సమన్వయాలు తప్ప ఈనాటికీ పాక్ తీవ్రవాద సంస్థలు అనుబంధించుకోలేదు. దీనిని బట్టి లాడెన్ వల్ల భారత్‌కు ప్రమాదం పెరగకపోగా తగ్గిందని అర్థం చేసుకోవచ్చు. కానీ లాడెన్ పట్ల భారత ప్రజల్లో (ముఖ్యంగా హిందువులలో) గుడ్డి ద్వేషాన్ని పెంచడానికి రకరకాల కట్టు కథలను అల్లుతున్నారు. అమెరికాకీ, భారత పాలక వర్గాలకీ ఇలా గుడ్డి ద్వేషాన్ని పెంచడం అవసరమైనదే. ఈ కుట్రలను భారత ప్రజాతంత్ర, విప్లవ శక్తులు సరిగ్గా అర్థం చేసుకోవాల్సి ఉంది.

పై తొమ్మిది అంశాల ద్వారా ఇస్లామిక్ తీవ్రవాదం, లాడెన్‌ల పట్ల ఒక వాస్తవిక దృక్పథాన్ని ఏర్పర్చుకోగలం. చరిత్ర గర్భాన్ని మరింత లోతుగా తవ్వితీస్తే, మరిన్ని ఎక్కువ నగ్న సత్యాలు వెలుగులోకి రావచ్చు.

ఈ వాస్తవాల మీద ఆధారపడి ఇస్లాం తీవ్రవాద మంచి, చెడులను శాస్త్రీయంగా విశ్లేషించుదాం.

ఎన్ని మహోన్నత త్యాగాలు చేసినా, దురాక్రమణదార్లను ఓడించగలిగినా, మత దృక్కోణంలో ఒక అత్యున్నత నాగరిక, సామాజిక వ్యవస్థను నిర్మించడం సాధ్యం కాదు. ఇస్లాం తీవ్రవాదం కూడా అందుకు మినహాయింపు కాదు. అది రేపు ఒకవేళ దురాక్రమణదార్ల నుంచి కొన్ని పీడిత దేశాలు, జాతులు లేదా తెగలకి విముక్తి కూడా కలిగించవచ్చు. అవి సామ్రాజ్యవాద యుగంలో ముమ్మాటికీ విప్లవ విజయాలే అవుతాయి. అయితే విముక్తి సాధించిన చోట ఒక ప్రత్యామ్నాయ ప్రజల ప్రజాస్వామిక ప్రభుత్వాలను స్థాపించలేవు. ఈ స్పష్టమైన అవగాహన, అంచనాలు ఉండాల్సిందే. అలాగని వాటిలోని సానుకూల అంశాలను గుడ్డి ద్వేషంతో తిరస్కరించరాదు.

ఇస్లాం తీవ్రవాద ఉద్యమం మేడి పండు వంటిదా? లేదంటే, అరటి పండు వంటిదా? ఇందులో ఏదో తొలుత తేల్చుకోవాలి. ఇది మధ్య యుగాలలోని మతరాజ్యాల (ఇస్లాం ఖలీఫేట్)ను స్థాపించే నిజ రాజకీయ లక్ష్యం కోసం ఆధునిక సామ్రాజ్యవాద వ్యతిరేకతను ఆయుధంగా ఎంచుకున్న ఉద్యమమా? లేదంటే, ఆధునిక సామ్రాజ్యవాద దోపిడీ, బానిసత్వాల నుంచి విముక్తి సాధించే నిజ రాజకీయ లక్ష్యం కోసం ఇస్లాం మతాన్ని ఒక సాధనంగా వినియోగించుకుంటున్న ఉద్యమమా? ఈ రెండింటిలో ఏది నిజం? మొదటిది నిజమైతే ఇస్లామిక్ తీవ్రవాద ఉద్యమాన్ని మేడిపండుతో పోల్చాలి. రెండవదీ నిజమైతే, దానిని అరటి పండుతో పోల్చాలి. మేడిపండును దగ్గరకు తీసుకోనక్కరలేదు. అరటి పండును చేతుల్లోకి తీసుకొని తొక్కను తొలగించి, లోపలి గుజ్జును స్వీకరించాలి. ఇది గతితార్కిక భౌతికవాదుల రాజకీయ కర్తవ్యమౌతుంది.

సమకాలీన సామ్రాజ్యవాద యుగంలో కోట్లాది ముస్లిం ప్రజలు సాగిస్తున్న సాయుధ ప్రతిఘటనోద్యమం అరటిపండు లోని గుజ్జు వంటిదే. దాని మీద తొక్కను చూసి దూరంగా ఉండడం సరికాదు. ఆ తొక్క మీద కూడా బురద (మీడియా నిందా ప్రచారం) పడడం వల్ల మరింత దూరంగా జరగాలన్న భావన కలుగుతుంది. కానీ అందులోని మధురమైన గుజ్జును గెలుచుకోవాలంటే, అరటి పండును చేతుల్లోకి తీసుకోవాల్సిందే. మేడిపండు వంటి బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం సైతం సోషలిస్టు ప్రస్థానానికి ఉపయోగపడుతున్నది. అరటి పండు వంటి ఇస్లాం దేశాల ప్రజల సాయుధ ప్రతిఘటన ఇంకెంత ఎక్కువ ఉపయోగపడుతుంది? ఈ కొత్త దృక్కోణపు వెలుగులో ఇస్లాం ప్రజల ప్రతిఘటనోద్యమాలకు దగ్గరవుదాం.

(అయిపోయింది)

*(రచయిత ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)*

వీ

## వీక్షణం రచయితలకు సూచనలు

తొమ్మిది సంవత్సరాలలో, నూట ఇరవై సంచికలలో వీక్షణం రెండు వేల పైగా వ్యాసాలు, రచనలు ప్రచురించింది. వీటిలో నిడివిలోనూ, వస్తువులోనూ, చెప్పిన పద్ధతి లోనూ, సుబోధకత లోనూ చాల వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్నంతా గౌరవిస్తూనే, పత్రికలో అచ్చయ్యే వ్యాసాలను ప్రామాణికం చేయడానికి రచయితలు ఈ కింది సూచనలు పాటిస్తే బాగుంటుందని భావిస్తున్నాం.

- ❖ రచన మరీ చిన్నది (ఒక పేజీ కన్న తక్కువ) కాకుండానూ, మరీ పెద్దది (ఐదు పేజీల పైన) కాకుండానూ ఉంటే బాగుంటుంది. రచన ఐదు పెజీలకు మించితే రెండు మూడు సంచికలలో వేయవలసి వస్తుంది గనుక రచయిత అభిప్రాయం పాఠకులకు అందడం కష్టమవుతుంది. మూడు-నాలుగు పేజీల రచన (1800 - 2500 పదాలు) వీక్షణం కు సరిగ్గా సరిపోతుంది.
- ❖ చేతిరాతతో పంపేవారయితే వీలయినంత కుదురుగా, చదవడానికి వీలుగా, పంక్తుల మధ్య ఖాళీ వదులుతూ, కాగితానికి ఒకవైపునే రాసి పంపాలి. కంపోజ్ చేసి పంపేవారయితే, డబుల్ లైన్ స్పేసింగ్ లో కాగితానికి ఒకవైపునే అచ్చువేసి పంపాలి. యూనికోడ్ లో గాని, పేజ్ మేకర్ లో గాని కంపోజ్ చేసేవారు సాఫ్ట్ కాపీ సి.డి. ద్వారాగాని, ఇ మెయిల్ లోగాని పంపితే మంచిది.
- ❖ రచయితలు తప్పనిసరిగా తమ రచన ఫొటో కాపీ తమ దగ్గర ఉంచుకోవాలి.
- ❖ రచనతో పాటు తప్పనిసరిగా రచయిత సంక్షిప్త పరిచయం, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఇమెయిల్ వగైరా వివరాలు పంపాలి.
- ❖ వీక్షణం కార్యాలయానికి రచన అందిన వెంటనే అందినట్టుగా రచయితలకు సమాచారం పంపుతాం. రెండువారాలలోగా ఆ రచనను ప్రచురణకు స్వీకరిస్తున్నదీ లేనిదీ తెలుపుతాం. తక్షణ ప్రాముఖ్యత ఉన్న అంశం మీద రచన అయితే రెండు-మూడు నెలల లోపు అచ్చువేస్తాం. సాధారణ రచనలు అచ్చువేయడానికి ఆరు నెలల వరకూ పట్టవచ్చు.
- ❖ మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణం కు పంపగూడదు.
- ❖ దీర్ఘకాలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద మాత్రమే కాక, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపైన కూడ రచనలు పంపాలని రచయితలకు విజ్ఞప్తి. ఆ విషయం మీదనే మరొకరు రాసినా, అన్ని దృక్పథాల రచనలు అచ్చు వేయడం వీక్షణం ఉద్దేశ్యం. క్షేత్ర పరిశోధనా నివేదికలు, విధానాల అమలు తీరుతెన్నులు, ప్రజాజీవితంలో మార్పులు, వివిధ దృక్కోణాలు, విభిన్న సామాజిక శాస్త్ర పరిశీలనాంశాలు వీక్షణంలో ప్రాధాన్య ప్రచురణాంశాలు. సాహిత్య రంగానికి సంబంధించిన రచనలకు వీక్షణంలో చోటు కల్పించడం సాధ్యం కాదు.
- ❖ రచయిత అభిప్రాయాలను మార్చడం ఎప్పుడూ జరగదు. కాని నిడివి దృష్ట్యాగాని, సాంకేతిక కారణాల దృష్ట్యాగాని రచనలు కుదించే, మార్చే పరిస్థితి రావచ్చు. ఇలా ఎడిట్ చేయడానికి రచయితలు ఆమోదించాలి.

భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు

ఎస్. సరళా వందనం

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 7

*(గత సంచిక తరువాయి...)*

సంస్థానాధీశులు, చిన్న చిన్న రాజులు, జమీందార్లు తమ ఆధీనంలో ఉన్న భూముల నుంచి బ్రాహ్మణులకు అగ్రహారాల రూపంలో ఇనాముగా ఇచ్చేవారు. అలానే ముస్లిం పాలకులు లేదా జాగీర్దార్లు, మనసబుదార్లు 'ఖిద్‌మతి' ఇనామ్‌గా దర్గాలకు, దేవాలయాలకు భూములను మంజూరు చేసేవారు. ఇలా వందల ఎకరాలను దేవాలయాలు, దర్గాల పోషణకు పూజారుల, మౌల్వీల జీవనానికి కేటాయిస్తూండేవారు. ఈ ఇనామ్ భూములకు అతి తక్కువ శిస్తు విధించేవారు. దీనినే క్విట్ రెంట్ అంటారు. చాలాసార్లు అసలు పన్ను లేకుండానే ఇనామ్‌గా భూములను ఇచ్చేవారు.

గ్రామాల్లోని వృత్తిపని వారైన కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, కంసాలి, మంగలి, చాకలి వారికి సాగు చేసుకోవడానికి కొంత భూమిని మంజూరు చేసేవారు. ఈ వృత్తి పనివారికే పంట కోసే సమయంలో రైతులు ధాన్యం కూడా ఇచ్చే ఆనవాయితీ ఉంది. వీరికే కాకుండా గ్రామ రెవెన్యూ వసూలుకు ఉపయోగపడే వారికి, ఇతర ప్రభుత్వ సేవలకు ఉపయోగపడే వారైన తలారి (గ్రామంలో అన్ని రకాల పన్నులు వసూలు చేసేవాడు), సేథ్ సింధి (ప్రతి యాభై గృహాలకు కాపలాగా ఉండే వ్యక్తి), నేరి లేదా నీరుకట్టు (పొలాలకు నీటి సరఫరా సక్రమంగా జరిగే విధంగా చూసేవాడు), ఖైయిర్ (నిమ్న జాతులకు చెందిన గ్రామ సేవకుడు), బేగారి (గ్రామ రెవెన్యూ అధికారులకు, ఇతర ప్రభుత్వ ఉద్యోగులకు జీతం లేకుండా వెట్టి చాకిరీ చేసేవాడు) లకు కూడా వ్యవసాయం చేసుకోవాడనికి కొంత పొలాన్ని వారి సేవలకు గాను ఇనామ్‌గా ఇచ్చేవారు. ఇలా దాదాపు 17 రకాల గ్రామ సేవలకు గాను మంజూరు చేసే భూములను 'ఛాతా' ఇనామ్ భూములుగా పరిగణించేవారు.

మొదటి నిజాం తరువాత పాలన కొంత వారసత్వపోరుతో ఒడిదుడుకులకు లోనయినా, తరువాత కాలంలోని నిజాం అలీ మాత్రం పూర్తి పాలన అందించాడు. ఇతని పాలనా కాలంలో హైదరాబాద్ దక్కన్‌లోని పది జిల్లాలలోని 23 తాలూకాలలో 1,194 గ్రామాలు పాయిగా భూములు/ జాగీరు భూములుగా కేవలం సైన్యం పోషణకు గాను శిస్తు లేకుండా భూములు మంజూరు చేయబడి ఉండేవి. ఈ పాయిగా భూములకు అధికారులుగా మొఘలుల పాలన నుంచి కూడా అరబ్బులు, పఠానులు, రోహిల్లాలు మొత్తం ఆరు సుబాలలో మనసబుదారులుగా మాత్రమే కాకుండా, నాయబ్ (రెవెన్యూ అధికారులు)లుగా కూడా ఉండేవారు. వీరు ఎప్పుడూ రాజధానిలోనో, ఇతర పట్టణాలలోనో ఉండి తమ బంధుగణం, తమ అనుచరులతో రెవెన్యూ వసూలు చేయించేవారు. ఖల్సా భూములకన్న ఈ భూములలో రకరకాల కొత్త పన్నులను చాలా ఎక్కువ మొత్తంలోనూ, భూమి శిస్తునైతే దివాని భూములకన్నా 25 నుండి 50 శాతం ఎక్కువగా ప్రజల నుండి వసూలు చేసేవారు. వీరు తమను నియమించడానికి ప్రభుత్వానికి ఇచ్చిన 'నజరు'తోపాటు తమ సైన్యం, ఇతర బంధుగణం, తమ ఇతర ఖర్చులు, మిగులు ఆదాయం అన్నీ కూడా కలిపి రెవెన్యూ డిమాండ్ ఉండే విధంగా చూసుకొనేవారు. వీరు తమ పరిధిలో పన్ను వసూలుకు సహాయకులను నియమించుకొని, సైన్యం సహాయంతో పన్నులు కఠినంగా వసూలు చేసేవారు.

క్రీ. శ. 1790 నుంచీ సికింద్రాబాద్‌లో ఉంటున్న బ్రిటిష్ రెసిడెంట్ కమిషనర్ ఈ పద్ధతులతో సరిగ్గా శిస్తు వసూలు కావడం లేదని ప్రతి తాలూకాకు బ్రిటిష్ అధికారులను సూపర్‌వైజర్‌లుగా నియమించాడు. కాని వీరి వలన కూడా సక్రమంగా పన్నులు వసూలు కాకపోవడం వలన తిరిగి స్వదేశీ అధికారులనే అమీనులుగా కొనసాగించారు. ఈ అమీన్ల వ్యవస్థ కూడా ఉపయోగంగా ఉండడం లేదని 1840లో ఈ వ్యవస్థను కూడా రద్దు చేశారు. దివాని భూములలో ప్రతికూల పరిస్థితులలో పన్ను తగ్గించడమో, రద్దు చేయడమో జరిగేది కాని, పాయిగా భూములలో ఎలాంటి పన్ను తగ్గింపు, రద్దు అనేవి ఉండేవి కావు. పైగా పన్ను కట్టలేని వారిని సంవత్సరాల తరబడి వారి ఆధీనంలో భూమి ఉన్నా కూడా నిర్దాక్షిణ్యంగా ఆ భూమి నుంచి వెళ్లగొట్టేవారు. ఒక జాగీరు నుంచి ఇంకో జాగీరుకు పన్ను విధింపు కూడా ఒకేరకంగా ఉండేది కాదు. ఈ నవాబులు, జాగీర్దార్లు, మనసబుదార్లు తమ అవసరాలకే ప్రాధాన్యం ఇచ్చి ప్రజల పట్ల ఎప్పుడూ కూడా ప్రజల పట్ల బాధ్యతగా ప్రవర్తించలేదు.

ఇందుకు ఉదాహరణ 1813లో అలూఫ్ ఖాన్ ప్రజలను దారుణంగా పీడించి కర్నూలు జాగీరులో 12 లక్షల పన్ను వసూలు చేశాడు. 1816లో అలూఫ్‌ఖాన్ కొడుకు గులామ్ రసూల్ ఖాన్ అయితే నంద్యాల చెరువు కింద సాగుచేసే భూములకు అప్పటివరకూ అమలులో ఉన్న 1/2 వంతు పంట శిస్తును 2/3 వంతు పంట శిస్తుగా వసూలు చేసి ప్రజలను పీడించాడు. నన్నూరు గ్రామంలో తనకు సంబంధించిన గుర్రం చనిపోయినందుకు గాను గ్రామశిస్తులో గుర్రం ఖరీదు ఐదు

వేల రూపాయలను కూడా కలిపి ప్రజల దగ్గర నుండి బలవంతంగా వసూలు చేశారు. ఇతను తన పాలన కింద పండే పంటకు ధర తనే నిర్ణయించి ప్రజలకు డబ్బుకు బదులుగా ప్రోనోట్లు రాయించి ఇచ్చి, అతి తక్కువ ధరకు ధాన్యం కొని నిల్వ ఉంచి తరువాత ప్రజలకే ఎక్కువ ధరకు అమ్మేవాడు. అందువలన ప్రజలు, వ్యాపారస్తులు బతకడం చాతకాక అన్నీ వదులుకొని పారిపోయేవారు. ఇలా సంపాదించిన డబ్బుతో ఆయుధాలను రహస్యంగా సమకూర్చుకోవడం, ధాన్యాన్ని రహస్యంగా నిల్వ ఉంచడాలు గురించి తెలుసుకున్న బ్రిటిష్ వారు ఇతనిపై విచారణకు కమిషన్‌ను నియమించి కర్నూలుకు పంపారు. ఇతను కమిషన్ ఎదుట విచారణకు హాజరు కాకుండా 18 అక్టోబర్ 1839న కర్నూలు పక్కనే ఉన్న జోహరాపురంకు పారిపోయాడు. కాని అక్కడ అతని సైన్యంలోని రోహిల్లాలు, అరబ్బులు నవాబును చుట్టుముట్టి ఏడు నెలలుగా ఇవ్వని తమ జీతాలు ఇవ్వమని దాడి చేయబోయారు. వీరు ఎంతకీ అదుపులోకి రాకపోవడంతో దాదాపు వంద మందిని బ్రిటిష్ వారు కాల్పులలో చంపి నవాబును తిరుచురాపల్లికి తరలించి, 1839 నుంచి రాయలసీమ జిల్లాలను తమ పూర్తి ప్రత్యక్ష పాలనలోకి తీసుకున్నారు. 1839లో బ్రిటిష్ వారి పూర్తి పాలన మొదలయ్యే నాటికి ఒక్క కర్నూలు నవాబు కిందే భూమి శిస్తు డిమాండ్ రు. 6,86,817 గా ఉంది.

అలూఫ్ ఖాన్ 1815లో చనిపోయిన తరువాత బ్రిటిష్ వారి అండతో నవాబుగా నియమింపబడిన మూనావర్ ఖాన్ తను కర్నూలును ఆక్రమించుకున్నప్పుడు అతని సైనికులు రెవెన్యూ రికార్డులను తమకు తోచిన రీతిలో మూటలు కట్టిపెట్టారు. తరువాత మునావర్ ఖాన్‌కు ఆ రికార్డు ఒక పద్ధతిగా సర్దించడం చేతకాక తన ఒంటెలు, ఏనుగులపై ఆ రికార్డులను మోయించి తుంగభద్ర నదిలోకి కొన్ని రోజుల పాటు విసిరెయించాడు. ఈ చర్య వలన కేవలం గ్రామ పరిపానాధికారుల వద్ద ఉన్న రికార్డు తప్ప వేరే భూమి రికార్డుల ఆధారం లేకుండా పోయింది.

ఒకవైపు పాలకులు ఈ విధంగా ఉంటే రాయలసీమ జిల్లాలో గ్రామ రెవెన్యూ అధికారులైన రెడ్డి, కరణాలలో అధికశాతం ఇందుకు విరుద్ధంగా లేరు. కర్నూలు కమిషనర్ అప్పటి ప్రభుత్వ చీఫ్ సెక్రటరీకి 25 అక్టోబర్ 1843న రాసిన లేఖలో రెడ్డి కరణాలు భూములను తమకు ఇష్టం వచ్చిన రీతిగా ప్రజలకు సాగు చేసుకోవడానికి, ఇతర అవసరాలకు కేటాయించేవారని రాశాడు. అలాగే సాగు చేసుకొనే రైతులను భూముల నుంచీ ఏదో ఒక కారణం చూపించి తొలగించేవారని, బాగా పండే నీటి పారుదల కలిగిన భూములు, గ్రామానికి దగ్గరగా ఉన్న భూములను తమ స్వంతానికి ఉంచుకొనే వారని లేదా, తమకనుకూలంగా ఉండే వ్యక్తుల ఆధీనంలో ఉంచుకొని లాభం పొందేవారని రాశాడు. ఇక భూమి శిస్తు నిర్ధారణ, వసూలు విషయానికొస్తే ఒక పొలానికి ఎకరానికి ఒక రూపాయి శిస్తు ఉంటే, అదే రకమైన పక్కనున్న పొలానికి రెండు రూపాయలు లేదా మూడు రూపాయల శిస్తు విధించి కఠినంగా వసూలు చేసే వారని రాశాడు.

1802లో ఈస్ట్ ఇండియా కంపెనీ నిజాంలో ఏ వస్తువుకైనా ఒకేసారి రవాణా సుంకం వసూలు చేసుకోవాలని ఒక వాణిజ్య ఒప్పందం కుదుర్చుకుంది. కానీ ఈ పాయిగాదార్లు, జాగీర్దార్లు తమ ఆధీనంలో ఉన్న భూములలో సరుకు రవాణా జరుగుతున్నప్పుడు ఈ ఒప్పందాన్ని ఖాతరు చేయకుండా పలుసార్లు వాణిజ్య వస్తువులపై రహదారి సుంకాన్ని వసూలు చేసేవారు. చివరకు 1860లో సాలార్‌జంగ్ ఈ ఒప్పందాన్ని రద్దు చేశాడు. ఇలా ప్రజా విరుద్ధమైన రీతిలో పాలన జరిగింది.

## రెవెన్యూ సంస్కరణలు - సాలార్‌జంగ్ 1

సాలార్‌జంగ్‌ను 1853లో నిజాం తనకు దివానుగా నియమించుకున్నాడు. సాలార్‌జంగ్ బ్రిటిష్ వారికి చాలా సన్నిహితుడు. 1857లో జరిగిన భారత మొదటి స్వాతంత్ర్య సంగ్రామంలో నిజాం బ్రిటిష్ వారికి మద్దతుగా యుద్ధం చేయడంలో సాలార్‌జంగ్ పాత్ర చాలా కీలకమైంది.. బ్రిటిష్ వారు తాము గెలవడానికి నిజాం చేసిన సహాయానికి గాను ఉస్మానాబాద్, రాయ్‌చూరు, బీదర్‌లను 1857లో తిరిగి నిజాంను అప్పగించారు. సాలార్‌జంగ్ 1 తను దివానుగా నియమింపబడిన తరువాత బ్రిటిష్ రెవెన్యూ పాలనను నిజాం పాలనలో తమ పాలనకు అనుకూలంగా ఉండే విధంగా మలుచుకొని అవలంబించాడు. సాలార్‌జంగ్ దివానుగా నియమింపబడే నాటికి చాలా మంది తాలుకాదార్లు (జిల్లా అధికారులు. వీరిలో ఎక్కువ మంది మిలిటరీ అధికారులు ఉన్నారు.) రెవెన్యూ వసూలు చేసుకుంటున్నా కూడా, ఖజానాకు జమ చేయకుండా, లెక్క చెప్పకుండా గొడవలకు కారణమయ్యారు. ఇదే సమయంలో వీరు తమ అనుచరులతోనూ, సైన్యాలతోనూ ప్రజలను పీడించి అధిక మొత్తంలో రెవెన్యూ వసూలు చేయడం వలన చాలా మంది రైతులు వంశ పారంపర్యంగా వస్తున్న భూములను కూడా బంజరుగా పెట్టి వేరే చోట్లకు వలసలు వెళ్లడం జరిగింది. సాలార్‌జంగ్ 1853లో ప్రభుత్వం తరపున రెవెన్యూ వసూలు చేసే ఈ తాలుకాదార్ల వ్యవస్థను రద్దు చేశాడు. వీరి స్థానంలో ప్రభుత్వానికి జవాబుదారీగా ఉండి, ప్రభుత్వంచే వేతనం పొందే కొత్త అధికారిక వ్యవస్థను నెలకొల్పాడు.

1864లో రెవెన్యూ బోర్డును నెలకొల్పి దివాని ఆధీనంలోనున్న రాజ్యాన్నంతటినీ 14 జిల్లాలుగా, 74 తాలూకాలుగా విభజించారు. ఇంతకుముందు తాలూకా విస్తీర్ణం ఒక సంవత్సరం 40 గ్రామాల పరిధిలో ఉంటే, ఇంకో సంవత్సరం 60 గ్రామాలుగా ఉండి తరచూ మారుతూ ఉండేది. కొన్నింటి విలీనం, కొన్నింటి సమ్మేళనంతో సుబా, తాలూకా, తహసిల్‌గా బ్రిటిష్ ఇండియాలో ఉండే విధంగా విభజించాడు. జీతంపై పనిచేసే ఒక తాలూకాదారు, ఇద్దరు సహాయ తాలూకాదార్లను ఒక్కో జిల్లాకు నియమించాడు. తహసిల్ పరిధిలో నిర్ణయించబడే శిస్తులను బట్టి గ్రేడ్లవారిగా విభజించి విభాగాలు చేశాడు. ప్రతి విభాగంలో ప్రైవేట్ బ్యాంకులకు బదులుగా ప్రభుత్వ ఖజనాను మొట్టమొదటిసారి ఎక్కడికక్కడ ప్రభుత్వాదాయాన్ని జమచేయడానికి నెలకొల్పాడు.

కొన్ని జిల్లాలు కలిపి సుబాగా ఉన్నాయి. ఇందులోని తాలూకాదార్ల పనిని సూపర్‌వైజ్ చేయడానికి సదర్ తాలూకాదార్లను నియమించి వీరికి సివిల్, క్రిమినల్, జుడిషియల్ అధికారాలు అప్పగించాడు. ప్రతి సంవత్సరం డిమాండ్, వసూలు తెలుసుకోవడానికి క్రమం తప్పకుండా

జమాబందీ చేయించేవాడు. రెవెన్యూ బోర్డుకు తన పరిధిలో ఉన్న దివాని భూములను విభజించడానికి, తగాదాలు తీర్చడానికి, కేటాయించడానికి కావల్సిన అధికారాన్ని ఇచ్చాడు. ఈ సంస్కరణలతో రెవెన్యూ పరిపాలన పూర్తిగా బలపడింది.

సాలార్‌జంగ్ పదవిలోకి వచ్చే సమయానికి ఎక్కువ చోట్ల తకదమా' (పంట పండినా, పండించకపోయినా ముందస్తుగా పన్ను చెల్లించాల్సి రావడం) పద్ధతి అమలులో ఉండేది. ఈ పద్ధతిని రద్దు చేశాడు. పైగా ఇంతకు ముందు 'బటాయి' (ప్రభుత్వమే పంటల ధరను తన ఖజానాకు అనుకూలంగా ఉండే విధంగా నిర్ణయించడం) విధానాన్ని రద్దు చేశాడు. 1865-66లో రైతువారీ పద్ధతిలో పంట కొనే సమయంలో ప్రతి ఒక్కరి ఆధీనంలోనున్న భూమిని శిస్తు నిర్ణయించడం కోసం సర్వే చేయించడం మొదలుపెట్టి, పంట దిగుబడిని బట్టి పన్ను వసూలు చేసే విధానం మొదలు పెట్టాడు. ఇలాంటి రెవెన్యూ సంస్కరణల వలన చాలా ఏళ్లుగా బంజరు భూములుగా ఉన్న పొలాల్లో మళ్లీ రైతులు వ్యవసాయం చేయడం వలన పంట దిగుబడి బాగా పెరిగింది.

ఎవరి ఆధీనంలో ఉన్న భూమిని వారికి రైతు వారీగా సర్వే చేయించడం సక్రమ భూమి శిస్తు వసూలుకు ఎంతో ముఖ్యమని గుర్తించి కొత్తగా రెవెన్యూ అధికారుల కొరకు భూముల సర్వే విభాగాన్ని నెలకొల్పాడు. డైరెక్టర్ ఆఫ్ రెవెన్యూగా మహది ఆలీని నియమించాడు. ఇతని ఆధ్వర్యంలో రెవెన్యూ అధికారులకు ముందుగా థియరిటికల్ శిక్షణ ఇచ్చేవారు. తరువాత ప్రాక్టికల్ ట్రైనింగ్ చేయడానికి గ్రామాలకు పంపడం వలన ఈ సర్వే మొదలయిన కొద్ది కాలంలోనే భూమి శిస్తు వసూలు మూడింతలు పెరిగింది. 1867లో పూర్తి స్థాయి సర్వే మొదలు పెట్టి మొఘలుల కాలం నుంచి ఉన్న 'బీము'ల స్థానంలో 'బీగా'ల రూపంలో పొలాలు కొలిపించాడు.

1 బీము - ఒకటిన్నర గుంట, లేదా 181 చ. గజాలు.

1 బీగా - 30 గుంటలు.

1 గుంటకు - 121 చ. గజాలు.

1 చ. గజం - 9 చదరపు అడుగులు.

1850లో నిజాం హైదరాబాద్ నుంచి ముంబయిలోని వాడి వరకు రైల్వే లైను వేయడానికి బ్రిటిష్ వారికి కావలసిన భూమిని అప్పగించాడు. భూసేకరణ జరిగిన విధానం, సర్వే విధానాలను తెలుసుకోవడానికి 1880లో వచ్చిన సర్. రిచర్డ్ మీడ్ నిజాం ప్రభుత్వ కార్యాలయాలను తనిఖీ చేసి రైల్వే లైన్‌కు కోల్పోయిన భూములకు బదులుగా నిరాశ్రయులకు వేరే భూమిని అప్పగించడంలో రెవెన్యూ అధికార్ల పాత్ర ప్రశంసనీయంగా ఉందని మెచ్చుకున్నాడు. భూమిని సర్వే చేసిన తరువాత వాటి వివరాలను నమోదు చేయడం, నమోదు చేసే విధానానికి తీసుకున్న జాగ్రత్తలు చూసి సెటిల్‌మెంట్ విధానం, సర్వే పని వేరైనా వాటికి రెంటికి కూడా సమాన స్థాయిలో ప్రాధాన్యం ఇచ్చి, సమన్వయపరిచి తయారు చేసిన రికార్డులను, వారి జాగ్రత్తను పనితీరును అభినందించాడు. 1885లో భూములన్నింటిపై క్రమబద్ధమైన సర్వే చేయించి, శాశ్వత రికార్డును తయారు చేసే పనిని మొదలు పెట్టించాడు. ఇందుకు ముప్పై సంవత్సరాలలో సర్వే రీసర్వే చేసి శాశ్వత రికార్డును తయారు చేయించారు. భూముల కేటాయింపులు, ధాన ధర్మాలు, బహుమతుల రూపంలో ప్రభుత్వం ఇచ్చిన భూములు, భూమి హక్కులు ప్రభుత్వపరంగా మారినవి, వారసత్వం ద్వారా వచ్చు మార్పులు ఎప్పటికప్పుడు రికార్డులలో నమోదు చేసే విధంగా అన్ని కోణాలలోనూ భూమి సరిహద్దులు వ్యక్తిగతంగానూ, గ్రామం వారీగానూ తెలిసే విధంగా భూములపై సర్వే చేయాలని నిర్ణయించారు.. ఈ సర్వేను మరాఠీలు, ముస్లింలు, బ్రిటిష్ వారు కలిసి చేశారు. అందువల్లనే శాశ్వత రికార్డులలో ఎక్కువ భాగం మోడి (మరాఠీ) భాషలో ఉంటాయి. సర్వే వలన భూమి వివరాలను ఈ కింద తెలిపిన రికార్డుల ద్వారా తయారు చేశారు.

## సర్‌నక్ష (గ్రామ పటం)

గ్రామం మొత్తం విస్తీర్ణం కలిసి ఉండే పటం. 'టో పో గ్రాఫికల్ సర్వే' (స్థలాల ఆకృతి వివరణ) ద్వారా ప్రాథమికంగా గ్రామం ఉమ్మడి ఆస్తులు, సరిహద్దులుతో ఆకారం మొత్తం కలిసి ఉంటుంది. ఈ సర్వేలో నదులు, కొండలు, రోడ్లు, దేవాలయాలు, మసీదులు, రైలు మార్గాలు ఉంటే అవి, పర్వతాలు, బావులు, చెరువులు మొదలైనవి నమోదు చేస్తారు. కడస్ట్రల్ సర్వే (రెవెన్యూ సర్వే) పొలం సరిహద్దులు పట్టాదారుని రెవెన్యూను నిర్ణయించడానికి వారి అనుభవంలో ఉన్న భూములను కొలిచే విధానం. ఇందులో పట్టాదారువే కాకుండా ప్రభుత్వ భూములు, పోరంబోకు భూములు కూడా కొలిచి నంబర్లిస్తారు. ఇది పన్ను నిమిత్తం నిర్దేశించబడిన సర్వే అయినా ప్రతి పొలమునకు చట్ట సంబంధమైన గుర్తింపునిస్తుంది. ఈ సర్ నక్షలో టోపో వివరాలు, తాలూకా, సుబా వివరాలు, గ్రామం పేరు తయారు చేసిన తేది అన్నీ ఉంటాయి. గ్రామం మొత్తం విస్తీర్ణం కూడా నమోదు చేస్తారు. ఈ సర్వేకు గంటర్ (ఛైయిన్) గొలుసును ఉపయోగించారు.

1 గొలుసు - 100 లింకులు

గొలుసు పొడవు - 66 అడుగులు లేదా 22 గజాలు.

## టిప్పన్ పుస్తకం

సర్వే చేయడానికి కొంత భాగం తీసుకొని వాటికి ఒక్కో చాల్తా నెంబర్ (ఒక సర్వేయరుకు కొలవడానికి నిర్దేశించిన భూమి నంబర్) కేటాయిస్తారు. ఆ చాల్తా నెంబర్ భూమిలోని గ్రూపు నెంబర్లతో ఒక ఔట్‌లైన్ గీసి, సరిహద్దులలో ఏముందో కూడా రాసిన తరువాత, ఎవరి ఆధీనంలో ఆ భూములున్నాయో ఆ పట్టాదార్ల పేర్లు, పాత సర్వే నంబర్, కొత్త సర్వే నంబర్, విస్తీర్ణం, అసెస్‌మెంట్ (శిస్తు), పొలం పేరు, అనుభవదార్ల పేర్లు, పటం తయారు చేసిన తేది, గ్రామం పేరు నమోదు చేస్తారు. ఈ చాల్తా నెంబర్‌కు పక్కా పుస్తకంలో నమోదు చేయబడిన పేజీ నంబర్, పటం తయారు చేసిన సర్వేయరు పేరు, తేదీతో సర్వేయర్ సంతకం చేస్తాడు. ఈ పటంలో ఆ భూమిలో ఏదైనా కాలిబాట, బండి దారి, బావులు, కాలువలు, చెట్లు ఉంటే వాటిని కూడా నమోదు చేస్తారు.

## పక్కా పుస్తకం

ఒక గ్రామంలోని నిర్దిష్టమైన విస్తీర్ణం కలిగిన భూమిని తీసుకొని వాటాని సర్వే చేసే సర్వేయర్‌ల మధ్య పంచి ఒక్కొక్క సర్వేయర్‌కు ఎంత మొత్తంలో కొలతకు ఇచ్చారో దానికి ఒక నెంబర్ ఇస్తారు. ఆ నెంబర్‌నే చాల్తా నంబర్ అంటారు. ఒకవైపున ఇచ్చిన విస్తీర్ణానికి

*అణు శక్తి ఉత్పత్తికి కీలకమైన యురేనియం స్వరూప స్వభావాలను, రేడియో ధార్మికతను వివరిస్తున్నారు*

**డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# యురేనియం స్వరూప స్వభావాలు

యురేనియం అణుశక్తి ఉత్పత్తికి చాలా కీలకమైన పదార్థాల్లో ఒకటి. ప్రకృతిలో సహజంగా దొరికే మూలకాల్లో ఇదే అన్నిటికన్నా బరువైనది. ఇదొక సాంద్రమైన లోహం. ఒక ఘనసెంటిమీటర్ యురేనియం 19.1 గ్రాములు తూగుతుంది. ఇది సీసంకన్నా ఎక్కువే కాని బంగారంకన్నా తక్కువ. వేల ఏళ్ళ క్రితమే సహజంగా దొరికే యురేనియం ఆక్సైడ్‌ను ఉపయోగించి గాజు వస్తువులకు పసుపు పచ్చని రంగు వచ్చేలా చెయ్యడం క్రీ.శ.79లోనే మొదలైనట్టు తెలుస్తోంది. యురేనియంకూడా తక్కిన ఖనిజాల్లాగే నేలలో దొరుకుతుంది.

భూగోళానికి వెలపల మన కాళ్ళకు తగిలే బాహ్యపటలం ఒక పలచని పొరవంటిది. దీని కింద మధ్యపటలమూ (మేంటల్), అన్నిటి కన్నా లోపల క్రోడం (కోర్) ఉంటాయి. మధ్యపటలం వేడిగా ఉండి, కరిగిన శిలాద్రవంతో జారుడుగా ఉంటుంది. దీనిమీద తేలుతూ ఉండే బాహ్యపటలం అనేక ఫలకాలుగా ఉండడంవల్లనే అవి అప్పుడప్పుడూ ఒకదానికొకటి తగులుతూ, ఒరుసుకుంటూ ఉంటాయి. భూకంపాలకూ, త్సునామీలకూ ఇటువంటి కదలికలే కారణం. బాహ్య పటలానికి కింద వేడిమి పెరగడానికి కారణం అక్కడుండే యురేనియం, థోరియం, పొటాసియం-40 వంటి పదార్థాలన్నీ రేడియోధార్మిక అస్థిరతకు లోనయి క్షీణిస్తూ ఉండడమే. అణుస్థాయిలో విడుదల అయే శక్తి యావత్తూ చివరకు ఉష్ణంగానే మారుతుంది కనక భూగర్భంలోని పదార్థరాశి జ్వలనం చెందుతూ లోపలి భాగాలను వేడెక్కిస్తూ ఉంటుంది.

భూమిలోని సహజ రేడియోధార్మికతకు యురేనియం నిక్షేపాలు కూడా ఒక కారణమే. యురేనియం అంత అరుదైనదేమీ కాదు. పోల్చి చెప్పాలంటే ఇది వెండితో పోలిస్తే 40 రెట్లు ఎక్కువగా లభించే ఖనిజం. ఇది ప్రధానంగా యురేనైట్ రూపంలో దొరుకుతుంది (పటం). చూడటానికి నల్లగా ఉండే ఈ ఖనిజాన్ని పిచ్‌బ్లెండ్ అనికూడా అంటారు. ఇందులో ప్రధానంగా యురేనియం ఆక్సైడ్ పదార్థాలూ, సీసంతో సహా యురేనియం క్షీణించగా రూపొందే అనేక ఇతర పదార్థాలూ కలిసి ఉంటాయి. ముడి ఖనిజంలో యురేనియం మోతాదు సామాన్యంగా

---

సంబంధించి అన్ని సరిహద్దుల నమోదుతో తయారు చేసిన మ్యాప్ (పటం) ఇంకోవైపు పాత సర్వే నెంబర్ విస్తీర్ణం, కొత్త సర్వే నంబర్ విస్తీర్ణం, పోటు ఖరాబు (ఒక సర్వే నంబర్‌లో ఖాస్తుకూ ఉపయోగించ డానికి లేదా వ్యవసాయానికి పనికి రాని) భూమి, రాళ్లు ఎక్కడెక్కడ ఉన్నాయి, ఎన్ని ఉన్నాయి, ఈ భూములలో ఉన్న కాలిబాట, బళ్లదారి, నాలాలు కూడా నమోదు చేస్తారు. ఇందులో మాగాణి (తరి) విస్తీర్ణం, మెట్ట విస్తీర్ణం ఎంత ఉందో నమోదు చేస్తారు. ఏ సర్వేయర్ కొలతలు చేశారో ఆ సర్వేయరు పేరు కూడా తేదీతో సహా నమోదు చేస్తారు.

### క్లాసర్ రిజిస్టర్

ఈ రిజిస్టర్‌లో గ్రామానికి సంబంధించిన మొత్తం సమాచారం ఉంటుంది. అన్ని సర్వే నంబర్లు, వాటి విస్తీర్ణం, అందులో పోటు ఖరాబు విస్తీర్ణం, పన్ను విధించదగిన విస్తీర్ణం, తరి లేక ఖుష్కి / మెట్ట రకం, తోటలు, గ్రామకంఠం లేదా గ్రామ నత్తం లేదా ఆబాదీ, వ్యవసాయం చేస్తున్న భూములు, ఇనామ్ భూములు, చెరువులు, కుంటలు, నదులు, కాలువలు, గైరాన్ భూములు (గ్రామంలో పది నుంచి పదిహేను శాతం భూమి పశువుల గడ్డి మేత కోసం వదిలి వేయబడిన భూములు) అన్నీ ఈ రిజిస్టర్‌లో నమోదు చేయబడతాయి. ఈ రిజిస్టర్ సర్వేయర్‌లు తయారు చేస్తారు. ఇది చాలా ముఖ్యమైన రిజిస్టర్. ఈ రిజిస్టర్‌లో సర్ నక్ష, టిప్పన్, పక్కా పుస్తకంలోని వివరాలన్నీ సమన్వయపరచి, వ్యత్యాసాలుంటే సరిచూసిన తరువాత రాసే రిజిస్టర్.

### వసూల్ బాకీ రిజిస్టర్

ఈ రిజిస్టర్‌ను మామూలుగా సర్వేయరు కొలతలకు ముందు మూలంగా ఉపయోగించుకుంటారు. ఈ రిజిస్టర్‌ను గ్రామ రెవెన్యూ అధికారులైన పటేల్, పట్వారీలు తయారు చేస్తారు. ఇందులో సర్వే నెంబర్, విస్తీర్ణం, ఖాతాదారుని పేరు, నిర్ణయించబడిన శిస్తు, బాకీ ఉన్న శిస్తును పట్వారీ తయారు చేస్తాడు. వసూల్ బాకీ రిజిస్టర్‌ను పైన పేర్కొన్న అన్ని సెటిల్‌మెంట్ రిజిస్టర్‌లతో సరిచూసుకొని, ఏదైనా విస్తీర్ణంలో తేడాలుంటే, ఆక్రమణలుంటే, తగాదాలుంటే అవి పరిష్కరించిన తరువాత సరియైన విస్తీర్ణం, అందుకు గాను నిర్ణయించిన శిస్తు ప్రతి సంవత్సరం పటేల్, పట్వారీలు మార్పులు చేర్పులు నమోదు చేస్తూ ఈ వసూలు బాకీ రిజిస్టర్ తయారు చేస్తారు.

*(ఇంకావుంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
saralareddy007@gmail.com



యురేనియం లోహం, ఆక్సైడ్, ముడి ఖనిజం

23 శాతానికి మించదు. ఖనిజాన్ని పొడి రూపంలో తయారుచేసినప్పుడు అది పసుపుపచ్చని రంగులో ఎక్కువగా ఆక్సైడ్‌లతో కూడుకుని ఉంటుంది (పటం). లోహం ముదురు రంగులో కనిపిస్తుంది.

ప్రపంచవ్యాప్తంగా యురేనియం నిక్షేపాలు ఎక్కువగా ఉన్న ప్రాంతాలు కెనడా, ఆస్ట్రేలియా, కజఖ్‌స్తాన్, నైజర్, రష్యా, నమీబియా తదితర దేశాల్లో కనిపిస్తున్నాయి. మనదేశంలో జార్ఖండ్‌లోని జాదుగూడా గనులున్నాయి. కొత్తగా ఆంధ్రప్రదేశ్‌లోని నల్గొండ, కడప జిల్లాల్లోనూ, మేఘాలయలోనూ యురేనియం నిలవలున్నాయని తెలుస్తోంది.

యురేనియం అణుకేంద్రకంలో 92 ధనవిద్యుత్తుగల ప్రోటాన్లూ, వాటికన్నా ఎక్కువగా విద్యుత్తు లేని న్యూట్రాన్లూ ఉంటాయి. న్యూట్రాన్ల సంఖ్య 141నుంచి 146దాకా ఉండవచ్చు కనక దీనికి ఆరు ఐసోటోప్‌లుంటాయి. అంటే వీటి రసాయనిక లక్షణాలన్నీ ఒకలాంటివే అయినప్పటికీ కేంద్రక నిర్మాణంలో మటుకు తేడాలుంటాయన్నమాట. తక్కిన మూలకాల్లోకూడా ఇలాంటి ఐసోటోప్ లుంటాయిగాని యురేనియం విషయంలో 235 కణాలు కలిగిన కేంద్రకం చాలా ప్రత్యేకమైనది. యురేనియం అణుకేంద్రకాన్ని ఒక న్యూట్రాన్ చేత ఢీకొట్టించినట్టయితే ఆ పెద్ద కేంద్రకం కాస్తా రెండు ముక్కలవడం జరుగుతుంది. యురేనియం-235 విషయంలో ఇది ఎటువంటి న్యూట్రాన్‌తోనైనా సులువుగా సాధ్యపడుతుంది కాని యురేనియం-238 కేంద్రకం విచ్ఛిన్నం చెందాలంటే న్యూట్రాన్ వేగం అధికంగా ఉండాలి. విచ్ఛిత్తి అనేది దేనిలో జరిగినా బ్రహ్మాండమైన శక్తి మాత్రం విడుదల అవుతుంది. అందుకే యురేనియం కీలకమైన ఇంధనంగా ఉపయోగపడుతుంది. మనకు సహజంగా లభించే యురేనియంలో 99.28 శాతం యురేనియం-238 ఐసోటోప్ రకానివే ఉంటాయి. 0.71 శాతం మాత్రమే యురేనియం-235 అణువులుంటాయి.

విచ్ఛిత్తి చెందకపోయినప్పటికీ యురేనియం ఐసోటోప్‌లన్నిటికీ కొంత రేడియోధార్మికత ఉంటుంది. వీటినుంచి ఆల్ఫా కణాలూ (రెండు ప్రోటాన్లూ, రెండు న్యూట్రాన్ల సమ్మేళనం), కొంత గామా వికిరణమూ ప్రసరిస్తాయి. ఇందులో కూడా 70.4 కోట్ల ఏళ్ళ అర్ధాయుష్షు కలిగిన యురేనియం-235 కన్నా 447 కోట్ల ఏళ్ళ అర్ధాయుష్షు కలిగిన యురేనియం-238 తక్కువ క్రియాశీలంగా ఉంటుంది. బరువైన ఈ అణుకేంద్రకాలన్నీ అస్థిరమైనవే కనక విచ్ఛిత్తి చెందకపోయినప్పటికీ ఆల్ఫా కణాలను వెలువరించాక ఇవి నెమ్మదిగా ఇతర మూలకాల కేంద్రకాలుగా మారిపోతాయి. ఈ విధంగా వీటినుంచి రూపొందిన మూలకాలుకూడా అస్థిరమైనవే. అవికూడా పరిస్థితినిబట్టి ఒక బీటా (ఎలెక్ట్రాన్) కణాన్ని విడుదల చెయ్యడంద్వారానో, మరొక పద్ధతిలోనో మరొక మూలకంగా మారిపోతాయి. అంచెలంచెలుగా జరిగే ఈ మార్పుల్లో కొన్నిటికిది కోట్ల సంవత్సరాల అర్ధాయుష్షు కాగా మరికొన్ని త్వరితంగా జరిగిపోతాయి. మొత్తంమీద ఒక అణువు తల్లి అనీ, దాన్నుంచి పుట్టుకొచ్చినది కూతురనీ అనుకుంటే ఒక్కొక్క తల్లికీ, కూతుళ్ళూ, కూతుళ్ళ కూతుళ్ళూ ఇలా పుట్టుకొస్తూనే ఉంటాయి. అంటే మనం యురేనియం పెళ్ళగా పరిగణించేదాంట్లో దానితోబాటుగా దాని సంతతి కూడా చాలా ఉంటుందని గుర్తుంచుకోవాలి. ఈ సంతతిలోని ఒక్కొక్క అణువుకూ స్వభావసిద్ధమైన రేడియోధార్మికత ఉండి తీరుతుంది కనక (రేడియోధార్మికత అంటే అస్థిరంగా ఉండడమే) మనం చూసే యురేనియం మొత్తంగా ఈ రేడియోధార్మికతనంతటినీ ప్రదర్శిస్తూ ఉంటుంది.

వీటిలో చివరిదశ సీసం అణువు. అది స్థిరమైనది కనక మారదు. ఈ కారణంవల్లనే యురేనియం గనులన్నిటిలోనూ సీసంకూడా తప్పనిసరిగా ఉంటుంది. యురేనియంతో పోలిస్తే సీసం ఏ నిష్పత్తిలో ఉందో చూసి, దాన్నిబట్టి ఆ మార్పు కలగడానికి ఎంతకాలం పట్టిందో లెక్కకట్టవచ్చు. భూమి వయస్సు అంచనా వెయ్యడానికి ఇటువంటి పద్ధతులు పనికొస్తాయి. యురేనియం అస్థిరత ఖచ్చితమైన వేగంతో జరగడం కనిపిస్తుంది కనక ఇదొక దీర్ఘకాలిక గడియారంవంటిది.

యురేనియం గనులలో రేడియోధార్మికతకు కారణం దాని సహజమైన అస్థిరతే. దీనికీ, అణు ఇంధనంగా దాని ఉపయోగానికీ సంబంధమేమీ ఉండదు. నిజానికి ఈ రేడియోధార్మికత అంత తీవ్రమైనది కాదు. మామూలు గ్రానైట్ గనులలో కూడా ఈ స్థాయిలోనే రేడియోధార్మికత కనబడుతుంది. అయితే భద్రతాప్రమాణాలు పాటించకపోతే అనర్థాలు తప్పవు. ఉదాహరణకు ఖనిజం ఎక్కువగా పోగుపడడం, వ్యర్థాలు భూగర్భజలాలతో కలవడం, రసాయనిక కాలుష్యంవంటివన్నీ యురేనియం గనులతో ముడిపడిన సమస్యలు. అలాగే ధూళిలో కలిసిన యురేనియం ఊపిరి తిత్తులలోకి వెళితే ప్రమాదమే. ఇటువంటి అనేక కారణాలవల్ల యురేనియం తవ్వకాల విషయంలో పాటించవలసిన అనేక జాగ్రత్తలున్నాయి.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

'స్త్రీవాద సాహిత్యం ఒక పరిశీలన' డా. నళిని వ్యాస సంకలనంపై ఆశాలత సమీక్షను చర్చిస్తున్నారు **సారథి**

# 'స్త్రీ విముక్తి మరోకోణం' - చర్చనీయాంశాలు

**జూ**న్ 2011 వీక్షణం సంచికలో ప్రచురితమైన 'స్త్రీ విముక్తి మరో కోణం' సమీక్షా వ్యాసంలో ఆశాలత కొన్ని ముఖ్యమైన సిద్ధాంత, రాజకీయ అంశాలను లేవనెత్తారు.

స్త్రీల అణచివేత కారణాల గురించి నళిని వివరించిన మార్క్సిస్ట్ అభిప్రాయాలను ఉటంకించి, వీటితోపాటు ఏంగెల్స్ చెప్పిన కింది మాటలను కలిపి చదువుకుంటే కూలంకషమైన అవగాహన ఏర్పడుతుందంటూ ఆశాలత ఆ మాటలను ఇలా పేర్కొన్నారు -

'స్త్రీ పురుషుల మధ్య ప్రప్రథమంగా జరిగిన శ్రమ విభజన సంతానోత్పత్తి కోసం, దంపతి వివాహంలో స్త్రీ పురుషుల మధ్య పెంపొందిన వైషమ్యాలు మొట్టమొదటి వర్గ వైషమ్యం ఏకకాలంలో తలెత్తాయి. స్త్రీ జాతిని పురుష జాతి అణచివేయడమే మొట్టమొదటి వర్గ పీడనం.' (వీక్షణం, పేజీ 54)

ఏంగెల్స్ చెప్పిన పై మాటల్లోని చివరి వాక్యం అనువాదం సరికాదు. నళిని పుస్తకంలో 'ఏంగెల్స్ మాటల్లోని ఆఖరి వాక్యం అనువాదం సరిగానే ఉంది. (స్త్రీవాద సాహిత్యం - ఒక పరిశీలన పే. 39) ఆంగ్లంలో ఏంగెల్స్ రాసిన మాటలు ఇవి..

*"The first division of labour is that between man and woman for the propagation of children... The first class and antogonism that appears in history coincides with the development of the antagonism between man and woman in monogamous marriage, and the first class oppression coincides with that of the female sex by the male" (The origin of family, private property and the state, foreign language press, Peking, Page 75)*

ఏంగెల్స్ రాసిన ఈ గ్రంధాన్ని మహీధర రామమోహనరావు తెలుగులో అనువదించగా 1961లో దానిని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు 'కుటుంబం, వ్యక్తిగత ఆస్తి రాజ్యాంగాల పుట్టుక' పేరుతో ప్రచురించారు. ద్వితీయ ముద్రణ 1975లో వెలువడింది. ఈ పుస్తకంలోని తప్పుడు అనువాదాన్నే (అదే పుస్తకం ద్వితీయ ముద్రణ పేజి 100) ఆశాలత తన వ్యాసంలో యధాతథంగా పేర్కొంది. ఈ అనువాదంలో ఆఖరి వాక్యం అర్థం మారిపోయింది. 'అలానే మొట్టమొదటి వర్గపీడన, స్త్రీలను పురుషులు పీడించడం ఏకకాలంలో తలెత్తాయి'. మాటలకు బదులు 'స్త్రీ జాతిని పురుషజాతి అణచివేయడమే మొట్టమొదటి వర్గపీడనం' అని అనువదించబడింది.

వర్గ సమాజం ఏర్పడిన నాటి నుంచి స్త్రీ పురుష బేధం లేకుండా ప్రజలంతా ఏదో ఒక వర్గంతో సంబంధం కలిగి ఉన్నారనే మార్క్సిస్ట్ దృక్పథానికి భిన్నమైన అవగాహనను ఈ అనువాదం ఏర్పరుస్తుంది. పురుషుల వలెనే స్త్రీలు కూడా పీడకులుగానో పీడితులుగానో ఉన్నారు. పీడించే వర్గానికి చెందిన స్త్రీలు వారి కుటుంబంలో ఇంటి బానిసలుగానే ఉన్నా వారి వర్గానికి చెందిన పురుషులతో కలిసి వారు కూడా శ్రామికులను పీడిస్తారు.' అవీనీతికరమైన పరాన్నభుక్కు జీవితాన్ని కొనసాగిస్తారు. పీడిత వర్గానికి చెందిన [illegible]ావళి రెండు రకాల పీడనకు గురవుతారు.

ఏంగెల్స్ అవగాహనను బలపరచడానికి అనుకుంటాను అగస్ట్ బెబెల్ చెప్పిన 'మానవులలో బానిసత్వాన్ని మొట్టమొదట చవిచూసింది మహిళలే. బానిస ఉనికిలోకి రాకముందే స్త్రీ బాని స అయింది.' మాటల్ని ఆశాలత కోట్ చేశారు. ఏది ఏమైనప్పటికీ ఏంగెల్స్ చెప్పిన కింది విషయాలు గమనించదగినవి.

'సమాజ ప్రారంభంలో స్త్రీ పురుషునికి బానిసగా ఉందనేది పద్దెనిమిదవ శతాబ్దపు పునరజ్జీవన కాలం నాటి నుంచి ప్రచారంలో ఉన్న అత్యంత అర్థరహితమైన భావనలలో ఒకటి. ఆటవిక దశలో ఉన్న ప్రజందరిలోనూ, అనాగరిక యుగపు దిగువ, నడిమి దశలలోని వారందరిలోనూ ఒక్కొక్కప్పుడు ఎగువ దశలో వారిలో కూడా స్త్రీ స్వేచ్ఛాపరురాలే గాక ఉన్నతంగా గౌరవించబడిన స్థానంలో ఉంది. (*One of the most absurd notions taken over from eighteenth century enlightenment in that in the beginning of society women was the slave of man. Among all savage, and all barbarians of the lower and middle stages and partly even for the upper stage, the position of woken is not only free but highly respected". (same book page 55)*

పితృస్వామ్య వ్యతిరేక పోరాట ప్రాముఖ్యతకు సంబంధించిన నళిని అభిప్రాయాలను ఆశాలత (వీక్షణం పేజీ 55 మొదటి పేరా) వివరించిన సందర్భంగా నళిని రాసిన కొన్ని వాక్యాలను పేర్కొనకపోవడం వల్ల సమగ్రత లేకుండా పోయింది. నళిని రాసిన పూర్తి పేరా ఇది.

'పురుషులందరి చేతిలో రాజకీయ అధికారం లేదు. వర్గ సమాజం ఏర్పడిన నాటి నుండి రాజకీయాధికారం దోపిడీ చేసే వర్గాల చేతుల్లోనే ఉంది. పితృస్వామిక విధానపు అస్తిత్వం కుటుంబ సంబంధాల్లో వర్గ దోపిడీకి ప్రతిబింబం. అది పాత ఉత్పత్తి సంబంధాలకు ఒక పార్శ్వం వంటది. ఈ సంబంధాలు ప్రజాస్వామిక విప్లవ దశలో, సోషలిస్టు విప్లవ దశలో కొంతవరకు బలహీనపడినా అవి రంగం నించి పూర్తిగా నిష్క్రమించవు. అవి కమ్యూనిస్ట్ ఉద్యమం వల్ల మాత్రమే పూర్తిగా ధ్వంసమవుతాయి. సోషలిస్టు సంబంధాల కనుగుణంగా ప్రజాస్వామిక ఐక్యతపై ఆధారపడిన నూతన కుటుంబ సంబంధాలు కమ్యూనిస్ట్ ఉద్యమ ప్రాతిపదికగా నెలకొంటాయి. పితృస్వామిక విధానం కూలిపోవడం నిజమైన, సంపూర్ణమైన స్త్రీ విముక్తిని సూచిస్తుంది.' (స్త్రీవాద సాహిత్యం ఒక పరిశీలన' పుస్తకం నించి. పేజీ 69, కింద గీతలతో ఉన్న వాక్యాలను పేర్కొనలేదు.

వర్గం, కులం, జెండర్ - ఈ మూడు అంశాల మధ్య అంతః సంబంధాన్ని గుర్తించాలనీ, దీనిని మనోరంజన్ మహంతి చక్కగా వివరించారనీ, దీనిపై చర్చలు విస్తృతంగా జరగాలనీ ఆశాలత సరిగానే అభిప్రాయపడ్డారు.

*వీక్షణం జూలై 2011 సంచికలోని సంపాదకీయ వ్యాఖ్య 'ఎప్పటికైనా రాజపక్షను శిక్షిస్తారా?' పై స్పందన తెలియజేస్తున్నారు* **ఎస్. కృష్ణమూర్తి**

# శ్రీలంక సంపాదకీయ వ్యాఖ్యపై విమర్శ

వీక్షణం సంపాదకీయాన్ని పురస్కరించుకొని - 'ఎప్పటికైనా రాజపక్షను శిక్షిస్తారా?' అన్న శీర్షికతో రాసిన సంపాదకీయం (వీక్షణం జూలై 2011) లోపాలతో నిండి ఉంది. వాస్తవాలూ, వైఖరీ - రెండిటా తప్పులున్నాయి. ఇందులోని వివరాలూ, వ్యాఖ్యలూ కూడా నేడు ప్రపంచ వ్యాప్తంగా బహుళ ప్రచారంలో ఉన్నాయి. వీటిని గుడ్డిగా నమ్మేవారు కొందరైతే, అలవాటు కొద్దీ విధేయంగా ప్రచారం చేసేవారు అనేకులు. మన దేశపు ఒక ప్రముఖ ఇంగ్లీష్ ఛానెల్ రోజూ రాత్రి 8 గంటల ప్రైం టైంలో వరుసగా కొన్ని రోజులు గంటసేపు కిల్లింగ్ ఫీల్డ్స్ సినిమా చూపించారు. రోజు మరో గంటసేపు చర్చలు జరిపారు. తెలుగులో కూడా ఒక ఛానెల్లో చూపించారు. మిగతావారు క్లుప్తంగా కవర్ చేసారు. దేశమంతటా పత్రికల్లో సంపాదకీయాలూ, వ్యాసాలూ వచ్చాయి. సామ్రాజ్యవాదుల మీడియా యుద్ధంలో భాగం అనడానికి ఇది చాలు. అమెరికా, నేటోలు దశాబ్దంగా పదుల లక్షల మందిని చంపుతూ సాగిస్తున్న దురాక్రమణ యుద్ధాలపై ఎంత ప్రచారం జరిగింది? దీనితో పోలిస్తే? అని చూడాలి. ఎందుకిలా?

శ్రీలంక ప్రపంచ జలమార్గంలోని కీలక వ్యూహాత్మక స్థావరం. అందులో భాగంగా సామ్రాజ్యవాదుల మీడియాలైన వాయిస్ ఆఫ్ అమెరికా, బిబిసిల ప్రసార కేంద్రంగా ఉండేది. మీడియా కమ్యూనికేషన్ విప్లవం వల్ల వాటి ప్రాధాన్యత తగ్గింది. అది వేరే సంగతి. గత శతాబ్దాకి పైగా సామ్రాజ్యవాదుల, వారి దళారుల రబ్బరు, టీ తోటలకు నిలయం. శ్రీలంక ఎగుమతుల్లో సగం ఇవే. ఒకప్పుడు సామ్రాజ్యవాదులకు లొంగి లోబడిన శ్రీలంక ఈ యుద్ధ క్రమంలో - తన అవసరాల కొద్దీ - తన స్వాతంత్ర్యాన్ని అసర్ట్ చేసుకున్నది. అక్కడ వ్యాపారంలో, ఇతరత్రా చైనా, ఇతర మూడవ ప్రపంచ దేశాల పాత్ర పెరిగింది. ఈ నేపథ్యంలో ఈ యుద్ధాన్నీ, పై మీడియా యుద్ధంని చూడాలి. పై కారణాల వల్ల వీక్షణం సంపాదకీయంని పరిశీలించాల్సిన అవసరం ఉంది. కొన్ని అంశాలు :

శ్రీలంకలో అంతర్యుద్ధం నిరాఘాటంగా సాగింది - 20 ఏళ్లు కాదు, 1983 నుంచి 26 ఏళ్లు. 2009 మేలో శ్రీలంక ప్రభుత్వం 'వేలాది మంది ఎల్.టి.టి.ఇ. సైనికులను, సాధారణ తమిళ ప్రజలను చంపి వేసింది. హతుల సంఖ్య నలభై వేల నుంచి లక్ష దాకా ఉండవచ్చని అంచనా' అని రాశారు. ఈ లెక్క వివాదాస్పదం. అంతేకాదు, అందులో ఎందరు సైనికులు? ఎందరు సాధారణ ప్రజలు? ఏ పక్షం వారు ఎందరు? ఎవరి వల్ల ఎందరు? హతుల సంఖ్య ఏ కాలంలోనిది? ఈ వివరాలు లేవు. హతులైన సివిలియన్ల సంఖ్యను అతిగా చూపిస్తున్న సామ్రాజ్యవాద మీడియా లెక్కలివి. 1983 నుంచి 2009 జూలై దాకా (26 ఏళ్లలో) 41,126 మంది చనిపోయారని (సంవత్సరాల వారీ విభజనతో) వికీపీడియా అంచనా. అందులో 13,500 మంది సాధారణ పౌరులనీ,. 5,247 శ్రీలంక సైనికులని పేర్కొన్నారు. 22,379 మంది తమిళ

---

ఈ అంశాల మధ్య అంతఃసంబంధాన్ని అవగాహన చేసుకోవడానికి మార్క్సిస్ట్ మహోపాధ్యాయుడు కామ్రేడ్ మావో చెప్పిన ఈ కింది మాటల్ని గైడెన్స్‌గా తీసుకోవడం అవసరమని భావిస్తాను. ఆయన తన ప్రసిద్ధ 'హునాన్ రైతు ఉద్యమం - ఒక పరిశీలనా నివేదిక' వ్యాసంలో ఇలా అన్నారు.

'చైనాలో వ్యక్తి సాధారణంగా మూడు అధికార వ్యవస్థల పెత్తందారీతనానికి గురవుతున్నాడు. అవి 1) జాతీయ, రాష్ట్ర, కౌంటీ ప్రభుత్వాల మొదలు పురపాలక ప్రభుత్వాల దాకా ఉన్న రాజ్యాంగ వ్యవస్థ (రాజ్యాధికారం); 2) ప్రాచీన ఆరాధనాలయాలు, వాటి శాఖల నుండి కుటుంబ యజమాని వరకూ విస్తరించియున్న వంశ వ్యవస్థ (వంశాధికారం); 3) నరకాధిపతి నుండి నగర, గ్రామ భూత ప్రేత పిశాచగణాల వరకూ, స్వర్గలోక చరక్రవర్తి మొదలు ఊర్ధ్వలోక వాసులైన అనేకానేక దేవుళ్లు, దేవతలు, ఆత్మల వరకున్నూ వ్యాపంచియున్న అతిలోక వ్యవస్థ (మతాధికారం), స్త్రీల విషయంలో పైన చెప్పిన మూడు అధికార వ్యవస్థలే కాక పురుషాధిక్యత కూడా అదనంగా ఉంది (భర్త పెత్తనం). ఈ నాలుగు అధికారాలూ - రాజకీయ, వంశ, మత, పురుషాధికారాలు - మూర్తీభవించిన సమస్త భూస్వామ్య, పితృస్వామిక వ్యవస్థ భావజాలమూను చైనా ప్రజలను, ముఖ్యంగా రైతులను బంధించిన నాలుగు గట్టి తాళ్లు - భూస్వాముల రాజ్యాధికారమే మిగతా అన్ని అధికారాలకు వెన్నె ముక. అది కూలద్రోయబడడంతో వంశాధికారమూ, మతాధికారమూ, పురుషాధిక్యత అన్నీ కూడా పట్టు తప్పి అల్లల్లాడుతున్నాయి.'

(మావో రచనలు, మొదటి సంపుటం, పేజీ 44)

మావో వెలిబుచ్చిన పై అభిప్రాయాలు మూడవ ప్రపంచ దేశాలన్నింటికీ సర్వసాధారణంగా వర్తిస్తాయి. ఈ సాధారణ మార్గదర్శక సూత్రాల వెలుగులోనే మనం నిర్దిష్ట పరిస్థితులను అధ్యయనం చేయాలి. 'ఫ్యూడల్ భావాలను తిప్పికొట్టి ప్రజాస్వామ్యాన్ని చాటిన స్త్రీవాద సాహిత్యం' వ్యాసంలో మావో అభిప్రాయాల ఆధారంగానే నళిని స్త్రీవాద సాహిత్యాన్ని విశ్లేషించడానికి గానీ, స్త్రీవాద సాహిత్యాన్ని నిర్వచించడానికి గానీ ప్రయత్నించింది. వర్గం, కులం, జెండర్‌తో పాటు మతాధిపత్యాన్ని ప్రజలు గ్రహించేలా సామాజిక కార్యకర్తల కృషి ఉండాలి. ఆశాలత మతాధికారం గురించి ప్రస్తావించలేదు.

నేడు ముస్లిం, మైనారిటీ ప్రజానీకం ప్రత్యేకించి రచయితలు మత ఛాందస భావాల్నీ, మత మౌఢ్యాన్నీ పలు రకాల ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తూ ముందుకు వస్తున్నారు. ఇది ఎంతైనా ఆహ్వానించ దగిన పరిణామం. నేటి అస్తిత్వవాద ఉద్యమాల్లోని పాజిటివ్, నెగెటివ్ అంశాలను గుర్తించడం అవసరం. ఫ్యూడల్ భావాలను తిప్పికొట్టి ప్రజాస్వామిక భావాలను చాటిచెప్పడంలో అవి అనుకూలమైన పాత్రను నిర్వహిస్తున్నప్పటికీ, కార్మికవర్గ నాయకత్వాన కొనసాగే సామాజిక విప్లవం ద్వారానే అన్ని తరగతులకు చెందిన పీడిత ప్రజానీకం ఆకాంక్షలు నెరవేరుతాయనే శాస్త్రీయమైన అవగాహనను అవి నిరాకరిస్తున్నాయి. మార్క్సిజం పట్ల అవి తీసుకుంటున్న వైఖరి, మార్క్సిజంపై అవి జరుపుతున్న దాడి తీవ్రత వంటి అంశాలపై ఆధారపడి మాత్రమే అవి ఏ మేరకు అభివృద్ధికర మైనవో ఏ మేరకు అభివృద్ధి నిరోధకమైనవో నిశ్చయమవుతుంది. వీ

సైనికులు / మిలిటెంట్లు. ఒక్క 2009లోనే మొత్తం 15,361 మంది చనిపోయారని, అందులో 11,108 మంది సివిలియన్లని వివరించారు. సుమారు ఇలాంటి అంచనాలనే ఎస్.ఎ.టి.పి. (సౌత్ ఏషియా టెర్రరిజం పోర్టల్) వారు ఇచ్చారు.

ఐక్యరాజ్య సమితి (ఐరాస) అంచనా ప్రకారం 2009లో - యుద్ధం చివరి దశలో - చాలా మంది సివిలియన్లు చనిపోయారు. ఏప్రిల్ మధ్య వరకూ 6,500 మంది, ఆ తర్వాత అధికారిక లెక్కలు లేవు. అయితే పదిహేను వేల మంది దాకా ఉండవచ్చని మరొక అంచనా. పౌరులను బలిపెట్టి ఎల్.టి.టి.ఇ. సాగించిన యుద్ధ ఎత్తుగడల్లో కూడా చాలా మంది చనిపోయారని ఐరాస నిపుణులు పేర్కొన్నారు. అయితే ఎంత మంది అన్న లెక్క లేదు. యుద్ధంలో ఇరుపక్షాల సైనికులు చనిపోవడం అనివార్యం. వారివీ, సివిలియన్లవీ చావులను కలగలిపి, అతి అంచనాలివ్వడం, సామ్రాజ్యవాదుల పన్నుగడ, ఆ లెక్కలనే విచక్షణ లేకుండా 'లక్ష దాకా' అని వీక్షణం పేర్కొనడం బాధ్యతారహితం. అయితే ఈ లెక్కలను ఉదహరించడం వెనుకగల వైఖరిలోనే అసలు మౌలిక లోపం ఉంది.

'అమెరికన్, యూరపియన్ ప్రభుత్వాలు రాజపక్ష రక్తపిపాసపై పల్లెత్తు మాట అనలేదు' అని రాసారు. నిజానికి అమెరికా పట్టుపట్టిన మీదటే ఐరాస నిపుణుల కమిటీని నియమించింది. వారి నివేదికను అమెరికా ఆహ్వానించింది. అంతేకాక ఇంగ్లండ్, ఫ్రాన్స్‌ల కోరిక మేరకు ఇంగ్లిష్ వారి ఛానెల్స్ మీడియాను విస్తారంగా, ప్రపంచవ్యాప్తంగా ప్రసారం చేశారు. ఐరాస వద్ద కూడా చూపారు. జూన్ మొదటి వారంలో ఐరాస మానవ హక్కుల కౌన్సిల్ సమావేశాల్లో శ్రీలంక ప్రభుత్వాన్ని వీరంతా అభిశంసించారు. అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్, యూరోపియన్ యూనియన్ (ఇయు) శ్రీలంక ప్రభుత్వపు దౌర్జన్యాలపై అంతర్జాతీయ దర్యాప్తు జరపాలని డిమాండ్ చేశారు. అయితే వారి ప్రయత్నాన్ని వ్యతిరేకిస్తూ 20కి పైగా దేశాలు అడ్డు పడడంతో వారి తీర్మానం వీగిపోయింది. రష్యా, చైనాలే కాక ఈ రోజు అమెరికాను వ్యతిరేకిస్తున్న బ్రెజిల్, క్యూబా, ఇరాన్ వంటి దేశాలతో పాటు భారత్, పాకిస్తాన్‌లు కూడా ఈ తీర్మానాన్ని ఓడించాయి (ఎవరి కారణాలు వారికున్నాయి). ఈ తీర్మానం ప్రతిపాదించినప్పుడు కౌన్సిల్ ప్రస్తుత ఛైర్‌పర్సన్ నవనీతం పిళ్లై అన్న ఎల్.టి.టి.ఇ. పక్షపాతి అన్నది గమనార్హం. ఇరాక్, అఫ్ఘనిస్తాన్లలో లక్షల మందిని చంపిన సామ్రాజ్యవాదులను, నేడు లిబియాలో పౌరులపై బాంబులు కురిపిస్తున్న యూరపియన్ దేశాలను ఏమీ అనకుండా, శ్రీలంకపై విరుచుకుపడడాన్ని పలు దేశాలు ఖండించాయి.

హక్కుల గురించి ఆయా దేశాలు ప్రజలు పోరాడాల్సిందే. కానీ మానవ హక్కుల పేరిట అంతర్జాతీయ కక్ర పెత్తనం, జోక్యం నెరపుతున్న సామ్రాజ్యవాదుల కుట్రలనూ వ్యతిరేకించాలి. ఈ రెంటినీ మేళవించాలి.

ఎల్.టి.టి.ఇ. కి రక్షిత నెలవులతో పాటు పాశ్చాత్య దేశాల్లో ఆర్థిక, రాజకీయ, దౌత్య, మిలిటరీ సాయం ప్రత్యక్షంగా, పరోక్షంగా లభించిన విషయం జగద్విదితం. అమెరికా ఒక దశలో నిషేధించినా, ఎల్.టి.టి.ఇ. కి పరోక్షంగా ఎలా తోడ్పడిందీ కూడా సమాచారం ఉంది. ముఖ్యంగా 2005లో శ్రీలంకకు ఒక రేవు నిర్మాణంలో చైనా తోడ్పడడం మొదలైనప్పటి నుంచీ, అమెరికా వ్యూహంలో మార్పులు చేసుకున్నది. ఎల్.టి.టి.ఇ. ని రక్షించడానికి అమెరికా ఇండియాతో కలిసి ఎలా ప్రయత్నించిందీ 'వికీలీక్స్'లో ఆధారాలున్నాయి. శ్రీలంక సైన్యం మానభంగాలకు పాల్పడింది అంటూ హిల్లరీ క్లింటన్ ఆరోపించింది. పాశ్చాత్య సహకారంతో నడిచే అనేక జాఫ్నా చర్చీలు ఎల్.టి.టి.ఇ. కి బాహటంగా సహకరించాయి. ఈ విధంగా సామ్రాజ్య వాదుల అండదండలున్న వాస్తవాన్ని తలకిందులు చేసి సంపాదకీయం రాశారు. వాస్తవాల లోపం, వైఖరి లోపం కలగలసిపోయిన రచన ఇది.

'ఒక జాతి స్వయం నిర్ణయాధికారం ఆకాంక్షను ఇంత బీభత్సంగా, దుర్మార్గంగా' చిదిమివేస్తుంటే చూస్తూ కూర్చున్నారని రాశారు. స్వయ నిర్ణయాధికారం సమస్యను ఆధునిక యుగంలో సామ్రాజ్యవాదుల పాత్ర నుంచి - దక్షిణాసియాలో భారత ఆధిపత్యవాద, విస్తరణవాదుల పాత్ర నుంచి విడదీసి చూడడం తప్పు. ఎల్.టి.టి.ఇ. ఇలాంటి శక్తుల మద్దతుతో, ప్రోద్బల సహకారాలతోనే ఇరవై ఆరు ఏళ్ల యుద్ధం సాగించింది. సోవియట్ విచ్ఛిన్నం ప్రధానంగా సొంత తప్పుల వల్ల, 'శాంతియుతం'గా పూర్తయింది. కాగా యుగోస్లావియా విచ్ఛిన్నంలో సామ్రాజ్యవాదుల పాత్ర నిర్ణయాత్మకం. అందువల్ల ఆ దేశం భీకర యుద్ధాలతో జాతి విద్వేష హింసతో ముక్కచెక్కలైంది. శ్రీలంక హింసలో కూడా ఇలాంటి శక్తుల ప్రమేయం ప్రబలంగా ఉంది. పాలస్తీనా యుద్ధంలో వలె సామ్రాజ్యవాదుల, అగ్రరాజ్యాల ద్వంద్వ పాత్ర ఉన్న సందర్భం ఇది.

ప్రస్తుత 'కిల్లింగ్ ఫీల్డ్స్' వీడియో ఇలాంటి సామ్రాజ్యవాదుల 'మీడియా అఫెన్సివ్' లో భాగమే. ఇరాక్‌లో ఏడు నుంచి ఎనిమిది లక్షల మంది పౌరులను, అఫ్ఘనిస్తాన్‌లో లక్షలాది పౌరులను బలిగొన్న సామ్రాజ్యవాదులు తమ 'కిల్లింగ్ ఫీల్డ్స్' గురించి ఏమి చర్యలు తీసుకున్నారు? ఎవరిని శిక్షించారు? కంపూచియాలో 1975 నాటికి లక్షల మందిని చంపిన సామ్రాజ్యవాదులు ఆ తర్వాత పోల్ పాట్ 'కిల్లింగ్ ఫీల్డ్స్' గురించి ఇలాంటి మీడియా అఫెన్సివ్‌నే సాగించి, ఐరాసని వాడుకొని తమ జోక్యందారీ విధానాలను కొనసాగించారు. రెండు అగ్రరాజ్యాల దురాక్రమణకు గురైన అఫ్ఘనిస్తాన్‌ను కుక్కలు చింపిన విస్తరిగా చేసిన సామ్రాజ్యవాదులు 'తాలిబన్ల దురాగతాల గురించి' సినిమాలు, వీడియోల ద్వారా తమ ప్రచార యుద్ధం సాగిస్తున్నారు. ఇప్పుడు అలాంటి ప్రయత్నం శ్రీలంక విషయంలో జరుగుతున్నది. 21వ శతాబ్దాన్ని ఇరాక్ దురాక్రమణతో మొదలుపెట్టి, అఫ్ఘన్ దౌర్జన్యాన్ని కొనసాగిస్తూ, లిబియాలో బాంబులు కురిపిస్తూ పదుల లక్షల మందిని బలిగొన్న సామ్రాజ్యవాదులు మనముందున్నారు. వారు ఇంకా ఎంత (కాలం) మారణకాండ సాగిస్తారో తెలియదు. ఈ లోగానే '21వ శతాబ్దపు హిట్లర్'గా రాజపక్సను అభివర్ణించారు. ఇందులో సంయమనం, సహేతుకత, బ్యాలెన్సు ఏమైనా ఉన్నాయా? వస్తున్నా యన్నారు. కంపూచియాలో, యుగోస్లేవియాలో, శ్రీలంకలో ఉల్లంఘనలు, యుద్ధ నేరాలు జరిగిన మాట నిర్వివాదాంశం. సామ్రాజ్యవాదుల విధానాల పర్యవసానం గానూ, విడదీయరాని విధంగానూ ముడిపడిన నేరాలివి. ఈ వైరుధ్యాల మధ్య సామ్రాజ్యవాదుల నేరాలు ప్రధానాంశం. దాన్ని విస్మరించి, కప్పిపుచ్చి వాటి పర్యవసానంగా జరిగిన హింసనే పేర్కొనడం తప్పు.

ఐరాస నియమించిన పరిశీలన బృందం ఇచ్చిన 'నివేదిక ఎల్.టి.టి.ఇ. మీద కొన్ని విమర్శలు చేసింది గానీ ఇప్పుడు అవి అప్రస్తుతం' అని రాశారు. అవి ఏవో 'కొన్ని విమర్శలు' కాదు. మానవ హక్కుల, చట్టాల విషయంలో 'ఇరుపక్షాలు సాగించిన ఉల్లంఘనల'పై సమగ్ర అంతర్జాతీయ విచారణ జరిపించాలని ఆ నివేదిక కోరింది. ఈ విషయంలో ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ విడుదల చేసిన ఒక ప్రకటన (14 జూన్ 2011) శీర్షిక ఇది - 'యుద్ధంలోని ఇరుపక్షాలు యుద్ధ నేరాలు చేశాయి అన్న యుఎన్ నిపుణుల నివేదిక.'

సంపాదకీయంలో పేర్కొన్న 'శ్రీలంకాస్ కిల్లింగ్ ఫీల్డ్స్' వీడియో చిత్రంలో కూడా స్పష్టంగా 'ఇరుపక్షాలూ సాగించిన యుద్ధ నేరాల' గురించి వీడియో భాగాలు, వ్యాఖ్యానాలు కూడా ఉన్నాయి. అయితే అది ఇంగ్లిష్ సామ్రాజ్యవాదులు అధికారిక బిబిసి ఛానల్ కాబట్టి శ్రీలంక ప్రభుత్వంపైన ప్రధానంగా ఎక్కుపెట్టారు. సివిలియన్ పౌరులను అడ్డం పెట్టుకుని తమిళ పులులు ఎలా యుద్ధం చేశారో, వారిని చాటు చేసుకుని ఎలా ఫిరంగులు ప్రయోగించారో పేర్కొన్నారు. ఆ విధంగా పౌరులను యుద్ధంలో టార్గెట్‌లుగా చేశారు. బలిపెట్టారు. ఇందులో తమ అనుచరులే కాక ప్రజలూ ఉన్నారు. ఒకటి రెండు లక్షల మంది నిరాయుధులైన పౌరులు యుద్ధ చివరి దశలో శరణార్థులుగా తరలిపోవడానికి ప్రయత్నించగా వారిని అడ్డుకొని, బెదిరించి, వారిపై కాల్పులు జరిపిన సంఘటనలను కూడా అదే వీడియోలో చూపించారు. యు.ఎన్. రిపోర్ట్‌లో కూడా ఇలాంటి వాటిని పేర్కొన్నారు. ఈ వాస్తవాలను కప్పిపుచ్చి ఏవో కొన్ని 'విమర్శలు'గా పేర్కొనడం, 'అవి అప్రస్తుతం' అని మీరే తీర్పు చెప్పడం విడ్డూరం. ఇది ఆమోదించరానిది.

ఇలాంటి పక్షపాత, పాక్షిక వైఖరి వల్లనే రాష్ట్రంలోని, దేశంలోని పౌర, ప్రజాస్వామిక హక్కుల ఉద్యమాల విశ్వసనీయత బాగా దెబ్బతిన్నది. అయినా

అవి బతికి బట్టగడుతున్నాయంటే దానికి రెండు కారణాలున్నాయి. బాలగోపాల్ వంటి వారు ఆలస్యంగానైనా ఈ తప్పులను గుర్తించడం, మరోవైపు పోలీసు మిలిటరీ రాజ్యం చేస్తున్న మారణకాండతో ఇలాంటి నేరాలు సరితూగకపోవడం. అయితే ఇందులో ఇమిడి ఉన్న సూత్రబద్ధమైన అంశం ముఖ్యమైనది. దాన్ని కాదనే రీతిలో మీ సంపాదకీయం పాక్షిక దృష్టితో ఉంది. ఎల్.టి.టి.ఇ. ఏదో చిన్న సాయుధ ముఠా కాదు. రెండు దశాబ్దాలు విశాల ప్రాంతంలో పోటీ ప్రభుత్వం నడిపిన సాయుధ శక్తి. స్వంత నేవీ, విమాన దళం కూడా ఉన్న సైనిక శక్తి. ఒక దశలో ప్రభుత్వం కన్నా హెచ్చు బలగాలు శక్తి ఉన్న గ్రూపు. వారి చరిత్ర అంతా సివిలియన్ టార్గెట్లపై టెర్రరిస్టు దాడులతో, సివిలియన్ రాజకీయ నాయకుల హత్యలతో, వందలాది రాజకీయ ప్రత్యర్థుల హత్యాకాండతో నిండినది. వారి నేరాలు కొద్దిపాటివీ, అరుదైనవీ కాదు.

నేటి ప్రపంచ రాజకీయాలూ, అందులోని యుద్ధాలూ చాలా సంక్లిష్టమైనవి. వీటిలో అత్యధిక భాగం సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష పరోక్ష ప్రోద్బల సహకారాలతో సాగుతున్నాయి. స్వయంగా సామ్రాజ్యవాదులు సాగిస్తున్న దురాక్రమణ యుద్ధాలు సరే సరి. (ఇరాక్, అఫ్ఘనిస్తాన్ మొదలైనవి). ఆధునిక మారణాయుధాలున్న నేటి స్థితిలో ఏ యుద్ధమైనా భీకరమూ, దారుణమే. పేరుకి యుద్ధ సూత్రాలు, మానవ హక్కుల చట్టాలు ఉన్నా ఈ యుద్ధాలలో వాటి ఉల్లంఘనలు సర్వ సామాన్యం. జాతి, తెగల వైరుధ్యాలతో కూడిన యుద్ధాలు, అంతర్యుద్ధాలు మరీ దారుణం. ఆఫ్రికా ఖండంలోని అంతర్యుద్ధాలలో లక్షల మంది బలైనారు. బలవుతున్నారు. సూడాన్ దానికి తాజా ఉదాహరణ. యుగోస్లేవియా పతనానికి దారితీసిన అంతర్యుద్ధాలు అలాంటివే. తిమోర్, చెచెన్యా, కుర్దు యుద్ధాలూ దారుణ ఉదాహరణలే. ఇరుగు పొరుగుల మధ్య జరిగే ప్రాంతీయ యుద్ధాల్లో కూడా మారణకాండ సర్వ సామాన్యం. ఉదాహరణకు - ఇరాన్ - ఇరాక్, వియత్నాం - కంపూచియాల మధ్య సాగిన సుదీర్ఘ యుద్ధాల్లో పదుల లక్షల మంది చనిపోయారు. పాతికేళ్లుగా సాగిన శ్రీలంక అంతర్యుద్ధం కూడా అలాంటిదే.

ఈ యుద్ధాలను కేవలం మానవత్వ విలువల కోణంలోనే చూడడం ఒక ఎత్తు.' రాజకీయ కోణం మరో ఎత్తు. ఈ రెండో కోణంలో చూసినప్పుడు విచక్షణా దృష్టి అవసరం. ఈ యుద్ధాల్లో సామ్రాజ్యవాదుల పాత్ర, ప్రయోజనాలు ఏమిటి అన్నది కీలకాంశం. ఇలాంటి విచక్షణా దృష్టి లేకుండా రాసిన సంపాదకీయం ఇది. అలాగని రాజకీయాలు లేకుండా మానవత్వ, పేసిఫిస్టు కోణం నుంచి రాసినది కాదు. సామ్రాజ్యవాదుల ప్రచారానికి లోబడిన రాజకీయాలతో ఉన్న వ్యాఖ్య ఇది. పైన పేర్కొన్న యుద్ధాలతో పోలిస్తే శ్రీలంక అంతర్యుద్ధం బహుశా అన్నింటికన్నా తక్కువ. మరణాలతో, దారుణాలతో సాగిన యుద్ధమేమో. సామ్రాజ్యవాదుల ఇరాక్, అఫ్ఘాన్ దురాక్రమణ యుద్ధాలతో పోలిస్తే లెక్కలోకే రాదు. శ్రీలంక యుద్ధంలో ప్రత్యేకత ఏమిటి? ప్రాంతీయ ఆధిపత్య వాది, విస్తరణవాది అయిన భారత ప్రభుత్వపు ద్వంద్వ పాత్ర. నేటి దాకా కొనసాగుతున్న డబుల్ గేమ్ - చాలా కాలం ఎల్.టి.టి.ఇ ని పెంచి పోషించిన భారత ప్రభుత్వం ఈ యుద్ధానికి గత పాతికేళ్లుగా ఆర్థిక, రాజకీయ, సైనిక, నైతిక, వ్యూహాత్మక రూపాల్లో ఆజ్యం పోసింది. చిన్న, పేద పొరుగు దేశాన్ని కుక్కలు చించిన విస్తరిలా చేసింది. వీరందరినీ వదిలి, రాజపక్సేనే 21వ శతాబ్దపు హిట్లర్‌గా ఎంచి పేర్కొనడం ఇంగితం, సంయమనం, సెన్స్ ఆఫ్ బ్యాలెన్స్, సెన్స్ ఆఫ్ ప్రపోర్షన్ లేని రాతగా చెప్పాల్సి వస్తుంది. సామ్రాజ్యవాదులకు సంతోషాన్నిచ్చే ఇలాంటి వ్యాఖ్య 'వీక్షణం' సంపాదకీయంగా రావడం విచారించ దగినది. ఈ వైఖరి వర్తమాన ప్రపంచ రాజకీయాలలో తప్పుడు ధోరణులకు ఉదాహరణ.

శ్రీలంకలో భారత్ ద్వంద్వ పాత్రకి నిదర్శనం, ఆ తర్వాతి అనేక పరిణామాలకు మూలం - ఇండో - శ్రీలంక ఒడంబడిక (1987). ఎల్.టి.టి.ఇ ని పెంచి పోషించిన శక్తి భారత ప్రభుత్వమే. 1980ల చివరి నాటికి కనీసం ఐదు వేల మంది తమిళ మిలిటెంట్లకు సాయుధ శిక్షణ భారత ప్రభుత్వం ఇచ్చింది. (భారత గూఢచారి వర్గాలను ఉటంకిస్తూ స్టేట్స్‌మెన్ - కలకత్తా - వార్త, ఇండియా టుడే 31, మార్చ్ 1984. ఇంకా అనేక రిపోర్టులు.) శ్రీలంక సైన్యం కన్నా రాశిలో వాశిలో మించిన ఎల్.టి.టి.ఇ ని ఎదుర్కోవడానికి శ్రీలంక విఫల ప్రయత్నాలు చేసింది. రష్యా, అమెరికా, యూరప్ దేశాలను సాయం అడిగితే ఎవరూ ముందుకు రాలేదని, ఆ దశలో భారత్‌తోనే ఒడంబడిక చేసుకోవలసి వచ్చిందని జయవర్దనే వివరించాడు. (హిందూ - 10 ఆగస్ట్ 1987, ఇంటర్వ్యూ). ఈ అగ్రరాజ్యాలన్నీ శ్రీలంకను భారత ఆధిపత్యానికి లోబడి ఉండాలని కోరుతున్నాయని, దాని ఫలితమే ఒడంబడిక అని స్పష్టం చేశారు. ఈ విధంగా భారత ప్రాంతీయ ఆధిపత్యం అగ్ర రాజ్యాల ప్రపంచ వ్యూహానికి ముడిపడినది, లోబడినది అని స్పష్టమైనది. ఇలాంటి వ్యూహాలలో భాగంగానే - ఒక దశలో దాదాపు లక్ష మంది - భారత సైనికులు ఐ.పి.కె.ఎఫ్. పేరిట శ్రీలంకలో ప్రవేశించి దురాక్రమణకు, మానభంగాలకు దౌర్జన్యాలకు పాల్పడినారు. (అమెరికాకి వియత్నాంలో ఎదురైన స్థితి వంటిది ఏర్పడిన పర్యవసానంగా చివరికి భారత సైన్యాలు వెనక్కి రావలసి వచ్చింది - 1990 ప్రారంభంలో).

ఎల్.టి.టి.ఇ. తన సైన్యాన్ని బలీయం చేసుకుంది. నేవీనీ, విమానాలనూ సమకూర్చుకున్నది. తాను మిలిటరీ పరంగా ఇరుకున పడ్డప్పుడల్లా పెద్ద రాజ్యాల దౌత్య సహకారంతో యుద్ధ విరమణలు చేయించి ఊపిరి పీల్చుకున్నది. ఇలాంటి స్థితే ఈలం వార్ - నాల్గవ దశలో కూడా ఏర్పడింది. ఈ స్థితిలో శ్రీలంక ప్రభుత్వం మిలిటరీ సాయం కోరగా భారత్ ఇవ్వ నిరాకరించింది. ఇతర దేశాల సాయం పొందడానికి ప్రయత్నిస్తే బాహాటంగా అడ్డు పడింది. భారత భద్రతా వ్యవహారాల సలహాదారు ఎం.కె. నారాయణన్ బహిరంగ ప్రకటన తెల్సిందే. అందువల్ల 'శ్రీలంక ప్రభుత్వం భారత్ సహాయంతో' మారణకాండను జరిపిందనడం పూర్తి నిజం కాదు. ఈ సందర్భంలో ఉన్నది ద్వంద్వ పాత్ర. పాశ్చాత్య దేశాలు సంక్షోభంలో చిక్కుకున్న నేపథ్యంలో భారత్ వారితో పూర్తిగా అంటకాగడానికి సిద్ధంగా లేదు. దక్షిణాసియాలో తన పెత్తనానికోసం భిన్నమైన ఎత్తుగడలను అనుసరిస్తున్నది. మానవ హక్కుల పేరిట అంతర్జాతీయ కక్ర పెత్తనంని స్వప్రయోజనాలతో వ్యతిరేకిస్తున్నది.

ప్రపంచ రాజకీయాలు నానాటికీ సంక్లిష్టంగా తయారవుతున్నాయి. ఇలాంటి స్థితిలో చివరికి శ్రీలంక భారత్‌ని, ఇతర బడా రాజ్యాలను ధిక్కరించి, ఇతర దేశాల సాయం పొందింది. టెర్రరిజానికి వ్యతిరేకంగా పోరాటం - అన్న వాతావరణాన్ని ఉపయోగించుకుని ఎల్.టి.టి.ఇ ని ఓడించింది. మారిన పరిస్థితుల్లో ఎల్.టి.టి.ఇ ని వారు నమ్ముకొన్న ఆధిపత్యవాదులే నట్టేట ముంచారు. శ్రీలంక యుద్ధంలో ఇరు పక్షాలూ జాతీయ ఉన్మాదంతో అంతర్ యుద్ధానికి పాల్పడినాయి. రాజీకి తావున్నా కాదని, ఆధిపత్యవాదుల కబంధ హస్తాల్లో చిక్కుకుపోయారు. ఇందులో ప్రధాన బాధ్యత తమిళ ఉన్మాదులది, వారిని పెంచి పోషించిన భారత్‌ది. శ్రీలంకది కాదు. నేటికీ కొలంబో జనాభాలో ముప్పై శాతం దాకా తమిళులుండ గల్గుతున్నారు. వారిలో మంచి స్థితిలో ఉన్న వారూ చాలా మందే ఉన్నారు. వారి మధ్య జాతీయోన్మాద ఘర్షణల నివారణ అవసరం. అందువల్ల ఇవాళైనా కావలసింది ఇరుపక్షాలూ రాజీకి రావడమే. విదేశీ జోక్యం ఇక లేకుండా చూసుకోవడమే. అలాటి దానికి ఆటంకంగా సాగుతున్న ప్రయత్నాలలో భాగమే ఈ వీడియో, శ్రీలంకను వేధించాలనే ప్రయత్నాలూ.

'పలెత్తు మాట అనలేదు' అన్నమాట నేటి భారత్‌కి వర్తించదు. ఐరాసలో పాత్ర ఒక రకం అయితే, దేశంలోనూ, మీడియా ద్వారానూ భారత్ నిర్వహిస్తున్న పాత్ర మరో రకంగా ఉంది. ఇలాంటి ద్వంద్వ పాత్రలో భాగంగానే తమిళనాడు అసెంబ్లీ శ్రీలంకపై ఆంక్షలు విధించాలని ఏకగ్రీవ తీర్మానం చేసింది. విదేశాంగ విధానంపై తీర్మానం ఇది. అసెంబ్లీ ఇలాటి తీర్మానం చేయడం ఒక ఉల్లంఘన ఎల్.టి.టి.ఇ. ని తీవ్రంగా వ్యతిరేకించిన జయలలిత ప్రభుత్వం గెలిచిన వెంటనే చేసిన పని ఇది. గతంలో కూడా ఆ రాష్ట్ర ప్రభుత్వం, అసెంబ్లీ ఇలాటివి చేసి, ఆ తర్వాత కేంద్రం సూచనల మేరకే చేసామని చెప్పుకున్నదని గమనించాలి. ఈ జోక్యందారీ విధానంని వ్యతిరేకించాలి. వీ

## కేంద్ర మంత్రి వర్గ విస్తరణ

ప్రధాన మంత్రి కేంద్ర మంత్రి వర్గాన్ని పునర్వ్యవస్థీకరించారు. ఇందులో ఎనిమిది మందిని కొత్తగా మంత్రి వర్గంలోకి తీసుకున్నారు. పది మంది శాఖలు మార్చారు. ఏడుగురు మంత్రులను తొలగించారు. కొత్తగా మంత్రి వర్గంలోకి వచ్చిన ఎనిమిది మందితో పాటు కేబినెట్ మంత్రులుగా పదోన్నతులు పొందిన ముగ్గురు మంత్రులతో రాష్ట్రపతి ప్రతిభా పాటిల్ జూలై 12న రాష్ట్రపతి భవన్‌లో ప్రమాణ స్వీకారం చేయించారు.

## ముంబైలో పేలుళ్లు

దేశ ఆర్థిక రాజధాని ముంబైలో జూలై 13న జరిగిన బాంబు పేలుళ్లలో జూలై 24 నాటికి 24 మంది మరణించగా 141 మంది తీవ్ర గాయాలయ్యాయి. ముంబైలోని జవేరీ బజార్‌లో సాయంత్రం 6.50కి, ఒపెరాహౌస్ ప్రాంతంలో 6.51కి, దాదర్‌లో 7.04కి పేలుళ్లు జరిగాయి. రెండు దశాబ్దాల కాలంలో 1993 నుంచి ఇప్పటి వరకు జరిగిన ముంబైలో బాంబు పేలుళ్లలో ఇది ఏడవది. (జూలై 13న జరిగిన పేలుళ్లతో మరణించిన వారి మొత్తం సంఖ్య 687.)

## పోలీసులపై సిబిఐ కేసు

గుజరాత్ పోలీసులు 2003 జనవరి 13న ఎన్‌కౌంటర్‌లో సాదిక్ జమాల్ మెహ్తర్‌ను కాల్చిచంపారు. సాదిక్‌ది బూటకపు ఎన్‌కౌంటర్ అని పేర్కొంటూ ఆయన సోదరుడు రాష్ట్ర హైకోర్టులో కేసు వేసారు. ఈ కేసులో విచారణ జరపాలన్న గుజరాత్ హైకోర్టు ఆదేశాల మేరకు సిబిఐ గుజరాత్, మహారాష్ట్ర పోలీసులపై కేసు నమోదు చేసింది. కేసును విచారించిన జస్టిస్ ఎం.ఆర్. షా ఈ కేసును దర్యాప్తు చేసి 6 నెలల్లో నివేదిక ఇవ్వాలని సిబిఐని జూలై 16న ఆదేశాలు జారీచేశారు.

## గుర్ఖాలాండ్‌లో ప్రాదేశిక పరిపాలన

గూర్ఖాలాండ్ ప్రత్యేక రాష్ట్రం కోసం పోరాడిన గూర్ఖాలాండ్ జన ముక్తి మోర్చా (జిజెఎం) తాత్కాలికంగా ప్రాదేశిక పరిపాలన ఒప్పందాన్ని కుదుర్చుకుంది. జూలై 17న పింటాయల్ అనే కు గ్రామంలో కేంద్ర హోంమంత్రి చిదంబరం, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి మమతా బెనర్జీ, జిజెఎం నాయకుడు బిమల్ గురుంగ్‌ల సమక్షంలో త్రైపాక్షిక ఒప్పందం కుదిరింది. 16 పేజీల 'గూర్ఖాలాండ్ ప్రాదేశిక పరిపాలన' ఒప్పందంపై రాష్ట్ర ప్రభుత్వ హోం కార్యదర్శి, కేంద్ర హోం శాఖ సంయుక్త కార్యదర్శి, జి.జె.ఎం. ప్రధాన కార్యదర్శులు సంతకాలు చేశారు.

## గుజరాత్ సర్కార్‌ను కుదుపుతున్న గనులు

ముఖ్యమంత్రి యద్యూరప్పపై గనుల అక్రమాలకు ఆధారాలు ఉన్నాయని కర్ణాటక లోకాయుక్త, సుప్రీం కోర్టు మాజీ న్యాయమూర్తి సంతోష్ ఎస్. హెగ్డే తేల్చి చెప్పారు. 2009 మార్చి నుంచి 2010 మే వరకు రు. 1800 కోట్లకు పైగా ప్రభుత్వ ఖజానాకు నష్టం వాటిల్లింది. ముఖ్యమంత్రి, మంత్రులు, గనుల తవ్వకందార్లపై తగిన ఆధారాలతోనే నివేదిక ఇచ్చారు. బళ్లారి గనుల్లో మాఫియా తరహా పరిస్థితి నెలకొందని వివరించారు.

## మహిళా రిజర్వేషన్ శాతం పెంపు

పంచాయతీ రాజ్ సంస్థలలో ఎస్సీ, ఎస్టీ మహిళల రిజర్వేషన్ శాతం పెంపుకు ఉద్దేశించిన రాజ్యాంగ సవరణ బిల్లును స్వల్ప మార్పులతో కేంద్ర క్యాబినెట్ జూలై 21న ఆమోదం తెలిపింది. ప్రధాని మన్మోహన్ సింగ్ అధ్యక్షతన సమావేశమైన మంత్రివర్గం నిర్ణయించినట్లు సమాచార, ప్రసార శాఖ మంత్రి అంబికాసోనీ విలేకరులకు తెలిపారు. ఎస్.సి., ఎస్.టి.ల ప్రాతినిధ్యం మరింత పెరిగేందుకు తోడ్పడుతుందన్నారు. ఈ అధికారిక సవరణతో బిల్లును వీలైనంత త్వరగా లోక్‌సభలో ప్రవేశపెడతామని ప్రకటించారు. ప్రత్యక్ష ఎన్నికల ద్వారా భర్తీ అయ్యే సీట్లు, ఛైర్‌పర్సన్ల పదవులతో పాటు ఎస్.సి., ఎస్.టి.లకు రిజర్వు చేసిన సీట్లు, ఛైర్‌పర్సన్ల పదవులకూ ఇది వర్తిస్తుందని ఆమె తెలిపారు.

## స్విస్ బ్యాంకుల్లో 11 లక్షల కోట్లు

స్విస్ బ్యాంకుల్లో భారతీయులు దాచుకున్న సంపద విలువ2008లో రు. 13.35 లక్షల కోట్లు ఉన్న సొమ్ము 2010 నాటికి 11.12 లక్షల కోట్ల రూపాయలకు చేరుకుంది. ఈ విషయాన్ని స్విస్ నేషనల్ బ్యాంకు అధికార ప్రతినిధి వాల్టర్ మీయర్ తెలిపారు. విదేశీ బ్యాంకుల్లో ఉన్న నల్లధనం ఇక రాదనీ, నల్లధనంకు సంబంధించిన చట్టాలు కొత్త అకౌంట్‌లకు మాత్రమే వర్తిస్తాయనీ, ఇప్పటికే ఉన్న నల్లధనం గురించిన సమాచారం తెలిసినా ఏమీ చేయలేమనీ భారత ప్రభుత్వ ఆర్థిక కార్యదర్శి అన్నారు. ఈ సమాచారం వెల్లడిస్తే ఆయా దేశాలతో ఉన్న ద్వైపాక్షిక ఒప్పందాలకు విఘాతం కలుగుతుందని ఆయన అన్నారు.

## ఎస్.పి.ఒ. ల నియామకం ఆపండి

మావోయిస్టు వ్యతిరేక పోరులో స్థానికంగా ఉండే ఆదివాసులకు ఆయుధాలిచ్చి సల్వాజుడుం, కోయ కంమెండోల పేరుతో సాయుధ బలగాన్ని 'స్పెషల్ పోలీస్ ఆఫీసర్స్' (ఎస్.పి.ఒ.) గా వినియోగించడం రాజ్యాంగ విరుద్ధమని దేశ సర్వోన్నత న్యాయస్థానం తేల్చి చెప్పింది. అలాంటి 'ప్రత్యేక విధానాలకు' ఛత్తీస్‌గఢ్, కేంద్ర ప్రభుత్వాలు స్వస్తి చెప్పాలని జస్టిస్ బి. సుదర్శన్ రెడ్డి, జస్టిస్ ఎస్ఎస్ నిజ్జార్‌లతో కూడిన ధర్మాసనం జూలై 5న ఆదేశించింది. ప్రముఖ సామాజికవేత్త నందిని సుందర్, చరిత్రకారుడు రామచంద్ర గుహ, మాజీ కేంద్ర ప్రభుత్వ అధికారి ఇఎఎస్. శర్మ తదితరులు దాఖలు చేసిన పిటిషన్‌పై ఈ ఆదేశాలు జారీచేసింది.

## వేదాంత కలుషితాలు

ఒడిశాలోని వేదాంత అల్యూమినియం కర్మాగారం నుండి వస్తున్న వ్యర్థాలను వంశధార నదిలోకి వదులుతోంది. విషరసాయనాలు, భార లోహాలతో నదీ జలాలు కలుషితమవుతున్నాయి. దీని ప్రభావం వల్ల వంశధార తీర గ్రామాలైన ఒడిశాలోని లాంజీఘడ్, బుందేల్, బసంత్‌పడ, కలహండితో పాటు, శ్రీకాకుళం జిల్లాలో వేలాది మంది అనారోగ్యం పాలవుతున్నారు. దీంతో తాగు నీరు, సాగు నీటికి ముప్పు ఏర్పడింది.

## పోస్కోను వ్యతిరేకిస్తున్న రైతులు

పోస్కో స్టీల్ కంపెనీకి వ్యతిరేకంగా ఒడిశాలో పెద్ద ఎత్తున ప్రజలు ప్రతిఘటన తెలుపుతున్నారు. పోస్కో ప్రతిరోధ్ సంగ్రామ్ సమితి ఆధ్వర్యంలో ప్రజలు ఉద్యమం చేస్తున్నారు. అలాగే కర్ణాటకలోని గదగ్ జిల్లా హళ్లిగుడి గ్రామంలో పోస్కో కంపెనీ తలపెట్టిన స్టీల్ ప్లాంట్‌కు ప్రజల నుంచి వ్యతిరేకత వస్తోంది. తమ భూముల్లోకి కంపెనీ వాళ్లను అడుగుపెట్ట నీయమని ప్రజలు తెగేసి చెప్పారు. కంపెనీ వాళ్లు రాకుండా రహదారికి అడ్డంగా గ్రామ ప్రజలంతా పిల్లలతో సహా అడ్డంగా పడుకొని నిరసన తెలిపారు. వీ

## ఐరాస చీఫ్‌గా బాన్‌కీ మూన్

ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శిగా బాన్‌కీ మూన్ మరోసారి ఎన్నికయ్యారు. ఐదేళ్లపాటు ఆయన ఈ పదవిలో కొనసాగుతారు. 2012 జనవరి 1 నుంచి రెండో విడత పదవీ కాలం మొదలవుతుంది. 192 సభ్య దేశాలున్న సర్వప్రతినిధి సభ బాన్‌కీ మూన్ అభ్యర్థిత్వాన్ని జూన్ 21న ఏకగ్రీవంగా మద్దతు తెలిపింది. రెండోసారి తనకు ఈ అవకాశం ఇచ్చినందుకు గౌరవంగా భావిస్తున్నట్లు మూన్ తెలిపారు.

## ప్రపంచ పటంపై కొత్త దేశం

ప్రపంచంలో కొత్తగా 193వ దేశంగా దక్షిణ సూడాన్ ఆవిర్భవించింది. జూలై 9న సూడాన్ ఉత్తర సూడాన్, దక్షిణ సూడాన్‌గా చీలిపోయింది. అర్ధ శతాబ్దం పాటు ఉత్తర సూడాన్‌తో సాగిన అంతర్యుద్ధంలో సుమారు ఇరవై లక్షల మందికి పైగా ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. దక్షిణ సూడాన్‌లో ఉన్న చమురు నిక్షేపాలే అంతర్గత యుద్ధానికి ప్రధాన కారణం. అయినా దక్షిణ సూడాన్ ప్రపంచంలోకెల్లా పేద దేశాల్లో ఒకటిగా ఉంది. అక్కడి అక్షరాస్యత కేవలం 15 శాతమే. దక్షిణ సూడాన్ నూతన దేశాధ్యక్షుడు సాల్వా కీర్ మయార్‌డిట్.

## పాకిస్థాన్ విదేశాంగ మంత్రిగా మహిళ

పాకిస్థాన్‌లో తొలిసారిగా విదేశాంగ మంత్రిగా మహిళను ఎన్నుకొన్నారు. విదేశాంగ శాఖ సహాయ మంత్రిగా బాధ్యతలు నిర్వహిస్తున్న హినా రబ్బానీ ఖర్‌ను పూర్తిస్థాయి మంత్రిగా నియమించేందుకు పాకిస్థాన్ ప్రధాని యూసుఫ్ రజా గిలానీ ఆమోదం తెలిపారు. ముప్పై నాలుగేళ్ల అతిచిన్న వయసులోనే హినా విదేశాంగ మంత్రిగా జూలై 19న ప్రమాణ స్వీకారం చేశారు. పాకిస్థాన్ సీనియర్ రాజకీయ నాయకుడు నూర్ రబ్బానీ కూతురైన హినా రబ్బానీ ముషార్రఫ్ హయాంలో పిఎంఎల్-క్యు పార్టీ సభ్యురాలిగా ఉన్నారు. 2008లో అధికార పాకిస్థాన్ పీపుల్స్ పార్టీలో చేరారు.

## ఖైదీల నిరాహార దీక్ష

అమెరికా జైళ్లలోని అమానవీయ పరిస్థితులకు నిరసనగా ఖైదీలు నిరాహార దీక్ష చేపట్టారు. కాలిఫోర్నియాలోని క్రిసెంట్ నగరంలో పెలికాన్ బే రాష్ట్ర కారాగారంలో ఖైదీల పట్ల జైలు అధికారుల తీరుపై ఖైదీలు తీవ్ర నిరసన తెలుపుతున్నారు. తొమ్మిది జైళ్లకు చెందిన 2100 మంది ఈ నిరసనలో పాల్గొంటున్నారు. ఖైదీలను క్రూరంగా హింసించడంతో పాటు, మనుషులు ఉండలేని పరిస్థితుల్లో ఉంచుతున్నారనీ, చీకటి గదుల్లో ఒంటరిగా ఏళ్లపాటు ఉంచుతున్నారనీ తెలిపారు.

## ఈజిప్ట్‌లో మళ్లీ నిరసనలు

ఈజిప్ట్‌లో మాజీ అధికారులపై బహిరంగంగా, సక్రమంగా విచారణ జరపాలని, మరిన్ని సంస్కరణలు చేపట్టాలని డిమాండ్ చేస్తూ రాజధాని కైరోలోని తెహ్రీర్ స్క్వేర్‌లో జూలై 8న వేలాది ప్రజలు ప్రదర్శనలు చేశారు. రాజధానిలోనే కాకుండా ఈజిప్ట్ ఇతర నగరాలలో కూడా నిరసన ప్రదర్శనలు మొదలయ్యాయి. ఈ సంవత్సరం ప్రారంభంలో జరిగిన తిరుగుబాటు సందర్భంగా నిరసనకారులను చంపిన మాజీ అధికారులపైనా, పోలీసు అధికారులపైనా బహిరంగంగా విచారించాలనీ, పోలీసు స్టేషన్లను ప్రక్షాళన చేయాలనీ, మసీదు ఇమామ్‌లు సాయుధ దళాల అత్యున్నత మండలికి డిమాండ్ చేశారు. ఈ నిరసనలో ముస్లిం బ్రదర్‌హుడ్‌తో సహా ఇరవైకి పైగా రాజకీయ పార్టీలు, గ్రూపులు పాల్గొన్నాయి.

## దక్షిణాఫ్రికాలో కార్మికుల సమ్మె

దక్షిణాఫ్రికాలో చమురురంగ కార్మికులు సమ్మెకు పిలుపునిచ్చారు. రసాయనాలు, ఇంధనం, కాగితం, అలైడ్ వర్కర్స్ యూనియన్ (సి.ఇ.పి.పి.డబ్ల్యూ.ఎ.డబ్ల్యూ.యు.) కు చెందిన డెబ్బై వేల మంది కార్మికులు ఈ సమ్మెలో పాల్గొంటున్నారు. 13 శాతం వేతన పెంపుదలను డిమాండ్ చేస్తూ సి.ఇ.పి.పి.డబ్ల్యూ.ఎ.డబ్ల్యూ.యు. జూలై 11న సమ్మెకు పిలుపునిచ్చింది. దీంతో దేశంలో అనేక పెట్రోల్ బంకులు, గ్యాస్ స్టేషన్లు మూతపడ్డాయి. ఆరువేల మంది నిపుణులైన కార్మికులకు ప్రాతినిధ్యం వహిస్తున్న సాలిడారిటీ యూనియన్‌తో సహా చిన్న చిన్న సంఘాలు కూడా ఈ సమ్మెలో చేరుతున్నాయి.

## 'న్యూస్ ఆఫ్ ది వరల్డ్' పత్రిక మూసివేత

బ్రిటన్‌లో అత్యధిక జనాదరణ పొందిన, 168 ఏళ్ల చరిత్ర కలిగిన పత్రిక 'న్యూస్ ఆఫ్ ది వరల్డ్' జూలై 10న తన ప్రస్థానాన్ని ముగించింది. చివరి సంచిక ముఖచిత్రం మీద 'థాంక్యూ అండ్ గుడ్‌బై' అన్న శీర్షికతో పాఠకులకు వీడ్కోలు పలికింది. ఈ కంపెనీ యజమాని రూపర్ట్ మర్డాక్. బ్రిటన్ ప్రధాని డేవిడ్ కామెరాన్‌కు అత్యంత సన్నిహితుడు. 1969లో ఈ పత్రికను మర్డాక్ కొనుగోలు చేశారు. అనేక మార్పులు, చేర్పులు చేయడం ద్వారా అతి తక్కువ కాలంలోనే బ్రిటన్‌లో జనాదారణను ఈ పత్రిక సొంతం చేసుకుంది. అయితే, ప్రైవేట్ వ్యక్తులు, రాజకీయ నాయకుల, సెలబ్రిటీల వ్యక్తిగత జీవిత రహస్యాలు సంచలనం చేసి ప్రచురించడం, ఫోన్ హ్యాకింగ్ వంటి చర్యల వల్ల అభాసు పాలయింది. భారీ అవినీతికి పాల్పడిన నేరారోపణ కూడా ఉండడంతో తప్పనిసరి పరిస్థితుల్లో పత్రికను మూసేయడానికి నిర్ణయించారు.

## ఆస్లోలో మారణహోమం

జూలై 22న నార్వే రాజధాని ఆస్లోలో ప్రధానమంత్రి కార్యాలయం సహా పలు ప్రభుత్వ కార్యాలయాలు ఉన్న ఇరవై అంతస్తుల భవనంలో భారీ బాంబు పేలుడు సంభవించింది. ఈ సంఘటనలో ఏడుగురు మరణించారు. ఆ తరువాత ఆస్లో సమీపంలోని ఉటోయియా ద్వీపంలో జరుగుతున్న యువసమ్మేళనంపై ఓ యువకుడు జరిపిన కాల్పుల్లో 85 మంది చనిపోయారు. ఈ రెండు సంఘటనలకు బాధ్యుడుగా ఆండర్స్ బెహ్రింగ్ బ్రెయివిక్ ప్రకటించుకున్నాడు.

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 జూన్ 2011 నుండి 20 జూలై 2011 వరకు 16 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య - 1720)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 5 | - | 20 | 22 | 4 | 3 | 3 | 1 | 2 | 1 | 1 | 1 | 2 | 18 | 24 | - | - | - | 1 | - |
| హైదరాబాద్ | - | - | - | 14 | 12 | - | - | - | 2 | 9 | 3 | 11 | - | 9 | 41 | 18 | - | - | - | 8 | - |
| కరీంనగర్ | - | 3 | 2 | 23 | 40 | 9 | 24 | - | 1 | 7 | 5 | 3 | 4 | 15 | 22 | 35 | - | - | - | 8 | 2 |
| ఖమ్మం | - | 1 | - | 9 | 2 | 1 | 5 | 1 | - | 4 | 6 | 9 | 1 | 4 | 29 | 11 | - | - | - | - | - |
| మహబూబ్‌నగర్ | - | 9 | - | 14 | 15 | 9 | 9 | 4 | 4 | 4 | 4 | 10 | 33 | 11 | 34 | 3 | - | - | - | - | 1 |
| మెదక్ | - | 2 | - | 3 | 7 | 5 | 2 | - | - | 3 | 6 | 2 | 4 | 10 | 25 | 23 | - | - | - | - | 4 |
| నల్గొండ | - | 2 | - | 19 | 13 | 1 | 1 | - | 2 | 6 | - | 3 | 5 | 9 | 42 | 28 | - | - | - | 3 | - |
| నిజామాబాద్ | - | - | - | 10 | 21 | 1 | 1 | 1 | 1 | 5 | 4 | 7 | 2 | 5 | 25 | 19 | - | - | - | - | - |
| వరంగల్ | - | 2 | 3 | 5 | 6 | 8 | 6 | 5 | 1 | - | - | 1 | 1 | 9 | 12 | 8 | - | - | - | - | 5 |
| అనంతపూర్ | 2 | 10 | 1 | 6 | 4 | 7 | 5 | 1 | 3 | 5 | 2 | 6 | 2 | 1 | 26 | - | - | - | - | - | - |
| చిత్తూరు | - | - | - | 13 | 15 | 1 | 1 | - | 2 | 3 | 24 | 11 | 5 | - | 41 | 13 | - | - | - | - | - |
| గుంటూరు | - | 3 | - | 7 | 7 | - | 1 | - | 1 | 3 | 7 | 11 | - | - | 17 | 10 | - | - | - | - | - |
| నెల్లూరు | - | - | - | 2 | 3 | - | - | - | - | 2 | 1 | - | 1 | 1 | 26 | 12 | - | - | - | - | - |
| ప్రకాశం | - | 7 | 5 | 8 | 10 | 12 | 15 | - | 5 | 7 | - | 6 | - | 3 | 37 | - | - | - | - | - | - |
| కర్నూలు | - | 3 | - | 13 | 14 | 3 | 9 | 4 | 3 | 4 | 7 | 11 | 2 | 5 | 30 | 30 | - | - | - | - | - |
| విజయనగరం | - | - | - | 2 | 4 | [illegible] | 3 | 3 | 2 | 5 | 1 | 2 | 13 | 8 | - | - | - | - | - | - | 5 |
| **మొత్తం** | **3** | **47** | **11** | **168** | **195** | **65** | **85** | **22** | **28** | **69** | **71** | **94** | **74** | **92** | **425** | **234** | **-** | **-** | **-** | **20** | **17** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ - డి. విజయభాస్కర్; కరీంనగర్ - ఎల్. సంతోష; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ - గౌడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ - ఎం. నర్సయ్య; రంగారెడ్డి - ఎస్. శంకరయ్య; వరంగల్ - ఎ.కుమార్; అనంతపూర్ - కె. నాగేశ్వరచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - దస్తగిరి; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు - బి. అంజమ్మ ; నెల్లూరు - బాలగురువయ్య; శ్రీకాకుళం - జి. సుధీర్; ప్రకాశం - ఎల్. సాంబశివరావు, విజయనగరం - డి. సుధాకర్

# వీక్షణం చదవండి! చదివించండి! చందాదారులు కండి!

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు తొమ్మిది సంవత్సరాలుగా మీరు అందిస్తున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు. మీ నిత్యజీవితంలో, కుటుంబ సభ్యులతో, పని స్థలంలో, స్నేహితులతో, భిన్నాభిప్రాయాలున్న వారితో మాట్లాడుతున్న ప్రతి సందర్భంలోనూ వీక్షణంలోని వ్యాసాలు, అభిప్రాయాలు మీకు ఉపయోగపడతూనే ఉన్నాయి. ఈ పత్రిక నిలదొక్కుకుని పది కాలాలపాటు నిలబడాలని మీరు కోరుకుంటున్నారని మాకు తెలుసు. తెలుగు సమాజానికి అవసరమయిన విభిన్న ఆలోచనలను అందించే పత్రికగా వీక్షణం ఇంకా విస్తరించాలని కూడా మీరు కోరుకుంటూ ఉంటారు. కాని, వీక్షణం ఆర్థిక పరిస్థితి సుస్థిరంగా లేదు. వీక్షణంను నిలబెట్టడానికి మీ వంతుగా పూనుకుని అందించవలసిన సహకారం..

❖ మీ బంధుమిత్రుల దగ్గర, మీ పనిస్థలంలో, మీరు మాట్లాడే ప్రతిచోటా, సామాజిక రాజకీయ విషయాల చర్చ వచ్చిన ప్రతిచోట ఆ విషయాల మీద వీక్షణం అవగాహన కలిగిస్తుందని ప్రస్తావించండి. వీక్షణం చదవడం ఎంత అవసరమో చెప్పండి. ❖ మీ చందా చెల్లించడంతోపాటు, మీ మిత్రుల కొరకు కానుకగా చందా చెల్లించండి. వారిని చందా చెల్లించమని కోరండి. ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న గ్రంథాలయానికి వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని తెప్పించడానికి ప్రయత్నాలు చేయండి. ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న విద్యాలయాలలో, కళాశాలలో, ముఖ్యమైన ప్రభుత్వ, ప్రభుత్వేతర కార్యాలయాలలో, స్వచ్ఛంద సంస్థల, యువజన సంస్థల కార్యాలయాలలో వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని వారిచేత చందాలు కట్టించండి. ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న వీక్షణం శ్రేయోభిలాషులు, విద్యా సంస్థల నిర్వాహకులు, వ్యాపారవేత్తల దగ్గర వీక్షణంకు ప్రకటనలు సేకరించండి. ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న పత్రికల ఏజెంటు వీక్షణం తెప్పిస్తున్నారో లేదో కనుక్కుని తెప్పించేలా చూడండి.

## చందా వివరాలు

| | సంస్థలకు/లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

వీక్షణంకు రాష్ట్రంలోనేకాదు, దేశమంతటా, విదేశాలలోనూ విస్తృతంగా పాఠకులున్నారు. మేధావులు, విద్యార్థులు, పరిశోధకులు, ఉపాధ్యాయులు, పత్రికా రచయితలు, ఉద్యమాల కార్యకర్తలు, సామాజిక, రాజకీయ కార్యకర్తలు, నాయకులు, విధానకర్తలు... ఒకరేమిటి తెలుగు సమాజంలో ప్రభావశీల వ్యక్తులందరికీ కరదీపిక వీక్షణం మరి మీ ప్రకటన ప్రపంచానికి చేరాలంటే..

## వీక్షణంలో ప్రకటనల ధరలు

| | |
|---|---|
| చివరి కవర్ (కలర్‌లో పూర్తి పేజీ) | రు. 40,000 |
| రెండవ కవర్ (కలర్‌లో పూర్తి పేజీ) | రు. 25,000 |
| మూడవ కవర్ (కలర్‌లో పూర్తి పేజీ) | రు. 25,000 |
| లోపలి పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో పూర్తి పేజీ) | రు. 20,000 |
| లోపలి పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో అర పేజీ) | రు. 10,000 |
| లోపలి పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో పావు పేజీ) | రు. 5,000 |

వీక్షణం అకౌంట్ నెంబర్ - 013911011002175, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**

veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

KLVADSM108

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 121 - August 2011 ISSN 2231-6892
RNI Regn.No.APTEL/2003/11482 Published on 29/07/2011 Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణంకు చేయూతనివ్వండి...

మీ ఆదరాభిమానాలతో త్వరలో పదో సంవత్సరంలో అడుగుపెడుతున్న వీక్షణం మీరు మరింత సహాయం అందించకపోతే ఎక్కువకాలం నడవడం కష్టం...

ఔను, వీక్షణం నష్టాలతో నడుస్తున్నదని, ఉత్పత్తి వ్యయం కూడ తిరిగి రావడం లేదని, ఆర్థిక పరిస్థితి నానాటికీ క్షీణిస్తున్నదని గత కొంతకాలంగా చెపుతూనే ఉన్నాం. అది ఇంకా విషమించింది. వీక్షణం నాలుగు కాలాల పాటు సజావుగా నడవడానికి ఇప్పటికే వందలాది మంది అభిమానులు తమ శాయశక్తులా ప్రయత్నిస్తున్నప్పటికీ, ఆ సహాయం చాలడం లేదు. సహాయం ఇతోధికంగా పెరగకపోతే వీక్షణం ఎక్కువకాలం మనగలగడం కష్టం.

వీక్షణం మీ పత్రిక. ప్రజల పత్రిక. ప్రజలకు అవసరమైన పత్రిక. ఇది ఆగిపోకుండా కాపాడండి.

ప్రతి పాఠకుడూ/పాఠకురాలూ కనీసం మరొకరికి వీక్షణాన్ని పరిచయం చేయండి. ప్రతి చందాదారూ కనీసం మరొకరిని చందాదారుగా చేర్పించండి. మీకు తెలిసిన కళాశాలలు, కార్యాలయాలు, గ్రంథాలయాలు, ప్రజా సంస్థలు వీక్షణంను తెప్పించేలా చూడండి. మీ గ్రామంలో, పట్టణంలో న్యూస్ ఏజెంట్ దగ్గర వీక్షణం అమ్మేలా చూడండి

**ఇవన్నీ వీక్షణం ప్రచురిస్తున్న భావాలు ప్రచారం చేయడానికి. కాని వీక్షణం ఆర్థిక పరిపుష్టికి అవి మాత్రమే సరిపోవు. వ్యాపార, ప్రచార ప్రకటనలు లేకుండా పత్రికలేవీ మనుగడ సాగించలేవు. వీక్షణంకు మీకు తెలిసిన వ్యక్తులనుంచీ, సంస్థల నుంచీ ప్రకటనలు సంపాదించండి. కళాశాలలు, వైద్యశాలలు, ఆస్పత్రులు, దుకాణాలు, వ్యాపార, పారిశ్రామిక సంస్థలు, గ్రామ స్థాయి నుంచి రాష్ట్ర స్థాయి దాకా పాలక సంస్థలు, దాతలు... సంస్థల బాధ్యులు, వ్యక్తులు ఎవరి నుంచి ఐనా సరే...**

జీవిత చందాలు, కానుకగా చందాలు, విరాళాలు సేకరించండి.

ప్రకటనలు సేకరించండి.

**ప్రతినెలా కనీసం మూడు పేజీల ప్రకటనలు ఉంటేనే వీక్షణం ఆర్థిక స్థితి ఏనెలకానెల అన్నట్టు సాగుతుంది. తెలుగు సమాజం తనతో తాను జరుపుకుంటున్న సంభాషణ ఆగిపోకుండా మీ వంతు సాయం చేయండి.**

మీ సహకారం అందించాల్సిన చిరునామా :

## వీక్షణం

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao

BC



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M108 |
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | saranya |
| పేజీలు విడదీసినది | SARANYA |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |